# విషయ సూచిక

# విజ్ఞప్తి

మధురకవి నాళము కృష్ణారావుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి యైన మహాపురుషుడు? ఆకాలమునాటికి ఆంధ్రదేశమున అవసర మైన అన్ని సేవారంగముల యందును అంతరాత్మ ప్రేరణతో, చిత్తశుద్ధిగా, నిష్కామముగా, నిస్స్వార్థముగా సేవచేసి, ఆంధ్ర మాత ఋణమును తీర్చిన అకలంక సేవాశీలి! తాను నమ్మినమంచి సిద్ధాంతములకు తన్ను, తనజీవితమును అంకితము చేయుటయే కాక ఆసిద్ధాంతములను ఆచరించుటలో ఎన్నికష్టములు వచ్చినా, వెనుదీయని పరమ సాహసియైన నిష్కళంక కర్మవీరుడు? సత్యా గ్రహోద్యమము నందేమి? మహిళాభ్యుదయమును సాధించు సేవాకార్యక్రమముల యందేమి? గౌతమీ గ్రంథాలయ నిర్వ హణమునందేమి? సంఘసంస్కారమునందేమి? బాలలకవిగానేమి? నిజాయితీగల సేవాశీలముతో ముందు నిలిచి, పట్టుదలతో, దీక్షతో ఎంతో శ్రమించి, విజయము సాధించిన అఖండ దేశ భక్తుడు? భాషాతపస్వి? కడసారి ఊపిరి తీయువఱకు, తాను నమ్మిన ఏకేశ్వరోపాసనా పరమైన మనోభావములు కల్గిన నిర్మలా ధ్యాత్మిక పరతంత్రుడు?

అట్టి మహనీయుడు పుడమిపై జన్మగైకొని, నూరు సంవత్స రములు నిండిపోయినవి. ఆ మహాపురుషుడు ఆంధ్రమాతకేకాదు భారతమాతకే కడుప్రియముగూర్చు పుత్రరత్నము! ముఖ్యముగా ఆంధ్రదేశమునకు, ఆంధ్రవాఙ్మయమునకు ఆయన కావించిన అకల్మష సేవాసపర్యలు అపారమైనవి!

సాంఘిక, సాంస్కృతికరంగములలో నన్నపార్యుని నాటినుండి మకుటాయమానముగా ఖ్యాతిచెందిన రాజమహేంద్రవర పునర్ని ర్మాతలలో శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారి తర్వాత వారి సహచరులుగా, వారి కుడిభుజముగా వ్యవహరించి, ఆద్యతన కాలమునందు ఆ నగరచరిత్రకు తేజస్సు నాపాదించి ఆ నగరీమ తల్లికి యశోవిభూషణముగా చెప్పొందినమాన్యులు, మధురకవి శ్రీనాళము కృష్ణారావుగారి శతజయంతి జరిపి, సల్మాషిమతమైన నేటి దేశపరిస్థితులలో, మరల ఆత్యాగశీలియొక్క పవిత్రమైనవాణిని వినిపించి, ఉద్దేశరహితముగ, నియమవిరహితముగా, లక్ష్యరహిత ముగా, దురాదర్శ పూరితముగా, దౌర్జన్యముగా విచ్చలవిడిగా దురాగతములు సల్పుచు, భరతమాత యొక్క బంగారు భవిష్య త్తును పాడుచేయుచున్న నేటి బాలబాలికలకు, ఆబాలురవియూ కాంచిన బంగారు భవిష్యత్త్వభోదయ స్వప్నరూపమైన జిలిబిలి పలుకు తేనియలవాకలైన మధురగీతికా కావ్యకుటసందేశమును ప్రచారము చేయుటకై శ్రీమధురకవి నాళము కృష్ణారావుగారి శతజయంతి జరుప నిశ్చయించితిమి.

---

సాంఘిక, సాంస్కృతికరంగములలో నన్నపార్యుని నాటినుండి మకుటాయమానముగా ఖ్యాతిచెందిన రాజమహేంద్రవర పునర్ని ర్మాతలలో శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారి తర్వాత వారి సహచరులుగా, వారి కుడిభుజముగా వ్యవహరించి, ఆద్యతన కాలమునందు ఆ నగరచరిత్రకు తేజస్సు నాపాదించి ఆ నగరీమ తల్లికి యశోవిభూషణముగా చెన్నొందినమాన్యులు, మధురకవి శ్రీనాళము కృష్ణారావుగారి శతజయంతి జరిపి, కల్మాష్మితమైన నేటి దేశపరిస్థితులలో, మలల అత్యాగశీలియొక్క పవిత్రమైనవాణిని వినిపించి, ఉద్దేశరహితముగ, నియమవిరహితముగా, లక్ష్యరహిత ముగా, దురాదర్శ పూరితముగా, దౌర్జన్యముగా విచ్చలవిడిగా దురాగతములు సల్పుచు, భరతమాత యొక్క బంగారు భవిష్య త్తును పాడుచేయుచున్న నేటి బాలబాలికలకు, ఆబాలురవియూ కాంచిన బంగారు భవిష్యత్త్వ్యభోదయ స్వప్నరూపమైన జిలిబిలి పలుకు తేనియలవాకలైన మధురగీతికా కావ్యకుటసందేశమును ప్రచారము చేయుటకై శ్రీమధురకవి నాళము కృష్ణారావుగారి శతజయంతి జరుప నిశ్చయించితిమి.



4. వెన్నెల వెలుగులు - శ్రీ పైసాని మాధవచెట్టి
ఛారిటీస్ఫండు
377 మింటు స్ట్రీటు, మద్రాసు

5. వెన్నబుడగలు - శ్రీ లింగంచెట్టి యతీంద్రులు
చెట్టి ఛారిటీస్,
141 మింటుస్ట్రీటు, మద్రాసు

6. విరివంద - ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య
మహాసభ, హైదరాబాదు

7. దీపావళి - వాసవీ సేవా కేంద్రము
హైదరాబాదు

8. పాలతరగలు - ఆంధ్రప్రదేశ ప్రభుత్వము
డా॥ చిటుకూరి లక్ష్మీకాన్తమ్మ
బాపట్ల

9. ముద్దు - శ్రీ. వి. వి. అశ్వత్థయ్య సెట్టిగారు
శ్రీకన్యకా పరమేశ్వరీ దేవాలయ
ట్రస్టు అధ్యక్షులు బెంగుళూరు

10. పాపాయి - శ్రీ గ్రంధి సుబ్రహ్మణ్యంగారు
ప్రముఖ వ్యాపారదక్షులు,
కళాభిజ్ఞులు, బహువితరణ శ్రీ
లైన్సుక్లబ్బు అధ్యక్షులు,
రాజమండ్రి

11. గ్రంథాలయ సూక్తులు } శ్రీమతి అడ్డేపల్లి మహాలక్ష్మీదేవి
12. గాంధీదశావతారములు } కళాశాల ప్రతిష్ఠాపకులు, సేవా ధురీణ, విహారసంస్థా నిర్వహణ దక్షురాలు శ్రీమతి అడ్డేపల్లి వివేకానంద దేవి; విహారకావ్య ప్రచురణకర్తలు, ముద్రాపకులు శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావు, రాజమండ్రి.

ఉదారులైన దాతలను, కొన్ని స్థలములతో ప్రోత్సాహకులైన సభలూ సుబ్బారావు రాయబోటి; శ్రీ కె. రాధాకృష్ణయ్య ఆం. ప్ర. ఆర్యవైశ్య మహాసభాధ్యక్షులు; శ్రీ కొత్తూరి సీతయ్యగుప్త, వాసవి సేవాకేంద్రం అధ్యక్షులు, హైదరాబాదు వారికి అత్యంత కృతజ్ఞతాంజలులు. ఈ సంపుటి బైండుకు ఆర్థిక సహాయ మొనర్చిన శ్రీ మందారం రంగయ్యచెట్టి ఛారిటీస్, మద్రాసు వారికిని మా కృతజ్ఞతాంజలి. మద్రాసులోని సంస్థల వారు ఆర్థిక సహాయము మొనర్చుటకు మిక్కిలిగా కృషి సల్పిన మద్రాస్ త్యాగరాయనగర్ వాస్తవ్యులు, పెక్కు సంస్థలలో సభ్యులు, ప్రజాహితకార్యములలో అగ్రగేశి నాయకులు అయిన శ్రీ పాతాళం వెంకటస్వామి అడ్వకేటు గారికి, శ్రీ ఎంబెరు మానార్ సెట్టిగారికిని మా కృతజ్ఞతావందనములు.

**శతజయంతి** సంవత్సరమని ప్రకటింపగనే, రు. 116-00 చొప్పున ఆర్థిక సహాయమొనర్చిన పశ్చిమగోదావరిజిల్లా ఆర్యవైశ్య సంఘం; తణుకు, ఆర్యవైశ్య సంఘం, పెద్దాపురం;

AVOPA, ఏలూరు: చీరాల AVOPA పతాన్న శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లు గారు రు. 300/చీరాల శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరి దేవస్థానం ;- రు. 300/;

బాపట్ల ఆర్యవైశ్య సంఘము వారు రు. /-

వీరందరకూ మా ధన్యవాదములు

-సమ్మాన సంఘము

## పీఠిక

## మధురకవి ప్రశంస

ఆంధ్రసాహిత్యసరస్వతీమంజుమంజీరసింజానములఘలం ఘలలు, పావనగౌతమీవాఃపూరముల మర్మరధ్వనులు మృదంగ తాళములై సహకరింపగా తొలిసారిగా ఏ సీమ నర్తించినవో :

ఆదికవి నన్నయార్యుని పైడిగంటము నుండి తొలగిపారిన రమ్యాక్షరామృతరసధునుల నిండగా ఏ ఆంధ్రీకృత భారతామ్నాయము రూపులు దిద్దుకొనె. విశ్వశ్రేయస్కరమైన ఆంధ్రుల సాహిత్యసంస్కృతి కొలువాలయముగా రాజమహేంద్రవర నగరము నకు చిరంతన యశఃకాంతుల నొసంగెనో :

ఆ రాజమందిరము వెయ్యేండ్ల సాహిత్య చరిత్రతో ప్రకా శించు మహా నగరము :

అవిరళజపహోమతత్పరుడైన నన్నయ భట్టారకుని ఆది కవిగా తీర్చిన మహానగరమిది : శ్రీనాథుని సార్వభౌమునకు కొన్నాళ్లాశ్రయమిచ్చిన భాగ్యము మహానగరమునకు దక్కినది :

అద్యతనాంధ్ర సాహిత్యమహాయుగప్రవర్తక, శ్రీ కందు కూరి వీరేశలింగము పంతులుగారీ నగరి వాసులనుట జగమెఱిగిన సత్యమే కదా :

ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి కవితా జీవితము నకు ఈ నగరి సాహిత్య సంస్కారములు ప్రోత్సాహమొసంగి నవి !

ఈ ఆచార్య పరంపరకు చెందిన మాన్యుడు. సుప్రసిద్ధ భాషావేత్త, సంఘ సంస్కారి, గౌతమీ గ్రంథాలయ ప్రతిష్ఠాపకుడు, బాలసాహిత్య పితామహుడు. మధురకవి బిరుదాంకితుడు శ్రీ నాళము కృష్ణరాయసుధిని తన ఒడియందుచేర్చి లాలించి పెంచినదీ నగర రాజ్యమే !

పుడమితల్లి పురుటినొప్పులు పడిన ఒక శుభదినమున తూర్పుగోదావరిజిల్లా యందలి మండపేట గ్రామమునందు, అంతర్జాతీయ నౌకా వ్యాపారదక్షుడు, కలకత్తానుండి, మద్రాసుపురి వఱకు బహు సత్రములను నిర్మించి మించిన ప్రజాహిత జీవనుడు, ముద్రాపిత సంస్కృతాంధ్రానేక మహా కావ్యమనీషి, బహువితరణ శీలి, ఉదారగుణ చరిత్రసంస్కారము కల దొడ్డ మానిసి. దుర్మార్గులకు పక్కలో బల్లెము. అప్రతిమ మహిమసంపదితాసిరుడు అయిన నాళము కామరాజు. లక్ష్మమ్మల గర్భశుక్తి ముక్తా ఫలముగా నాళము కృష్ణరావుగారు వారి కడపటి సంతానముగా 1881 లో జన్మించినారు.

బహు విశ్రుతుడైన నాళము కామరాజుగారు తన ఆత్మజునకు వెంకటకృష్ణయ్య అని నామకరణము చేసినారు. తరువాత కాలాంతరమందు తనకు ఊహ వృద్ధియైనపుడు వెంకటకృష్ణయ్యగా తన పేరును తానే కృష్ణారావుగారు మలచుకొని యుండెనేమో !

కృష్ణరావుగారు బాల్యమునుండియు భావస్వాతంత్ర్యము, ఆచరణ వైశిష్ట్యము కల్గిన వింత మానిసి. పురానా సంస్కారములన్నను, మూఢాచారములన్నను అనిష్టము చూపుటయే కాక,

బాల్యము నుండియు సంఘ శ్రేయస్సునకు భంగము కల్గించు మూఢ విశ్వాసములపై, కుటిల సంస్కారములపై ధ్వజమెత్తి, తిరుగుబాటు సాగించిన విప్లవ వీరుడు ! సాంఘిక దురాచారములపై ఎంత విద్వేషము కనబరచెడు వారో, జాతి యందు తేజము కల్గించు సంఘ సంస్కార కార్యకలాపములన్నను, పేద వారైన తోడి సహచరులను ఆదుకొనుట యన్నను, కష్టములలో, ఆపదలలో చిక్కుకొనిన వారికి తోడు పడుట యన్నను, నంత ప్రీతిని చూపుచు, అట్టి కార్యముల యందు ఎంతో అనురక్తితో పాల్గొనెడివారు.

తనకు తండ్రిగారు కాని, ఇతర బంధువర్గము కాని యిచ్చిన ప్రతి పైసను సంఘ ప్రయోజనకరములైన కార్యములకై వెచ్చించుచుండెడు వారు నిత్యము ఇరువది ముప్పది మంది సహచరులతో ఎవరికో సాయము సల్పుటకై నగరపర్యటన సల్పుచు వైశపదశయందు చదువుకొనుటయందేమియు శ్రద్ధ కనబరుపక, తనకు చదువుచెప్పుటకై తండ్రిగారు నియోగించిన గురువుగారు తమ యింటికినిత్యము వచ్చెడు వేళకు తన సహచరులతో గలిసి, గౌతమీ ప్రవాహమున బడికొట్టుకొని పోవు జీవులను కాపాడుటకో, లేక సామూహిక రామభజన కార్యకలాపమునకో, కాక తెలిసిన వారి యిండ్లయందలి అవసరములను దీర్చుటకో వర్వెత్తి పోయెడువారు. బాల్యమునందే మాతృ వియోగమునందిన బాలకృష్ణుని, సంతాన విహీనయైన చిన్న వదిన అమ్మన్నగారు పుత్రసమాన ప్రేమతో దగ్గరకు తీసి పెంచెడిది.

నగరమువందేవేవో కార్యకలాపములను దీర్చుటకు. మంది మార్బలముతో తిరుగాడుచున్న కుమారుడు వేంకటకృష్ణయ్య, భోజన సమయమునకును ఇంటికి రాకపోవుసరికి, కామరాజుగారు కోడలిని పిలిచి 'అమ్మన్నా, నీ కొడుకెక్కడ ఏ దీనజనోద్ధరణ కార్యక్రమమున, ఆకలి దప్పులు మఱచి నిమగ్నుడై యున్నాడో ? మఱి, పెట్టె బండి (నాడు కామరాజుగారి అంతఃపుర స్త్రీలు వీధి లోని వారికి కనబడకుండా వెళ్లు బండి) వెళ్లి, వానికి కావలసిన దబ్బిచ్చి యింటికి తీసుకొని రా తల్లీ' అని కోడలిని పంపెడు వారు ! ఒకనాడు ధవళేశ్వరమందలి ఆప్త మిత్రుని యింట యేదో ఆపద సంభవించి డబ్బువాలక వారు బాధ పడుచుండగా ఆ కుటుంబము నా సందర్భమునందు ఎట్లు ఆదుకొనవలెనా ? యని ధవళేశ్వరము దగ్గఱ కల గౌతమీ తీరమునందలి ఒక పెద్ద చెట్టుపై కృష్ణరావుగారి నాయకత్వమున మిత్రబృందముతోయు ఆలోచనా సభాకార్యక్రమమును నిర్వహించుచుండగా, ఆ విష యము తెలిసి అమ్మన్నగారు అక్కడికి వెళ్ళి మఱిదిని రమ్మని బ్రతిమలాడుటయు, నా స్నేహితునకిచ్చుటకు వలసినంత డబ్బు తక్షణము నాకిచ్చినగానీ నేనింటికి రాను, ఆ సహాయము జరుగక పోయిన ఇదిగో నేనిపుడే ఈ కొమ్మపై నుండి గోదావరిలోకి పడి పోయెదనని ఆయన మాతృ సమానురాలైన అమ్మన్నగారిని బెద రించుటయు, వెంటనే ఆమె "వెంకటకృష్ణయ్యా, ఇదిగో డబ్బు నీ కెంత కావలెనో తీసుకో" మని డబ్బు చూపగా, వెంకట కృష్ణుడు ఆ డబ్బు తీసికొని ఆ స్నేహితునకిచ్చి ఇంటికి వచ్చు టయు జరిగినది.

బాల్యముననే కృష్ణరావుగారు చదువు మానిపెట్టినను, సాములు చేసి పరోపకార జీవితమునకు ఓంకారము దిద్దిరి.

తల్లి గర్భము నుండి ధరణిపై పడిన వెంటనే చేసిన రోదనము నాలించి, తన యీ కడపటి సంతానమైన, వెంకటకృష్ణయ్య ఎంతో ప్రాజ్ఞుడుకాగలడనియు, తన వంశ మీ కడగొట్టుబిడ్డ యొక్క సత్కార్యములచే ఘన ప్రతిష్ఠనందు ననియు సంభావన చేసిన, వెంకటకృష్ణయ్య విద్యాభ్యాసమునకై ఎన్నో ఏర్పాట్లుచేసిన కామరాజుగారు, తన కొడుకు దుడుకుదనము ఎంతగనో చింతా క్రాంతులై కాకినాడ మహామున నోవ వ్యాపారము గావించుచున్న తన మూడవ కుమారుడు పద్మనాభుని దగ్గఱకు వెంకటకృష్ణయ్యను పంపివేసిరి.

కాకినాడలో వెంకటకృష్ణయ్యకు తన సాహసకృత్యములకు, సత్కార్యములకు సహకరించు సహవాసగాండ్రు దొరకక అట్టి కార్యకలాపముల నాచరింపకపోయినను. అపుడే ఆంధ్రదేశమున అడుగు మోపుచున్న బ్రహ్మ సమాజ కార్యకలాపములకు కాకినాడ కేంద్రమగుటచే బ్రహ్మ సమాజోపన్యాసముల కాకర్షితుడై వెంకటకృష్ణయ్య అక్కడ కూడ చదువు సంధ్యల పట్ల అంత ఆసక్తి చూపడయ్యెను.

తమ్ముని హితచింతకుడైన పద్మనాభముగారికి తమ్ముని వింత ప్రవృత్తి చింతా కారణముకాగా, వారు ఉన్నత పాఠశాలా పండితులతో తమ్ముని విద్యావిషయమున మంతనము గావింపదొడంగిరి. కానీ ఉపాధ్యాయులెల్లరును ఏకగ్రీవముగా వెంకటకృష్ణయ్య వివేక

వంతుడైన విద్యార్థి యనియు, అతని విద్యాభ్యాసవిషయమున ఎట్టి చింతకును తావులే "దని పద్మనాభముగారికి నమ్మబలుకుటే కాదు ; ఈ విషయములన్నియు గ్రహించిన వెంకటకృష్ణయ్య వాల్గవ ఫారము పరీక్షాపత్రమునకు పద్యములతో ప్రత్యుత్తరములు వ్రాయగా ఆ పత్రములను దెచ్చి పద్మనాభముగారికి చూపి వారి విచారమును పోగొట్టగల్గిరి.

ఈ సంఘటన జరిగిన వెనుక కొడుకు ప్రయోజకుడే కాక, సదాచార విశ్వాపరుడనియు, కవీశ్వరుడు కాదగిన భవిష్యత్తు కల వాడనియు తెలిసికొని, కామరాజుగారు కొడుకును రాజ్ఞగరికి పిలి పించుకొనిరి.

వెంకటకృష్ణయ్య బాలహృదయమునందు జరుగుచున్న సంఘ సంస్కార సంఘర్షణ శ్రీ కామరాజుగారు గుర్తించిరో లేదో కానీ, వెంకటకృష్ణయ్య యందలి సంస్కార భావావేశ మాతనిని కృష్ణరావుగా మార్చివేయుటయేకాక, గ్రంధాలయ స్థాపన ద్వారా, ఆంధ్రభాషాభివృద్ధి కావింపవలెనను తీవ్రసంకల్ప మును కల్గించుటయే కాదు ; ఆ కాలము నాటికి ఉద్యమముగా రూపులు దిద్దుకొనుచున్న సత్యాగ్రహోద్యమమున చేరి దేశసేవ చేయవలెనను దృఢ సంకల్పమును సహితము కల్గించెను.

ఈ భావుకతా తీవ్రతయొక్క దివ్య స్ఫూర్తియే, 1898 వ సంవత్సరమునందు జరిగిన వీరేశలింగ గ్రంధాభాండాగార ప్రతిష్ఠా పనము. అదియే క్రమక్రమముగా వృద్ధిచెంది, ఉన్నతినంది వసు రాయ గ్రంథమండలి, సర్వజన గ్రంథమండలి యను పేర్లు

పొందె. తర్వాత గౌతమీ గ్రంథాలయముగా శాశ్వతరూపము దాల్చినది.

గౌతమీ గ్రంథాలయాభివృద్ధికి, స్థిరత్వమునకు కృష్ణరావు గారు ఎంతగా శ్రమించినారో, ఎన్ని వేల రూప్యముల ద్రవ్యమును తన ఆస్తి నుండి ఖర్చుపెట్టి త్యాగము చేసి యుండిరో అనునది ఊహాకందనిది !

ఎక్కడా దొరకని తాళపత్ర గ్రంథము లెన్నింటినో సంపాదించి యుండిరి - ఋగ్వేదమునకు పద్యరూపమున అనువాదమును సంపాదించి భద్రపరచిరి - దానినే ఈ నాడు తిరుమల, తిరుపతి దేవస్థానము వారు ముద్రించి వెలుగులోనికి దెచ్చిరని ఈ శుభతరుణమున చెప్పుటకు సంతసించుచున్నాను.

గ్రంథాలయ ప్రతిష్ఠాపనము, దాని నిర్వహణకార్యమును ఒక వంక సాగుచుండ, వేరొకవంక వితంతూ ద్వాహ సంస్కారమునకై పలువిధముల పాటుపడుచున్న శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారి అనుచరవర్గమున జేరి, అందు అగ్రశ్రేణి కార్యకర్తగా శ్రీ పంతులుగారిచే ఎంచబడి, రహదారులే లేని ఆ కాలమున అంచెల బండ్లపై ఇచ్ఛాపురము వంటి అతిదూర ప్రదేశములకేగి, పావురాయి, మైనాపిట్టల టపా సహాయముతో పునర్వివాహము చేసుకోదలచిన బాల వితంతువులకు తమ వితంతూ ద్వాహ సంస్థా సందేశములనందజేసి, పరమవిశ్వాసముతో తన వెంబడి రాజమండ్రి వచ్చి పునర్వివాహము చేసుకొనుటకంగీ

కరించి, వచ్చిన బాల వితంతువులను రాజమహేంద్రవరము చేర్చి, తనయింట వారికి అన్ని వసతులను ఏర్పాటుచేసి శ్రీపంతులు గారికి అప్పగించుటయే కాక, ఆ పెండ్లిండ్లు సక్రమముగా జరుగు నంత వఱకు శ్రీపంతులుగారి కన్ని విధముల చేదోడు వాదోడుగా నుండి, వారేర్పఱచిన 'రామదళ' నాయకత్వమును సార్థకముగ, సమర్థవంతముగా నిర్వహించుచు సంఘసంస్కారోద్యమమున నింతింతరాని సేవ సల్పిరి.

అంతతో ఊరుకొనక వితంతూద్వాహసంస్థలను ఏలూరు మున్నగు నగరములలో ప్రతిష్ఠాపించి ఆ ఉద్యమ వ్యాప్తికి తోడ్పడిరి.

వీరేశలింగముపంతులుగారు చేబూనిన మఱొక మహో ద్యమము, బ్రహ్మ సమాజ మత సంస్కారము - ఆ ఉద్యమము నందును కృష్ణరావుగారే అగ్రగసరుడని చెప్పవలసి యున్నది. ఆయుద్యమ నిర్వహణమున శ్రీపంతులుగారి కంటె ముందే జందెము తీసివేసి, వారికంటె ముందుగా సర్వమత సమ్మేళన విందును తన యింటియందు జరిపి, బంధువుల ఆగ్రహమునకు గురియై, వెలివేయబడి తుద కత్తవారైన ఏలూరు నందలి మోతే వారు కూడా తనను ఇంట్లోకి రానీయక పోవుటచే, ఏలూరులో, తన ఆప్తమిత్రుడైన శ్రీ మాజేటి సుబ్బయ్యగారింట భుజించిన ధీరయుపరత్న మాయన !

అక్లో గాంధీమహాత్ముని స్వాతంత్ర్యోద్యమ శంఖారావము వీనుల సోకిన యంతనే ఆ ఉద్యమమునందురికి. తనకు —

ఆ ఉద్యమమున కంకితము చేసుకొన్న అకలంక దేశభక్తుడు శ్రీకృష్ణరావుగారు। ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధమైన జెండా కేసునకు పట్టుగొమ్మలు శ్రీ దేవత శ్రీరామమూర్తిగారు. శ్రీ నాళము కృష్ణరావుగారు మాత్రమే అని చెప్పవలసి యున్నది.

రాజమహేంద్రవరములో కాంగ్రెసునకు సెక్రటరీగా నున్న సమయమున పూజ్య బాపూజీ విదేశ వస్త్రదహనమునకు పిలుపు నిచ్చినపుడు తన భార్య సుశీలమ్మ తన యింటిముందు వీధిలో బాపూజీ ఎదుట తన విదేశవస్త్రములన్నింటిని రాసులుగా పోసి దహనమొనర్చినపుడామెకు ప్రోత్సాహమిచ్చి తోడ్పడిరి.

గాంధీమహాత్ముడు నడపిన సత్యాగ్రహోద్యమములో చరిత్ర ప్రసిద్ధి పొందిన పెద్దాపురం లాటీఛార్జి సంఘటనలో, ప్రప్రథమము నుండి తనకు నీడగా ప్రవర్తించిన క్రొత్త సూర్యనారాయణగారితో పాటు లాటీ దెబ్బలు తిని చాలా బాధపడిన సత్యాగ్రహి శ్రీ నాళము కృష్ణరావుగారు.

కాంగ్రెసు ఉద్యమమున అతివాద పక్షమునవలంభించి తాను కార్యదర్శిగానున్న శ్రీపంతులుగారి టౌను హాలులో ఖుదీరాం బోసు చిత్రపటమును పెట్టి, మితవాదియైన శ్రీ పంతులుగారికా చర్య ఇష్టము లేకుండుటచే వారమురోజులు నిద్రాహారములు లేకుండా ఆ పటమునకు కాపలా కాచిన ధీరయువరత్నము; శ్రీ కృష్ణరావుగారు।

ఇంక ఆమానసీయుడు సల్పిన మహిళా జనోద్ధరణ సేవయు ప్రస్తుతిపాత్రమైనదే. తాను స్థాపించిన గౌతమీ

గ్రంథాలయము నుండి, ఆ రోజులలో, ఇల్లుపీరి ఇవతలకు స్త్రీలు వచ్చుటే తప్పుగా భావింపబడెడు ఆనాటి సంఘ వ్యవస్థలో, అనేకమైన ఉత్తమ గ్రంథములను ఇండ్లకు స్త్రీలకు పంపి, ప్రతి మాసమునందును, వారికి వారు చదివిన గ్రంథములలో పరీక్షలు పెట్టి, వారికి బహుమతులందజేయుటయే కాక, వారిచే వ్యాసములు వ్రాయించుట మున్నగు నెన్నో మహిళాజ కోద్ధరణకార్యక్రమము లను చేపట్టిరి.

తన పెదతండ్రి కుమారులైన కాకినాడ వాస్తవ్యులు శ్రీ నాళము రామలింగయ్యగారు వైశ్యసేవా సదన మహా సంస్థను స్థాపించుటలో, తానును, తన మిత్రుడు కోరుకొండ లింగమూర్తి గారును మిక్కిలి సహాయమొనర్చుటయే కాక, ఆ వైశ్య సేవా సదన స్థాపనకు ముఖ్యకారకురాలైన సంఘసేవాధురీణ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి కాజీవితాంతము ఎనలేని సాయమొనర్చి యుండిరి - 'బావగారు పెట్టిన గౌతమీ గ్రంథాలయం వలన విద్యను నేర్చి, అభ్యుదయ భావాలను ప్రోదిచేసుకొని, వారి అమూల్యసహాయంతో నేను సదనాన్ని స్థాపించి, నిర్వహించాను-, రావు అని ఎన్ని పర్యాయములో చేసిన ప్రస్తావనమునట్టే శ్రీకృష్ణ వక్తలామె మహిళాభ్యుదయము పట్లకల ప్రగాఢమైన వాంఛ అని మ్మ గారికికాగలదు.

తన భార్యయైన శ్రీమతి సుశీలమ్మగారికి కవిత్వాభ్యాసము పట్ల శ్రద్ధాసక్తి కల్గించుటలోనేమి, గాంధీమహాత్ముని ఆదేశాను సారముగామె సత్యాగ్రహోద్యమమున పనిచేయుటకు ఏ మాత్ర

మత్యంతరము చెప్పక, ప్రోత్సహించుట యందేమి, ఆమె మొదట్లో సనాతనాచార పద్ధతులలో తనకు సహకరింపక పోయినపుడామె నేమాత్రము తన అభిప్రాయానుసారము ప్రవర్తింపవలెనని నిర్బంధింపక పోవుటయే కాక, ఆమె కాలము గడచిన కొలదీ తన ఉద్యమముల యందలి ఔన్నత్యమును, దేశహితమును గ్రహించి, తనతోపాటు అన్ని ఉద్యమములలో పాల్గొని తనకు సహకరించి నపుడెంతో సంతోషించుటయే కాక, ఆమె ఆంధ్రమహిళా గాన సభను స్థాపించి నిర్వహించినపుడామెకు అన్ని విధముల ఆజన్మాంతము ప్రోత్సాహ సహాయ సహకారములొసంగుట యందేమి శ్రీకృష్ణరావుగారు 'మహిళాభ్యుదయమే మానవాభ్యుదయము' అను సగ్నసత్యమునెంతగా నమ్మి, తదాచరణలో ఎంత నిష్కళంకమైన తీవ్రతను జూపి, ఆ ఉద్యమమును ప్రోదిచేసి యుండిరో, మనకు తెల్లము కాగలదు.

ఈ విధముగా కృష్ణరావుగారు ఆనాటి సాంఘిక రాజకీయ రంగములన్నింటిలో, ఆనాటి భారతీయ పౌరుడుగా తన విధ్యుక్త ధర్మమనియు, తనక నీసబాధ్యతాయుతకర్తవ్యమనియు భావించి పాల్గొని దేశమాతను సేవించుటయే కాక, చక్కని కళాభిజ్ఞతతో సమలంకృతమైన హృదయ చైతన్యముతో భావిపౌరులు కావలసిన బాలుర అపరిపక్వ మనస్సంస్కారములను భారతీయ సంస్కృతి కనుగుణముగా రూపులు తీర్చవలెనను ఉత్తమాశయముతో మధురగీతికలను ప్రధానముగ కటమున "గోరుముద్దలు, మీగడతరకలు, తేనెచినుకులు, వెన్నెలవెలుగులు, వెన్నబుడగలు, విరిదండ, దీపావళి, పాలతరగలు అను కావ్య సంపుటము

లను బాల, బాలికలకు చల్లని వెలుగు బాటలుగా వెలయించుటయే కాక, తన కుమారుని పాపాయి స్మృతిచిహ్నముగా 'పాపాయి' అను స్మృతికావ్యమును, 'ముద్దు' అను భావకవితా ఖండమును, తన జీవిత సర్వస్వమైన గ్రంథాలయములను గూర్చి 'గ్రంథాలయ సూక్తులు' అను కావ్యమును, గాంధిపకావతారములు, 'వితంతు వివాహ చరిత్ర' 'స్త్రీలపై పురుషులు గావించు పంచమహాపాతకములు-' అను వచన గ్రంథములను, తాను మిత్రులకు పద్యరూపముగా వ్రాసిన లేఖలను 'మిత్రలేఖావళి' యను పేరునను రచించి, ప్రచురించిరి. తనకు అన్ని రంగములలో ఆదర్శ గురుప్రాయుడైన శ్రీపంతులుగారితో భేదభావము కల్గి, తరువాత తానట్లు గురు విమర్శ చేయుట ఒప్పగు పనికాదని భావించి 'అనుతాపము' అనునొక పొత్తమును పద్యయుక్తముగ వ్రాసి ప్రచురించిరి - దీనితో వీరి రచనలు పదునేనుగా వీను మిగిలినవి. తన రచనములను అచ్చువేయుటయే కాని, అమ్మకము చేసికొనుట చేతకాని వారగుట కొన్ని సేకరణ గ్రంథములను ముద్రణ గావింప లేకపోయిరి.

ఆంధ్ర వాఙ్మయ పోషకుడుగా, తొల్దొల్త ప్రాచీన ప్రబంధోదాహరణములతో పదివేల సామెతలను సేకరించియు, ముద్రణ చేయింపలేకపోవుటచే మిత్రుడైన శ్రీ చిలుకూరి నారాయణరావుగారు తానుసంపాదించిన లక్షతెనుగు సామెతలతోబాటు నీ సేకరణ భాగమును నీ పేరిట ప్రచురింప గలనని తీసుకొనుట జరిగినది. తర్వాత ఆ ముద్రణమును శ్రీ నారాయణరావుగారును గావింపలేకపోయిరి, కాలాంతరమున శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి

గారు. శ్రీ కృష్ణరావుగారి షష్టిపూర్తి ప్రచురణగా వీరి తక్కిన సేకరణ గ్రంథములనన్నింటిని. తెనాలి కళ్యాణీ ప్రెస్సువారి సహాయముతో ముద్రణ చేయించగలనని కృష్ణరావుగారి దగ్గఱ నున్న సామెతల ఇంకొక ప్రతిని తీసుకొని వెళ్ళిరి. ఆ షష్టిపూర్తి సందర్భముగా లోకోక్తులు, జాతీయములు అను పేరుగల శ్రీకృష్ణ రావుగారి ఇంకొక సేకరణ గ్రంథమును వారు ముద్రణ చేయించినారేకాని 10 వేల సామెతలేమైనవో పరమాత్మునకే ఎఱుక ;

సంపూర్ణమైన తెలుగు సాహిత్య పరిశీలనాదక్షతతో ఆంధ్రవాఙ్మయ రంగమున నిట్లు సేకరణ గ్రంథములను ప్రప్రథమముగా వెలయింపజేసిన ఖ్యాతి శ్రీకృష్ణరావుగారికే దక్కినది — ఈ సేకరణ గ్రంథములు కాక ఇంకొక అపూర్వమైన సేకరణ గ్రంథము; శ్రీకృష్ణరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వము! రెండు వందలకు పైబడిన ప్రాచీన కావ్యముల నుండి. సుమారు వెయ్యి మకుటములతో ఉదాహరణ పూర్వకముగా ఉద్ధరింపబడిన ఎనిమిది వందల పుటలుకల బృహత్తర సేకరణ గ్రంథమిది; ఇదివారి మరణానంతరము వారికుమార్తెయైన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారిచే, ఉదారులైన దాతల ఆర్థిక సాహాయ్యముతో ప్రచురింపబడినది. అఖిలాంధ్ర సాహిత్యమునందలి నిఖిలవస్తు విషయ వివేకము కల్గించు ఈ కృష్ణరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వమును బోలిన విజ్ఞానోపజ్ఞామహితమైన సాహిత్య సర్వంకషమగు గ్రంథము ఇంకేహిందూ దేశభాషల యందును వెలువడి యుండలేదనుట సత్యేతరము కాజాలదు. ఇదియొక్కటియే చాలును; శ్రీకృష్ణరావుగారికి ఆంధ్రసాహిత్యముపై నెంత అధికారముకలదో పట్టి చూపుటకు ;

1911 వ సంవత్సరమున మొదలు పెట్టి 'మానవసేవ' యను సచిత్ర మాసపత్రికను ప్రచురించిరి. ఇది అప్పటికి తొలి సచిత్ర మాసపత్రిక !

శ్రీకష్ణరావుగారు ఆనాటి సంఘమును మేల్కొల్పుటకు, ముఖ్యముగా పిన్నవయను వారిని ప్రశోత్సాహించుటకు సాంఘిక, రాజకీయ, సాహిత్య చైతన్యము కల్గించు రచనలకే ప్రాధాన్య మిచ్చి అట్టి రచనలనే కావించిరి. కృష్ణరావుగారు జీవించి యున్నంత వఱకు 'భారతి' (సచిత్రమాసపత్రిక) కృష్ణరావుగారి పద్యములనే మొదటి పుటలో ప్రచురించెడిది. అట్లే 'వాసవి' మాసపత్రిక కూడా !

శ్రీకృష్ణరావుగారికి ఆప్తమిత్రులైన ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, హైదరాబాదు నందలి తిరుమలగిరి బజారువైశ్య సంఘ నాయకులైన శ్రీ అల్లాడి వీరయ్య గుప్త ప్రభృతులు శ్రీ కృష్ణరావుగారికి ఘన సమ్మానమొనరించినపుడు 'మధురకవి' బిరుదమిచ్చి గౌరవించిరి. అట్లే ప్రొద్దుటూరు వాస్తవ్యులు శ్రీ కొవ్వూరవు సుబ్బయ్య శ్రేష్ఠిగారు సన్మానించి రజత మురళి నొసంగిరి. నరసన్నపేట వాస్తవ్యులు కొట్నూరు స్వామిబాబుగారు ఘన సన్మానమొనర్చిరి.

కృష్ణరావుగారి యిల్లు ఎప్పుడును కవి, పండిత, గాయక, నటబృందములతో నిండియుండెడిది. కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు చతురంగ క్రీడ సల్పుచు ఎక్కువ కాలము కృష్ణరావుగారి యింటియందేయుండెడివారు !

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ముదిగంటి జగ్గన్నశాస్త్రి గారు. కృష్ణరావుగారి వీధి అరుగుపైనున్న గదులలో తమ తమ జీవనోపాధి వృత్తులను కొనసాగించుకొను చుండెడివారు ! శ్రీ మున్నంగి శర్మగారిని గౌతమీ గ్రంథాలయం క్యూరేటరుగా నియమించి వారికి తమ యింటియందే ఆశ్రయమిచ్చి యుండిరి.

ఇంక శ్రీ భావరాజు కృష్ణరావు. శ్రీ నందూరి బంగారయ్య. శ్రీ బాలదారి వీరనారాయణదేవు శ్రీ సత్యవోలు అప్పారావు. శ్రీ వెల్లపిల్ల వేంకటకవి. శ్రీ వడ్డాది సుబ్బరాయకవి. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి. శ్రీ చిలుకూరి నారాయణరావు. శ్రీ చిలుకూరి వీరభద్రరావు మున్నగు మహనీయులు. మహా పండితులు. మహా కవులతో మొగసాల ఎప్పుడునూ కలకలలాడు చుండెడిది.

అంతే కాక బ్రహ్మ సమాజ కార్యనిర్వాహణము నందు ప్రసిద్ధులైన శ్రీ పెద్దాడ రామస్వామిగారు, శ్రీ నరహరిశెట్టి వేంకటరత్నంగారు శ్రీ అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు మున్నగు వారు శ్రీ కృష్ణరావుగారికి ఆప్తమిత్రకోటిలోనివారు.

శ్రీ నాళం కృష్ణరావుగారు నిర్వహించిన బహుముఖ సేవా రంగముల వలన వారికి రాజమహేంద్రవరమునందలి గొప్ప గొప్ప కవి పండితులతో గల స్నేహసంబంధములు సహజము లైనవే. కాని ప్రపంచ ప్రఖ్యాత సంగీత కళాభిజ్ఞులైన శ్రీ హరీంద్రనాథ్ ఛట్టోపాధ్యాయగారిని రాజమండ్రికాహ్వానించుటయే కాక, వలుమార్లు వారికి తన గృహమునందే వసతిని. ఆతిథ్యము నిచ్చి సమ్మానించి. శ్రీకృష్ణరావుగారు గౌరవించి యుండిరి.

అప్డే బ్రాహ్మ సమాజనాయకులైన శ్రీ హేమచంద్ర సర్కారు ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినపుడు శ్రీకృష్ణరావుగారి యింట విడిది చేయడం గమనార్హం।

శ్రీ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి వంటి మహా మహులు రాజమండ్రి వస్తే శ్రీకృష్ణరావుగారి దగ్గఱకు వచ్చి, వీరి సహాయ సత్కారాలు అందుకోకుండా వెళ్లేవారుకారు.

శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు పర్లాకిమిడి వదలి రాజమహేంద్రవరమునందు కొన్నాళ్లున్న సమయంలో శ్రీకృష్ణ రావుగారి యింటికి వారు రావడం, శ్రీకృష్ణరావుగారు వారి యింటికి వెళ్లి తెలుగు వారి యోగక్షేమాలు విచారించి, వారితో కలిసి సాహిత్య కార్యక్రమాలు నిర్వహించడం జరిగిందంటే, అత్యుక్తి కాదు।

ఇట్టివి వారి జీవితంలో అనేక సంఘటనలున్నాయి.

శ్రీయుతులు దేశరాజు పెదబాపయ్య, కామరాజు హనుమంత రావు, తారకం, తల్లాప్రగడ ప్రకాశరాయుడు, సర్ రఘుపతి వెంకట రత్నంనాయుడు, పిఠాపురం రాజాసూర్యారాయ మహీపతి, సర్ కట్టమంచి రామలింగారెడ్డి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, వెల్లంకి కృష్ణమూర్తి, చుండూరి శ్రీరాములు, కనపర్తి వరలక్ష్మమ్మ, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీపాద కామేశ్వరరావు గార్లు, స్థానికులైన వారేకాక, ఆంధ్రదేశము నలుచెఱగుల నుండి ఏ రంగమునకు చెందిన కళాభిజ్ఞులైనను రాజమహేంద్రవరమునకు

వచ్చుటయే తటస్థించినచో కృష్ణరావుగారిని దర్శింపక వెళ్లెడువారు కాదు. శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు రాజ మహేంద్రవరమునందున్నన్నినాళ్ళు గౌతమీ గ్రంథాలయమునందు శ్రీకృష్ణరావుగారితో కాలక్షేపము చేయకుండా ఉండెడివారు కాదు. శ్రీ బొడ్డు బాపిరాజుగారు, శ్రీ మదబ్బాడ అదిభట్ల నారాయణదాసుగారు మున్నగు మహానుభావులు కృష్ణరావుగారి సందర్శనార్థము ఏతెంచుచుండెడివారు.

శ్రీ శమని అచ్యుతరామశాస్త్రిగారిని పిలిపించి, ఇంటి యందే వారి కన్ని వసతులు కల్పించి, కుమారుడైన నాగేశ్వర రావునకు, కుమార్తెయైన లక్ష్మీరాజ్యమ్మకు, భార్య సుశీలమ్మకు వీణావాదనమందు శిక్షనిప్పించిరి. అట్లే నరసింహపేట నుండి మహా వీణావిద్వాంసులైన, శ్రీ పొడుగు రామమూర్తి పంతులు గారిని తోడ్కొని వచ్చి నాళము వారి సత్రమునందు వారికి వసతి నేర్పాటు చేసి పిల్లలకు భార్యకు వీణావాదనమందు శిక్షనిప్పించిరి.

శ్రీ దేవత శ్రీరామమూర్తిగారును వీరును కలిసి, ఒక గాన సభను స్థాపించి ఎన్నో గాన సభలను నిర్వహించియుండిరి. వ్యావహారిక భాషోద్యమ పితామహులైన శ్రీ పొడుగు శ్రీరామ మూర్తి పంతులుగారి సప్తతి జన్మదినోత్సవమును అతి సమర్థ ముగా నిర్వహించిరి.

అఖిలాంధ్రదేశమునకు మకుటాయమానమై వెలుగొందిన గౌతమీ గ్రంథాలయమునందు జరిగెడు సభా సమావేశములకు లెక్క యుండెడిది కాదు. గౌతమీ గ్రంథాలయ మాశ్రయముగా

ఎన్నో యువక సాహిత్య సంస్థలు రాజమందిరమున వెలసి అత్యుత్సాహముతో ఆంధ్రసాహిత్యాభివృద్ధికి దోహదకరమగు కార్యక్రమములు నిర్వహించుచుండెడివి. అట్లే శ్రీకృష్ణరావుగారి ప్రోత్సాహముతో ఎన్నోసాహిత్యసంస్థలు, చిన్నచిన్న గ్రంథాలయ ములును స్థాపింపబడి, ఓపినంత సాహిత్యసేవ సల్పుచుండెడివి. అట్టి సంస్థలలో శ్రీరామబాలభక్త సమాజము, కౌముదీ పరిషత్తు, జాలీఫ్రెండ్స్ అసోసియేషనులను పేర్కొనవచ్చును. ముఖ్యముగా యౌవన ప్రాదుర్భావమునందే తానొక కృష్ణదేవరాయల యాకృతి వహించి. శ్రీ చాగంటి వీరభద్రకవి పెద్దనగా, సత్యవోలు అప్పారావు, సుంకర రంగయసూరి, నూరాబత్తుల సూర్యనారాయణ సుధి, అత్తిలి సూర్యనారాయణ మనీషి, చెళ్లపిళ్ల భినవేంకట శాస్త్రి, నిడమర్తి భీమరాజు, ఉేటుమళ్ల వసురాట్కవులు మిగతా కవుల పాత్రలు కాగా, వీరందఱును అష్టదిగ్గజములుగా కృష్ణరావు గారు అభినవ కృష్ణరాయడుగా ఎల్లప్రొద్దులు సాహిత్య సమా వేశములు, కవిపండిత చర్చలు, కావ్యపఠన కార్యక్రమములు, సమస్యాపూరణాద్యనేక సాహిత్య సల్లాపగోష్ఠులు నిర్వహించెడు వారు.

శ్రీపంతులుగారి కుడిభుజమై నిర్వహించిన సంఘసంస్కా రోద్యమ విశేషములెన్నోచరిత్ర కెక్కవలసినవియున్నవి - కాని శ్రీపంతులుగారి చివరి దినములలో గురుశిష్యులకు పొడమిన భేదభావముల వలన నవియన్నియు తెరమరుగైపోయినవి. శ్రీపంతులుగారు తమ స్వీయచరిత్రయందుతన శిష్యాగ్రగణ్యుడైన నాళము కృష్ణరావు తన ఉద్యమమునకు, దేశమునకును కావించిన

ఎన్నో యువక సాహిత్య సంస్థలు రాజమందిరమున వెలసి అత్యుత్సాహముతో ఆంధ్రసాహిత్యాభివృద్ధికి దోహదకరమగు కార్యక్రమములు నిర్వహించుచుండెడివి. అట్లే శ్రీకృష్ణరావుగారి ప్రోత్సాహముతో ఎన్నోసాహిత్యసంస్థలు, చిన్నచిన్న గ్రంథాలయములును స్థాపింపబడి, ఓపినంత సాహిత్యసేవ సల్పుచుండెడివి. అట్టి సంస్థలలో శ్రీరామబాలభక్త సమాజము, కౌముదీ పరిషత్తు, జాలీఫ్రెండ్స్ అసోసియేషనులను పేర్కొనవచ్చును. ముఖ్యముగా యౌవన ప్రాదుర్భావమునందే తానొక కృష్ణదేవరాయల యాకృతి వహించి. శ్రీ చాగంటి వీరభద్రకవి పెద్దనగా, సత్యవోలు అప్పారావు, సుంకర రంగయసూరి, సూరాబత్తుల సూర్యనారాయణ సుధి, అత్తిలి సూర్యనారాయణ మనీషి, చెళ్లపిళ్ల చినవేంకట శాస్త్రి, నిడమర్తి భీమరాజు, శేషుమళ్ల వసురాట్కవులు మిగతా కవుల పాత్రలు కాగా, వీరందఱును అష్టదిగ్గజములుగా కృష్ణరావు గారు అభినవ కృష్ణరాయడుగా ఎల్లప్రొద్దులు సాహిత్య సమావేశములు, కవిపండిత చర్చలు, కావ్యపఠన కార్యక్రమములు, సమస్యాపూరణాద్యనేక సాహిత్య సల్లాపగోష్ఠులు నిర్వహించెడు వారు.

శ్రీపంతులుగారి కుడిభుజమై నిర్వహించిన సంఘసంస్కారోద్యమ విశేషములెన్నోచరిత్ర కెక్కవలసినవియున్నవి – కాని శ్రీపంతులుగారి చివరి దినములలో గురుశిష్యులకు పొడమిన భేదభావముల వలన నవియన్నియు తెరమరుగై పోయినవి. శ్రీపంతులుగారు తమ స్వీయచరిత్రయందుతన శిష్యాగ్రగణ్యుడైన నాళము కృష్ణరావు తన ఉద్యమమునకు, దేశమునకును కావించిన

పంతులుగారి తర్వాత పంతులుగారంత సేవ చేసి, వారికంటె ఎక్కువ కష్టాలు పడడమే కాదు, ఒక రంగంలో కాదు, అన్ని రంగాల్లో, దేశసేవలో, సాహిత్యసేవలో, సత్యాగ్రహోద్యమంలో, గ్రంథాలయ నిర్వహణంలో. ముఖ్యంగా వితంతూద్వాహ సంస్కారోద్యమంలో, బ్రహ్మ సమాజోద్యమంలో కఠోరమైన దీక్షతో, వజ్రసంకల్పంతో తనను తాను అంకితం చేసుకొని ఊహించలేనంతగా అన్నివిధాలా నష్టపడ్డాడు ! అదే కృష్ణరావు గారిలో ఉండే విశిష్టత ! అని ప్రసంగించిన దాన్ని బట్టి చూస్తే నాళము కృష్ణరావుగారి విశిష్టవ్యక్తిత్వాన్ని గూర్చి కొద్దిగానైనా మనము ఊహించుకొనుటకు కొంతలో కొంత అవకాశము కలుగును. అంతేకాక దాకారపు అప్పారావుగారు రచించిన అఖిలభారత బ్రాహ్మ సమాజము" అనే గ్రంథంలో వీరి సంస్కారం చక్కగా ప్రశంసింపబడింది.

'అఖిలభారత బ్రాహ్మ సమాజము' అనే గ్రంథంలో గ్రంథకర్త శ్రీ దాకారపు అప్పారావుగారు శ్రీ నాళం కృష్ణరావుగారిని అన్ని కోణముల నుండి పరిశీలించి వారిని గూర్చి వ్రాసిన అంశములీ క్రింద ఉద్ధరింతబడినవి -

"శ్రీ నాళము కృష్ణరావుగారు విక్రమ సంవత్సరములో, సంక్రాంతి వెళ్లిన మరునాడు అనగా కనుమ పండుగనాడు జనన మందారు. ప్లవ ఉగాదినాడు. దివంగతులైనారు - ఆంధ్రులకు మిక్కిలి ప్రీతి పాత్రములైన, రెండు పండుగలతో వీరి జనన మరణాలు బంధింపబడినవి.

'విక్రమాబ్దంలో పుట్టి ధర్మం కొఱకు, సత్యం కొఱకు, న్యాయం కొఱకు విక్రమించిన మహాధర్మపరుడీ మహానుభావుడు.'

'జీవితమంతా సంఘర్షణతోను, విప్లవాలతోను గడిపిన నెఱజోదు ! దేశసేవలోను, సంఘ సేవలోను, భాషా సేవలోను కాకలు తీరిన, మహానాయకుడు ! కష్టాల్లో ఉన్న వారిని, కవి పండితులను ఒక్కరీతిగా ఆదరించి ఆదుకున్న ధర్మదాత ! ఎంత నిరాడంబరుడో, అంతదీక్షావైష్ఠికుడు ! ఎంతరసికుడో, అంత శీల దక్షుడు ! ఎంతకళామయుడో, అంత ఛాందసుడు ! ఎంతకర్మ వీరుడో, లౌకిక ప్రవృత్తిలో అంత అమాయకుడు ! ఇట్టి విరుద్ధ, విచిత్ర, విశుద్ధ, ధర్మగణాల వింత సంపుటియే మధురకవి నాళము కృష్ణరావు !"

"నిజమైన ఈశ్వర సేవ, సంఘ సంస్కారము, మహిళోద్ధరణములో నున్నదని గ్రహించి వితంతు వివాహాదికములలో శ్రీ వీరేశలింగముగారికి కుడిభుజమై పనిచేసిన మహానుభావుడీయన"

"తన సోదరులెన్ని కష్టాలు పెట్టినా, ఇల్లాలికెంత ఇష్టంలేక పోయినా, అత్తవారెంత ప్రతిమలాడుకొని, ఎంత డబ్బు ఆశ చూపినా, లోకులాఖరికి వెలివేసినా, జంకకుండా బ్రాహ్మధర్మ వ్రతానుష్ఠానాన్ని స్వీకరించి, అందఱ కంటె ముందుగా జందెం తీసివేసి సర్వకులమతసమాన విందు నేర్పాటు చేసిన సంఘ సంస్కారి"

"అంతర్లీనమై యున్న భాషా తీవ్రతను అణచుకోలేక, అత్తవారిచ్చిన విలువ గల వస్తువులన్నీ తెగనమ్మి తన పదునైదవ యేట, ప్రప్రథమాంధ్ర గ్రంథాలయాన్ని 'వీరేశలింగ గ్రంథాలయం' అనే పేరుతో స్థాపించి భాషారాధనతో మానవ సేవ చేసిన మహనీయుడు !"

గురుశిష్యులిద్దఱూ (పంతులుగారూ, కృష్ణరావుగారూ) తీవ్రంగా విభేదాలు వచ్చి కోర్టుల కెక్కినా కృష్ణరావుగారి విజాయితీ, చిత్తసంస్కారమూ, నిష్కళంకమైన సేవా శీలమూ పంతులుగారికి బాగుగా తెలియును. కాబట్టే తాను చనిపోవునపుడు, తన వీరేశలింగోన్నత ఆస్తిక పాఠశాలకూ, హితకారిణీ సమాజమునకు శ్రీ కృష్ణరావుగారినే అధ్యక్షునిగా నియమించుట జరిగినది - హితకారిణీ సమాజమునకు, శ్రీకృష్ణరావుగారే ఆజీవితాధ్యక్షులు ! అట్లే గౌతమీ గోరక్షణ సంఘమునకు వారే అధ్యక్షులు ! ఇంక సరేసరి గౌతమీ గ్రంథాలయమునకు, సంస్థాపకులు, సంచాలకులు, నిర్వాహకులు, బంట్రోతు, అధ్యక్షుడు - అన్నియు ఆయనయే.

గౌతమీ గ్రంథాలయమునకు స్థిరమగు భవన వసతి కల్గించు సందర్భముల యందు గ్రంథాలయము పురమధ్యమున నుండవలెనా ? ఊరిచివరనుండవలెనా ? యను విషయమున పుర ప్రముఖులకు, కృష్ణరావుగారికి పెద్ద వివాదము జరిగినది. అది కోట - పేట సంవాదముగా రాజమహేంద్రవర నగరమున పెద్ద సంచలనమును లేవదీసినది. ఆ వివాదమునందు పురప్రముఖు

లైన శ్రీ కంచమర్తి రామచంద్రరావుగారు. శ్రీకృష్ణరావుగారి పక్షమున నిలువబడి, ప్రస్తుతము గ్రంథాలయమున్న ప్రదేశము నందే గ్రంథాలయమును నెలకొల్పుటకు శ్రీ కృష్ణరావుగారికి సహాయపడుటయే కాదు - ఆర్థికముగా కూడ సహాయపడిరి. తరువాత, తనయొద్దగల బంగారు వస్తువులను అమ్మియు, కొంత ఉదారులైన వారి ఆర్థిక సహాయమును స్వీకరించియు శ్రీరామచంద్రరావుగారి అప్పును తీర్చివేసి, గ్రంథాలయమునకు కృష్ణరావుగారు స్వతంత్ర భవన ప్రతిపత్తిని గల్పించిరి.

శ్రీకృష్ణరావుగారి షష్టిపూర్తి సమయమునకు వారి పెద్ద కుమారుడు నాగేశ్వరరావు గ్రంథాలయ కార్యదర్శిగా నుండెను. ఎంతో గొప్ప వైభవముతో ఆంధ్రదేశమునందలి పెద్దలు, గ్రంథాలయోద్యమము వారు పాల్గొని షష్టిపూర్తిని జరిపించిరి.

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు శ్రీఅయ్యంకి వెంకటరమణయ్యగారు పితామహులు, శ్రీకృష్ణరావుగారు తొలికార్యదర్శి.

శ్రీకృష్ణరావుగారి అర్ధాంగి, ధర్మపత్ని, శ్రీమతి నాళము సుశీలమ్మగారు ; ఆమె జమీందారులైన శ్రీ మోతే వెంకట కృష్ణయ్యగారి ద్వితీయ కుమార్తె. శ్రీ మోతే కృష్ణరావుగారి సోదరి ; సత్యాగ్రహోద్యమ నాయకుడైన శ్రీ మోతే నారాయణ రావుగారి మేనత్త - బహుదాన ధర్మకార్యములొనర్చిన శ్రీ మోతే గంగరాజుగారిమేకు పినతండ్రి - సమున్నతాచార శీలయైన సుశీలమ్మ గారు మిక్కిలి విజ్ఞురాలు ; మొదట్లో కృష్ణరావుగారి సంపు

సంస్కారోద్యమమునకు విముఖత కనబఱచినను, కాలక్రమమున నందలి ప్రయోజనమును తెలిసికొని, భర్తగారికనేక విధములుగా ఉద్యమ నిర్వహణమున సహకరించినది ! ఆమె గాంధీ భక్తు రాలు ! గాంధీగారి పిలుపు విని సత్యాగ్రహోద్యమమున నుతికి ఎన్నో సేవా కార్యములు చేసినది. తన విదేశవస్త్రములను గాంధీ గారి ఎదుట తన యింటి ముందు వీధిలో దహనమొనర్చి వైచినది. పరమసనాతన ధర్మనిష్ఠతో నిత్యము విగ్రహపూజాదికమును నిర్వర్తించుచు, ఏకాదశీ ఉపవాసములతో, గోదావరీ స్నానము లతో, శాస్త్రోక్త విధానమున, సకల వ్రతనియమములను సాంగో పాంగముగా సాగించిన ఆమె గాంధీగారి పిలుపు వీనులబడగానే, హరిజనులను ఇంటిలోని తన పూజామందిరము కడకు తీసుకొని వచ్చి వారిచే పూజ చేయించి, నూతిలో నీళ్లను తోడించి సనాతన మూఢవిశ్వాసములకు స్వస్తిపల్కిన ఉచితజ్ఞురాలామె !

నిత్యము చరఖాపై నూలువడికి ఆ నూలుతోనే తన చీరెలు నేయించుకొని, భర్తకు పంచెలు నేయించి, గాంధీగారికి ఏటా రెండు అంగవస్త్రములను పంపెడిది, ఏదైనా ఒక నియమమవ లంభించినచో, అతికఠోర నియమముతో ఆ వ్రతమును అకుంఠిత దీక్షతో పాలించు నియమశీలి ! ఆమె స్వయముగా సత్యాగ్రహో ద్యమమున పాల్గొనినది ! ఆంధ్ర మహిళా గాన సభ యని స్త్రీల కొఱకొక గాన కళాశాల స్థాపించిన ఖ్యాతి ఆంధ్రదేశమున నామెకే దక్కినది.

ఈ పుణ్యదంపతులకు ఎనమండుగురు సంతానమైనను, కడకు మిగిలినది ముగ్గురు మాత్రమే.

అందు ప్రథమ పుత్రుడు నామము నాగేశ్వరరావు (B. sc Hons) గొప్ప వైజ్ఞానిక విద్వాంసుడు. బొంబాయి నగరమున నివాసముండుచు, కర్ణాటక, హిందీ గాన సాంప్రదాయముల యందు అభిజ్ఞ పాండిత్యము కల ఏకైక వీణావిద్వాంసుడుగా పేరొందినాడు ! భార్య శకుంతల ఆమె సద్బ్రాహ్మణవంశస్థురాలు ! ఈ దంపతులకు శోభారాణి, శరద్రాణి, విద్యారాణి యని ముగ్గురు కుమార్తెలు ! ప్రవీణుడని ఒక కుమారుడును కలరు.

రెండవ సంతానము లక్ష్మీకాన్తమ్మ. ఆమె టుటుకూరి హయగ్రీవగుప్తగారి సతీమణి ! హయగ్రీవగుప్తగారు బాపట్లలో న్యాయవాది, వారికైదుగురు సంతానము. ప్రథమ పుత్రిక పోలేపల్లి సుహాసిని, అల్లుడు పోలేపల్లి హరనాథ్ B. Sc., (Ac). ప్రథమ పుత్రుడు ప్రతాప చంద్ర. ద్వితీయ పుత్రుడు రాజ రాజ నరేంద్ర. మూడవ కుమారుడు విజ్ఞానేశ్వరకుమారుడు, రెండవ కుమార్తె మైథిలీబాలాజీ. పుత్రికయైన లక్ష్మీకాన్తమ్మ ఉభయ భాషా ప్రవీణ పట్టభద్రురాలు, బహుకావ్యప్రణేత, వీణా వాదకురాలు, ఉపన్యాసవిశారద, ఆంధ్రదేశమునందే కాక యావద్భారతమునందును, తన బహుముఖ సేవా కార్యక్రమములతో సుప్రశస్తినందిన ధన్యజీవని - భారతప్రభుత్వము వారి పంపున విదేశముల కేగి భారత సంస్కృతి ప్రచారమొనర్చినమిన్న ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే కళాప్రపూర్ణ బిరుదమునందినమేటి ప్రజ్ఞాశాలిని !

మూడవ సంతానము నామము కామేశ్వరరావు B. Sc. ఛాయాగ్రాహక విద్యలో నిపుణుడు. ప్రశస్త వీణావాదనా విప

ఋడు. క్రొత్తరాగముల గనుగొన్న నిపుణుడు. భార్య వనజా గుప్త. గొప్ప గాయనీ మణి బాల్యమునందే పోతన చలన చిత్రమున పోతన కుమార్తె లక్ష్మిగా నటించి ప్రశంసలందిన ప్రజ్ఞామతి ! ఆశామధుర్, ఉదయకిరణ్, అనిల కుమారులు. వీరిపుత్ర సంతానము.

శ్రీ నాళం కృష్ణరావుగారికి సంతాన నష్టమెక్కువగుట వలనను, సహజముగా పిన్నవయస్కులపై మక్కువ ఎక్కువగుట వలనను, చాలా మంది పిల్లలకు ఉచితవేతనాద్యనేక సౌకర్యములు కల్గించి, ఉన్నత విద్యల వఱకు చదువులు చెప్పించి, వారి బ్రతుకులు సుస్థిరములగుటకు తోడ్పడియున్నారు. అట్టి వారిలో మద్రాసులోని ఒక పెద్ద ఎడ్వర్టైజుమెంటు కంపెనీ మేనేజరుగా పనిచేసిన శ్రీ సాల్వ గోపాలరావుగారొకరు.

సేవా కార్యక్రమము లందును, సంఘ సంస్కారాచారణ విషయముననను శ్రీకృష్ణరావు గారెంత నిష్ఠురుడో, ఎంత నిపుణమతియో, బాధ్యతాయుతమైన, గార్హస్థ్యకార్యకలాప నిర్వహణమునందు అంత అంబేద ! ఎల్లప్పుడును ఏదో ధ్యాన నిష్ఠలో నున్నారేమో యనిపించుచు, అన్య మనస్కుడై వీధులలో తిరుగాడు నపుడు, ఒక కాలిచెప్పు ఊడిపోయినను, కనుగొనలేని పరాకు మానిసి ! పిల్లలకు ఏదేని వ్యాధి ప్రమాదములు సంభవించినను వెజ్జుని పిల్చుట కూడా చేతకాక, మనోవేదనతో దిగులు పడి బాధపడునట్టి బేల !

వింతప్రకృతికల, ఈ విచిత్ర వ్యక్తిని, అన్నింటి యందును మిక్కిలి శక్తిసామర్థ్యము ఊహాపోహములు, ఉచితజ్ఞతకల యువతి సుశీలమ్మగారు వారి ధర్మపత్నిగా, గృహిణీ ధర్మములను కడుజాగరూకతతో నైపుణితో, నిర్వహించుకొనగల్గుట చేతనే కృష్ణరావుగారు సంసారమున తామరాకుపై, నీటి చందమున ప్రవర్తించినను, వారి కాపురము ఏ విధముగను రసభంగము కాక పోవుటయే కాదు, అత్యధిక వైభవ సముజ్జ్వలముగ సాగిపోయినది.

శ్రీకృష్ణరావుగారి అంత్య సమయాన్ని గూర్చి కొద్దిగా చెప్పవలసి యున్నది.

1961 ఏప్రియల్ 17 వ తేదీ నాడు - ఉగాది పర్వదిన ప్రవేశ సమయంలో వారు కన్నుమూశారు.

అంతకు ముందు సుమారు అయిదు సంవత్సరాలు కాలు విరుగుటచే వారు, మంచంపట్టి ఉండడం తటస్థించింది.

వయస్సు పెద్దదికావడం వలన 1961 నుండీ క్రమంగా వారికి బలహీనత హెచ్చుకావడం ఆరంభించింది.

ఏప్రియల్ 3 వ తేదీ నాడు మాటపడిపోయినది. అయినా వారు స్పృహ ఉన్నంత సేపు భారతం చదివించుకోవడం, రామాయణం చదివించుకొని వినడమూ మానలేదు. థియసాఫికల్ వారి "మరణానన్తర దశ" అనే గ్రంథం తెప్పించుకొని, తన మరణానన్తరంతాను ఉత్తమ గతులకే పోగలననే ధైర్య విశ్వాసాలను, సంతృప్తిని పొందారు.

భారతంలో కర్ణపాత్రపై ఆయనకు ఎక్కువ మక్కువ. ఆ కారణంగా తన కుమార్తె అయిన లక్ష్మీకాంతమ్మచే భారతంలో కర్ణపాత్ర గల ఘట్టాలను చదివించు కొన్నారు.

త్యాగరాయ కీర్తనలపై గల ప్రీతి పెంపున కుమార్తెను వీణపై త్యాగరాయ కీర్తనలు వాయించమని అడిగి, విని, ఎంతో సంతృప్తి పడినారు.

ఆ అంత్య సమయంలో ఎన్నో మార్లు బ్రాహ్మమత కీర్తనలు పాడమని కుమార్తె నడగడమూ ఆమె పాడడమూ జరిగింది. ఇంక రేపురాత్రి మరణిస్తారనగా క్రమక్రమంగా స్మృతి తప్పుతూ వచ్చింది. ఆఖరు రోజున కుమార్తె లక్ష్మీకాంతమ్మ ఉదయమే బ్రాహ్మ ధర్మ కీర్తనలు పాడడం ప్రారంభించగా, మూసుకు పోయిన కండ్లు తెఱచుకొని, గోడవైపు తిరిగి పోయిన తలను కుమార్తె వైపు త్రిప్పి పాటలు విన్నారు. రాత్రి 11-45 వఱకూ ఆమె పాడుతూనే ఉన్నారు. ఆయన వింటూనే ఉన్నారు. తర్వాత 12 దాటిన కొద్ది సేపటికి ఆ పుణ్యమూర్తి, ఈశ్వర సేవకుడు, సంఘోద్ధారకుడు, భాషావేత్త, మధుర కవి సత్తముడు, గౌతమీ గ్రంథాలయ ప్రతిష్ఠాపకుడు, ఆంధ్రమాత అనుగు పుత్రుడు తుదిశ్వాస విడచినారు.

ఇది వారి జీవితచరిత్ర కాక, శతజయంతి సంఘము వారి ప్రశంస యగుటచే ప్రధానమైన వారిజీవిత విశేషములను పేర్కొ-
నుటనే జరిగినది

కళా సాంస్కృతిక పీఠముగ సముజ్జ్వలమైన సహస్ర వర్ష చరిత్ర కల రాజ్ఞగరియందు బాధ్యతకల పౌరుడుగా, ప్రభు మర్యాద నెఱపిన నాళము కామరాజుగారి కుమారుడైన తండ్రిగారి ధార్మిక, సాంస్కృతిక సంస్కారములకు వారసుడుగా, తన జమీందారీ సంపదనంతను దేశము కొఱకు, సాహితీ సరస్వతీ సమారాధన కొఱకు, ముఖ్యముగ గౌతమీ గ్రంథాలయ నిర్వహణ కొఱకు అంతస్తునకు మించునట్లు వ్యయించి రిక్తుడై మిగిలిపోయిన నిస్స్వార్థత్యాగశీలి. సంఘరూపమైన మాధవసేవయందే, మానవ జీవితమును ధన్యమొనర్చుకోవలెనను ఉత్తమాశయ దీక్షతో బ్రతుకు కప్పురహారతి గావించుకొని, బాల్యమున సాధనచేసిన, రామభజనకు, ఏకేశ్వరోపాసనయందు సాఫల్యసిద్ధిని గావించుకొని ధన్యజీవిగా, జీవించి, పరలోకమారు మాన్యమైన, ఆ మహానగర లక్ష్మియొక్క చిద్విలాస హాస రేఖలను యావదాంధ్రమును శుభ్ర ధవళ రోచిస్సులలో కాంతిలహరులుగా నర్తన మొనరింపజేసిన, సద్గుణాఢ్యుడు, సంస్కారి, శీలవంతుడు, సంఘ శుభచింతకుడు, ఈశ్వరవిశ్వాసి, మహాకవి, బాలుర భవితవ్యమునకు ధర్మ దీప్తితో పథములు పఱచిన మధురకవి నాళము కృష్ణరాయ శత జయంతిని మా సమ్మాన సంఘము వారు జేగీయమానముగా నిర్వహింప దొరకొనుట యెంతేని భాగ్యకారణముగా భావించు చున్నాము.

ఈ శతజయంతికి ముఖ్యప్రేరణనొసంగి ఈ సందర్భ ముగా వారి కావ్యములన్నింటిని వారి కుమార్తెయైన కళా ప్రపూర్ణ, ఆంధ్ర సరస్వతి, సాహితీ రుద్రమ, ధర్మప్రచారభారతి,

ఆంధ్రదేశమునందలి వదాన్య శేఖరుల సహాయముతో శతజయంతి ప్రచురణములుగా ముద్రణ చేయించినారు.

బహుకష్టసాధ్యమైన ఈ మహా కార్యమును ఆమె ఒక్కరే నిర్వహించి, మా సంఘము వారి శ్రమను తొంబదితొమ్మిది పాళ్ళు తగ్గించినందులకు సోదరి లక్ష్మికాన్తమ్మగారికి ధన్యవాదములు - ఈ శతజయంతి ప్రచురణకు ఆర్థికముగా సాయమొన ర్చిన దాతలకు మా కృతజ్ఞతా వందనములు - ఆ వివరములు వేరే యియ్యబడినవి.

మధురకవి శతజయంతి జరుగవలెనను సంకల్పము ఆంధ్ర మహా జనులలో కల్గుటయే తడువుగ 1981 జనవరి 16 వ తేది నాడు బాపట్ల యందు కళాభారతి వారును, రాజమహేంద్రవరము నందు గౌతమీ గ్రంథాలయము వారును ఉత్సాహముగా జరిపిరి.

తరువాత 1981 జనవరి 21 వ తేదీనాడు శతజయంతి సంఘమువారు వైభవముగా జరిపి 'ఈ సంవత్సరము శతజయంతి వత్సరము' గా ప్రకటించిరి.

తరువాత ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య సంఘము వారు హైదరాబాదు నందు జరిపిరి.

తరువాత, తరువాత నరసరావు పేట యందును, కారెమ పూడి యందునుబాపట్ల ఆర్యవైశ్య సంఘము వారును వేటపాలెం, సారస్వత నికేతనము వారును, వినుకొండ యందును 1983 జనవరి నాడు రాజమహేంద్రవరమునందు టౌనుహాలు కమిటీ

ఆంధ్రదేశమునందలి వదాన్య శేఖరుల సహాయముతో శతజయంతి ప్రచురణములుగా ముద్రణ చేయించినారు.

బహుకష్టసాధ్యమైన ఈ మహా కార్యమును ఆమె ఒక్కరే నిర్వహించి, మా సంఘము వారి శ్రమను తొంబదితొమ్మిది పాళ్ళు తగ్గించినందులకు సోదరి లక్ష్మీకాన్తమ్మగారికి ధన్యవాదములు - ఈ శతజయంతి ప్రచురణకు ఆర్థికముగా సాయమొనర్చిన దాతలకు మా కృతజ్ఞతా వందనములు - ఆ వివరములు వేరే యియ్యబడినవి.

మధురకవి శతజయంతి జరుగవలెనను సంకల్పము ఆంధ్ర మహా జనులలో కల్గుటయే తడువుగ 1981 జనవరి 16 వ తేదీ నాడు బాపట్ల యందు కళాభారతి వారును, రాజమహేంద్రవరమునందు గౌతమీ గ్రంథాలయము వారును ఉత్సాహముగా జరిపిరి.

తరువాత 1981 జనవరి 21 వ తేదీనాడు శతజయంతి సంఘమువారు వైభవముగా జరిపి 'ఈ సంవత్సరము శతజయంతి వత్సరము' గా ప్రకటించిరి.

తరువాత ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య సంఘము వారు హైదరాబాదు నందు జరిపిరి.

తరువాత, తరువాత నరసరావు పేట యందును, కారెమపూడి యందునుబాపట్ల ఆర్యవైశ్య సంఘము వారును వేటపాలెం, సారస్వత నికేతసము వారును, వినుకొండ యందును 1983 జనవరి నాడు రాజమహేంద్రవరమునందు టౌనుహాలు కమిటీ

ఈ ఉత్సవములు జరుపుటకు నిశ్చయించినప్పటి నుండియు, కార్యవర్గమున సభ్యత్వము నామోదించి, అన్ని విధములా మాకు చేదోడు వాదోడుగా నున్న మా కార్యవర్గము వారి కందఱకును మా కృతజ్ఞతాంజలి !

ముఖ్యముగా నాళము కృష్ణరావుగారి శతజయంతి సంరంభము ఆరంభింపబడినప్పటి నుండి, అనేక సభలు చేయించియు సభలలో పాల్గొని ప్రసంగించియు అనేక వ్యాసములు వ్రాసియు, అనేక సంస్థలలో శ్రీకృష్ణరావుగారి చిత్రపటములను ఉచితముగా బహూకరించియు, ప్రస్తుతము నాళం వారి సంక్షిప్త జీవితచరిత్ర వ్రాసియు సమధికోత్సాహముతో నాళము కృష్ణరావుగారి శతజయంత్యుత్సవములో పాల్గొనుచున్న శ్రీ చిట్టిప్రోలు సుబ్బారావుగారు, ఎం. ఏ., తెలుగు లెక్చరరు, S. S. & N. కాలేజి, నరసరావుపేట వారికి మా కృతజ్ఞతాంజలి.

కారెంపూడి మున్నగు స్థలములలో శతజయంతులు జరిపించిన కవిశేఖరులు శ్రీ చిట్టిప్రోలు కృష్ణమూర్తిగారికి, మా ధన్యవాదములు.

ఈ శతజయంతి సందర్భముగా ప్రచురణ మందిన ఈ "మధురగీతికలు" సంపుటిపై వచ్చు ఆదాయమును ఒక రిజిష్టర్డు ట్రస్టు నేర్పఱచి దానిపై వచ్చు ఆదాయపు వడ్డీతో సాధ్యమైనంత వఱకు ప్రతి సంవత్సరము శ్రీ నాళము కృష్ణరావుగారి స్మారక సభలు, స్కాలర్‌షిప్‌లు మున్నగు కార్యక్రమములను నిర్వహించుటకు నిశ్చయించడమైనదని తెల్పుటకు సంతసించుచున్నాము.

శతజయంతి సమ్మాన సంఘము

# నాళంవారి శత జయంతి
# సభలు - విశేషాలు

అనుబంధం - I

# నాళం వారి శత జయంతి సభలు — వాని విశేషాలు

మధురకవి నాళం కృష్ణరాయని శతజయంతి సభను 30-8-1981 వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్య వైశ్య మహాసభవారు కాచిగూడలోని వైశ్యాహాస్టలులో నిర్వహించారు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు సభాధ్యక్షత వహించారు. "నాళం వారి శతజయంతి ఉత్సవం వైశ్యులు మాత్రమేకాక తెలుగువారందరు జరుపుకోదగిన ఉత్సవం అన్నారు. శ్రీకృష్ణరాయాంధ్ర సాహిత్య విజ్ఞానసర్వస్వం వంటి గ్రంథాన్ని తయారు చేసిన పూర్వకవి యెవరూ తనకు తెలిసినంతవరకు కన్పించలేదన్నారు.

కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, శ్రీమతి కోదూరి లీలావతి, శ్రీయుతులు నీలా జంగయ్య, వి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి, చిట్రోలు కృష్ణమూర్తి ప్రభృతులు ప్రసంగించడం జరిగింది. "నాళం వారిని గూర్చి కవిలోకం, పండితలోకం అర్థం చేసికోవలసినంతగా అర్థం చేసికో లేదని, తెలుగు కొరకు, తెలుగు భాషకొరకు కష్టపడి తెలుగుదనం సాధించటానికి ఆయన చేసిన కృషి ప్రశంసనీయ"మని ఆ వక్తలు అభిప్రాయపడ్డారు.

బ్రాహ్మ సమాజ చరిత్రలో పేర్కొనదగ్గ ముగ్గురు నలుగురు ప్రముఖ వ్యక్తులలో వీరొకరని, లక్షలాదిగా తమ ఆస్తిని సాహిత్యం కోసం, సమాజం కోసం వెచ్చించిన మనీషి కృష్ణరాయగారు తమ చివరి ఘడియల్లో డాక్టరు ఫీజుకుకూడా డబ్బులు ఇవ్వలేని స్థితికి వచ్చారని, శిస్తు కట్టలేని కారణాన సుమారు 600 ఎకరాలను ప్రభుత్వంవారు తీసికొన

టం జరిగిందని తమ పితృపాదలను గూర్చి శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు పేర్కొనటం జరిగింది.

మహాసభ పక్షాన అధ్యక్ష కార్యదర్శులు కోశాధికారులైన శ్రీయుతులు కానం రాధాకృష్ణయ్యశ్రేష్ఠి, జూటూరు వేమయ్య, కదిలవాయి రాధాకృష్ణమూర్తి ప్రభృతులు పాల్గొన్నారు. ఈ వ్యాసకర్త నాళం వారి చిత్రపటాన్ని బహూకరించటం, భావకవిగా నాళంవారు అనే అంశాన్ని పరామర్శించటం జరిగింది.

## నరసరావుపేట

10-3-1981 వ తేదీన నరసరావుపేట అభ్యుదయ భారతి సాహిత్య సమితివారు ఏర్పాటు చేసిన శత జయంతి సభలో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, డాక్టర్ అకురాతి పున్నారావు, శ్రీ చిట్టిప్రోలు కృష్ణమూర్తి ప్రభృతులు నాళంవారి జీవితాన్ని, సాహిత్యాన్ని భిన్నకోణాల నుంచి పరిశీలించారు.

తిరుపతి వేంకటకవుల తర్వాత అటు దువ్వూరివారు, ఇటు నాళంవారు మాత్రమే తెలుగులో సారళ్యాన్ని సంతరించి పెట్టిన సాహిత్యకారులని కైకేయి, తరంగిణి ఇత్యాది గ్రంథకర్తలైన చిట్టిప్రోలు కృష్ణమూర్తిగారు పేర్కొనటం జరిగింది. ఈ వ్యాసకర్త సమర్పించిన నాళంవారి చిత్రపటాన్ని పంచాయతీరాజ్యం, విశ్వశిల్పి పత్రికా సంపాదకులు, గ్రంథాలయోద్యమ కార్యకర్తలలో ఒకరైన చిట్టూపూరు నాగభూషణాచార్యులుగారు ఆవిష్కరించారు.

అభ్యుదయ భారతి తరపున దాని అధ్యక్ష కార్యదర్శులైన శ్రీయుతులు కొప్పరపు సత్యనారాయణ, ముప్పాళ్ల మధుసూదనరావు, జిల్లా

గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు శ్రీ యన్నం వేంకటనరసిరెడ్డి, శ్రీ యన్. మాలకొండయ్య, కథారచయిత లింగంగుంట జానకిరాం ప్రభృతులు కార్యక్రమంలో, నిర్వహణంలో పాల్గొన్నారు.

ఈ సభను తిలకించిన ఆవేశ దురంధరులు, గుంటూరుజిల్లా ఆర్య వైశ్య మహాసభ అధ్యక్షులు శ్రీ మేళ్ళచెరువు వీరాంజనేయులు నాళంవారి సంక్షిప్త వ్యక్తిత్వాన్ని, చిత్రపటంతోసహా కరపత్రాలుగా ముద్రించి, ఆయా సంఘాలకు పంపటం జరిగింది. ఆ కృషిలో వారి కోరిక మేరకు యీ వ్యాసకర్త సహకరించటం జరిగింది.

కారెంపూడి

పలనాటి కురుక్షేత్రంగా పరిగణింపబడే కార్యంపూడిలో 19[illegible]1 మే [illegible]1 వ తేదీన రోటరీ క్లబ్ వారు జిల్లా పరిషదున్నత పాఠశాలలో శతజయంతి సభను ఘనంగా నిర్వహించారు.

"అలనాడు కృష్ణుడు తన మురళీ నాదంతో ప్రజలను పరవశింప చేశాడు. అయితే యీనాటి నాళం వారి విషయంలో మురళీ స్థానంలో కలం ప్రవేశించింది, తత్ఫలితంగా సంగీత స్వభావమైన మాధుర్యాన్ని అది సంతరించుకుంది" అని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నుమ్మంవారి సాహిత్యాన్నిగూర్చి పరిశోధనచేస్తున్న చిట్టిప్రోలు వేంకటరత్నంగారు చెప్పారు.

ముఖ్యఅతిథి లక్ష్మీకాంతమ్మగారిని తదితరులను సభాస్థలికి మేళతాళాలతో, స్వాగత సత్కారాలతో విడిదినుండి తీసికొనిరావటం జరిగింది. లక్ష్మీకాంతమ్మగారికి సన్మానపత్రాన్ని సమర్పించిన తరువాత చీరాల ఛాన్సీ శివకోటేశ్వరరావు దంపతులు నూతన వస్త్రాలను బహూకరించటం

జరిగింది. రోటరీ అధ్యక్ష కార్యదర్శులైన డా॥ కె. యస్. ఆర్. శర్మ, వి. జి. కె. మూర్తిగారలు, గ్రామ సర్పంచ్ శ్రీ యడ్లా రామయ్య, శ్రీ చందోలు అల్లా నారాయణ, శ్రీ చిట్టిప్రోలు కృష్ణమూర్తి, విదిదిని ఏర్పాటుచేసిన శ్రీ యక్కలి పిచ్చయ్య ప్రభృతులతోపాటు ఈ వ్యాస రచయిత పాల్గొనటం, నాళంవారి చిత్రపటాన్ని బహూకరించటంజరిగింది.

## వినుకొండ

8–12–1982 వ తేదీన వినుకొండ యువ సాహితీ వికాస వేదిక వారు జూనియర్ కళాశాలలో ఏర్పాటుచేసిన సభలో ప్రధానవక్తగా యీ వ్యాస రచయిత పాల్గొనటం జరిగింది. చతుర్విధ కవితాధురీణ శ్రీ బెల్లంకొండ సూర్యప్రకాశరావుగా రధ్యక్షతవహించిన సభలో యీ వ్యాస కర్త బహూకరించిన నాళం వారి చిత్రపటాన్ని నరసరావుపేట లైబ్రేరియన్, రచయితయైన శ్రీ ముప్పాళ్ళ మధుసూదనరావుగారు .ఆవిష్కరించటం జరిగింది. ముఖ్య అతిధిగా శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు పాల్గొన్నారు. అభ్యుదయ కవులలో ప్రముఖులైన శ్రీ గంగినేని వేంకటేశ్వర రావు, శ్రీయుతులు కమలారామ్, చందోలు చంద్రశేఖర్, యోగీశ్వర రావు, ప్రిన్సిపాల్ శ్రీ పిచ్చయ్యగారు, తెలుగు సాహిత్యప్రియులైన తమిళ సోదరుడు షణ్ముగం ప్రభృతులు సభాకార్యక్రమాలలో పాలు పంచుకొన్నారు.

## బందరు

బందరు జాతీయ బోధనా కళాశాల సాహిత్య సమితివారు 10–12–1982 వ తేదీన ఏర్పాటు చేసిన సభలో యీ వ్యాస రచయిత ప్రధాన వక్తగా పాల్గొనటం జరిగింది. సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు

వేదాల తిరువేంగళాచార్యులుగారి కుమారులు, ఆ కళాశాల తెలుగుశాఖా ధ్యక్షులు, శ్రీ నరసింహాచార్యులు చలంపైకూడా నళం వారి ప్రభావ మున్నట్లు పేర్కొనటం జరిగింది, నళం వారి పలుకు మార్దవాన్ని సాధన ద్వారా రాబట్టుకోవటానికి రాయప్రోలు వారు ప్రయత్నించిన జాడలున్నాయని తమ అనుభూతుల నాధారంగా తెలియచేశారు. వీరేశ లింగంగారి దత్తకుమారుడైన వీరేశలింగంగారు ప్రాచీన గ్రంథాలు కూడా కొన్ని క్రొత్త విషయాలను వెలుగులోనికి తీసుకువస్తాయని పేర్కొన్నారు. మినీకవితా ప్రచారకులు, అభ్యుదయ కవులలో ఒకరైన శ్రీ రావి రంగా రావు నళకు కృతజ్ఞతలు తెలిపారు.

## వేటపాలెం

1981 సెప్టెంబరులో వేటపాలెము సారస్వత నికేతనమువారు ఏర్పాటు చేసిన సభలో శ్రీమతి లక్ష్మీకాంతమ్మ, శ్రీ పాతూరి నాగభూష ణం, శ్రీ గద్దె శ్రీరామమూర్తిగారలతోపాటు ఈ వ్యాస రచయిత పాల్గొ నటం జరిగింది. లక్ష్మీకాంతమ్మగారు పూజ్యపాదులైన తమ తండ్రిగారి ఛాయాచిత్రాన్ని గ్రంథాలయానికి సమర్పించారు. శ్రీయుతులు జ్వాలా నరసింహం, సుబ్రహ్మణ్యంగారలును, గ్రంథాలయ అధ్యక్ష కార్యదర్శు లును ఆ సభా నిర్వహణంలో పాలు పంచుకోవటం జరిగింది.

## బాపట్ల

18-1-1981 వ తేదీ శుక్రవారము నాడు బాపట్ల కళా భారతి వారి అధ్వర్యంలో శ్రీ హితైషిణీ మందిరిలో సభ ఏర్పాటు చేయబడింది. న్యాయవాది శ్రీ టి. వేంకట జ్వాలానరసింహశాస్త్రి అధ్యక్షతన జరిగిన యీ సభలో లక్ష్మీకాంతమ్మగారితోపాటు డా. కె వి. సత్యనారాయణా చార్యులు, నెమ్మాని సీతారామయ్య ప్రభృతులు ప్రసంగించటం జరిగింది.

బాపట్లలోనే ఆర్యవైశ్య సంఘంవారు మరో సభను ఏర్పాటుచేశారు

## రాజమండ్రి

రాజమండ్రిలో నాళం వారి శతజయంతి సన్మాన సంఘం వారు, గౌతమీ గ్రంథాలయంవారు 1981 జనవరిలో విడివిడిగా జయంతి ఉత్సవాలను నిర్వహించటం జరిగింది.

ఈ వ్యాస రచయిత దృష్టికిరాని శతజయంతి ఉత్సవ సభలుకూడా మరికొన్ని ప్రాంతాలలో జరిగి ఉండవచ్చును.



వినుకొండలో యువసాహితీ వికాస వేదికలో
శ్రీ ముప్పాళ్ల మధుసూదనరావు వీరి చిత్రపటాన్ని ఆవిష్కరించి
కార్యదర్శి కమలారామ్‌గారికి అందిస్తున్నారు. వేదికపై శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు, నాటి ప్రధానవక్త చిటిపోతు సుబ్బారావు, సభాధ్యక్షులు
బెల్లంకొండ సూర్యప్రకాశరావుగారు ఉన్నారు.

# మధురకవి సంక్షిప్త జీవిత చరిత్ర

[ * ]

ఆంధ్ర సాహిత్య రంగంలో, సంస్కరణోద్యమంలో, సామాజిక నిర్మాణాత్మక కార్యక్రమంలో నాళం కృష్ణారావుగారందెవేసిన చేయి. అనేక రంగాలలో, అనేక కారణాలవల్ల కొందరు తమకు రావలసినంత పేరు, ప్రతిష్ఠలు రాకుండా కన్నుమూస్తారు. అటువంటి వారిలో వీరొకరు,

వంశచరిత్ర:- దేశ చరిత్రలు, సాహిత్య చరిత్రలు, కవి చరిత్రలవలెనే ప్రముఖులైనవారు తమ వంశీయుల చరిత్రలను పదిలపరచుకోవటం ముదావహం. రానున్న తరాలవారికి వారి చరిత్రను తెలియచెప్పినట్లవుతుంది, ఆ ఉద్దేశ్యంలో నాళం రామలింగయ్యగారు 1916 మే నెలలో "శ్రీ నాళము వంశముక్తావళి" అనే గ్రంథాన్ని (డెమ్మీసైజు 32 పుటలు) వెలువరించారు. రామలింగయ్యగారిచే సంపాదింపబడి నాళం కృష్ణారావుగారిచే వచనంలో వ్రాయబడిన ఈ పుస్తకాన్ని చెళ్ళపిళ్ళ దిన వేంకట శాస్త్రిలుగారు పద్యాలుచేర్చి సరిచూచారు. కాకినాడ స్కేప్ అండ్ కో, ముద్రాక్షరశాలం వారు ముద్రించారు. గుంటూరుజిల్లా వినుకొండతాలూకా, హరితస గోత్రికులైన పులిపాక పార్వతీశంగారి వంశస్థులు వీరి గురువులుగా ఆ గ్రంథంలో చెప్పబడ్డారు. ఆయా కుటుంబాలవారేర్పాటు చేసుకొన్న వర్తక స్థావరాలు, చేసిన దాన ధర్మాలు, ఎవరెవరే యే కాలాలలో జనన మరణాలకు లోనైందో ఆ గ్రంథములో తెలియచేయబడ్డాయి. వారు ప్రచురిద్దామనుకొన్న "ద్వితీయగుచ్ఛం" వెలుగు చూచినట్లు కన్పించదు.

విష్వక్సేన గోత్రంగా, వివరిశిష్ట సంకేత నామంగా ఉన్న నాళం వారి వంశానికి మూలపురుషులు శంకరప్ప అనే వారు. గోదావరి జిల్లా, అమలాపురం తాలూకా అంబాజీపేటలో ఉండే శంకరప్పగారు-

"శంకర ప్రీతికరుఁడు, వంశంకరుండు
సంకుల యశః ప్రకాశి విజ్ఞానరాశి
మూగురు కుమారులం గన్న మొదటి యన్న
శంకరప్పకు నెవ రప్ప సాటి చెప్ప."

అని ప్రస్తుతింప బడ్డారు. అటువంటి శంకరప్పకు ఏడవ తరం లోనివారు భీమయ్య. అన్నగారైన చలమయ్యగారి నుండి 1885 లో వేరు పడ్డారు భీమయ్యగారు. వీరికి, వీరయ్య, వెంకన్న, రామన్న, వల్లభరాయుడు, పట్టాభిరామయ్య సుబ్బయ్య, చలమయ్య, అనే ఏడుగురు కుమారులూ, కామమ్మ, వెంకమ్మ, జగ్గమ్మ అనే ముగ్గురు కుమార్తెలు కలిగారు. వీరంతా కలిసి మెలసి మండపేట, రాజమహేంద్రవరం, కాళ్ళరేవు, విజయనగరం, చెన్నపట్నం మొదలైన స్థలాలలో వ్యాపారాన్ని చేశారు. అప్పటిలోనే వారి ఆస్తిపాస్తులు సుమారు 20 లక్ష లుండేవి.

"భీమయ్య స్వీయవృత్తియెడ భీమయయేయగు సత్యవృత్తి నా
రామయ నా దగున్ బహుధురంధరులౌ తనయుల్,
తనూజులున్
శ్రీ మహిమమ్ములుం గల యదృష్ట విశిష్టుఁడతం డొకండెయీ
భీమయ చేతగాదె యభివృద్ధిఁ యఖిలమ్ము గాంచుటల్."

అని ప్రశంసింపబడ్డ యీయన తమ డెబ్బైవయేట శోభకృత్ కార్తీక

బహుళ పంచమీ(12-11-1843)నాడు భార్యను, సంతానాన్ని వీడి పరలోక గతులయ్యారు.

రాజమహేంద్రపుర వాస్తవ్యుడుగా:-

నాళం వారి జన్మస్థలం చారిత్రిక ప్రాశస్త్యాన్ని సంతరించుకొన్న రాజమహేంద్రవరం ఆదికవి నన్నయ్య, ఆధునిక యుగకర్త కందుకూరి, మధురకవి నాళం కృష్ణరాయలా యిమ్ము వలరించే ముద్దుబిడ్డలు. వారి వాసినీ, రాశినీ తొలిగిస్తే ఆ పట్టణాన్ని మనం ఊహించలేము. అందువల్లనే నా దృష్టిలో వారు "వర కవిత్రయం"

చరిత్ర ప్రశస్తికెక్కిన ఆ పట్టణంలో వృత్తిరీత్యా, ప్రవృత్తి రీత్యా సుగంధాన్ని, సాహిత్యసుగంధాన్ని వెదజల్లినవారు కృష్ణారావుగారు లక్ష్మి కామరాజుల ముద్దుబిడ్డగా 1881 జనవరి 18 వ తేదీన జన్మించారు, సంక్రాంతి శోభలతో తనదైన ఒక సాహిత్యప్రపంచానికి ఆదిపురుషుడుగా నిలచిపోదగ్గ గుణాలను భవిష్యత్తులో మూర్తీభవింపుకొన్నాడు. నాళం వంశస్థులైన పద్మనాభం, రామలింగయ్యగార్లతోనూ, పైడా రామకృష్ణయ్య ఆత్మూరి లక్ష్మినృసింహ సోమయాజివంటి త్యాగపురుషులతోపాటు కృష్ణారావుగారి జనకుడైన కామరాజుగారు వీరేశలింగంగారి స్వీయచరిత్రంలో చోటు చేసుకొన్నారు. అటువంటి కుటుంబంలో పుట్టినా, ఆంధ్రదేశంలో నాటక రంగానికి వన్నె తెచ్చిన ఏలూరు జమిందారులైన మోతే వారికల్లుడయినా కృష్ణారావుగారికి జమిందారీ వాసనలు పట్టుపడలేదంటే అతిశయోక్తికాదు. భావనా ప్రపంచంలోతేలి సుందర మందిరాలను, సుకుమార ప్రకృతిని వర్ణించిన తొలితరం భావకవులకులేని ఒక అవకాశం మాత్రం నాళంవారికి కలిగినట్లు వారి గ్రంథావలోకనంవల్ల తెలుసుకోవచ్చు। దర్శనీయమైన వస్తువును వర్ణించే కవికీ, దర్శనీయం కాని వస్తువును వర్ణించే

కవి కిభేదాలు పసికట్టాలంటే సహజసుందరమైన వీరి మధుర కవితలను తదనంత రీసుల కవితలలో పోల్చి చూడవచ్చు। "లోకంలో అన్నిబిరుదులు సార్థకమైనట్లు కనుపించదు. అవి పరిమితము. అంత సార్థక్యముపొందిన బిరుదు మరి యే కవిపట్లను ఉన్నట్లు నేను భావించను" అని అందుకే కాబోలు దివాకర్లవారు నాళం వారికున్న మధురకవి బిరుదాన్ని హైదరాబాద్ సభలో తడవిచూస్తూ తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చగలిగారు.

జాతకం:- బాలదారి వీరనారాయణదేవుగారు వీరి జననకాలాన్ని పేర్కొంటూ నాళంవారి షష్టిపూర్తి సంచిక (సమీక్ష 179 పుట)లో యీ క్రింది పంక్తులువ్రాశారు. నాళమువారి వంశముక్తావళిలోను (పుట 25) యీ జనన తిథిని పేర్కొనటం జరిగింది.

"శ్రీ మధురకవి నాళము కృష్ణరాయుడు జన్మించినది విక్రమాబ్దము పౌష్యమాసం. కృష్ణపక్షంలో విదియ తిథి సోమవారం పగలు అశ్లేషా నక్షత్ర తృతీయ చరణంలో మేష లగ్నమందు ప్రభవమందినాడు మా కృష్ణరాయడికి గురుడు పంద్రెండో యింట నున్నాడు. కావుననే సద్వ్యయం చేస్తాడు. లగ్నంలో శనిగాడు దాపురించిన కారణాన పితలాట కొనికింత కావుంది. వాక్స్థానానికి పాపార్గళం పట్టింది. శుక్రగ్రహం స్త్రీగ్రహంఅయింది. కావుననే సఖాకంపం వెంటబడి తరుముతుంది. తృతీయ కేతుయోగం. బుధాదిత్య యోగం కల్గాయి. చతుర్థి కేంద్రంలో పూర్ణ చంద్రుడు స్వక్షేత్రంలో ఉంది, గురుదృష్టి కలిగిఉండడం జాతకానికి మహా శుభలక్షణం. అందుకనే దేశీయ విద్యలమీద పర్యవేక్షణము కుదురుకుంది: పాండిత్యమూ ప్రాప్తించింది. శుక్రుడు దేకాదశ స్థానాన్ని విడుచుట చేత, కావ్య నాటకాది సత్కృతులు జాలువారాయి. కాని, ఒక్క చి తం మాత్రంఉంది. మహోత్కృష్టదశలో శుక్రుకీర్తులతో వెలుగొందవలసిన

జాతకునకు యోగ భంగం కలిగింది. హేతు నిర్ణయభారం పార మెరింగిన కార్తాంతికులది కాని, మన యూహల కందరాని విషయం॰

బాల్యము :- కృష్ణరావు చిన్నతనంలో దుందుడుకుగా ప్రవర్తించేవాడు. బడి కూడా మానివేశాడు. అయితే ఈకాలపు ఆకతాయివాళ్ళల్లా ప్రవర్తించేవాడు కాదు. గోదావరిలో శవాలు తీయటం, ఆస్పత్రిలో రోగులకు సేవచేయటంవంటి కార్యక్రమాల్లో నిమగ్నమయ్యేవాడు. అతడికి తోడు ఇరవై, ముప్పైమంది మిత్రులుండేవాళ్లు. గోదావరితీరంలోనో మరో ప్రాంతంలోనో ఆడుకునే అతగాడిని పట్టుకోవాలని ఎవరైనా ప్రయత్నిస్తే "సైం" మార్చి "సైం"లో మోయేవాడు. తనకోసం వచ్చే వంతుళ్ళ నుంచి తప్పించుకోవటానికి మిత్రులనే అంచలంచలుగా వుంచేవాడు. యుద్ధరంగంలో ప్రధానాధికారి తెలుసుకొన్నట్లుగా తాజా సమాచారాలను ఎప్పటికప్పుడు తెలుసుకొనేవాడు. భావకవులవలె కేవలం ప్రకృతివర్ణనలతో తృప్తిపడక ప్రకృతి పంచియిచ్చిన అనుభవాలను మనసా, వాచా, కర్మణా తెలుసుకోవటానికి పూనుకొని కృతకృత్యుడు కావటానికి ప్రయత్నించాడు. ఆవిధంగా కృతకృత్యులైన తెలుగు కవులలో అగ్రేసరుడుగా కూడా నిలుస్తాడు. చిలుకలకు పలుకులు నేర్పి వాటి రాయబారంతో వీరేశలింగంగారి ఉద్యమాలకు తోడ్పడిన విషయం వీరికే చెల్లుతుంది. వారి సమీపబంధువు పైడా రామకృష్ణయ్యశ్రేష్ఠి (కాకినాద) గారు కందుకూరి వారి ఉద్యమాలకు ఆ రోజులలోనే ముప్పైవేల రూపాయలివ్వటం జరిగింది. తన కుటుంబీకులు, బంధువులు కందుకూరి వారికి బాసటగా నిలబడితే వాళ్ళల్లో కలికితురాయి వంటివాడీ కృష్ణరావుగారు.

పేనాభావంతో ప్రవర్తించే వేంకటకృష్ణయ్యను ఒకసారి వాళ్ళ పెద్దలు పిలిస్తే చెట్టెక్కి కూర్చొని ఎంతకూ దిగిరాలేదు. పది, ఇరవై,

ముప్పై అలా రెండువందల రూపాయలిస్తామన్నారు. అప్పుడు దీ
వచ్చాడు. ఆ డబ్బులు అవదలో ఉన్న ఒక స్నేహితుడికిచ్చి అతని
యిల్లు విడబెట్టాడు. తన దగ్గర లేకుంటే పెద్దల నడిగి దానధర్మాలు చేసే
వాడు. మామిడి దేవేంద్రుడనే వ్యక్తి పైచదువులకు ఇంగ్లాండువెళ్ళాలి.
150 రూపాయలు కావాలి. ఆస్తిపాస్తి లున్నప్పటికి అతనికి డబ్బు లివ్వ
టానికి చిక్కులేర్పడ్డాయి. అప్పుడు గురువుగారైన వీరేశలింగంగారివద్ద
ప్రోనోటు వ్రాసి అతణ్ణి ఇంగ్లాండుకు పంపించాడు. (వంతులుగారి స్వీయ
చరిత్రము పుట 324) దానధర్మాలు గోప్యంగా ఉంచే కృష్ణారాయ డీల
యెన్ని కావించాడో? ఇలాంటి వాళ్ళాంధ్రదేశంలో ఎందరుంటారో అనే
అనుమానాస్పదమే.

మూడవ అన్నయ్య పద్మనాభం (గోదావరిజిల్లాలో మొట్టమొదట
బి. ఏ., గ్రాడ్యుయేటు) ప్రకృతులవల్ల చదికిపోయిన అతడు ప్ర
పరీక్షలో ఫస్టుమార్కులు తెచ్చుకోవటం అందరికి ఆశ్చర్యం కలిగించింది.
అంతేకాకుండా తొమ్మిదవతరగతిలో ప్రశ్నాపత్రానికి జవాబులన్నీ పద్యాల్లో
వ్రాసి తన ప్రతిభను నిరూపించుకొన్నాడు. ఆనాటి చదువుల సారాన్ని
వంటబట్టించుకున్న కృష్ణారావుగారు మెట్రిక్యులేషను వరకు చదివారు.
అయితే ఇంగ్లీషులో యం. ఏ., లు వ్రాసిన కొంతమంది వీరి వద్ద విద్య
నభ్యసించారు. దానివిబట్టి ఆంగ్లభాషా పాండిత్యం అవగతమవుతుంది.

వైవాహిక జీవితం :— ఏలూరు జమీందారుగారైన మో
రామకృష్ణయ్య, రామమ్మగార్ల కుమార్తె వేంకటసుబ్బమ్మను వివాహం
చేసికొన్నాడు. తనకంటె 8 సంవత్సరాలు చిన్నదైన ఆమెకు ధార్మిక
చింతనం ఎక్కువ. సనాతనాచార నిష్ఠాచార గరిష్ఠురాలు. అటువంటి
ఆమెకు కృష్ణారావుగారు తమ కవితాహృదయాన్ని పరిచయం కావించారు.

అంతకుమించి సంస్కారవాదిగా మలిచారు. ఆమె తులసీదాస హిందీ రామాయణాన్ని నిత్యం పఠిస్తుండేది। నూటికి నూరుపాళ్లు బ్రాహ్మణసామాజికుడిగా బ్రతికిన కృష్ణరావుగారి కనుకూలవతిగా ఉన్నప్పటికీ ఆమె సనాతనాచారాన్ని మాత్రం వీడలేదు. హైందవత్వం, భారతీయత మూర్తీభవించుకున్న ఆమె నీ విషయంలో పట్టువట్టకపోవటం కృష్ణారావుగారి సంస్కారానికి తార్కాణం. భర్తచేత సంస్కారవాదిగా మలచబడ్డ యామె విదేశ వస్త్ర బహిష్కరణమే కాకుండా గాంధీమహాత్ముని రాజమహేంద్రవరం రాక సందర్భంగా విదేశ వస్త్ర దహనం చేసింది. అందుకు సంతోషించిన మహాత్ముణ్ణి తమ యింట సంద్లరసం ఆ పట్టణంలో తొలుదొల్తగా యిచ్చిన మహిళకూడా యామె। ఆ సందర్భంలో బాలికగా ఉండే లక్ష్మీకాంతమ్మగారు కూడా తన బంగారు గాజులను గాంధీ ఉద్యమాని కివ్వటం జరిగింది. నిరాడంబరంగా ఉండే ఆమె అనుదినం వీణావాదనం కావిస్తుండేది. ఆంధ్ర మహిళాగాన సభ మొదలైన కార్యక్రమాలలో పాల్గొంటూ ఉండేది. ఆమెలోని సుగుణ కోటినిచూచి ఆమెకిడిన సార్థక నామధేయమే సుశీల। ఆమె చేతల్లో, కట్టుబాట్లలో పెరిగిన సంతానం అభివృద్ధిక్రమంలో వామనమూర్తుల్లా తేజరిల్లారు.

"ఆత్మ విభునకు నేడ్గడ యగుచు, నతని
తెల్లగతులను దోడ్పడి, యెప్పుడుఁ దల
లోని నాల్కవలెం బొల్చు నా నెలంత"

అని మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిగారు పల్కిన పలుకులు అక్షరసత్యాలు.

కృష్ణరావుగారు దక్షిణ భారతమేకాక ఉత్తర భారతాన్ని అందునా కాశ్మీరు, హిమాలయాలు మొదలైన సుందర దృశ్యాలను, అజంతా,

ఎల్లోరా మొదలైన శిల్పవైభవాన్ని ఆయా సమయాలలో స్నేహితులలో లేదా కుటుంబ సభ్యులతో దర్శించటం జరిగింది. తను పొందిన కళాను రక్తికి తార్కాణాలుగా కార్యాసక్తులను కుమార్తెను తీర్చిదిద్దారు. తన కున్న దేశభక్తి, కళానురక్తి మొదలైనవానికి ప్రతిబింబాలా అనేవిధంగా - కత్తిసాము, కర్రసాము, గుఱ్ఱపుస్వారి, సంగీతం, సాహిత్యం మొదలైన కళలలో చిన్ననాడే కుమార్తె లక్ష్మీకాంతమ్మగారు తమ ప్రవీణతను చాటుకొన్నారు.

సాహిత్యానికి, గ్రంథాలయానికి అంకితమైన నాళం వారు 1961 ఏప్రియల్ 17 వ తేదీన చనిపోయే నాటికి డాక్టర్ని పిలిస్తే ఫీజు ఇవ్వ గలమా? లేమా? అనే సందిగ్ధావస్థలో పడ్డారు. అనాటి సుశీలమ్మగారి హృదయ పరివేదనాన్ని గమనిస్తే చకితులమవుతాము. అలహాబాదు మొద లైన చోట్ల తమకున్న ఆస్తిపాస్తులు ప్రజాహిత కార్యక్రమాలకు దత్తం చేసి, తన వారసురాలిగా ఇందిరను రూపుదిద్దుకున్న నెహ్రూగారిలాగా నాళం కృష్ణారావుగారు కనిపిస్తుంటారు.

ప్రకృతి ప్రియత్వం - వింత అలవాట్లు :

"ప్రకృతి సౌందర్య రేఖలు ప్రస్ఫుటముగ
పలుకు పోగర చెక్కిన పరమశిల్పి!
రమ్య గీతా కథానికా రత్నహార
మంద్రముగ పోహళించిన అమృతహస్త!
మనసు మెత్తన పలుకులో మలచితెచ్చి
తలపు లోతుల నర్థమం దలవరించి
సహజ సౌశీల్య మంతటు జాలుకొలిపి
కవితయే నీవుగా గూడు కట్టినావొ!"

అని ఏలూరు రత్నత్రయంలో ఒకరైన బొడ్డు బాపిరాజుగారిచే ప్రశంసలు పొందారు. పేకుమళ్ళ కామేశ్వరరావుగారు "బాలరకవి" అంటే, కొమరువోలు సుబ్బారావుగారు బాలరకవి మాత్రమే కాదు ప్రకృతి కవి"కూడా అన్నారు. తెలుగువారి వర్డ్సవర్తుగా పోల్చారు. ఆంగ్లవాఙ్మయ ప్రభావంలో. వంగదేశంలో జరిగిన మార్పులు తెలుగు దేశంలో ప్రతిబింబించే కాలంలో షుమారు 1900 సంవత్సరంలో "లిరిక్కుల తుఫాను" తెలుగు సాహిత్యంలో బయలుదేరింది. ఆ యుగసంధిలో నాశంవారు వ్రాయటాని కుద్యుక్తులైనట్లు కొమరువోలు వారి వ్రాతలు:

"పువ్వుఁ దేనెయు తావియు పుప్పొడియును
చిందకున్నను చెడకున్న చెదరకున్న
ముద్దు బిడ్డల నవ్వుతోఁ బోల్చవచ్చు
క్రొత్తగా విచ్చు పున్నాగ గుచ్ఛకంబు.

కన్నె వెన్నెల కన్నను : వెన్న కన్న
మంచు బిందులకన్న । క్రొమ్మించుకన్న,
కుసుమ మకరందమునకన్న కోమలంబు
చిఱుతపాపల చిన్నారి చిన్ని నగవు"

అని ప్రకృతికి, బాలలకు సంబంధాన్నేర్పరచారీ మృదుమధుర హృదయులు, పసిపాపంపై ప్రదర్శించే ఆదరాతిశయాలు, పెద్దలమీద సర్వ ప్రాణులమీదా చూపించేవారు. "దయాజనీస వేదాంతి"లా ప్రకృతి ప్రసాదించే వాన, గాలి, యెండ, స్వేచ్ఛ మొదలైనవాటిని నిరంతరం అనుభవించాలనే అభిలాషను కలిగి ఉండేవాడు. గౌతమీ గ్రంథాలయానికి వెళ్ళేటప్పుడు ఎండ, ముసురు, మంచువంటివి పట్టినప్పుడు మిత్రులు

ఆహ్లాదకరంగా ఉంచే గొడుగును వారించిన సందర్భాలెన్నో ఉన్నాయి. ఉరుగు ముసురు, గోరువెచ్చని యెండ అంటె వారికి ప్రాణం. మనుష్యుని జీవనం ప్రకృతి శోభలనుండి దూరం చేసే సాంఘిక బంధాలను వీలైనంతవరకు తెంచుకోవటమే వారి మతం. "ప్రకృతి చికిత్సకుగాని, భైషజ్య చికిత్స" వారి కుటుంబానికి తెలియదట. పురుళ్ళకూ, పుణ్యాలకూ అంతే. వీణా గానం, పద్య పఠనం, తొట్టె స్నానం మొదలైనవి వారి పిల్లల రోజువారీ డైరీ.

"తొట్టి తానము చేయుచున్నట్టి వేళ
వచ్చియును రాని జిలిబిలి పలుకు లొలయ
చిన్ని కృష్ణుని పద్దెముల్ చెన్ను మిగుల
చదువుచుందువు, నే డట్లు చలుపవేమి

సరస సంగీత సాహిత్య భరితమైన
శ్రుతి హితంబగు త్యాగయ్య కృతిని బోలె,
చిన్నదయ్యును తావక జీవితంబు
రసిక జన రంజనంబయి రమణగాంచె.

బుధవరేణ్యులు బోధించు బోధకన్న
ప్రకృతి యందలి బహువిధ వస్తు సమితి
అవగత మొనర్చు సృష్టి రహస్యములను
గ్రంథములకన్న ప్రకృతియే ఘనతరంబు"

వంటి పద్యాలిందు కుదాహరణాలు.

"హృదయకోశంలో విజ్ఞానకోశాన్ని గర్భీకృతం చేసుకొన్న నవ నాగరిక శిఖామణి, చదువుల సరస్వతి"యైన నాళం వారు "ఆలోచనా ధార

ముచే ముడుతలు పడిన ఫాలభాగంతో, అంతర్భాగమున కళ్యాసపడిన ఓరచూపులతో, ముతక గుడ్డలను కట్టుకుని, చేతిలో బెత్తంకాని, నెత్తి మీద గొడుగుకాని, కాళ్ళకు చెప్పులుకాని, జేబులో ఊటకలంకాని లేకుండా వీధివారే నడచి పోతుంటే, శుద్ధ పల్లెటూరినుండి రవాణా కాబడ్డ జానపదునికి సరియైన నమూనాగా ఉంటా" రంటారు. బాలదారి వీరనారాయణదేవు గారు. రోళ్ళు పగిలే రోహిణికార్తెలో కాళ్ళకు "అగవాళ్ళు" లేకుండా మీదనుండి జాలువారే వర్షధారలను పాయలుపాయలుగా విదళించుకొంటూ మందస్మితాంకురాలను పెదవులమీద తాండవింప జేసుకొంటూ, తనమానాన తను ఏ అభివతి లేకుండా పోయేవాడట। ఆ వ్యక్తే సంధ్యా సమయం అయ్యేవరకి పురమందిరంలో చదరంగం బల్ల వద్ద సమరాన్ని సాగిస్తుండే వాడు. ఒక్కొక్కవేళ అక్కడే బల్లలమీద కండువాను చుట్టకుదురుగా చుట్టుకొని తలవాల్చి ఏటవాలుగా పరుండి కాలుమీద కాలువేసి బలేదర్జాగా చుట్ట కాలుస్తుండేవారు। వాయు తరంగాలను తలపిస్తూ అలవోకగా ధూమ పానం చేసే యీతణ్ణి "కాపీ" కొట్ట "త్రాహి, త్రాహి"యైనవారున్నారు। ఆ వ్యక్తే కొన్ని వేళలందు ప్రత్యూష పవనాంకురాలు, స్వైర విహారాలు సాగించే పట్టులందు, గౌతమీ ప్రవంతి వీచికల్లో బారీతలు సాగించేవాడు। ఇదొకటెట్టూ, దానికి వ్యక్తి దళవాయి. ఈతలో జలస్తంభనాది దృశ్యాలను ప్రదర్శిస్తూ "ముద్దనుసు ముచ్చట"లనుచూపించేవాడు. నావ షికారులంటే వీరి కభిమాన క్రీడ: ఆ సరంజామా అంతా ఒక మహాయజ్ఞంలా సాగించేవాడట।

ఒక్కొక్క సమయాన పొయ్యిదగ్గర బైటాయించి పెసరట్లు తయారీని పరామర్శిస్తుండేవాడు. మరొకవేళ రొట్టెబిడ్డలకు వెన్న పూతలను బనాయించి, త్రేల్చుకొని అహరించేవాడు. చిత్రమైన చిరుతిండ్లు తినే అలవాట్లూ ఉండేవి. ఏ పువ్వు కాసింది – ఏ అకు కాసింది–

అమాంతంగా తినేస్తాడు. వర్వ భక్షక స్వామి। ఒకసారి ఏ ఆకో, పూవో తిని మాట వడిపోయి ప్రాణాపాయ స్థితిని కొనితెచ్చుకొని ఎలాగో బ్రతికి బట్ట కట్టాడని లక్ష్మీకాంతమ్మగారి కథనం. శీతోష్ణపరిశలావ అరుపైట హిమానీపూరాలు, సాంద్రతరంగా వర్షించే ఋతువులో సైతం "మేలి ప్రావారాన్ని" మునుగువన్ని మూడంతె వేసి ఉలక్కుండా వలక్కుండా ఉండేవాడట। తులాసాక్తైనా, విలాసావిక్తైనా, వానితో పోటీపడి యెవ్వరైనా వాని ప్రక్కన ప్రక్క వేశాడంటే, ఆ పక్క పక్క ఒక్క ఆరు మాసాలకైనా సాగి రావలసిందేనట। ఆ మానవుడు త్రాగే తేనీటి పాని యాన్ని త్రాగి బ్రతికి బట్టకట్ట సాహసించినవాడు లేడంటారు బాలదారివారు.

దేశభక్తుడు :- రాజమండ్రి, ఏలూరు, మండపేట, కాకినాడ వంటి ప్రాంతాల్లో తమ సేవా కార్యక్రమాలవల్ల రచనా వ్యాసంగంవల్ల కొద్దికాలంలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకో గలిగారు. విద్య, వినయం, సంపదవంటి అన్ని హంగులూ ఉంది, అవకాశాలున్నప్పటికీ పదవులతో కూడినరాజకీయాలకు దూరంగాఉన్నాడు. స్వాతంత్ర్యోద్యమంలో తనశక్తి కొద్దీ పాల్గొన్నాడు.

బిపిన్ చంద్రపాల్ రాజమండ్రికి వచ్చిన సంవత్సరంలో నాళంవారు క్తేజితు లయ్యారు. అంతేకాక పురమందిరంలో వీరేశలింగంగారి పేరుతో పెట్టిన పఠనమందిరంలో ఖుదీరాం బోసు చిత్రపటాన్ని ఉంచి తమ దేశభక్తిని తద్వారా ప్రజల్లో రేకెత్తించాడు. గురువైన వీరేశలింగంగారు కేవలం సమాజ సంస్కరణల్లో మాత్రమే పాల్గొన్న ఆ సమయంలో నాళంవారు స్వాతంత్ర్యోద్యమ రంగంలోను పాల్గొన్నారు, ముందుచూపు లేని వీరేశలింగంగారు ఖుదీరాం బోసును రాజద్రోహిగాను, కృష్ణారావును అకతాయిగాను జమ కట్టడం విషాదకరం. [వీరేశలింగం స్వీయచరిత్రం

పుట 321]. అటుతరువాత వచ్చిన గాంధేయ ఉద్యమాల్లోపాల్గొన్న కృష్ణ రాయని ప్రోత్సాహం టంగుటూరి ప్రకాశం పంతులుగారు కూడా పొందా రని లక్ష్మీకాంతమ్మగారి కథనం.

బ్రాహ్మ సామాజికుడు :- ఆంధ్రదేశంలో తొలినాళ్ళకు చెం దిన బ్రహ్మమతావలంబకుల్లో నాళం వా రొకరు. "అపర విద్యా సాగరు శైవ శ్రీ వీరేశలింగ గురునికి గుండెకాయ" అనీ బ్రహ్మసమాజంలో స్వానుష్ఠాన సంపన్నులు లేని కాలాన వీరేశలింగం, బావయ్యగార్ల కన్న ముందుగా యజ్ఞోపవీతాన్ని విసర్జించి బహిష్కారాన్నందిన నెలబాోదు" అని, ఆంధ్ర ప్రవక్త, ఉపన్యాసకేసరి, బాలదారి వీరనారాయణ దేవుగారు ప్రస్తుతించారు. రఘుపతి వెంకటరత్నంనాయుడు వంటి వారితో సన్నిహిత పరిచయముంది. 1904 ప్రాంతంలో ప్రార్థనా సమాజంలో ఉన్నతాసనా న్నధిష్ఠించి వారు కావించిన తొలిపూజ హృదయ తంత్రులను మీటినట్లు బాలదారివారు పేర్కొన్నారు. సంగీత ప్రియులైన నాళంవారి సమాజ ప్రార్థనల కివిధంగా తలలూపిన వారెందరో ఉన్నారు.

1908 వ సంవత్సరంలో ఏలూరులో కావించిన ప్రార్థనా మందిర స్థాపనలో వీరి కృషి ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ విషయాలలో ఒకటి. ఆ మందిరంవల్ల బ్రాహ్మ సమాజ ధర్మాలకు, సంఘ సంస్కరణ భావాల కెందరో అంకితం కాగలిగారు. అటువంటివారిలో మాజేటి సుబ్బయ్య, వెల్లంకి కృష్ణమూర్తి, చుండూరి శ్రీరాములు, దుగ్గిరాల దేవలరాజు, డాక్టరు గోవిందరాజులు, శంకర వెంకట్రామయ్య, మాజేటి సుబ్బారావు ప్రభృతులు ప్రత్యేకించి చెప్పుకోదగ్గవారు. అతడు కావించిన సేవాకార్య క్రమాలవల్ల కులం నుండి వెలివేయబడ్డాడు. అత్తమామలుకూడా తమ యింట అన్నం పెట్టటానికి నిరాకరించారు. సిద్ధాంతాలకు లొంగని కృష్ణ

రాయడు తనను అర్థం చేసుకోగలిగి, ఆదరంతో పిలిచిన మాజేటి సుబ్బారావుగారింట మాత్రమే పరమానందంగా భుజించాడు.

"వీరేశలింగం పంతులుగారి వితంతు వివాహాలు, సంఘ సంస్కరణ, బ్రహ్మ సమాజోద్యమం మా పొలిమేర చేరేవికావు. పండితదాసు శ్రీరాములుగారు ఎంత గడబిడసాగించినా లాభం ఉండేదికాదు. సనాతనం ఇక్కడ గాఢంగా గడ్డకట్టుకుపోయింది."అని నాళంవారి రాక ముందున్న ఏలూరు స్వరూపాన్ని వెల్లంకి కృష్ణమూర్తిగారు ఆవిష్కరించారు.

కాకినాడ ఆంధ్రశాస్త్రి ఆస్తిక మహాసభల్లో భోజనాల సమయంలో పంచములు తమ ప్రక్కన కూర్చుండటం ఒక వర్గానికి అత్యంతరంగా కనిపించింది. వెల్లంకి కృష్ణమూర్తివంటి మిత్రులతోకలసి వాళ్ళతోపోరాడి విజయం సాధించాడు. పంచముల్లో ఒకరైన చింతా శేషయ్యగారిని స్వయంగా రాజమండ్రికి తీసుకువచ్చి మూడుసంవత్సరాలు అయిన్నా తన సోదరుడిగా ఆదరించాడు. బ్రాహ్మ మత ప్రచారకునిగా తీర్చి దిద్దాడు. ఈశ్వర చంద్ర విద్యాసాగర్‌గారు రాజమండ్రి వచ్చినప్పుడు వారి వెంట ఉండి కార్యక్రమాలు చక్కదిద్దాడు.

బాల సాహిత్యకారుడు :- పసిబిడ్డల చేష్టలు, వారి అమాయికత వారి నిర్లిప్తత, వారి ముద్దులు, వీరి మనస్సును చూఱకొన్నాయి. స్వత స్సిద్ధంగా వెన్నెవంటి మనస్సు. ఊహ అంకురించని, జీవితపు మాయ లింకా సోకని పాలవెన్నెలవంటి వారి "లేత యెదదల యిఱుకులు"కూడా శోధించటంలో దిట్టలు.

గోరు ముద్దలు, మీగడ తరకలు, వెన్న బుడగలు, పాలతరగలు, తేనె చినుకులు, దీపావళి, విరిదండ, వెన్నెల వెలుగులు, మొద

లైన గ్రంథాల్లోని అనేక అంశాలిందు కుదాహరణాలు. దువ్వూరి రామి రెడ్డిగారి వలిత కేళాన్ని తలపించే వీరి "ముద్దు" కావ్యాన్ని, మిక్కిలి ఉత్కృష్టమై స్మృతిగీతంగా పేర్కొనబడ్డ వీరి హృదయ నైవేద్యమైన "పాపాయి" కావ్యాన్ని ప్రత్యేకంగా విమర్శకులు పరిగణనలోకి తీసుకో వలసి యుంటుంది. "పాశ్చాత్య కవితా సూత్రముల ప్రకారము కృష్ణ రావుగారి సుతస్మృతి గీతమువంటి యుత్కృష్టగీతము తెలుగులో లేదని చెప్పవచ్చు" నన్న యీ గీతాన్ని శ్రీయుతులు శ్రీపాద, బొడ్డు బాపిరాజు, జాషువా ప్రభృతులు ప్రశంసించారు. తమకుగల సాహిత్యాభిమానాన్ని, రచనా శక్తిని ప్రోదిచేసిన నాళము కృష్ణారావు, చింతా దీక్షితులుగారు రెండు కళ్ళలాంటి వారంటారు బాలబంధు శ్రీ బి. వి. నరసింహారావుగారు.

వీరి బాల సాహిత్యంలో బాలురను గూర్చిన విషయాలు, సులభంగా విషయ బోధనం కావించటానికి బాలురకొరకు ఎంపికచేసిన విషయాలు, పరిణామక్రమంలో సాహిత్య జిజ్ఞాసను, భాషాపుష్టిని పెంపొందించాలని వ్రాసే విషయాలు గోచరిస్తాయి. ఆ తరువాత వచ్చిన బాలసాహిత్య కర్తలు ఏదో ఒక అంశాన్ని తీసికొని ఎక్కువగా రచనలుచేశారు. బాలసాహిత్యంపై వచ్చిన తమ పరిశోధనా గ్రంథంలో డాక్టర్ వెలగా వేంకటప్పయ్యగారు వీరినిగూర్చి బాగా పరామర్శించినట్లు కన్పించదు. [ఈ వ్యాస రచయిత వెలగా వేంకటప్పయ్యగారి ఉపన్యాసం విన్న తరువాత వచ్చిన అభిప్రాయం] "నాళం వారి జీవితమూ సాహిత్యమూ" అనే పూర్తిగ్రంథం వచ్చినపుడు మాత్రమే అనేకమైన సందేహాలు తీరి కొన్ని నిర్ణయాలను ఇంకా నిష్పష్టంగా చేయగలుగుతాము.

"ఆకసంబున తూనీఁగ లాడఁ జొచ్చె
గుంపులుగఁ గూడి చీమలు గ్రుడ్లు మోచె

కొంగ కడుపులు బారులై నింగి తెగసె
త్రాఁచుపాములు పుట్టలఁ దాగియుండె

మెడలు సారించి తొండలు మిన్నుచూచె
బురదలో నూరపందులు పొరలియాడె
దున్నపోతులు తిరుగాడె దుంతగమున"

మొదలైన పద్యాల్లో నుడికారంతోపాటు పిల్లలకు పాఠాలు నేర్పించే పద్ధతి కూడా గర్భీకరింప చేశాడు. చిన్నయసూరిలో కనిపించే యీ ప్రక్రియను నాళంవారు వపికట్టినట్లు గోచరిస్తుంది.

పాల తరగల గ్రంథంలో - బిచ్చగాడు, అంధ బాలుడు మొదలైన ఖండికల్లో వారి మన స్తత్వాలను వెలిబుచ్చటంతోపాటు, ఉదాత్తంగా ఉండవలసిన ఆప్పాత్రల ఆలోచనలను రూపకల్పనంచేశాడు. "కవి-ధనికుడు" శీర్షికలో కవులు వ్రాసే విషయాల్లో నత్యాసత్యా లెంతగా ఉంటాయో వ్యంగ్యంగా, హృద్యంగా చెప్తాడు.

"ఊరి వెలుపల పాడుకోనేరు చెంత
మనుజు లెవ్వరు మసలని మాఱుమూల
గుట్టచ్ఛాటున లోతైన గొయి త్రవ్వి
పసిడి దాచెను పిసినారి ముసలి యొకడు"

కొఱవితో గాల్చినట్టులు, నురియవెట్టి
వ్రచ్చినట్టులు, కొఱ్ఱున గ్రుచ్చినట్లు
కలుకు అంపాన గోసిన కరణి॥

వంటి పద్యాల్లో శ్రీపాద కృష్ణమూర్తిగారు పేర్కొన్నట్లు అర్థానికీ, భావానికీ మించి కవి చేసిన కూర్పు కనబడుతుంది.

"తేట తెలుఁగునఁ గవనంబు తేనె లొలుక
నేర్చి చెప్పెడి నాళము కృష్ణరావు
మధుర కవితంబుఁ గ్రోలెడి మానవులకు
జ్ఞాన మభివృద్ధిఁ జెందును జయము కలుగు॥

అని కదా కవికేసరి, అద్దేపల్లి సత్యనారాయణగారు తమ అభివందనంలో తెలియ చేసినది.

భావకవి :- 10-12-1982 న మచిలీపట్నంలో నాళంవారి శత జయంతి సభలో మాట్లాడుతూ సుప్రసిద్ధ విమర్శకులు వేదాల తిరువేంగళాచార్యులుగారి కుమారులు నరసింహాచార్యులుగారు నాళం వారిని తొట్టతొలి బాల సాహితీబ్రహ్మగా అభివర్ణించారు. నాళం వారి పలుకుబడిలోని సహజ సాహితీ మాధుర్యాన్ని రాబట్టటానికి రాయప్రోలు వారు సాధన చేసిన జాడలున్నా యన్నారు. సహజ సుందరమైన నాళంవారి మధుర కవితలకు సగిషీని, రమ్యత్వాన్ని చేకూరిస్తే కవితా రమ్యాలోక మేర్పడుతుందనే యీ వ్యాసకర్త అభిప్రాయానికి వారి పలుకులు క్రొంత బలం చేకూర్చాయి. 1898 నాటికే గ్రంథాలయాన్ని స్థాపించిన ప్రముఖుడు కావటం, రాయప్రోలువారు తమ యౌవనపు తొలినాళ్ళలో నాళంవారితో గడపటం, రాయప్రోలువారే నాళం వారిని మధురకవి పట్టాభిషిక్తులను చేయటం, అందుకు కొన్ని ఉపబలకాలు.

రక్తి రచియించితివి మధుర ప్రబంధ
ఖండముల నిజ రస రక్త ఖండములుగ

బహుముఖ వ్యవసాయ సంస్కారమున
జీవిత క్షేత్రమున పూల తీవ లల్లు,
సాగె సంగీత సాహిత్య సస్య శిఖలు
బుతు కళా లాంఛనములయి కృష్ణరాయ

చ్యుత సదాచారమయి, శోభ సోలియున్న
చదరములను సంస్కార బీజములు చల్లు
కార్తెలందున నీ తొలకరి వయస్సు
కృషిముఖాసక్తమయ్యె నో కృష్ణరాయ ।

మొదలైన పద్యాలలో రాయప్రోలువారు నాళంవారిని [షష్టిపూర్తి సంచిక పుట [197] ప్రశంసించటం జరిగింది.

బాల సాహిత్య బ్రహ్మయైన నాళమువారు సాహిత్య పరిణామ క్రమమున కందుకూరి, గురజాడల తరువాతను, రాయప్రోలు వారికి ముందుగను నిలుస్తారని నా ఉద్దేశ్యం।

ఈ దృష్టితో చూచినపుడు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారి "వీరేశలింగంపంతులుగారి జీవితము - సాహిత్యము" లోను, డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారి "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు" గ్రంథంలోను నాళంవారు చోటు చేసికోవలసియుంటుంది. హైదరాబాదు(30-8-1981)లో జరిగిన నాళంవారి శతజయంతిసభలో సభాధ్యక్షత వహించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి సభలోను, ఆయా సభా సందర్భములలోను సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు జ్వాలాముఖి (3-10-1981), డాక్టర్ అకురాతి పున్నారావు, డాక్టర్ యస్. గంగప్ప ప్రభృతులలోను లేవనెత్తిన యీ యంశముపై ఏదో ఒక మేరకు వారంగీ

కరించటం జరిగింది. ఆయా విషయాలను కూలంకషంగా పరిశీలించి సిద్ధాంత స్థాపనం చేయటం, జాగ్రత్తగా అవలోకనం చేయటం సాహిత్య జిజ్ఞాసువులు చేపట్టవలసి యుంటుంది. ఇప్పటికే నాళంవారిని గూర్చి M. Phil. చేసిన కుమారి నూనె బాలాత్రిపురసుందరిగారి వ్యాసాన్ని యీ సందర్భంలో పరిగణనంలోకి తీసికోవలసియుంటుంది.

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి సిద్ధాంతగ్రంథంతో భావకవిత్వ శాఖలుగా పేర్కొనబడ్డ దేశభక్తి కవిత్వం, ప్రకృతి కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, స్మృతి కవిత్వం మొదలైన శాఖలను పోషించిన నాళంవారిపై ఆంగ్లభాషా ప్రభావంకూడా దట్టంగా ఉంది. అది భావకవులకు ఒక "క్వాలిఫికేషన్" గదా!

"రమ్యమగు నీదు కవితా మరంద ధార
చేరల కొలంది చుబ్బున చూఱగాగ
నర్థిఁ గ్రోలని యట్టి విద్యార్థి గలడె?
వానఁ దడియని వ్యక్తియే లేని భాతి"

అనే శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తంగారి [అభినందనము పుట 8] పద్యంకానీ, కోటేశ్వర చంద్రశేఖర కవులు పేర్కొన్న

వాలుజారు మీ కవితా ప్రవాహమునకు
పిల్లకాలువలగు మా కవిత్వ కళలు,
పారనేర్చుట యెల్ల మా భాగ్య గరిమ,
సత్య మరయ నదృష్టవశమ్ము సుమ్ము.

వెన్నముద్దలఁ బంచి గోపి వినోదీ
యెల్ల తన నెయ్యులను దనియించుమాడ్కి,

నవ్య నవనీత పేశల కావ్యములను
జనుల నెల్లఱ ముగ్ధుల సలుపు దీవు

మధుర మంజుల కవన సామ్రాజ్య మేలి
జన్మభూమిని జ్ఞాన బిక్షలను బంచు
త్యాగశీల! నీ జన్మ సార్థకత మించు।
గాదె నాశము కృష్ణరాట్కవి వరేణ్య!

ఇఁకను మీవంటి సరస కవీంద్రవరుల
భావనాకర్ష సాహిత్య భాగ్య గిరులఁ
గడుపునంగని చల్లని కనులఁ జూచి
భారతావని సంతసపడును గాత!

అనే పద్యాలలోని భావాలుకాని

"మధువునకుఁ బోల్పవచ్చును
సుధకుం బోల్పంగ దగును సురుచిరమౌ నీ
మధుర కవితా రసమ్మును"

అనే శిఖరం కోటేశ్వరగుప్త (బెంగుళూరు)గారి పద్యపంక్తులుకానీ,

"కులుకున్ గీతము నీ కరాబ్జమున నిగ్గుల్ దేరి, కొంగ్రొత్తశో
భలతో వాఙ్మయరంగమెక్కినది: నీ "పాపాయి" కావ్యంబు ము
ద్దులముత్యా లెగజిమ్మె నిందతిశయోక్తుల్ లేవు నీవాక్సుధన్
జలకం బాడిన తెల్గు కాశ్యపి ఋణస్థంబయె నీకుం గవీ!

అని మధుర శ్రీనాథ, గుఱ్ఱం జాషువాగారి "ఆశంస" నందుకొన్న పద్యం కాని, పన్యాల రంగనాథ్‌గారు పేర్కొన్న:-

"అవునోయీ! అతడేను మా తెనుగువాడత్యంత మాధుర్యస
త్కవితావేశ రసైకమూర్తి, తన వాక్యమ్ముల్కొ గీతమ్ము, మా
వినూత్నమస్మత జాతిముత్యమయి వాదన్ వాదలన్ తక్షులన్
చవిచూపించిన గీతికామయి"

అనే పద్యం కానీ, భావకవితా సిద్ధాంతస్థాపకులైన వలుపురి విమర్శకులకుకాని కనిపించక పోవటం సాహిత్య ప్రియుల దురదృష్టం.

"తెనుగు వారికి తేట తెనుగు మాటల నేర్పి
తెనుగుం దనము తీర్చి దిద్దినావు
తీయని గీతికా ఖ్యాయికల న్నేర్పి
చిన్నవాళ్ళను పెద్ద జేసినావు
కవితలో నూత్న మార్గమ్ము లన్వేషించి
మాధుర్యమును మాకు మప్పినావు"

అనే అవన్యాల రంగనాథ్ ప్రశంసల భావా లీ సందర్భంలో గమనార్హం.

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి "రీతి రాత్మా కావ్యస్య" అనే వ్యాసంలో లోకం చవి చూస్తున్న చక్కని ధారాశుద్ధి గల గ్రంథ కర్తలను పదిహేనుమందిని వెతకి చూపించారు. ఇంకా వెతికి చూస్తే ఇద్దరు ముగ్గురు కన్న ఎక్కువ కన్పించరని తేల్చి చెప్పారు. తిరుపతి వేంకట కవుల తరువాత ఆ అదృష్టానికి నోచుకున్నవారు పన్యా

భానం వారి ఉద్దేశ్యాన్ననుసరించి శ్రీయుతులు వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, వేలూరి శివరామశాస్త్రి, దీపాల పిచ్చయ్యశాస్త్రి, రాజశేఖరకవి, మోచర్ల రామకృష్ణయ్య, పెమ్మరాజు లక్ష్మీపతి, దువ్వూరి రామిరెడ్డి, జాషువా, కాటూరి వేంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతం, గిడుగు సీతాపతిరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, నాళము కృష్ణరావుగారలును. ఇందులో దువ్వూరి రామిరెడ్డి ప్రభృతులను సవ్యకవులుగా పేర్కొనిరి. కవితా గుణాన్నిబట్టి, రచనా కాలాన్నిబట్టి నాళంవారికున్న యీ స్థానాన్ని సముచితంగా భావించవచ్చు.

కావ్యసామగ్రిలో ఒకటైన వ్యుత్పత్తి కొఱవడటం, భావాన్ని ప్రదర్శించటానికి తగిన భాషరాక "అంతర్గూఢగుడాయతే బహిర్వ్యక్తుం న శక్యతే" అన్నట్లు "అలజడి" పడే వాళ్ళను గూర్చి -

"హృదయమున నచ్చు గ్రుద్దినట్లెదుట నిలిచి
తాండవించుచున్నట్లు చిత్ర ఫలకంబు
భావమును బ్రదర్శింపగా భాషరాక
యదుకు పెట్టుచునుం"దురని పేర్కొన్నారు.

ఈ దృష్టితో చూచినప్పుడు నాళం వారి కావ్యాలు మాత్రమే కాక ఇంచుమించు అన్ని పద్యాలు పాఠకుల మనస్సుపై ముద్రవేస్తాయి. "వెన్నెల వెలుగులు" అనే వారి గ్రంథంనుండి కొన్నింటి నుటంకిస్తాను.

నిన్ను ప్రేమించు నా ప్రేమ నిర్మలంబు
నిరుపమానంబు, నిత్యంబు, నిర్మలంబు,
నిన్ను సేవించు నా సేవ నిశ్చలంబు,
నిర్నిరోధంబు, నిద్దంబు, నిట్టలంబు.

పరులు నీపయి దండెత్తి వచ్చిరేని
వారితో బోరి యవలికిఁ బారఁ ద్రోల
నాదు ప్రాణము, మానంబు నా ధనంబు
నర్పణ మొనర్చి ధన్యుండ నగుదు నేను

[నా జన్మభూమి]

గేయమో లేక త్యాగయ్య కృతియొ లేక
జానపద గీతమో లేక జావళియొ
అదియుఁగాక తరంగమో, అష్టపదులో,
మువ్వగోపాల పదములో ఎవ్వఁ డెఱుఁగు

[ఒంటరి పల్లె పిల్ల]

ఒప్పులన్నియు నొకచోట కుప్పవోసి
అందములనెల్ల నొక చక్కి పొందు పరచి
చేసెఁ గాఁబోలు బమ్మ యా లూసి మోము.
అట్లుగాకున్నఁ గలుగునే యట్టి హొయలు

[లూసి గ్రే]

ఎవరి నెఱుఁగక. ఎవరిచే నెఱుఁగఁబడక
వాని వలె నేను జీవింప వాంఛ సేతు:
ఎవ్వరును నాదు మృతికయి యేడ్వకుండ
ఏ కతమ్మున కనుమూయ నిచ్చగింతు

[ప్రశాంత జీవనం]

ఈ మహా విశ్వ రణరంగ భూమియందు
జీవితం బను ప్రస్థాన సీమ నిలిచి
పిరికి పందల రీతిని పరుగు లిడక
పోరు గావించి గెలువుమా వీరుడవయి

పరమహాత్ముల జీవిత చరితలెల్ల
పావన మొనర్చు మానవ జీవితముల
దివికి నేగుచు కాలంపు దిబ్బమీద
విడిచెదరు వారు తమ కాలి యడుగుజాడ

[జీవిత గీతము]

పగలు వికసించి, దినమెల్ల సొగసులీని
రాత్రియైనంత నేలపై వాలఁగాక!
లీలఁ దానున్న యా యల్పకాలముననె
కమ్మ తావుల విరజిమ్ముఁ గాదె సుమము

[రాలిన పూలు]

సార్వభౌముని కత్తి. కర్షకుని హలము
సమముగా రెండు నొకదాని సరస నొకటి
మృత్తుతోపలఁ బొరలాడు, మృత్యుదేవి
అఖిల రీతుల నొకరీతి నాదరించు.

[మృత్యువు సకల సమవర్తి]

అదిగో! యా గుజ్జు మామిడి కొమ్మ మీఁద
పాడుచున్నది కోయిల వేడుకలర;
ఓహో అ గాన మెంత మనోహరంబు!
గ్రంథములకన్న నందె విజ్ఞాన మలరు

[గ్రంథము – ప్రకృతి]

దారిలో నిండి నిబిడీకృతముగనుండె
రాళ్ళు గుట్టలు. ఖురదయు. ముళ్ళపొదలు:
వాని దాటించి తెలతెల్లవారువేళ
రాజబాటను నన్ను జేర్పంగదయ్య!

[నడుపురణి]

ప్రణయ వాహిని వీచీ పరంపరలను
అడ్డువెట్టుట కెవరికి నలవికాదు:
ప్రేమ యెక్కడ దృష్టి సారించెనేని
లీల రెక్కలు గట్టుక వాలు నచట

ప్రేమకును లోనుగానట్టి చేది కలదు?
ప్రకృతి రమ్య ప్రదర్శన రంగముననుు
సకలమైన చరాచర జాలమందు
నిండి నిబిడీకృతంబయి యుండు ప్రేమ

ప్రేమ దేవుండు, ప్రేమయే విశ్వమెల్ల!
ప్రేమయే సృష్టి కంతకు ప్రేరణంబు:
ప్రేమ యను వస్తు వొకటి లోపించెనేని
లోకమంతయు నల్లకల్లోలమగును.

"వాని తలపుల గాలి నా వాంఛ లనెడి
యలల నుద్ధూత లూగించె"

పొమ్ము దుఃఖమ! సౌఖ్యమా! రమ్ము వేగ!
ఎవతె యందని ఫలమని యిన్ని నాళ్లు
తలచి యుంటినో అట్టి యా లలన నేఁడు
దక్కినది నాకు నవలీలఁ దనకుఁ దానె

[విరాగి]

జీవమా! నేను నీ కిదే చెప్పుచుంటి:
ఎప్పుడైనను సరియె - నీ యిచ్చవచ్చి
నప్పు డించుక నాతోడ చెప్పకుండ
చల్లఁగా మెల్లఁగా నీవు జారిపొమ్ము

[జీవ :హ

జన్మమునఁ దొల్త శూద్రులే సకల జనులు
అవల సంస్కారమున ద్విజుఁడగు నరుండు,
వేద పాఠంబుచే నంత విప్రుఁ డగును
బ్రహ్మ మెఱిగిన పిదప తా బ్రాహ్మణుఁడగు

"మాల మాల"ని యేల గగ్గోలు సేయ?
మాట తప్పిన యాతఁడే మాలగాని
కులము చండాలుఁ డయ్యెను కొఱత గలదె?
అనుచు వేమన యోగీంద్రుఁ డాడలేదె?

కుల విభేదన నిగళంబు కూలఁ ద్రోయ
లేనివాఁడు స్వరాజ్యంబు బూనలేడు
ఉట్టి కెగురంగఁ జాలని యట్టివాఁడు
స్వర్గ మెగురంగఁ దలచుట భ్రాంతికాదె?

మతము మతమంచు మాటికి మచ్చరించి
కాలు ద్రవ్వెద వేటికి కయ్యమునకు?
మతికి సమ్మతమైనదే మతము సుమ్ము
సర్వ మతముల యందలి సారమిదియ.

[కులము]

పై పద్యాలలో ధారాశుద్ధి, స్పష్టావగాహనంతోపాటు భావకవుల పోకడలుకూడా స్పష్టంగా గోచరిస్తాయి. జాగ్రత్తగా పరిశీలించినపుడు రాయప్రోలు, దేవులపల్లి, నాయని వంటి అనంతర భావకవుల పోకడ లీ పద్యాలలో గోచరిస్తాయి.

అయితే వల్నాటి సోదర కవులలో ఒకరైన శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు (1912-74) గారు పేర్కొన్నట్లు భావకవులకు సహజంగా ఉండే ప్రేయసి తాలూకు "హైల్య ప్రాభవోద్రేకముల్" నాఁటి వారిలో లేనందున ఆయన్ను భావకవిగా విమర్శకులు గుర్తుపట్టలేక పోయారేమో?

వీరేశలింగంగారికి ముందు "పూర్వసాహిత్యమున అందలమెక్కిన కావ్యకన్య అంతకంతకు కళాకాంతులు తరించి వయోరూపములు కృశిం" చిన విషయములను డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ "నవ్యాంధ్ర సాహితి" [Cyclestyled note book - 19/5] లో తెలియచేశారు.

రమణీయోక్తులచేత నర్థగుణ సారస్యంబుఁ గల్పించుచుం
దమి నాయంగ చయంబునన్ సహజ సౌందర్యంబు
పెంపొందఁ గొం
చె మలంకారములుంచి తొల్లి టికవుల్ చేష్టా చమత్కార భా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుంగాపాడి రక్షా క్రియన్

అటు సుఖియింపుచుండగ మ దాస్యమునందు నిరర్థకంబులై
పటుపటులాడు శబ్దములు బల్మిని బెట్టి, రసంబు నెట్టి య
క్కటికములే కలంకరణ కైతవముంగొని మేనుకుట్టి, యి
ప్పటి ఘనులార్తిపెట్టెదరు ప్రాణముతీసి ననుంగలంచుచున్

తెలియదు సుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్
వెలిభూషలు గా కివి సం
కెలలయి కడు నాదు మేనికిన్ వెత నించున్

సరస్వతీ నారద విలాపము (1.87) లో కవి హృదయాన్ని యీ
విధంగా బహిర్గతం చేసిన సరస్వతీదేవి చేతనే కందుకూరివారు

దయమాలి తుదముట్టఁ దలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించు నొకఁడు
పాదంబులోపలఁ బాదంబు లిమిడించి
వీరుఁడై నన్ను నొప్పించు నొకఁడు
ప్రాసంబుపైఁ బెక్కు ప్రాసంబు లడరించి
పోటుబంటై నన్ను పొడుచు నొకఁడు

రెండు పల్కులు గూర్చి నిండించు నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకఁడు

ఖడ్గ చక్రాది రూపముల్ కానిపించి
వర్ణములు మార్చి ననుఁ జిక్కుపఱుచు నొకఁడు
కుమతు లొడలెల్ల విఱిచి ప్రాణములు తీయ
నొడలి పసలేక శుష్కించి యున్నదాన.

రసములె కావే ప్రాణము
లసమాన కవిత్వకాంత కవనీ స్థలిలోఁ?
రసహీనమైన కవితకుఁ
బొసగించు నలంకృతి శవమున కిడు తొడవే!"

అని నారదునికి సూటిగా చెప్పస్తాడు.

రస జగత్తులో ప్రధానమైన కరుణ, శృంగారాల్లో కరుణాన్ని ఆశ్రయించి కందుకూరివారి భావాన్ని బాగా అర్థం చేసికొని కవిత్వపు సహజ సౌందర్యాన్ని పోషిస్తూ వచ్చిన ఉత్తమ కవులలో నాళంవారు మొదటివారేమోనని నా ఉద్దేశ్యం.

ఆంధ్రేతివృత్తాలతోపాటు ఆంగ్లవాఙ్మయంలో ఉత్తమ రచనలుగా ప్రశస్తి పొందిన ఏడుగురము, కేసయాంబికా, బిచ్చకత్తె, బ్రూను - సాలీడు, ప్రణయమహిమ, కుంద, ఈగ - సాలీడు, నళిని, కెన్యూటు చక్రవర్తి మొదలైన అనువాదాలను పఠితం సహజ సుందరంగా తీర్చి దిద్దటం జరిగింది.

"ఏది సహజంబో, ఎయ్యది కృత్రిమంబో?
అరసి వేగమె దేవర యానతిండు:
అఖిల శాస్త్ర విశారదులైన మీకు
ఎఱుగ రానట్టి మర్మముల్ ధరణి గలవె"

అని "సోలమన్ చక్రవర్తి"చే ప్రశ్నవేయించి సహజత్వ మేదో తెలియచెప్తారు.

"కృష్ణరావుగారి రచన కలంకలేని వెన్నెలవలె శుభ్రము. దాగుడు మూతలు, ఒడుదుడుకులు, విపరీతావేశములు మచ్చుకైనా కనబడవు. వర్ణిత వస్తువును కన్నులకు గట్టినట్లు స్వభావోక్తి వీరి రచన అన్నింటను పాలలో నీరువలె వ్యాపించియున్నది. శబ్దములతో ఛాయాచిత్రములు చేయుటలో ఈయన నేర్పరి" అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు; "మృదు భావములను ప్రదర్శించుటలో ఈతని శైలిని బోలిన దధునాతన కవులలో లేదనియే చెప్పవచ్చు"నని కొమరువోలు ప్రభృతులు అభిప్రాయపడ్డారు.

ఇటువంటి సహజ సుందరమైన, మృదువైన కవిత్వానికి రామణీయకాన్ని, విపరీతావేశాన్ని కల్పింపచేస్తూ క్రమంగా రాయప్రోలు, దేవులపల్లి ప్రభృతులు త్రోవలు తీయుటం జరిగింది. పరిణామక్రమంలో అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించింది. అందుకే తదనంతర కాలంలో జన్మించిన విస్ఫులింగంలాంటి "జ్వాలాముఖి" కాబోలు: కందుకూరివారి హృదయతాపాన్ని (సరస్వతీ నారద విలాపము) గుర్తుచేస్తున్నాడా అన్నట్లు

"కనిపించని ప్రేయసి వక్షోజాల
మత్తులో మునిగియున్న
కవికుమారులారా మేల్కొండి"

అవి మేల్కొలుపు పాడవలసి వచ్చింది. ఈ పంథాలో చూస్తే నాళం వారి కవిత్వం కాలం రీత్యా, గుణం రీత్యా, భావం రీత్యా అగ్రేస రంగా నిలబడుతుంది. అభ్యుదయ కవిత్వంలో తిలక్ ఎటువంటివాడో, భావకవులలో నాళంవా రటువంటివారేమో నని పిస్తుంది.

గ్రంథాలయ సేవకుడు :— ప్రప్రథమ గ్రంథాలయోద్యమ కార్యకర్తల్లో నాళంవా రొకరు. అయ్యంకి వెంకటరమణయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమరావు వంటి ప్రముఖుల ప్రవేశానికి ముందే నాళం వారీ రంగంలో ప్రవేశించారు. వారు స్థాపించిన రాజమండ్రి గౌతమీ గ్రంథాల యం ఆంధ్రదేశంలో అత్యంత ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. ఇటీవలనే ప్రభుత్వంవారు తీసుకున్న యీ గ్రంథాలయం వీరేశలింగ గ్రంథ భాండా గారం, వసురాజ గ్రంథ మండలి వంటి పేర్లతో పిలువబడింది. కాగా నలందవంటి సర్వోత్కృష్ట విద్యా కేంద్రాలతో గొట్ముక్కల వేంకటానంద రాఘవరావుగారు దీనిని పోల్చారు. గో సంరక్షణ సంఘాధినేతగా, హిత కారిణీ సమాజ ఉపాధ్యక్షుడుగా, అన్నదాన సమాజాధ్యక్షుడుగా, నాట్య గాన కళా సమితుల్లో ప్రధాన పోషకులుగా నాళంవారు కావించిన సేవలు ప్రశంసాపాత్రం. అంతకంటే ఎక్కువగా తను సేవలు గ్రంథాలయానికి ఆజన్మాంతం కావించారు. 1898 లో స్థాపించిన యీ గ్రంథాలయం 1940 లో వీరు షష్టిపూర్తి జరుపుకొనే నాటికే నలభై వేల అచ్చుపుస్తకాలు, ప్రాచీన వ్రాతప్రతులు, తాళపత్ర సంపుటాలు, తామ్ర శాసనాలతో నిండియున్న ఆ గ్రంథాలయం ప్రాధాన్యం తమ కళ్లల్లో స్పష్టంగా గోచ రించింది. మనస్సుతో చక్కగా మెదిలింది.

"తనువు రక్తంబు జీవంబు ధారవోసి
ఋషివతంసులు పెక్కు వేలేండ్లు తపము

సలిపి యార్జించినట్టి విజ్ఞాన ధనము
దాచియుంచిన పేటి గ్రంథాలయంబు,

ఏను గ్రంథాలయంబున కేగినపుడు
గ్రంథములు నాకు కన్పట్టు కనులయెదుట
పేడ్క దివి నుండి వచ్చిన విబుధు లనగ"

వంటి పంక్తులను వ్రాయగలిగారు.

• • •

8–12–1982 న వినుకొండలో యువ సాహితీ సమాఖ్య వారేర్పాటుచేసిన నాళంవారి శతజయంతి సభలో నాళంవారి గ్రంథాలయ సేవను, నాళంవారు గ్రంథాలయ వ్యవస్థలోనున్న లోపాల నెత్తి చూపించిన తీరు నరసరావుపేట లైబ్రేరియన్, రచయిత ముప్పాళ్ల మధుసూదనరావుగారెత్తి చూపించారు. ఏలూరులో రాష్ట్రస్థాయి గ్రంథాలయ సభ కధ్యక్షత వహిస్తూ, గ్రంథాలయోద్యమంలో రంకెలు వేస్తూ మద్రాసురాష్ట్రంలో మంత్రులైనంతనే తమ బాధ్యతలను విస్మరించిన పానగల్ రాజా, రామాయణం వంటివారికి ములుకులు కలిగించే అధ్యక్షోపన్యాసాన్ని కావించారు. 1981 సెప్టెంబరులో వేటపాలెం సారస్వత నికేతనం వారేర్పాటు చేసిన సభలో ముఖ్యవక్తలుగా విచ్చేసిన పాతూరి నాగభూషణంగారు గ్రంథాలయోద్యమంలో నాళంవారి పాత్రను, వారితోగల తమ పరిచయాన్ని లెన్నగా వెల్లడించారు. గ్రంథాలయోద్యమానికి వారు కావించిన సేవలను గూర్చి వ్రాసిన లక్ష్మీకాంతమ్మగారి వ్యాసం [గ్రంథాలయ జ్యోతి 1980 జూలై] ఒకటి ముద్రితమైంది.

"ఆంధ్ర దేశమునందు గ్రంథాలయోద్యమము ఉత్పన్నమగుటకు చాల కాలమునకు పూర్వమే, రాజమహేంద్రవరమున శ్రీ వీరేశలింగ పుస్తక భాండాగారమును నెలకొల్పి, ఆ పట్టణవాసుల కెల్లరకు గ్రంథ పఠనాభిలాషను పెంపొంద జేసి విజ్ఞాన బీజములను వారి హృదయ సీమ అలో వెదజల్లుచు వచ్చిన భాషా సేవాధురంధరు" డని "అతని స్నేహ సాహచర్యమువలన ననేక అమూల్య విషయములు నేర్చుకొనగలిగితి" నని విడదవోలు వేంకటరావుగారి లేఖనము [షష్టిపూర్తి సంచిక 147].

పత్రికా సంపాదకుడు :— "మానవ సేవ" అనే తొట్ట తొలి తెలుగు సచిత్ర మాసపత్రికను తమ సంపాదకత్వంలో ప్రవేశ పెట్టారు. "సత్య జీవనానురక్తి, ఏకేశ్వరోపాసనానక్తి" గల నాళంవారితోపాటు సుప్రసిద్ధ వాఙ్మయ పరిశోధకులు విడదవోలు వేంకటరావుగా రా పత్రికకు 1912 ప్రాంతములో కార్యనిర్వాహకుడుగా పనిచేశారు.

కళలకు, కవిత్వానికి, నర్మిశమలకు, సంఘ సంస్కరణానికి, ఏకేశ్వరోపాసనకు ఆ పత్రికలో ప్రధాన స్థానముండేది. రాజమండ్రి పుర మందిర గ్రంథాలయంలో భద్రపరచిన ఆ పత్రిక అట్టమీదున్న దృశ్యం, రంగుల కాంబినేషన్, అందులో ఉన్న భావం, ఆర్తి మొదలైన వాటి ద్వారా యీ నాటికీ గొప్ప చిత్రాలలో ఒకటిగా పేర్కొనవచ్చు.

కందుకూరివారికి నాళంవారికి వచ్చిన స్పర్ధల కారణంగా కందుకూరి తన స్వీయ చరిత్రం మండి నాళం కృష్ణరావుగారినిగూర్చి వ్రాసినఅంశాలు దాదాపు మొత్తంగా తీసివేయబడ్డట్లు, ఆ తరువాత ఆ ప్రతి ముద్రితమై నట్లు నాళంవారి ద్వారా లక్ష్మీకాంతమ్మగారు వివరణం జరిగింది.

చిలకమర్తి, చెళ్లపిళ్ల, శ్రీపాద, వడ్డాది మొదలైన సుప్రసిద్ధ కవి పండితులు నాళంవారి సహాయాన్ని ఏదోవిధంగా పొందారు. అజన్మాంత స్మృతి తీసికొన్న చిలకమర్తివారు కూడా వీరిని గూర్చి వ్రాసినట్లు కన్పించదు. రాజమహేంద్రవరం నుండి వెలువడ్డ కళాప్రపూర్ణ, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి "ఆంధ్ర రచయితలు" లోను కృష్ణరావు గారు చోటు చేసుకోలేకపోవటం విచారకరం. చరిత్ర కురుక్షేత్రంలో కృష్ణుడిగా మిగిలిపోయాడు.

ఈ అభినవ కృష్ణరాయని కొలువులో - కళాఖండాలు తీండ్రింప్తే తొలిజాము వేళ — సుంకర రంగయసూరి, సూరాబత్తుల సూర్యనారాయణ సుధీ, అత్తిలి సూర్యనారాయణ మనీషి, నత్కవోలు అప్పారాయ పండితుడు, బాగంటి వీరభద్రకవి, చెళ్ళపిళ్ళ చిన వేంకటశాస్త్రి, విదకుర్తి భీమరాజు, జేకుమళ్ళ రమణరాట్కవు అష్ట దిగ్గజాలుగా తేజరిల్లారు.

కవి జన పోషకుడైన కృష్ణరావుగారిని గూర్చి నరసరావుపేట నాళంవారి శతజయంతి సభలో (10-9-1981) ప్రసంగిస్తూ డా॥ అకురాతి పున్నారావుగారు నాళంవారు మధురకవి మాత్రమే కాక మహాకవికూడా అని ప్రస్తుతించారు. కాళిదాసువలె ఆర్ద్రహృదయుడైన నాళంవారు కాళిదాసుకంటె ఎక్కువ శృంగారాన్ని, ఎక్కువలాలిత్యాన్ని తమ రచనల్లో ప్రతిఫలింప చేసినట్లు వారు పేర్కొన్నారు. ఇరువురు కవులూ వ్రాసిన ఇందుమతీ వృత్తాంతాన్ని సందర్భాలో పేర్కొన్నారు.

"మంచి గంధము!! వెన్నెల, మంచుకంటె
శీతల కరంబు నందనా శ్లేష సుఖము,
ఉడుకు నూనియు, కార్చిచ్చు, పిడుగు కంటె
ఉగ్రతాపంబు పుత్రి వియోగ భరము"

అనే పంక్తులు తానెన్నో ఆశలు పెట్టుకున్న పుత్రుడు మరణించి నప్పుడు కృష్ణరావుగారు వ్రాయటం జరిగింది. పుత్ర వియోగబాధాన్ని, భావాన్ని యింత హృద్యంగా ఎందరు వ్రాస్తారో అనుమానాస్పదమే:

"శ్రుతుల సమ్మేళనము చేసి సొంపు మీఱ
రాగ మాలపింపగ వీణ బ్రద్దలయ్యె"

నవి మరెంద రా మరణాన్ని పోల్చగలరు. ఈ తీరైన వర్ణన వ్రాళ్లవారికి మాత్రమే చెల్లుతుంది.

"అందములు చిందు తీరు తీయములు గల్గి
ముద్దు గులికెడు నుడికారములు గల్గి యలరుచుండు
లలితజాతీయములు గల్గి యలరుచుండు
తేట తెనియయూట మా తెనుంగు మాట"

అని తమ కవితను గూర్చి చెప్పుకొనిన యీ కవి మధుర కవితలతోపాటు శ్రీకృష్ణరాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వం, జాతీయములు, లోకోక్తులు, సంస్కృత న్యాయములను గూర్చి వ్రాసిన పరిశోధనాత్మక గ్రంథాలు వ్రాశారు. గాంధీమహాత్ముని దశావతార లీలలు, స్త్రీలయెడ పురుషులు కావించు పంచ మహాపాతకములు వంటి సంఘోద్ధారకమైన గ్రంథాలూ వీరి లేఖిని నుండి వెలువడ్డాయి. భాషా విషయికంగా, భావ విషయికంగా పై యిరుతెగల గ్రంథాలు పరిశీలించవలసియుంటుంది. చచ్చు పుచ్చు కవుల గ్రంథాల స్థానంలో వీరి కవితలు పాఠకాలల్లో పఠనీయ గ్రంథాలుగా పెడితే తెలుగుదేశం తప్పక సత్ఫలితాలు సాధిస్తుంది.

నాళంవారి జీవిత గ్రథనం వల్ల మరికొన్ని సాంఘిక సత్యాలు సాహిత్యమథనంవల్ల మరికొన్ని నవీననవనీతమార్గాలు ద్యోతకమౌతాయి



శ్రీ విశ్వశ్రీ ఆర్ట్ ప్రెస్, నరసరావుపేట.

## దేవుఁడు

విరియు పువ్వులగుత్తుల పరిమళంబు,
సలలితం బగు పులుఁగుల కలరవంబు,
చిన్నిబిడ్డల చిన్నారి చిఱుతనగవు
చేసె నెవ్వఁడు? దేవుండె చేసెఁ గాక.

మింటి నంటెడు నెత్తైన మేటిగిరులు,
నేల జలజల ప్రవహించు మేలినదులు,
చదలు వన్నెలు వెట్టెడు సంజకెంపు
చేసె నెవ్వఁడు? దేవుండె చేసెఁ గాక.

కమ్మతావుల నెగఁజిమ్ము తెమ్మెరలును,
చల్లఁదనమును వెదజల్లు చందమామ,
తేనెసోనలఁ గురిపించు తీయపండ్లు
చేసె నెవ్వఁడు? దేవుండె చేసెఁ గాక.

మిసిమివెన్నెలయందలి మిసమిసలును
మించు నునుమంచుబిందుల మిలమిలలును
మింట మెఱసెడు చుక్కల మిసమిసలును
చేసె నెవ్వఁడు? దేవుండె చేసెఁ గాక.

ఇంద్రధనువున వన్నెల నెవఁడు నించె?
మెఱపుతీఁగల కెవ్వండు మిసిమి వెట్టె?
మబ్బుదొంతర కెవ్వఁడు మసక గూర్చె?
ఈశుఁడేగాక యిఁక నన్యుఁ డెవఁడు గలడు?

# తల్లి

కాంక్ష నవమాసములు మోసి కష్టమొంది
నిన్ను గని పెంచి పెద్దవానిగ నొనర్చి
మమత లాలించి పాలించి మనిచినట్టి
తల్లి ఋణమును దీర్ప నీతరమె వత్స ?

గర్భవాసాన నీవున్న కాలమందు
నిన్ను భరియించి సైరించి, యెన్నరాని
దారుణం బగు ప్రసవవేదనలఁ బడిన
తల్లి ఋణమును దీర్ప నీతరమె వత్స ?

ఆకలికిఁ దూలి నీ వేడ్చినప్పు డెల్ల
మక్కువను నిన్ను పైకెత్తి యక్కుఁజేర్చి
కడుపు నిండఁగ స్తన్యంబు గుడిపినట్టి
తల్లి ఋణమును దీర్ప నీతరమె వత్స ?

ఊఁగుటుయ్యలలోనఁ బన్నుండఁబెట్టి
హాళి 'నుయ్యాలొ జంపాలొ' యనుచు నూపి
నిన్ను జోకొట్టి హాయిగా నిదురఁబుచ్చు
తల్లిఋణమును దీర్ప నీతరమె వత్స ?

తప్పటడుగుల నిడి నీవు తారినపుడు
వచ్చియును రాని నుడువులు పలికినపుడు
విద్దెములు నేర్పి, పలుకులు దిద్దినట్టి
తల్లిఋణమును దీర్ప నీతరమె వత్స ?

నీదు తనుధూళి తనమేనినిండ సోఁక
నిండు బిగియారుకౌఁగిట నిన్ను బొదివి
మురిపమున నిన్ను నిరతంబు ముద్దులాడు
తల్లిఋణమును దీర్ప నీతరమె వత్స ?

నీకు నేదైన రోగంబు సోఁకెనేని
కంటవత్తిడుకొని చెంత కాచియుండి
సతత ముపచారములుచేసి సాఁకుచుండు
తల్లి ఋణమును దీర్ప నీతరమె వత్స ?

జలకమాడించి, జిలుఁగుదువ్వలువ లొసఁగి,
తిలకమును దీర్చి, చెలువుగా తలను దువ్వి,
బువ్వ దినిపించి నిన్నెప్డు బ్రోచుచుండు
తల్లి ఋణమును దీర్ప నీతరమె వత్స?

చెడుగుబుడుతలతో నీవు చెలిమిచేయ
మంచిమాటలచే నిన్ను మందలించి
బుద్ధులను చెప్పి మెల్లన బుజ్జగించు
తల్లి ఋణమును దీర్ప నీతరమె వత్స?

# చిట్టిపాపఁడ!

'చిట్టిపాపఁడ! ఎందుండి యుట్టిపడితి ?'
'వవతరించితి దివినుండి యవనితలము'
'ముద్దునెమ్మొగ మెందుండి పుణికికొంటి ?'
'పూర్ణచంద్రునిలోనుండి పుణికికొంటి.'

'జిలుగుముంగురు లెందుండి చిదుముకొంటి'
'చిమ్మచీఁకటిలోనుండి చిదుముకొంటి ?'
'మొలకనవ్వుల నెందుండి గిలుబుకొంటి ?'
'తళుకువెన్నెలలోనుండి గిలుబుకొంటి.'

'సొగసుకన్నుల నెందుండి చూఱగొంటి ?'
'చుక్కగుంపులలోనుండి చూఱగొంటి.'
'చుఱుకుఁజూపుల నెందుండి చెరివికొంటి ?'
'మెఱుపుతీవలలోనుండి చెరివికొంటి.'

కౌమరుపెదవుల నెందుండి గుంజికొంటి? '

' సంజకెంపులలోనుండి గుంజికొంటి.'

' పల్లువరుసల నెందుండి కొల్లగొంటి '?

' మొల్ల మొగ్గలలోనుండి కొల్లగొంటి.'

' గొనబుపలుకుల నెందుండి కూర్చుకొంటి '?

' కొదమచిలుకలలోనుండి కూర్చుకొంటి.'

' బెళుకుచెక్కుల నెందుండి మలఁచుకొంటి ?'

' నిలువుటద్దములోనుండి మలఁచుకొంటి .'

' చిన్నినాసిక యెందుండి చిమ్ముకొంటి ?'

' కమ్మసంపఁగిలోనుండి చిమ్ముకొంటి.'

' బుచ్చిగడ్డము నెందుండి పుచ్చుకొంటి ?'

' పువ్వుతొడిమలలోనుండి పుచ్చుకొంటి .'

' పొలుపుపొక్కిలి యెందుండి పొదివికొంటి ?'

' పొన్నపువ్వులలోనుండి పొదివికొంటి.'

' కులుకునడకల నెందుండి కొసరుకొంటి ?'

' గున్నయేనుఁగులోనుండి కొసరుకొంటి.'

' చిఱుతచేతుల నెందుండి తుఱిమికొంటి ?'

' తొఁగలతూఁడులలోనుండి తుఱిమికొంటి.'

' చిట్టిపాపఁడ! నీమేని కెట్లు గలిగె
ఇట్టి జిగి, యిట్టి నిగనిగ, యిట్టి వలపు?'

' తఱపి మెఱపులలోనుండి తళతళయును,
మంచుబిందులలోనుండి మార్దవంబు,
పదనుపుప్పొడిలోనుండి పరిమళంబు
తివిచి నామేని చెలువంబు దిద్దికొంటి.'

రా

## అన్నతో నాడుకొందు

కొదమకోయిల కో యని కూయుచోట
గుమ్ముగు మ్మని నెత్తావి గుబులుచోట
పొంగి నెలయేఱు జలజల పొరలుచోట
అన్నతోఁ గూడి వేడ్కఁ నే నాడుకొందు.

మలయపవనుండు మెలమెల్ల మలయుచోట
అళులు ఝుమ్మని గానమ్ము సలుపుచోట
పసరుపచ్చికజొంపమ్ము లెసఁగుచోట
అన్నతోఁ గూడి వేడ్కఁ నే నాడుకొందు.

అల్లిబిల్లిగ పూఁదీగ లల్లుచోట
నెమలి పురి విచ్చి నృత్యంబు నెఱపుచోట
గఱికితుద మంచుబిందులు మెఱయుచోట
అన్నతోఁ గూడి వేడ్కఁ నే నాడుకొందు

కోడి కొక్కొరో కో యని కూయుచోట
గుజ్జుపొదరిండ్ల పూఁదేనె కురియుచోట
ఎండమావులు మెండుగ నిండుచోట
అన్నతోఁ గూడి వేడ్క నే నాడుకొందు.

ఎండుటాకులు సుడిగాలి నెగురుచోట
వరుస కప్పలు బెకబెక అఱచుచోట
ఉదధివీచిక లొండొంటి నొరయుచోట
అన్నతోఁ గూడి వేడ్క నే నాడుకొందు.

పొదల మిణుఁగురుపురువులు పొదలుచోట
శారికలు కీరములు చేరి చదువుచోట
తరులపువ్వులగుత్తులు విరియుచోట
అన్నతోఁ గూడి వేడ్క నే నాడుకొందు.

సరసునిండను కలువలు విరియుచోట
పదనుపుప్పొడి కుప్పలై పొదలుచోట
పావురంబులు గుబగుబల్ పలుకుచోట
అన్నతోఁ గూడి వేడ్క నే నాడుకొందు.

కొంగగుంపులు బారులై పాఱుచోట
ఇసుకతిప్పలు మెండుగా నెసఁగుచోట
గుప్పుగుప్పున వడగండ్లు కురియుచోట
అన్నతోఁ గూడి వేడ్క నే నాడుకొందు.

పండువెన్నెల తెల్లెద నిండువేళ
మినుకు మిను కంచు తారలు మెఱయువేళ
చదల మెఱపులు నాట్యంబు సలుపువేళ
అన్నతోఁ గూడి వేడ్క నే నాడుకొందు.

## చిన్న వస్తువులు

'చిన్ని మొగ్గను వికసింపకున్న నేమి-
లోప మొక్కింత కలుగునే లోకమునకు ?'
అనుచు మొగ్గలు మూతులు ముణిచెనేని.
చల్లగాడ్పులు గోల్పోవు సౌరభములు
తరువు లెల్ల కళారహితంబు లగును.

'చిన్ని చినుకును నే రాలకున్న నేమి-
లోపమొక్కింత కలుగునే లోకమునకు ?'
అనుచు చినుకులు మబ్బుల నణఁగెనేని.
చెఱువు లన్నియు నెండి శుష్కించిపోవు
సస్యములు లేక నశియించు జంతుగణము.

'చిన్నిచుక్కను నే నుండకున్న నేమి-
లోప మొక్కింత కలుగునే లోకమునకు ?'
అంచు తారలు దివి నుదయించకున్న.
చిన్నవోవును గగనంబు చెన్ను తఱిగి
నావ లల్లాడు కడలిలోఁ ద్రోవ తప్పి.

' చిన్నిదివ్వెను నే వెల్గకున్న నేమి-
లోప మించుక కలుగునే లోకమునకు ?'
అనుచు దీపంబు వత్తుల నణఁగెనేని,
చిమ్మచీఁకటి కడలెల్లఁ గ్రమ్మికొనును
లోకమంతయు నల్లకల్లోలమగును.

' చిన్నిపిట్టను నే పుట్టకున్న నేమి-
లోప మించుక కలుగునే లోకమునకు ?'
అనుచు పక్షులు గ్రుడ్డుల నణఁగెనేని,
కలరవంబులు జగతిలో వెలితివడును
సృష్టి యెల్లను శృంగారహీన మగును.

' చిన్నికందును నే పుట్టకున్న నేమి-
లోప మొక్కింత కలుగునే లోకమునకు ?'
అనుచు పసిపాప గర్భమం దణఁగెనేని,
ప్రేమ యనునది లోపించు పృథివియందు
క్రమముగా సృష్టియెల్లను సమసిపోవు.

# కోర్కెలె ఱెక్కలై యలరెనేని

అహహా! కోర్కెలె ఱెక్కలై యలరెనేని,
రివ్వు రివ్వున వెస నంతరిక్ష మెగసి
చుక్కగమితోన నే నొక్కచుక్క నగుచు
మినుకుమిను కంచు మెఱయనే మింటిమీఁద?

అహహా! కోర్కెలె ఱెక్కలై యలరెనేని,
రింగురింగున నొక పెట్టు నింగి కెగసి
ఇంద్రచాపంబు నడుచక్కి నెక్కి లీల
నిలిచి నృత్యంబు సేయనే నిండువేడ్క?

అహహా! కోర్కెలె ఱెక్కలై యలరెనేని,
రివ్వురివ్వున వడి నంతరిక్ష మెగసి
తళుకు తొలకరి మెఱపుల త్రాళ్ళు గట్టి
మబ్బుటుయ్యాల నూఁగనే యుబ్బు మెఱయ?

అహహ! కోర్కెలె ఱెక్కలై యలరెనేని,
రింగురింగున నొకపెట్టు నింగి కేగసి
కొదమచందురు పడవగాఁ గుదురుపఱచి
వేడ్క వయ్యాళి వెడలనే విన్నుకడలి ?

అహహ! కోర్కెలె ఱెక్కలై యలరెనేని,
ఇనుఁడు తూర్పునఁ దోఁచక మునుపె లేచి
రివ్వురివ్వున పడి నంతరిక్ష మెగసి
సంజసరసున మునుఁగనే స్నానమాడ ?

అహహ! కోర్కెలె ఱెక్కలై యలరెనేని,
రింగురింగున నొకపెట్టు నింగి కెగసి
చుక్కపైనుండి వేఱొక్కచుక్క కుఱికి
కోఁతికొమ్మచ్చు లాడనే కోర్కు లూఱ ?

ఔర! కోర్కెలె ఱెక్కలై యమరెనేని
గాలి నొకసారి, ఒకసారి కడలినడుమ,
గిరుల నొకసారి, ఒకసారి తరులమీఁద
ఎగురుచుండనె నిరతంబు ఖగము వోలె.

## ఇంద్ర ధనుస్సు

తల్లి. తమ్మిపువ్వునఁ దూఁగాడు తుమ్మెద లన
చల్లగాలికి చెదరి నీపిల్లకురులు
ముద్దునెమ్మోముమీఁద దోబూచులాడ,
పరుగువాఱెద వెచటి కోబాలపాప ?

చిఱుతచెమ్మటముత్తెముల్ చిందువాఱ
చెంగుచెంగున పరుగెత్తి చెంగలించి
ఎచటి కేగెదు బాలుఁడా ! యిల్లు విడిచి
కులుకుఁజూపులు మింటిపై గుమ్మరించి ?

బిడ్డ. అల్లదే యమ్మ ! చూచితే యాకసమున
పంచరంగుల గిలకలబద్ద వోలె
వింతవన్నెల రతనాలవిల్లు తోఁచె;
బాళి నేగెద దానివి బట్టుకొనఁగ.

దానికొన యొండు మనతోఁటలోన నున్న
చెట్లగుబురులసందున చిక్కుకొనియె;
ఒక్కగంతున చెట్టుపై కుటికి, దాని
చిత్రముగఁ దీసికొని వత్తు చేతఁ బట్టి.

అమ్మరో! నీదు మణులహారమ్మునందుఁ
గ్రాలు కెంపులు పచ్చలు నీలములును
అందు కుప్పలుతిప్పలై యలరుచుండె,
వాని గొనితెచ్చి నీ కిత్తు కానుకఁగను.

చిన్నముక్కలుగా దాని చించివైచి
అమ్మ! నీచీరచెంగున కమ్మి గాఁగ,
అక్కచొక్కాయిమీఁదను నక్క గాఁగ
కుట్టుకొనవచ్చు దానిని కోమరు మిగుల.

బాగుగా దాని నాకుచ్చుపాగఁ జేసి
చుట్టుకొనియెద శిరముపై షోకు మీఱ;
గాలిపడగకు తోకగాఁ గట్టి దాని
నెగుర వైచెద గాలిలో సొగసు గులుక.

అందముగ దాని మనయింటియరుగుమీఁద
చూరుపట్టెలఁ గట్టెద తోరణములు:
చక్కఁగా దాని మనమేడ స్తంభమునకు
వ్రేలఁగట్టెద ధ్వజముగా గాలి కెగుర.

దానిఁ గొనితెచ్చి మనదొడ్డిలోన నున్న
తాడిచెట్టులనడుమ వ్రేలాడఁగట్టి
లీలమై దాని తూఁగుటుయ్యాలఁ జేసి
ఓలలాడుచు నుందు నే హాయిలా మీఱ.

తల్లి. ఎట్టెటూ! ఏమి యంటివి? ఇట్టు రావె.
ఇన్నివగ లెట్లు నేర్చితి వింతలోనె?
ఈవు పల్కినయట్టి యాయింద్రధనువు
పట్టుకొన నీకు శక్యమే చిట్టిపట్టి?

పోవుకాలఁదిని నది దవ్వు పోవుచుండు.
చూచి చూచినయంతలో చోద్య మొప్ప
మాయమై పోవు. నది పట్టిమాయ సువ్వె:
చిట్టికూనరొ! అది యెట్లు పట్టఁగలవు?

# చిన్న పక్షి

పుడమిపై నేను పుట్టినమొదటినాఁడు
ఉంటి హాయిగ నొకచిన్నయింటియందు;
విశ్వమంతయు నపుడు భావించియుంటి
గుండ్ర మగు చిన్న తెల్లనిగుల్ల యంచు.

కొన్నినాళ్లకు నొకచిన్నగూటి నుంటి
హాయిగా తల్లిఱెక్కలయందఁ జేరి ;
విశ్వమంతయు నపుడు భావించి యుంటి
గడ్డిపోచలచేఁ గప్పఁబడ్డ దనుచు.

ఒక్కదినమున నాగూటినుండి వెడలి
అవల నే మున్నదో చూడ నరిగియుంటి;
విశ్వ మంతయు నపుడు భావించియుంటి
పసరుటాకులచేఁ గప్పఁబడిన దనుచు.

౧౯

గగన మెగసితి తుద కెట్లో తెగువఁ జేసి,
అపుడు కనుపట్టె జగ మెల్ల నద్భుతముగ ;
అకట! ఇన్నాళ్ల గ్రుడ్డినై యరయనైతి
సృష్టిమహిమంబు నహహా! వర్ణింప వశమె !

## చిన్నమాలతి

"అమ్మరో! నేఁడు పొరుగింట బొమ్మపెండ్లి
కరిగియుంటిని. గమ్మత్తు జరిగె నచట:
తోడిబాలికలును నేను నాడుచుండ,
నేలఁ బడె నొక్కబాలిక కాలు జారి.

గొల్లు మని నవ్వి రంతట నెల్లవారు.
ఒక్కతెను నేనుమాత్రమె యూరకొంటి"
అనుచు మాలతి వచియించె జననితోడ
పలుకుపలుకున తేనియ లొలుకుచుండ.

"ఎట్టెటూ! చిట్టితల్లిరో! యిట్లు రావె!
ఇట్టివగ లెందు నేర్చితి వింతలోనె?
ఎల్లరును నవ్వుచుండఁగ నీ వదేల
నవ్వకుంటివొ చెప్పుమా నాదుకూన!

చెక్కు గీటిన పొల్గాఱు చిఱుతనాఁడె
ఎంతకనికర మబ్బె నీహృదయమందు!"
అనుచు ఆతల్లి మాలతి నక్కుఁ జేర్చి
మోవి మోవిని గదియించి ముద్దుగొనియె.

సిగ్గుచే చిన్నమాలతి శిరము వంచి
ఇట్టులనె "ఇంతమాత్రమె యెఱుఁగలేవె?
నేలఁ బడినట్టిదానను నేనె గాన,
ఏల నవ్వుదు నను జూచి యేనె తల్లి?"

# చీమ, చిలుక

చీమ యొక్కటి సెలయేటి చెంత నున్న
తరువుకొమ్మల నెగఁబ్రాకి తిరుగుచుండె;
జోరు మని వీవ నంతట ఓరుగాలి,
కొమ్మపైనుండి అయ్యది కూలె నీట.

మునిఁగి తేలుచు, తేలుచు మునిఁగి యింక
ఈదఁ జాలక యాచీమ యిట్లు అఱచె;
"ఏట మునుఁగుచునుంటి, న న్నెవ్వరైన
ఉద్ధరింపరె వేగమే యొడ్డు జేర్చి."

చెట్టుకొమ్మపై కూర్చున్న చిలుక యొకటి
తోడనే కేక నాలించి, తొంగి చూచి,
"భయముపడకుము, చీమరో! భయముపడకు
చేతనైనట్టి సాయంబు చేయుదాన."

అనుచు వచియించి, ముక్కుతో ఆకు చిదిమి
సూటిగా చీమ యున్నట్టి చోట వైచె;
అంత నాచీమ మెల్లగా నాకుచెంత
కీది, మీఁదికి నెగఁబ్రాకి, సేదదేఱి.

"బళిర! ఎంతటి చక్కనిపడవ దొరకె?
చిలుక! నీమేలు మఱవంగఁగలనె?" యనుచు
తేలియాడెడు నాకపుల్ల తెడ్డుగఁ గొని
ఒయ్యనొయ్యన గాలికి నొడ్డు జేరె.

"అమ్మ! నే నిటునటు తిరుగాడుచుండ
గాంచితిని నేఁడు కన్నులకఱవు దీఱ
సుందరంబగు నొక చిన్నమందిరంబు;
దాని సొగసును వర్ణింపఁ దరమె నాకు?

"చుట్టుతీగలు, ద్వారంబు నట్టనడుమ
గలిగి, ఆయిల్లు ముచ్చట గొలుపుచుండె.
ఆహహా! మఱచితి లోన వ్రేలాడుచుండె.
జున్ను కాఁబోలు- మిసిమిగా నున్న దమ్మ.

" అందు నివసింపఁగా రారె హాయి మీఱ?
జున్నుముద్దల కడుపార జుఱ్ఱవచ్చు,
ఇరుకుటొరియలలో నుండ నేల?" అనుచు
తల్లితోఁ జెప్పె నొకనాఁడు పిల్లయెలుక.

" చిన్నికూనరో! నీ వందు చేర నమ్మ.
మందిరము కాదు. మనపాలి బందె కాని;
అందు చేర నేల? ఇడుమల నొంద నేల?
ఇంటె యుందము. మనకేల మందిరములు?"

తల్లి యీరీతి వచియింప, పిల్లయెలుక
మొగము చిట్లించికొనియుండె మూల నొదిఁగి;
' అమ్మ యిటనుండి యావలి కరిగినపుడు
అందుఁ జొచ్చెదఁ గాకేమి!' యనుచుఁ దలఁచె.

తల్లి నిదురించె, అంత నాపిల్లయెలుక
సం దిదే యని చొచ్చెనామందిరంబు;
ఖక్కు మని మీట యంతట నొక్కవడియె,
చిక్కుకొనె లోన పాప మాచిన్నియెలుక.

# ప్రతిధ్వని

'అరరే! అయ్యారే! హైసరే!' అనుచు నఱచె
కొండగుహచెంత నొకగొల్లకుఱ్ఱవాఁడు;
'అరరే! అయ్యారె! హైసరే!' అనుచు ధ్వనులు
మరల వినఁబడె కొండగహ్వరమునుండి.

'ఎవ్వ రచ్చుట? ఎవ రది? ఎవ్వ?' రనుచు
అఱచె బాలుండు మరల నబ్బురముతోడ;
'ఎవ్వ రచ్చుట? ఎవ రది? ఎవ్వ?' రనుచు
మరల నాధ్వని దిక్కుల మాఱుమ్రోఁగె.

'నోరు మూయుము, జాగ్రత్త- నోరు మూయు'
మనుచు గట్టిగ నాబాలుఁ డఱచె నంత;
'నోరు మూయుము, జాగ్రత్త- నోరు మూయు'
మనుచు నాధ్వని వినఁబడె నంత మగుడ.

ఎన్నరానట్టి దుర్భాష లెన్నియేని
కూసె నంతట నా పెట్టిపిల్లవాఁడు;
అతఁ డాడిన దుర్భాష లన్ని వరుస
వినఁబడియె నంత నొకదాని వెనుక నొకటి.

పట్టఁజాలని యీసుచే బాలకుండు
కనుల జలజల బాష్పముల్ కాల్వగట్ట,
వేగ బరుగెత్తి గృహమున కేగుదెంచి
జరిగినది యెల్ల వచియించె జననితోడ.

అంత నాతనితో నిట్టు లనియె తల్లి:
" అనుగుబిడ్డఁడ! నేఁడు నీ వాడినట్టి
భాషణంబులె క్రమ్మర ప్రతిరవించె,
నింద యొనరించుకొంటివి నిన్ను నీవె.

" పరుల దూషణవాక్యముల్ పలికితేని,
వారు దూషణవాక్యముల్ పలుకుచుంద్రు;
మంచిమాటలు నీవు వచించితేని,
మంచిమాటలె వారు వచించుచుంద్రు."

## సోమరి సోముఁడు

బాలుఁ డొక్కఁడు కలఁ డొకపట్టణమున,
వాని నిజనామ మేదో యెవ్వరు నెఱుంగ;
రతఁడు సోమరిబాలకుం డగుటఁజేసి
సోముఁ డని బాలు రెల్లరు నామ మిడిరి.

ఆతఁ డొకనాఁడు బడిలోని కరుగ మాని
ఆటలాడఁగఁ జనె నొక్కతోఁటలోకి;
కడమబాలకు లెల్లరు బడికిఁ బోవ,
వానితో నాడ లేఁ డొక్కబాలకుండు.

వేగ నాదారిఁ జనుచున్న జాగిలమును
పిలిచి సోముఁడు "భైరవా! నిలువు మయ్య;
వేడుకలు మీఱ నాతోడ నాడుకొనఁగ,
వత్తువే?" యన, అనె నది వానితోడఁ:

" త్వరగఁ బోవలె నిపుడు నాస్వామికడకు,
వేఁటకై వాఁడు నాకయి వేచియుండు,
అదను కాదిది నీతోడ నాటలాడ;"
అనుచు నాకుక్క తన దారిఁ జనియె నంత.

గడ్డిపోచల ముక్కునఁ గఱచికొనుచు
వడిగ నెగురుచున్నట్టి వాయసమును
కాంచి, యిట్లనె బాలుండు: "కాకి! రమ్ము
వేడు కలరఁగ నాతోడ నాడుకొనఁగ."

" ఆటలాడఁగ నా కింత వ్యవధి లేదు
వానకాలము రానుండె, గాన నిపుడె
గూడు కట్టంగవలయు నోకుఱ్ఱవాఁడ!"
అనుచు వచియించి కాకంబు చనియె నెటకొ.

విరియఁబూచిన కుసుమమంజరులపైని
తేనె లానంగ వాలిన తేఁటిఁ జూచి,
బాలుఁ డిట్లనె: "నాతోడ బాళి మీఱ
ఆటలాడఁగ వత్తువే తేఁటి నీవు?"

" కుతుకబంటిగ తేనియల్ గ్రోలుచుంటి
ఆటలాడుటకే కాదు, మాటలాడ
నైనతీరిక లే దిప్పు" డనుచుఁ బలికి
వ్రాలె తుమ్మెద వేఱొక్కపూలగుత్తి.

సోముఁ డంతట నొక గండుచీమఁ జూచి
" ఎచట కేగెదు చీమ! యొక్కింత నిలుము.
ఆడుకొన నీవు వత్తువె వేడు కలర ?"
అనఁగ, నాచీమ యతనితో ననియె నిట్లు.

" నూక లొక్కటియొకటిగ నోటఁ గఱచి
కూర్చుకొనుచుంటి బాలుఁడా! గూటిలోకి;
మాటలాడిన గింజలు నోటజాఱు,
ఆటలాడఁగ నాకెట్టు లనువుపడును ?"

సోముఁ డిట్లని తలపోసె 'చీమ మొదలు
జగములోపలఁ గల జంతుజాల మెల్ల
పాటుపడుచుండ, నక్కటా! వ్యర్థముగను
గడపిపుచ్చితి నిన్నాళ్ళు కాల మెల్ల.'

బాలుఁ డంతట నిత్యంబు బడికిఁ బోయి
శ్రద్ధగా పాఠముల నెల్ల చదువుచుండె:
అతనిబుద్ధికి మది మెచ్చి అంతనుండి
బుద్ధుఁ డని పేరు పెట్టిరి బుడుత లెల్ల.

## గడుసు రాముఁడు

గడుసురాముఁడు పదియేండ్ల పడుచువాఁడు,
మంచిబాలకుఁడే కాని మంకువాఁడు;
తనదుచెల్లెలి చిన్నిమాధవిని బట్టి
పీడ చేయుట వానికి క్రీడ యెపుడు.

ఆతఁ డొకనాఁడు తనరెండుచేతులందు
రెండుమామిడిపండ్ల ధరించి, వేగ
తనదు చెలియలికడ కేగి, అనియె నిట్లు:
"మాధవీ! చూడుమిదె మూడుమావిపండ్లు."

"అన్న! ఇది యేమి- మూడువండ్లనెద వేల ?
రెండుపండులె కన్పట్టుచుండ" ననుచు
పలికె మాధవి. "మాయురే! బాల వీవు,
శక్యమే నీకు గణితశాస్త్రంబు తెలియ ?

విన తెలిపెద దీనిరహస్య మెల్ల-
ఇదిగో మొదటిది, రెండవ దిదిగో చూడు,
ఒక్కటియు రెండు కలిసిన నిక్కముగను
మూడని యెఱుంగు నెంతటి మూర్ఖుఁ డైన."

అన్న మూఁ డన. తాను రెం డనఁగ, నిట్లు
జరగె వాదము; వానితోఁ జాలలేక
అంత మాధవి రోదన మాలపించె;
వచ్చె నచ్చటి కింతలో వారితండ్రి.

వికటముగ నవ్వి రాముఁ డావివర మెల్ల
తండ్రితోఁ జెప్పె; నంత నాతండు పలికె;
"మేలు రాముఁడ! నీబుద్ధి మెచ్చినాఁడ;
మూడుపండులె. నిక్కంబు- మూడుపండ్లె.

ముద్దుచెల్లెలి కిచ్చెద మొదటిఫలము
ఎలమిఁ గైకొందు రెండవఫలము నేను,
మూడవఫలంబు నీయది ముద్దుకుఱ్ఱ!
కాంక్షదీఱ భుజింపుము కడుపునిండ."

# గొల్లకన్నె

'ఎందుఁ బోవుచునుంటివే సుందరాంగి ?'
'పాలు పితుకంగ నేగెద పశుచువాఁడ!'
'వత్తునా నేను నీవెంట వన్నెలాడి ?'
'ఇచ్ఛ గలదేని రావచ్చు నెమ్మెకాఁడ!'

'పెండ్లియాడెదవే నన్ను పిన్నదాన ?'
'కులముపెద్దల నడుగుమో కుఱ్ఱవాఁడ!'
'తండ్రి యెవ్వఁడె నీకు నోతరుణిమిన్న ?'
'పల్లెలోనున్న పెదకాఁపు పిల్లవాఁడ!'

'ఏమిభాగ్యంబు గలదాన వీవు చాన ?'
'వాలుఁగన్నులె నాపాలి భాగ్య మయ్య!'
'అట్టులైనను నిను పెండ్లి యాడ బాల'
'ఎవ్వ రడిగిరి? నీదారి నీవు పొమ్ము.'

## నక్షత్రములు

పట్టునీలంపుబట్టపై కుట్టినట్టి
వెండిజలతారుపువ్వుల విధము దోఁప,
కనులపండువు చేయుచు గగనమందు
మినుకుమిను కంచు తారలు మెఱయుచుండె.

వేడ్క యామినీసోముల పెండ్లివేళ
ఆకసం బను పందిరి యందుఁ గట్టు
బాగు మీఱిన తెల్లని పాదరసపు
గుండులో యన, చుక్కలపిండు లొప్పె.

విమల మందాకినీనది వీచికలను
తేలి తూఁగాడు బుడగల చాలు లీల,
దట్ట మగు పండువెన్నెల నట్టనడుమ
మినుకుమినుకంచు చుక్కలు మెఱయుచుండె.

కాల మనుకాపు మిన్నను నేలయందు
చిఱుపవెన్నెలజలముల చిలుకరించి
నిండుచందురుఁ డను దృష్టికుండ నిలిపి
చక్కఁగా నాఁటు పైరన చుక్క లలరె.

చదలుప్రమిదను తిమిరంపుచమురు పోసి
వేడ్క మీఁఱగ వేలుపుపేరటాండ్రు
నోచిరో లక్షవత్తుల నో మనంగ,
విమలకాంతుల చుక్కలు వెలిఁగె దివిని.

చందురుం డను వెండికంచంబునందు
అమరులమృతంపాయస మారగింప,
చుట్టు చిందిన మెతుకులయట్టిలీల
సలలితంబుగ తారకావళులు వెలసె.

అంబరం బను పందిరియందునుండి
పండి రాలిన గుమ్మడిపండో యనఁగ,
తరణికూలఁగఁ అందుండి తొరఁగి రాలు
గింజలో యన నక్షత్రపుంజ మొప్పె.

లీల మి న్నను మున్నటఁ దేలియాడు
గొప్పముత్తెంపుచిప్ప నా నొప్పు విధుఁడు;
అవల చిందిన యాణిముత్యంబు లనఁగ
తళుకుబెళుకున మెరయుచు తార లలరె.

అంబరం బను నీలివస్త్రంబుపైని
గట్టిగారుబ్బి ప్రోవిడి పెట్టినట్టి
నగ్గులియ్యపుముద్ద నా చంద్రుఁ డలరె;
పిండివడియంబు లన చుక్కపిండు లొప్పె.

పండువెన్నెల పేరిటి పాలకడలి
యందు నడుచక్కి జాబిల్లి యంద మొంద,
కడలితరగలపైఁ దేలి కదలియాడు
గండుమీనులో యన చుక్కపిండు లొప్పె.

ఆ వు

తనదు వత్సంబు కానక వనమువెంటఁ
దిరిగి, అంబే యటంచును దిక్కులెల్ల
మాఱుమ్రోగఁగ నఱచెడు మాతకూయి,
గఱికిపఱకల నెడనెడఁ గొఱికికొనుచు
పొంతపొలముల మేయుచు గంతులిడుచు
నాడుచున్నట్టి యాఁబెయ్య యాలకించి,
చెంగుచెంగునఁ బరుగెత్తి చెంత కేగి
ముట్టెతోడను పొదు గంటి యట్టెపొడువ,
తనువు పులకెత్త నయ్యావు చనుల చేసి
కుంభధారగ క్షీరముల్ కురియఁజేసి
కడుపునిండఁగ దూడను కుడువనిచ్చి,
ప్రేమ పొంగార దానిశరీర మెల్ల
మెల్లమెల్లన నాకుచు నుల్లసిల్లె.

# గృహము

జగముకంటెను స్వీయదేశంబు ప్రియము,
దానికన్న ప్రియతరంబు తనపురంబు,
అంతకంటెను ప్రియతమ మాత్మగృహము;
గృహముకంటెను సౌఖ్యంబు మహిని గలదె?

'తల్లి యైనను చేయంగ నొల్లనట్టి
మేలు లెల్లను సమకూర్పఁ జాలు నిల్లు'
అనెడి లోకోక్తి ధారుణి నమరెఁ గానఁ
గృహముకంటెను సౌఖ్యంబు మహిని గలదె?

'తనకు గ్రాసంబు లేకున్నఁ మనఁగవచ్చు
కాని వాసంబు లేకున్న గడపరాదు'
అనెడి లోకోక్తి ధారుణి నమరెఁ గాన,
గృహముకంటెను సౌఖ్యంబు మహిని గలదె?

అఖిలభోగభాగ్యంబుల కాకరంబు,
సకల కల్యాణముల కెల్ల జన్మభూమి,
దివ్యసుఖముల కెల్లను పట్టుకొమ్మ;
గృహముకంటెను సౌఖ్యంబు మహిని గలదె?

కామితంబుల నొసఁగూర్చు కల్పతరువు,
ఊర్జితం బగు శుభముల కునికిపట్టు,
పరమసంతోషముల కెల్ల పంటచేను;
గృహముకంటెను సౌఖ్యంబు మహిని గలదె?

# అల్ప జంతువులు

సమరతలమున నోడి రాకొమరుఁ డొకఁడు
అరులు చెలరేగి తన్ను వెన్నంటి తఱుమ,
వడిగఁ బరుగెత్తి యొక్క కారడవిఁ జేరి
వృక్షములచాయ నించుక విశ్రమించె.

బడలికలు వాయ నొక్కింత తడ వతండు
నిద్రవో నెంచి చేలంబు నేలఁ బఱవ,
చీమలును సాలెపురుగులు చేరి, వాని
పాన్పుపైఁ బ్రాఁకి చీకాకుపఱచె మిగుల.

'మాలదైవము కటకటా! ఏల కూర్చె
క్షుద్రజంతుల మనుజులనిద్ర చెఱుప?
శత్రువులబాధ నెటులైన సైపవచ్చు,
వీనిబాధల సైప నెవ్వానివశము?'

అనుచు నిరీతిఁ దలపోసి యాతఁ డెట్లొ
తుదకు నిదురించె; వానిని వెదకికొనుచు
వచ్చి నిలిచె తటాలున వైరివీరుఁ
డొక్కరుఁడు వాఁడు నిద్రించుచున్నయెడకు.

ఏమిచిత్రమొ- అంతలో చీమ యొకటి
కఱచె రాజకుమారుని కరతలంబు;
ఉలికిపడి లేచి యాతండు తెలివి నొంది
కాంచె వెసఁ దన్ను జంప నుంకించు వైరి.

కని, జరీలున నొఱనుండి కత్తి దూసి
ఒక్కవ్రేటున పగతుని నుక్కడంచి
కడమశత్రులు తనపైని పడకమున్నె
గంతుగొని దాఁగె నాచెంత గహ్వరమున.

తరణి గ్రుంకిడె; నంత శాత్రవులు రాత్రి
రాకుమారుని కనుఁగొనఁ లేక విసిగి,
ఉదయమున లేచి యటునిటు వెదకి వెదకి
చేరి నిలిచిరి గహ్వరద్వారముకడ.

"సందియం బేల ? ఈగుహయందె యతడు
జొచ్చి తలదాఁచుకొని యుండవచ్చు నిజము"
అనుచు వచియించె నొక్కఁడు; "అట్లు కాదు
ఇందు లేఁ డని నే వచియింపఁ గలను.

సఖుఁడ ! అల్లదె చూడుమా సాలెగూఁడు
అల్లిబిల్లిగ ద్వారంబు నల్లికొనియె;
వచ్చి రాకొమరుం డిందుఁ జొచ్చెనేని
చెక్కుచెదరక నిలుచునే చెలఁదిగూఁడు ?"

అనుచు నీరీతి రెండవయతఁడు పలికె;
"సర్పములు క్రూరమృగములు సంచరించు
నిందు జొర నేల ? చావంగ నేల ?" యంచు
వారు వెడలిరి వచ్చినదారిఁ బట్టి.

'బ్రతుకు జీవుఁడ' యంచు నీవలికి వచ్చి,
రాజసుతుఁ డంత తనయంతరంగమందు
నిట్లు తలపోసె 'అక్కటా ! యింతదనుక
అల్పజంతువులను నింద సల్పినాఁడ.

చిన్నజంతుల నేల సృష్టించె నంచు
నోరికొలఁదిని దైవంబు దూఱియుంటి,
చీమచెలఁదుల సాయంబుచేతఁ గాదె
నిలిపె దైవంబు నాజీవములను నేఁడు.'

# మార్గస్థుఁడు - మఱ్ఱిచెట్టు

మిటమిటని కాయు నెండకు కటకటఁబడి
తెరువరి యొకండు బడలిక తీర్చికొనఁగ
మార్గమున నున్న యొక పెద్దమఱ్ఱిచెట్టు
నీడఁ జని, మేను వాలిచె నేలమీఁద.

నిదుర పట్టక అటునిటు కదలియాడి,
అల్లిబిల్లిగ నేలపై నల్లికొనిన
పండ్లతో నున్న గుమ్మడిపాదు జూచి,
ఇట్లు తలపోసె నాతండు హృదయమందు.

'చేవ చాలని గుమ్మడితీవయందు
బానలంతేసి కాయలఁ బాదుకొలిపి,
విన్ను నంటెడు పెనుమఱ్ఱివృక్షమునకు
చిట్టికాయల నమరించె సృష్టికర్త.

'ఔర! సర్వజ్ఞుఁ డని పెద్దపేరె కాని
బమ్మ యొనరించు సృష్టిజాలమ్మునందు
అకటవికటము కానట్టి దొకటి కలదె?
బుద్ధి పెడతలఁ బట్టెఁ బో వృద్ధుఁ డగుట.

'అట్టి తా నొకనేర్పరి యయ్యెనేని
పెద్దచెట్టున కనువైన పెద్దపండ్లు
చిన్నచెట్టున కనువైన చిన్నపండ్లు
కూర్ప నగుఁ గాని, ఈతాఱుమార్పు లేల?'

అనుచు నీరీతి తలపోసికొనుచు నంత
కొంతసేపటి కాతండు కూర్కు జెందె;
గాలి కిట్టట్టు కొమ్మలు కదలియాడ
మఱ్ఱికాయలు పడె వానిబుఱ్ఱపైని.

దద్దఱిలి లేచి తనతల తడవికొనుచు
'అయయొ! ఇవ్వియె పెద్దపం డ్లయ్యె నేని
బ్రహ్మ మంచును నాతల బ్రద్ద లగుచు
యమునివాకిట బ్రాఁతకాపగుదుఁ గాదె?

'లీల జగముల నెల్లఁ గల్పించినట్టి'
సృష్టికర్తకె యీరీతి చెట్ట నగుచు
పంగనామము పెట్టఁ గడంగినాఁడ;
ఎట్టిసాహసమున కొడిగట్టికొంటి ?

అల్పబుద్ధిని నే నేడ ? అఖిలసృష్టి
మించి సృజియించి పాలించి త్రుంచునట్టి
అఖిలశక్తి నియామకుండాఁత డేడ ?'
అనుచుఁ జింతించె నాతండు మనమునందు.

# వాషింగుటన్

పాంథుఁ డొక్కఁడు పట్టణపరిసరమున
హయముపై నెక్కి యెచటికో అరుగుచుండె;
ఊరివెలుపల కొందఱు యుద్ధభటులు
త్రోయుచుండిరి బరువైన దూల మొకటి.

బలిమిమై వార లందఱు పట్టి పెనఁగి
అదిమి లాగిన దూలంబు కదల దయ్యె;
'పట్టుఁ, డెత్తుఁడు, నెట్టుఁడు, కట్టి లాగుఁ'
డంచు నొక్కఁడు వారి గద్దించుచుండె.

పథికుఁ డది చూచి వానితోఁ బలికె నిట్లు :
'అయ్య ! ఇటు చేయుఁ డటు సేయుఁ డంచు నిల్చి
నుడువుకంటెను నీవును నడుముకట్టి
సాయ మొనరించి కార్యంబు చేయరాదె ?"

చుఱుకుచుఱుకున నాతండు చూచి అనియె :
"నన్ను కేవలసామాన్యనరునిరీతి
మాటలాడెదు తారతమ్యంబు లేక;
ఎవ్వ రనుకొంటి ? సేనానిఁ జువ్వె యేను."

"అహహా ! మీర లంతటి మహామహు లటంచు
ఎఱుఁగ కాడితి, నను క్షమియింపుఁడయ్య"
అనుచు తెరువరి మెల్లన హయము డిగ్గి
శక్తికొలఁదిని భటులకు సాయపడియె.

తోడనే వారు పథికుండు తోడుపడఁగ
ఎత్తి రవలీల దూల ముస్వేత్తుగాఁగ;
చెంత నిలుచుండె నడుమునఁ జేయివైచి
భూవరుం డన దళవాయి ఠీవి మెఱయ.

అంత తెరువరి నవ్వుచు నతని కనియె
"అన్న ! ఎప్పుడైన పని యున్న నన్ను పిలువుఁ;
డన్యుఁడను గాను, సర్వసైన్యాధిపతిని,
నన్ను పిలుతురు 'వాషింగుట' న్నటంచు."

అంత పడవాలు గ్రుక్కుమిక్కనఁగ లేక
చిత్తరువురీతి నిలఁబడె చేష్ట లుడిఁగి;
'సెల వొసంగుఁడు పోయివచ్చెద' నటంచు
చనియె తెరువరి వేగ నశ్వంబు నెక్కి.

# బాటసారులు - ఎలుగుగొడ్డు

చిట్టిచీమయు చొరరాని దట్టమైన
దారుణం బగు నొక్క కాంతారమందు
రాత్రివేళను భీముఁడు, రాముఁ డనెడు
పాంథు లిరువురు కాల్నడఁ బయన మైరి.

రాముఁ డీ ట్లని వచియించె భీముతోడ;
"దారిలో నేది యైనను క్రూరమృగము
ఎదురుగా వచ్చి మనపైని గదిసె నేని,
ఏమి చేయుద ?" మనవుడు భీముఁ డనియె:

"ఏను నీచెంత నుండ నీ కేమిభయము?
ఎన్ని గుండెలు గలవు నే నున్నచోట
ఘాతుకమృగంబు కదియంగ? కదిసె నేని
చించి చెండాడనే యొక్కచిటికలోన ?"

అతఁ డిట్లనియెనో లేదొ-అంతలోనె,
ఎచటనుండియొ యొక పెద్ద యెలు గుగొడ్డు
గుఱ్ఱుగుఱ్ఱున సటలెత్తి ఘుర్ఘురించి
పరుగువాఱుచు నాచెంత కరుగుదెంచె.

జల్లుజల్లున నొడలెల్ల జలదరింప
తనదుమిత్రునిమాటయె తలపు గొనక,
పిక్కసత్తువ చూపించి భీముఁ డంత
తరువుమీఁదికి గుప్పించె సరభసమున.

ఏమి చేయంగఁ దోచకఁ రాముఁ డంత
చావకట్టుగ నేలపై సాగిలఁబడి
కాలుసేతుల నట్టిట్టు కదపకుండ
ఊర్పు బిగఁబట్టి చచ్చినయోజ నుండె.

అంత భల్లూక మాతనిచెంతఁ గదిసి
ముక్కు నోరును చెవులును మూరుకొనుచు
'చచ్చి యెన్నఁడొ చివికిన శవ మి దేల ?'
అనుచు నాతని విడనాడి యవలఁ జనియె.

కొంతసేపటికిని గుండె కుదుటఁబడఁగ
డిగ్గ రని చెట్టు పైనుండి డిగ్గ నుఱికి
భీముఁ డడిగెను "మిత్రుఁడా ! ఏమి చెప్పె
తెలుపుమా నీదుచెవిచెంత ఎలుగుబంటి."

అనుడు రాముఁడు వానితో ననియె నిట్లు:
"మంచిమాటలు చెప్పి నమ్మంగఁ జేసి,
అవల మోస మొనర్చెడి స్వార్థపరుల
చెలిమి చేయంగవల దంచు చెప్పె నెలుఁగు."

# బంగారు పండ్లు

అడవిదాపల నొకపూరిగుడిసెయందు
కాఁపురం బుండె ముదుసలికాఁపువాఁడు;
ఆతఁ డొకనాఁడు భూమిలో పాతుచుండె
చిన్నమామిడిటెంకల కొన్ని తెచ్చి.

వేఁటలాడఁగ నాదారివెంటఁ జనుచు,
తనదు పరివారజనులతో ననియె రాజు:
"కాంచితిరె మీర లీమూడుకాళ్ల ముసలి
చేయుచున్నట్టి చిత్రంపుచేఁత లౌర?

"వృద్ధుఁ డక్కట! ఎంతటి వెఱ్ఱివాఁడు?
విత్తుచున్నాఁడు మామిడివిత్తనముల,
చెట్లఫలముల తాను భక్షింపఁ దలఁచి;
ఎంతకాలము జీవింప నెంచినాఁడొ?

"కాటి కౌకకాలు సాఁచియు కాపువాఁడు
ఉట్టికట్టుక కలకాల మూఁగులాడ
నెంచెఁ గాఁబోలు, లేకున్న నిట్టిపనికిఁ
బూని కాలంబు రిత్తగాఁ బుచ్చనేల !"

నృపునిమాటల నాలించి వృద్ధుఁ డనియె;
"చెట్లఫలముల తిన నపేక్షించి కాదు,
మున్ను మనపెద్ద లందఱు చన్నరీతి
ఆచరించితి నంతియె అవనినాథ !

"వారు నాఁటిన వృక్షముల్ ఫలము లీన,
అనుభవించుట లే దొకో మనము నేఁడు !
అట్లె, మన మిప్డు నాఁటిన చెట్లఫలము
లనుభవింతురు గద ! మనతనయు లవల."

అంత నా రాజు ముసలివాఁ డాడినట్టి
పలుకులకు నాత్మ నెంతయు ప్రమద మంది,
గౌరవము మీఱ నాతని గారవించె
ఏడుబంగారుకాసుల నెలమి నొసఁగి.

అంత నవ్వుచు నావృద్ధుఁ డనియె "తేఁడ!
రిత్త కాలేదు నేఁడు నావిత్తనములు;
అహహ! నాఁటిన తొలినాఁడె అక్కజముగ
ఏడుబంగారు ఫలముల నీనెఁ గాన.

# పిసినివాఁడు - పసిఁడిమూట

ఊరివెలుపల, పాడుకోనేటిచెంత,
మనుజు లెవ్వరు మసలని మాఱుమూల,
గుట్టచాటున లోతైన గోయి త్రవ్వి
పసిఁడి దాఁచెను పిసినారిముసలి యొకఁడు.

ప్రతిదినంబును వృద్ధుండు పాతు త్రవ్వి
మురిసిపడుచుండు బంగారుముద్ద జూచి;
పొదలమాటున నది యెల్ల పొంచి చూచి
దొంగ యొక్కఁడు సర్వంబు దోచికొనియె.

మఱుదినంబున ముసలివాఁ డరుగుదెంచి
గోయి త్రవ్వంగ బంగారు మాయ మయ్యెః
నెత్తి నోరును లబలబ మొత్తికొనుచు
గొల్లు మని యేడ్చి యతఁడు గగ్గోలువెట్టె.

అంత నాతనియఖపుల నాలకించి,
పరుగుపరుగున పోరుగువా రరుగుదెంచి
"ఏల యేద్చెద వీలీల నేలఁ బొరలి ?"
అనుచు బ్రశ్నింప, నీరీతిఁ బనవె నతఁడు.

"ఏమి చెప్పుదు ? ముప్పదియేండ్లనుండి
కూడఁబెట్టిన ధన మెల్ల గోతిలోన
దాఁచియుంచితి, నెవ్వఁడో తస్కరుండు
వచ్చిపైకంబు మునుముట్ట బ్రుచ్చిలించె.

"అనుదినంబును నిచ్చటి కరుగుదెంచి
కాంచనంబును కాంక్షమై కాంచుచుందు;
ఏమి చేయుదు నక్కటా ! యింకమీద ?"
అంచు ముదుసలి కన్నీరు నించి చెప్పె.

అనుడు, నా మాటలకు వార లనిరి యిట్లు
"పరుల కీయవు, కుడువవు, పైఁడి నీకు
ఏమిలాభంబు చేకూర్చె నింతదనుక ?
అకట ! ఉండిన నూడిన నొకటి కాదె.

"ఇప్పు డైనను మించిన దేమి కలదు ?
పైఁడి గలచోట నొకపెద్దబండ పాతి
కాంచుచుండుము నిత్యంబు కాంక్ష దీఱ"
అనుచు ముదుసలివగ్గుతో ననిరి వారు.

# పక్షి - వరిపొలము

ఊరివెలుపల, నొకసెలయేఋదరిని
పండఁబాఱిన పొలమందు, పక్షి యొకటి
గూటిలోఁ దాను పిల్లలు గూడిమాడి
కాపురము చేయుచుండె సౌఖ్యంబు మీఱ.

చంచువుల గింజ లిరికించికొంచు పక్షి
ప్రేమతో కందువులఁ దినిపించుచుండె;
అపుడె మొలచిన ఱెక్క లల్లార్చికొనుచు
కొదమపులుఁగులు కిలకిల కూయుచుండె.

అంత నచటికి పొలముకాఁ పరుగుదెంచి,
తనదుపుత్రునితో నిట్టులనియె: "కుఱ్ఱ!
పండె పొల మెల్ల, నిఁక తడ వుండరాదు,
కాపు లందఱఁ బిలిపింతు రేపె కోయ."

"అమ్మ! వింటివె పొలముకా పన్నమాట?
నిలువవచ్చునె మన మిందు నిముస మైన?
ప్రొద్దుపుచ్చితి మిన్నాళ్లు ముదము మీఱ,
ఎందు బోవుదు మక్కటా! ఇప్పు డింక?"

అనుచు పిల్లలు వచియింప, అనియె తల్లి:
"ఇందె యుందము, అప్పుడే తొంద రేల?
రేపె జరుగవు కోతలు, కాఁపువాఁడు
ఒరులసాయ మపేక్షించియుండెఁ గాన."

కడచె కొన్నాళ్లు; మరల నాకాఁపువాఁడు
పొలమునకు వచ్చి వచియించె పుత్రుతోడ:
"ఒరులపైఁ బెట్టి మన మింక నుండఁ దగునె?
నేఁడె కోతము స్వయముగ నీవు నేనె."

అంత పిల్లలతో నిట్టులనియె తల్లి:
"గడియ యైనను మన మింక తడయరాదు:
పరులసాయంబు లేకయె స్వయముగానె
కార్య మొనరింప సమకట్టె కాఁపువాఁడు.

"రమ్య మగు నొక్క పద్మాకరంబు పొంత
గూడు కట్టితి నొకచెట్టుకొమ్మమీఁద;
హాయిగా నందు సకలసౌఖ్యములతోడ
నుంద మెప్పుడు నాముద్దుకందులార!"

# వేటకాఁడు - రాబందు

వేఁటకుక్కలు దేగలు వెంట రాఁగ,
వెడలె కానకు నొకనాఁడు వేఁటకాఁడు;
అంత నతఁ దేగనో లేదా కొంతదవ్వు,
దారిలో నొక్క రాబందు తారసిల్లి.

"అయ్య! మృగయుఁడ! నీవు వేఁటాడునపుడు
నాదుబిడ్డలలో నీకు నేది యైన
కానిపించిన, చంపక కాతు ననుచు
అభయహస్త మొసంగుమా!" అనుచు వేఁడె.

అంత నాతఁడు పక్షితో ననియె నిట్లు :
"అట్టులే కాని, నీబిడ్డ లనుచు నేను
గుఱుతుపట్టుట యెట్టులో యెఱుఁగఁజాల
కాన చెప్పుమ యేదేని యానవాలు."

పక్కు మని నవ్వి యతనితో పక్కి యనియె:
“ఓర! మృగయుఁడ! యెంత మాటాడినావు!
పులుఁగుజాతుల నిన్నాళ్ల మెలఁగుచుండి
అడిగెదవె నాదుబిడ్డల యానవాలు?

“జగములందలి బహువిధఖగము లెల్ల
నాదుబిడ్డలతోఁడ సౌందర్యమందు
సాటివచ్చునె? కాన నోవేఁటకాఁడ!
వాని నవలీల పోల్పఁగవచ్చు నీకు.”

పెక్కుమాట లిఁకేల! ఓపక్కిఱేఁడ!
వినుము చెప్పెద-నీబిడ్డ లనఁగ నేల?
సుందరం బగు పక్షులఁజోలిఁ బోవ
నంచు నే నిదె బాస గావించువాఁడ.”

అనుచు వచియించి యాతఁడు వనములోని
కేగి, దిన మెల్ల పక్షుల నెన్నొ కూల్చి.
వాని నన్నిఁటి నొకత్రాట వరుసఁ గూర్చి
తరలి వచ్చుచునుండె నాదారివెంట.

ఎదురుగా వచ్చి రాపులుఁ గిట్టు లనియె:
"అవుర! యెంతటి మోసకాఁడవుర నీవు?
మంచిమాటల నన్ను నమ్మంగఁ బలికి
నాదుబిడ్డలఁ జంపంగ న్యాయ మగునె?"

"నీదుబిడ్డలు లే విందు నిక్కముగను,
నేఁడు చంపిన పిట్టలన్నింటియందు
అంద మగు పిట్ట యొక్కటి యైన లేదు;
నీవె చూడుము నామాట నిజమొ, కాదొ!"

"ఇంతమాత్రమె మూర్ఖుఁడా యెఱుఁగవైతి,
వవనియందలి సర్వవస్తువులలోన
తనదుబిడ్డలె యధిక సౌందర్యవంతు
లనుచు మనమునఁ దలఁపని జనని గలదె?"

# కాఁపువాఁడు - బోయీలు

కలఁ డొకానొకపురమున కాఁపువాఁడు;
వానియాఁబెయ్యయొకనాఁడు పాఱిపోవ,
పల్లకీమోయు బాకలివాండ్రఁ బిలిచి
వెదకితెం డని వారికి ముదలవెట్టె.

"అందలము మోయుపని కాని, ఆవుదూడ
వెదకుపని మాది కా" దని బెదరు లేక
పొగరుఁబోతుతనంబున బోయ లంత
బదులుపల్కిరి యాకాఁపువానితోడ.

బోయ లాడినమాట కబ్బురము జెంది
"ఔర! వీరల కింతటి యాగడంబ?
మూర్ఖు లగు వీరి కెటు లైన బుద్ది సెప్పి
గర్వ మడఁచెదఁగా" కంచు కాఁపువాఁడు.

"సరియె మంచిది, మీరలు సలుపరాని
పనుల నియమించి మిము శ్రమపఱుప నేల ?
నేనె స్వయముగ దూడను నెమకికొందు
కాన పల్లకి మోయుఁ" డం చానతిచ్చె.

ఇట్లు వచియించి, పల్లకి నెక్కెఁ గాఁపు
దారుణం బగు నాఁటిమధ్యాహ్న వేళ
చౌటిపఱ్ఱల, పొలముల, తోట దొడ్ల,
సందుగొందులఁ ద్రిప్పించె నందలంబు.

మండుటెండల మలమల మాడి మాడి
వేసటంబడి బోయలు గాసినొంది
"అయ్య ! మే మింక నొకయడు గైన నకట
మోప లే" మని మొఱవెట్టఁ, గాఁపువాఁడు.

"అందలము మోయుపని మీది, ఆవుదూడ
రోయుపని నాది కావున బోయలార !
అందలము మీరు మోయుఁడి, ఆవుదూడ
వెదకికొందును నే" నని బదులు పలికె.

అంత బోయలు మాఱు మాటాడ లేక
వానిపదములపైఁ బడి దీను లగుచు
'మేము చేసినతప్పు క్షమింపుఁ' డనుచు
వేఁడి, వేగమె దూడను వెదుకఁ జనిరి.

## రాజు — కాఁపువాఁడు

ఒక్కనాఁ డొకభూవరుఁ డుదయవేళ
హయముపై నెక్కి స్వారికి బయలు వెడలె;
కోట దాఁటి యతం డట్లు కొలఁదిదూర
మేగుసరి కొకకాఁపువాఁ డెదురుపడియె.

ఏమిచిత్రమొ కాని- యానృపునిహయము
కాఁపువానిని దవ్వునఁ గాంచినంత
బెదరి యట్టిట్టు గంతులువేసి తుదకు
నేలమీఁదికి భూవరుఁ గూలఁద్రోసె.

క్రిందఁ బడినను గాయంబు నొందకుండ
తోడనే లేచి యొడ లెల్లఁ దుడిచికొనుచు
హయముపై నెక్కి క్రమ్మర రయము మీఱ
కోటలోనికిఁ జనె ఱే డు కోప మడర.

చని జరీలున నంత నామనుజవిభుడు
కొలువుకూటమునం జొచ్చి తలవరులను
పిలిచి యాకాఁపువాని రప్పించి యటకు
కనుల నిప్పులు రాలంగ ననియె నిట్లు.

"ఉదయమున లేచి యెవ్వరివదనములను
కాంచకయె తొలుదొల్త నీ కాఁపువాని
మోము జూచితి, నంతట నేమి చెప్ప
నేలపై నశ్వమునుండి కూలినాఁడ.

ఇంక నీతనివదనంబు నెవ్వ రైనఁ
గాంచిరేని ప్రమాదంబు గలుగుఁ గాన
తొడనే వీనిశిరమును త్రుంచివేయుఁ"
డంచు నానతియిచ్చె నాయారెకులకు.

తనకు నెటు లైన మరణంబు తప్ప దనుచు
దిట్టతనమున నాకాపు తెంపు చేసి
హృదయమున నించు కేనియు బెదరుగొనక
పలికె నీరీతి గట్టిగా ప్రభునితోడ.

"ప్రొద్దుననె లేచి నాపాడుమొగము మీరు
పావనం బగు తావకవదన మేను
నొక్కసారిగ నిరువుర మొకరి నొకరు
కాంచితిమి గాదె యెవ్వరిఁ గాంచకుండ.

నాదువదనంబు గాంచి భూనాథ ! మీరు
పుడమిపై నశ్వముననుండి పడితి రంతె;
కాని దేవరవదనంబు గాంచి నేను
మరణశిక్షకుఁ బాల్పడి మడియనుంటి.

కాన నెవ్వరివదనంబు హానికరమొ
అరసి లెస్సగ దేవర యానతిండు"
అనుడు, సిగ్గున మాఱు మాటాడలేక
వెంటనే కాఁపువానిని విడిచె ఱేఁడు.

## గురువు - శిష్యులు

తెలివి మాలిన గురునొద్ద తెలివి లేని
శిష్యు లిరువురు పరిచర్య చేయుచుండి;
కొకదినంబున వారి నాయొజ్జ పిలిచి
పుచ్చె నడవికి సమిధలఁ దెచ్చిపెట్ట.

అడవిఁ జొచ్చినతోడనే హరిణ మొకటి
వారి కెదురుగఁ గనఁబడె; వారు దాని
చూచి యెన్నఁడు నెఱుఁగని కుంత లగుట
చర్చ గావించి రది యేమిజంతువో యని.

"శంక యేటికి దీనికి చర్చ యేల ?
తెల్లముగ నది యేనుంగుపిల్ల గదర"
"వ్యర్థముగ దీని కింకను వాద మేల ?
కుంజరము కాదు, సింగంపుగొదమ కాని."

"చాలు చాలును-నీతెల్వి కాలిపోను-
కొమ్ము లేవిర సింగంపుగొదమ యైన ?'
'అంతు లేలర ? నీబుద్ధి సంత కేగ-
దానిమెడమీఁద జూ లేది యేను గైన ?'

వార లీరీతి తమలోన వాదమాడి
గురువు నడిగి యథార్థంబు నెఱుఁగఁ గోరి
ఇరువురును రెండువైపుల తఱిమి తఱిమి
ఎట్టకేలకు దానిని పట్టుకొనిరి.

అంత నాలేడి నుత్తరీయమునఁ గట్టి
గురువుచెంతకుఁ గొనితెచ్చి కూలవైచి
"సింగమో యిది యేనుంగొ చెప్పుఁ" డంచు
నడుగ, వారికి గురు విట్టు లానతిచ్చె.

"పనికిమాలిన పరమనిర్భాగ్యులార !
సింగమును గాదు, మఱియు నేనుంగు గాదు;
శీఘ్రముగ పాఱవేయుఁడాచెఱువులోన
ఎగిరితే కప్ప, మునిఁగినయెడల కాకి."

# ఈశ్వరుడు - శనైశ్చరుడు

సిరులు చెలగంగ కైలాసశిఖరిమీఁద
ప్రమథగణములు సేవింప ప్రమద మరల
పార్వతీసహితుం డయి పరమశివుఁడు
నిండుకొలువును దీర్చి కూర్చుండియుండె.

అంత నచటికి శని వచ్చి, "వంత మెప్ప
నేను తలఁచితినా, యెట్టివాని నైన
కొంతలము గూర్చి దైన్యంబు నొందఁజేసి
పట్టి పీడింతుఁగా" కని ప్రతిన వట్టె.

అతనిప్రజ్ఞఁ బరీక్షింప ననియె శివుఁడు:
"ఓయి నను గూడ దైన్యంబు నొందఁ జేయఁ
గలవె? అటులైన మాసంబు గడువు నిత్తు,
ఏది చూచెద చూపుమా నీదుమహిమ."

వల్లె యని పల్కి శని యేగె నుల్లసమున;
ఈతఁ డెట్లు బాధించునో చూత మనుచు
దారుణాటవియం దొక్క మాఱుమూల
మడువులో దాఁగె నభవుండు గడువుదాఁక.

అంత నీశుండు తనగిరి కరుగుదెంచి
శనిని బిలిపించి, "ఓరి నీశపథ మేమి
యయ్యె? న న్నేల పీడింప వైతి?" వనుచు
నడుగ, పక్కన నవ్వుచు ననియె నతఁడు.

"విబుధు లెల్లరు సేవింప విభవ మొప్ప
వెండికొండపై ఠీవిఁ గూర్చుండు నీవు
అడవిలో నొక్క మడుగున నడఁగియుంట
నాదుమహిమంబు గాక యిం కేది గలదు?"

## సూరకవి - క్షత్రియుఁడు

హస్తమున నొక్క తాటాకుపుస్తకంబు
దాల్చి చనుచుండె నొకకవితల్లజుండు;
వానిఁ బొడఁగని "యీవేళ వర్జ్య మెప్పు ?"
డనుచు క్షత్రియుఁ డొక్కరుఁ డడిగె నతని.

అనుడు, వెఱ గంది కవివర్యుఁ డనియె నిట్లు:
"కవివరుల గుండె లల్లాడ కవిత చెప్ప
పేరు గాంచిన అడిదము సూరకవిని,
తిథులు చెప్పఁగ నేను వైదికుఁడఁ గాను."

"భార మైనట్టి యొకపెద్దభారతంబు
వంటి గ్రంథము చేఁ దాల్చి, వర్జ్య మెపుడొ
చెప్పలే నని నుడువుట సిగ్గు గాదె ?"
అనుచు క్షత్రియుఁ డతని హాస్యంబు చేసె.

ఒకదినంబున క్షత్రియుఁ డుదయవేళ
ఖడ్గ మొక్కటి కరమున కరము మెఱయ,
వడి హుటాహుటినడలతో నడచుచుండ,
సూరకవి చూచి యాతనిఁ జేర నరిగి.

"ఓయి నా కీవు క్షురకర్మ చేయఁ గలవె?"
అనుచు ప్రశ్నింప, క్షత్రియుఁ డలుక గదుర
"కనులు గానవ? నీ కింత కావరంబ!
మూఢుఁడా! నేను మంగలివాఁడ నఁటర?"

అంచు గద్దింప, చాలు శాంతించు మయ్య!
ఇంత పొడవైన కత్తి నీచెంత నుండ
బార! క్షురకర్మ నైన చేయంగ లేవె?
అనుచు నెంచితి" నని కవి యపహసించె.

# సూరకవి - బంధువులు

తన్ను కుక్కలు వెన్నంటి తఱుమ తఱుమ,
సూరకవి యొక్కదినమున పాఱిపోయి
ఎట్లొ తప్పించుకొనివచ్చి తుట్టతుదకు
జొచ్చె నొకయిల్లు నిట్టూర్పు పుచ్చికొనుచు.

వాని నెటులైన నవమానపఱుప నెంచి
బందుగుఁ డొకండు దొరకెఁ గా సందటంచు
"బావ ! ఇది యేమి ? గాడిదవలెను బెదరి
పరుగువాఱితి" వని వాని పరిహసించె.

"శ్వానభయమున పరుగెత్తి వచ్చినాఁడ
శీఘ్రముగ నింక మందలోఁ జేరుకొంటి,
కాన నిప్పుడు ధైర్యంబు కలిగె" నంచు
బదులు పలికెను కవి యంత బందుగునకు.

# చంద్రోదయము

అంబరం బను కమలాకరంబునందు
కైరవంబుల కైవడి తార లలర,
అందు విహరించు కొదమరాయంచ యనఁగ
నిండు చంద్రుఁడు కన్నులపండు వయ్యె.

పొంచి తెరవెన్క దాఁగి దోబూచులాడు
ముద్దు గులికెడు పసిపాపమొగము వోలె,
కారుమబ్బులసందునఁ గాన నగుచు
ఇందుబింబము లోచనానంద మయ్యె.

అంబరం బను నీలిపళ్లెంబునందు
అక్షతలు వోలె నక్షత్రకాళి మెఱయ,
తేజరిల్లెడు కపురంపుదీప మనఁగ
నిండుచంద్రుఁడు కన్నులపండు వయ్యె.

పానవట్టము తూరుపుపర్వతంబు,
దీపికారాజి తారలు, ధూప మిరులు
గా వెలుంగఁగ, స్ఫటికలింగంబొ యనఁగ
నిండుచంద్రుఁడు కన్నులపండు వయ్యె.

చిమ్మచీకటికుప్పల చెత్తమీఁద
బగ్గుబగ్గున మండెడి యగ్గి వోలె
ఉదయరాగంపుకాంతుల నుజ్వలించి
ఇందుబింబము లోచనానంద మయ్యె.

వెన్నెల యనంగ రాత్రినా వెలయు తనదు
పత్నులిరువుర మెచ్చులఁ బడయఁ గోరి
తెలుపు నలుపులు గలమేన నలరె ననఁగ
నిండు చంద్రుఁడు కన్నులపండు వయ్యె.

మెల్ల మెల్లన చిఱుచేప లెల్ల మ్రింగి
పెద్దచేప క్రమంబుగ పెరిగినట్లు,
విన్నుకడలిని చుక్కలు సన్నగిల్ల
అంతకంతకు చందురుఁ డగ్గలించె.

తార లను ముత్తియంబుల నేరి తీయ
సమయనావికుఁ డాకాశజలధియందు
వెడలి చనుచున్న చక్కని పడవ యనఁగ
విదియ చందురుఁ డందమై వెలయుచుండె.

నలువ మరునకు నభ మను పలకమీఁద
సుద్ద చేఁ బట్టి వ్రాసిన సున్న లనఁగ
తారకారాజి యొప్ప, 'అ' కార మనఁగ
అర్ధచంద్రుఁడు మిసిమిమై నలరుచుండె.

నీలిగోళంబు రేకపైఁ దేలియాడ
కొదమజాబిల్లి రాజిల్లె చదలయందు,
పాలకడలిని తరిగొండ లీలఁ దాల్చు
ఆదికచ్ఛపమూర్తితో నవఘళించి.

## ఆఁబోతు

వెల్లయేనుంగుగున్న నా, విధివ మొప్ప
గోపురంబును బోలిన మూపురంబు
గలిగి, నగరవీధుల వెంటఁ గదలియాడి,
ఒకరిజోలికిఁ బోవక, ఒకరిచేత
నదలుపులను బడక, యథేచ్ఛానురీతి
నిబ్బరంబుగ నర్థాడి, యుబ్బు మెఱయ
అంగడులను జొచ్చి, పురజను లాదరమునఁ
దనివి తీఱఁగ బెట్టెడి ధాన్యములను
నోరినిండఁగ నిరికించి యారగించి,
కూర్మిమై వారు గంగడోల్ గోఁకుచుండ,
మోర సారించి యొయ్యారముగను నిలిచి,
కనుల నరమోడ్చి పరవశంబునను జొక్క,
సెలవులను మ్రోఁగు నడవియాఁగలు కఱంగి
బెదర, నాఁబోతు గుటుకలు వెట్టుచుండె.

# చెఱువు - సెలయేఱు

"ఏల పాఱెదు సెలయేఱ! ఇంత వడిగ?
ముందువేసఁగి వచ్చుచునుండె వేగ,
కూర్చుకొనరాదె యాలోన కొంతజలము?"
అనుచు కాసార మేఱితో ననియె నిట్లు.

"చెల్లునే యిట్లు పలుకంగ చెఱువ! నీకు?
తనదు సౌఖ్యము నాసించి మనుటకంటె
పరుల మేలునకై చావ బాగు కాదె?"
అనుచు సెలయేఱు కొలనితో ననియె బదులు.

భీష్మముగ నంత నరుదెంచె గ్రీష్మఋతువు;
చెఱువుజల మెల్ల నెండి నిశ్శేష మయ్యె,
చెట్టుచేమలు శుష్కించె, చేను లెండె,
పులుఁగు లన్నియు నటు నిటు తొలఁగి చనియె,

కళ్లు తొర్గుచు పొంగె నా వాఁకనీరు,
కుసుమవర్షము కురియించె కుజము లెల్ల,
మంగళంబుగ పాడె విహంగతతులు,
మెల్లఁగా వీచె చల్లని పిల్లగాలి.

# ఎచటికేగెదు కీరమా!

బాలిక: ఎచట కేగెదు కీరమా? ఇందు రమ్ము
ఏటి కాయనపడెదవే యెగిరి యెగిరి?
పసిఁడి తీఁగల నల్లిన పంజరంబు
వ్రేలఁగట్టితి నల్లదే వ్రాలు మందు.

దోరపండిన నునుపోరు దొండపండ్లు
పరువ మొందిన తీయని పనసతొనలు
కురువఁ బెట్టెద నిచ్చలు కడుపునిండ
ఆరగింపుము కీరమా! హాయి మీఱ.

చిలుక: మోద మందితి బాలరో నీదు దయకు;
డంబు మీఱిన నీ పంజరంబుకంటె
మఱ్ఱిమ్రాఁకున నలరారు తొఱ్ఱలోని
నాదు వెచ్చని తిగిగూఁడె నాకు హితము.

తెలివెన్నెలలందలి తళతళలును
మించు నునుమంచుబిందుల మిలమిలలును
కమ్మతెమ్మెరలందలి గమగమలును
విడిచి నీ యింట కడగండ్లు బడఁగ నేల?

**బాలిక:** మండుటెండల మంటల మాఁడి మాఁడి
వానసోనల పలుమాఱు నాని నాని
మంచుబిందుల మాటికి మాఁగి మాఁగి
కడిఁది సీతున వడవడ వడఁకి వడఁకి,

గాసిచెందఁగ నేటికే గండుచిలుక?
మంజులంబగు నా పైఁడిపంజరమున
కొంతకాలము తలదాఁచికొనఁగ రాదె?
ఇచ్చ కలదేని పిదప పోయెదవు గాని.

**చిలుక:** మండుటెండలు, వానయు, మంచు, సీతు
మీకు మనుజులకే కాని మాకుఁ గలవె?
స్వచ్ఛతర మగు నిర్మలవాయువులను
స్వేచ్ఛమీఱ విహారంబు చేయుచుందు.

మంచుమలలందు నొకసారి మలయుచుందు;
జలదపంక్తుల నొకమాఱు చౌకళింతు;
సాగరముమీఁద నొకపరి సంచరింతు;
పులుఁగులకు మాకు ఋతుభేదములును గలవె?

బాలిక: గిరుల, మబ్బుల, కడలిపైఁ దిరుగునపుడు
త్రోవ తప్పి భ్రమింపవే తోడు లేక?
చిన్ని చిలుకరో! నీ కిట్టి సిలుగు లేల?
చెలఁగి నాయింట నెపుడు వసింపరాదె?

చిలుక: నోరు లేనట్టి పశు పక్షివారములకు
తోడుపడు నెవ్వఁ, డాతండె త్రోవ నూపు;
కిరణముల జిమ్మి, జిగిమబ్బుపొరల జించి
లీల విహరింతు నిచ్చమై గాలి వోలె.

# ఆడుకొందము తమ్ముఁడా!

బాలుఁడు: ఎచట నుంటివి తమ్ముఁడా ఇందు రమ్ము!
చదలనడుచక్కి వెలుఁగొందె చందమామ!
పండువెన్నెల తెల్లెర మెండుకొనియె;
ఆడుకొందము తమ్ముఁడా! వేడు కలర.

అల్లచేఁ తేఁటి ఱెక్క లల్లార్చికొనుచు
తమ్మితేనియఁ గ్రోలుచు ఝుమ్మటంచు
పాడుచున్నది, దానితో వేడుకలర
తమ్ముఁడా! ఆడుకొందము రమ్ము వేగ.

పొలములో నీవు నాటిన పూలచెట్లు
విరివిగాఁ బూచి బటు వయి విఱ్ఱవీఁగ
గమ్మ గమ్మని తావులఁ జిమ్ముచుండె;
తమ్ముఁడా! ఆడుకొందము రమ్ము వేగ.

గుజ్జుమామిడి సెలగొమ్మకొనల వ్రాలి
చివురుజొంపంపు గుబురులు చిదిమి మేసి
కొదమకోయిల కో యని కూయుచుండె;
తమ్ముఁడా! ఆడుకొందము రమ్ము వేగ.

సగము మేసిన పోఁచలు జాఱిపడఁగ
బెదరుకన్నుల మాటికి వెనుకఁ గనుచు
భీతిచే లేడి పరుగులు వెట్టుచుండె;
తమ్ముఁడా! ఆడుకొందము రమ్ము వేగ.

అనుదినమ్మును మనము వయ్యాళి వెడలు
సరసునిండను కలువలు విరియఁబాఱి
కనులపండువు సేయుచుఁ గానవచ్చె;
తమ్ముఁడా! ఆడుకొందము రమ్ము వేగ.

తల్లి : గోరువంకలు చిలుకలు మాఱు పలుక
కఱకు కాలును జాలిచే కరఁగిపోవ
ఎవని పిలుతువో యెలుఁగెత్తి యింతసేపు,
వాఁడు నీచెంత కెన్నఁడు రాఁడు బిడ్డ!

మొలక వెన్నెలనవ్వుల గులకరించు
సొమ్ముఁ బోలిన నెమ్మోము గోమువాఁడు
నీదు ముద్దుల తమ్ముఁడు నిన్ను విడిచి
స్వర్గసుఖముల చూఱాడఁ జనియె తల్లి!

స్వాదుతరమయి మకరందసహిత మగుచు
సుప్రచిరంబగు సుకుమారసుమము వోలె,
చిన్న దయ్యును తమ్ముని జీవితంబు
బంధురామోదభరితమై వన్నె కెక్కె.

బాలుఁడు: దూరములచెంత, అల సెలయేటి పొంత
వాఁడు నేనును జతగూడి యాడుచుందు,
అతఁడు లేకుండ నొంటినై నాడఁ జాల;
తొలఁగి యున్నాఁడు వచ్చునో చెప్పు మమ్మ.

పులుఁగులను వీడి, పువ్వుగుత్తులను వీడి,
అక్కా! నను వీడి యరిగెనే అనుఁగుఁదమ్ముఁ?
డతఁడు రాకున్న నేనైన నతనిదరికి
నేఁగువాఁడను, చెప్పుమా! ఎచటి కేగె?

తల్లి : వాఁడు నీచెంత కెన్నఁడు రాఁడు మరల,
నీవు నాతని పొంతకు బోవ లేవు;
పాపిమృత్యువు మి మ్మెడబాయఁ జేసె,
జాలి నీలీల వాపోవ నేల వత్స!

బాలుఁడు: అన్నదమ్ముల నెడఁబాప నక్కటకట!
చెనటిమృత్యువ! నీ తేమి చేటు మూఁడె?
అతఁడు లేకున్న నే నింత బ్రతుకఁ జాల
నన్ను గొనిపొమ్ము నాతమ్ముఁ డున్నయెడకు.

# ఎచటి కేగెదు బాలుఁడా !

కాఱుమబ్బులు చదలెల్లఁ గవలుకొనియె
చిమ్మచీఁకటి దిశలెల్లఁ గ్రమ్ముకొనియె
ఱివ్వు ఱివ్వున పెనుగాలి ఉవ్వఁ బాఱఁగ
ఎచటి కేగెదు బాలుఁడా! యిల్లు వదలి?

కలయ మిన్నును మన్ను నేకంబు గాఁగ
జోరుజోరునఁ జోరంపుధార లదర
కుంభవృష్టిగ వర్షంబు కురియుచుండె
ఏల వెడలెదు బాలుఁడా! యిల్లు విడిచి?

ఆకసంబున తూనీఁగ లాడఁ జొచ్చె
గుంపులుగఁ గూడి చీమలు గ్రుడ్లు మోచె
కొంగకదుపులు బారులై నింగి కెగసె
త్రాఁచుపాములు పుట్టల దాఁగియుండె.

మెడలు సారించి తొండలు మిన్ను చూచె
దుమ్ము మైనిండ పిచ్చుకల్ జిమ్ముకొనియె
బురదలో నూరపందులు పొరలియాడె
దున్నపోతులు తిరుగాడె దుండగమున.

ఒండుపిఱుఁదను వేఱొండు పిండుగట్టి
నీడలను జేరి మేకలు నెమరువెట్టె;
కుజము కొనకొమ్మ డిగి క్రిందికొమ్మమీఁద
నిలిచి పులుఁగులు కిలకిల యెలుఁగు లిడియె.

మేఁత సాలించి యావు లంబే యటంచు
మరలి యింటికిఁ జనుదెంచె మందగొనుచు;
పొదుఁగుదూఁటులు వదలి క్రేపులు తొలంగి
మొదవుకదుపుల మాటున నొదిఁగియుండె.

ఏటిదరి బారులై యున్న తాటిచెట్లు
కొసరి యొండొంటి డిక్కిలు కొట్టుచుండె;
చింతకొమ్మలఁ గూర్చుండి జెముడుకాకు
లల్లనల్లన ఱెక్కల నార్చుచుండె.

ఇఱుకుసందుల వెంబడి మెఱకనుండి
వఱ్ఱు లొత్తుచు ప్రవహించె వాననీరు;
తల్లిదరినుండి అల్లరి పిల్లవాఁడు
కేరిగంతులు వైచుచు పాఱినట్లు.

నిండిపోయిన చెరువులనుండి పొంగి
పొలములోనికి పొరలిన జలములోన
కొట్టుకొనివచ్చు చేఁపలఁ బట్టుకొనఁగ
సంభ్రమంబున మూఁగిరి జనము లెల్ల.

రయముగాఁ బాఱు వానకట్టాల నెక్కి
మఱ్ఱురౌతు లుదాయించి పెయ్యి మొరయు
మెఱపుకొరడాల ఝళిపించి తఱుముచేసి;
ఏల వెదలెదు బాలుఁడా! యిల్లు విడిచి?

పండువెదురుల సందులనుండి గాలి
బుస్సుబుస్సున వెడలుచు బుసలుకొట్టె,
బొరియలోపలఁ జిక్కిన భుజగివోలె;
ఎచటి కేగెదు బాలుఁడా! యిల్లు వెడలి?

# బిచ్చగాఁడు

మూపుపై చినిగిన బొంత వ్రేలాడ,
ఒకచేత జోలెయు, నొకచేత కోల
పుచ్చుక తిరుగాడె బిచ్చగాఁ డొకఁడు
వాడవాడలవెంట పాడుచు నిట్లు;

'అవనితలంబున ఆదిభిక్షుకుని
అపరావతారమై అవతరించితిని;
పృథివిలోఁ గలయట్టి వృత్తులలోన
బిచ్చంపువృత్తియె హెచ్చైన వృత్తి;
చెట్టునీడలె నాకు పట్టెమంచములు,
చినుగు బట్టలె నాకు చీనాంబరములు,
పుట్టగోచియె నాకు పట్టుపుట్టంబు.
భిక్షాన్నమే నాకు పిండివంటకము,
బూదిపూఁతయె నాకు పునుఁగు జవ్వాది,
పూరికొంపయె నాకు భూరిసౌధంబు;

రాజ్య మెవ్వరిదైన, రా జెవ్వరైన,
నా కేమి లక్ష్యంబు? నా కేమి కొదువ?
రాజశాసనములు, రాజ్యాంగవిధులు
ఎన్ని మారినయేని నన్నేమి సేయు?

కలుపుపై కలుపులు కలుగఁ గా కేమి,
పెట్టరే యెవరైన పట్టెడోగిరము?
సంతత మీశ్వరస్మరణమే కాని
ఇతర చింతలు నాకు నెవ్వియు లేవు.

అన్యుల పదవుల నాసింపఁ బోవ
పరులు నా పదవికి వాంఛింపఁ బోరు.
లక్షాధికారి యా భిక్షాధికారి
భిక్షాధికారి కా భేదంబు గనఁడు.

భిక్షుకవృత్తియే విశ్వేశ! నాకు
జన్మజన్మముల ప్రసాదింపు మయ్యా!
పాఁడిపంటలు గల్గి, భాగ్యంబు గల్గి
ఎల్లవారలు సుఖియింతురు గాక!

# విశ్వాసముగల కుక్క

ఏడి నా ముద్దుపాపాయి? ఏఁడి! ఏఁడి!
నిమున మేనియు నొకచోట నిలువఁబోడు
దుడుకుఖుడుఁతడు, వాఁడెంత దుండగీఁడె!
చూడవే దాది! ఎచట నున్నాఁడొ వాఁడు.

తల్లిపలుకుల నాలించి దాది యేగి
గదులు వాకిళ్ళు దొడ్డులు వెదకి వెదకి
వాని నడిజాడ నెచ్చోటఁ గాన లేక,
మొగము వెలవెల వోవంగ మగుడి వచ్చె.

గుండియలు జల్లు జల్లని కొట్టుకొనఁగ
తల్లి వెడలెను వెదుకంగ దాదితోడ,
మూలుమూలల వెదకిరి వారు పూని;
ఏడ వెదకిన కానంగరాఁడు బిడ్డ.

వినఁబడవు వాని నవ్వుల విరవిరలును,
తళుకు బంగరుమువ్వల గలగలలును,
తప్పటడుగుల చిటిపొటి చప్పుడులును;
అక్కటా! ఎందు సున్నాఁడొ యనుఁగుబిడ్డ?

అంత తటాకున నెద్దియో స్వాంతమందు
జ్ఞప్తి రా, తల్లి పశువుల శాల కరిగి
'భైరవీ!' యని దిక్కులు మాఱు సెలఁగ
పిలిచె పెంపుడుకుక్క నుత్తలము మీఱ.

గొంతు బొంగురు వో నామె యెంతసేపు
పిలిచినను గాని, భైరి తాఁ బలుకదయ్యె;
అకట! వెనుచేటు వాటిల్లె ననుచు నామె
బావికడ కేగె రొమ్మును బాదుకొనుచు.

అంతఁగాంచిరి వా రొక్క యద్భుతంబు:
బాలుఁ డెగఁ బ్రాకుచుండె నా బావిగట్టు,
బిడ్డచొక్కాయి నోటితో బిగ్గఁ బట్టి
లావుమై భైరి క్రిందికి లాగుచుండె.

రెండుచేతులు బావిలో వ్రేలవైచి
రొమ్ము గట్టున నానించి హుమ్మటంచు
చిట్టిపదముల గిజగిజ కొట్టుకొనుచు
బావి నుఱుకంగ బాలుండు పట్టి పెనఁగె.

అలుకచే దన్ను బాలుండు బలముకొలఁది
నెంత తన్నిన, భైరవి శాంత మూని
గట్టిగాఁ దాను పట్టినపట్టు విడక
నూతఁ బడకుండ బాలుని నొక్కిపట్టె.

తల్లడంబున నది చూచి తల్లి యంత
చెంగు మని యొక్కగంతున చెంత కుఱికి
గొబ్బగొబ్బున బిడ్డని గ్రుచ్చియెత్తి
అక్కునను జేర్చి మక్కువ యగ్గలింప.

సంతసంబున సంతత గంతులిడుచు
నేలఁ బొరలాడి భైరవి బాలుఁ గదిసి
తోఁక యాడించి పదముల నాక సాగె;
ఎట్టి తరితీపొ వాని కా బొట్టెపిందఁ?

"అమ్మ! భైరవి కెంతటి యాగడంబె?
బావిలో నున్న ముద్దుపాపాయితోడ
ఆడుకొనఁబోవ, నన్నది యదిమిపట్టి
చిన్ని మొకమాలుచొక్కాయి చించివైచె."

"చూడు మమ్మరో! ఇది యెంత చుప్పనాతి!
ఇంతసేపును నాతోడ వంతగించి
ఏమి యెఱుఁగని లాగున నీవు రాఁగ
నాకుచున్నది నను సంగనాచివోలె."

"అమ్మ! నే నింక భైరితో నాడుకొనను
గెంటివైచెద నవతలి కింటినుంచి"
అనుచు దానిని చెవి పట్టి యవలఁద్రోచి
మూతిపై మూఁడు దెబ్బలు మోఁదె వాఁడు.

"అకట! కొట్టకు కొట్టకు మనుఁగుబిడ్డ!
చిన్నిభైరిని; అది నీకు చేసినట్టి
హితము మఱవంగ శక్యమే యెన్నఁడైన?
చిట్టిపాపవు నీ కది యెట్టు తెలియు?"

అంచు వచియించి, తోక యాడించుకొంచు
మ్రోల నిలుచుండి మోమ్పై వ్రేలవైచి
తేటపాటుఁగఁ దిలకించు బైరిఁ బిలిచి
మురిపమున తల్లి యొడిఁజేర్చి ముద్దుగొనియె.

# సందేశము

మెఱ్ఱుబంగరురంగుల మిసిమి మించు
వెలుఁగు లీనుము, నో చిన్ని వేగుచుక్క!
ఒంటిగా నేల తిరిగెదు మింటిమీఁద?
నిలిచి నా మాటలకు మాఱుపలుక వయ్య.

ఒక్కతోరటిగ నీ తోడిచుక్క లెల్ల
ఓసరిల్లెను, తొలికోఁడి కూసె నదిగో!
తూర్పుదిక్కున సంజలు తొలవరించె;
ఏల తిరిగెద వీ లీల వేల వోలె?

కలువచెలికాడు చని యొక్కగతియ యయ్యె;
భానుఁడు చనుదెంచు క్షణములో; ఇంతలోన
ఏల నెంచితె ఆకాశ మెల్ల నొకటి?
నిలిచి నా మాటలకు మాఱు పలుక వయ్య!

నాదు ముద్దులకొమరుండు నన్ను విడిచి
ఏడు మాసము లయ్యె, తా నెటకొ చనియె,
నింతకాలము ధనుక నాచెంత రాఁడు;
అతని విడనాడి నే నింత బ్రతుకఁ గలనె?

నిన్ను బోలిన వన్నెలు చిన్నె లొలుకు
సోయగమువాఁడు, చక్కనిచుక్క యతఁడు;
చుక్కగమిలోన తా నొక్క చుక్క యగుచు
ఉన్నవాఁ డేమొ చూడుమా ఒక్కసారి.

ఉన్నచో వేగ నాతనియొద్ద కీవు
చేరి, మెల్లఁగ నడుగుమా చిన్నమాట:
ఇప్పుడైనను మఱియెంత నెప్పుడైన
ఇచ్చటికి వాఁడు క్రమ్మఱ వచ్చునేమొ?

ఇటకు వచ్చుట కతని కనిష్టమైన
అటకు నన్నైన రప్పించు మంచు ననుము;
వాని కటు సేయ నలవి కా దేని, వాని
పొంత కీ వైనఁ దోడ్కొనిపొమ్ము నన్ను.

ఇంక నొకమాట చెప్పెద-ఎల్లి నీవు
మిన్నువీథిని విహరించువేళ, వాని
వెంటఁ గొనిరమ్ము, వాని నే విన్నవింతు;
సమ్ముఖమ్మున రాయబారమ్ము లేల?

చిత్ర మది యేమియో కాని, చెప్పఁగాం
నిన్ను చూచినతోనె నా కన్నకొడుకుఁ
గాంచినటు లుండు, కాన నా కర్తి యెల్ల
తెలిపికొంటిని-ఇఁక పెక్కుపలుకు లేల?

కరువుతీవుకొలందిని నుడివినాఁడ,
నీ వెఱుంగని ధర్మంబు లెందు నైనఁ
గలవె? నీటను ముంచెదో, కరుణ నన్ను
పాల ముంచెదవో? నీదె భార మయ్య.

తూర్పుదిక్కున నల్లనే తొంగిచూచు
చుండె భాస్కరుఁ, డింక నీ వుంటి వేని
కరఁగిపోఁగల వాతని కిరణములను
మూసలోఁ బడ్డ బంగారుపూస భంగి.

# చేఁపల వేఁట

మొలకసంజలు తొలిదెస తొలకరించె
నింగి నప్పుడె భానుండు తొంగిచూచె
మసక మసకని మబ్బులు మసలఁ జొచ్చె
చిటపొ టంచును చిటిపొటి చినుకు రాలె.

జాలెయును కోల బుజమున వ్రేలవైచి
చల్దిచిక్కము పెరకేల సవదరించి
ఈడుబాలురతోఁ గూడి వేడుకలర
వెడలె రంగఁడు చేఁపల వేఁటలాడ.

వడి హుటాహుటి నడలతో నడచి, యంత
చెంతఁ గాంచిరి వా రొక్క చిన్నపడియ;
'ఎంత చక్కని చెఱువురా యిద్ది!' యనుచు
వలలు వైచిరి తోడనే వారలందు.

'అద్దిరా! ఎద్దియో యొక పెద్దచేఁప
నిక్కముగ నాదు వలయందు చిక్కెఁగానియొ,
ఎంత బరువుగ నున్నదో యిదిగో చూడు'
మనుచు రంగఁడు సఖులతో ననియె పొంగి.

లావుకొలఁదిని జాలెంబు లాగి రంత
ఒడ్డుమీఁదికి వారలు బాలు మ్మటంచు;
'చేఁప కాదుర యిది దొడ్డ చాఁపజాయి'
అనుచు రంగనితోఁ బల్కె సనుఁగుసఖుఁడు.

'చూడు మీసారి వచ్చెడు చోద్య మొప్ప
గొప్ప చేఁపల దుప్పులు తిప్పలుగను'
అంచు రంగఁడు జాలెంబు ముంచె మరల,
చిత్ర మది యేమొ ఒక చేఁప చిక్కదయ్యె.

వలను విసరుచు లాగుచు వార లంత
మడుఁగుచెంతను దిన మెల్లఁ గడపిపుచ్చి;
కొక్క టేనియు వలయందు చిక్కదయ్యె
మేలు మే! లెంత గడుసరి మీలొ కాని!

అల్ల నా దారిఁ జనుచున్న పల్లెవానిఁ
బిలిచి రంగఁడు వానితో పలికె నిట్లు;
'ఏది చూతము జాలరీ నీదు నేర్పు!
పట్టు నేర్తువె చేఁప లీ పడియ యందు?'

'చేఁప లుండినఁ గద నేర్పు చూపు టెల్ల!
నిన్న దాఁకను లే దిందు నీటిబొట్టు;
నిండె మాపటివానకు నీరు నేఁడు;
ఇంతలోననె మచ్చెంబు లెట్లు వచ్చు?'

అనుచు సవ్వాము జాలరి చనియె; నంత
జాలెయును తోల భుజమున వ్రేలవైచి
చల్దిచిక్కము పెడతేల సంతరించి
అరిగె రంగఁడు 'టింగురంగా' యనంగ.

అపరదిక్కున భానుఁడు దత్తమిల్లె,
తూర్పుదిక్కున చంద్రుండు తొంగిచూచె,
మినుకు మిను కని తారలు మెఱయుచుండె;
ఇంటి కేతెంచె రంగఁడు హితులఁ గూడి.

# సోలమన్ చక్రవర్తి

దావుతదకీర్తి సోలమన్ చక్రవర్తి
విక్రమంబున ధారుణీచక్ర మెల్ల
పాలనము చేయుచుండంగ, వచ్చె వాని
సింహపీఠిక చెంతకు 'షిబ' రాణి.

వాని మహనీయ సుచరితవర్తనంబు,
వాని యనుపమ శేముషీవైభవంబు,
వాని రమణీయ మధురవాక్పాటవంబు
గాంచు వేడుకతో నేగుదెంచె రాణి.

నిండుకొలువున తానిసన్నిధిని నిలిచె
పువ్వుగుత్తులఁ గేల్దోయిఁ బూని రాణి:
ప్రకృతి సుకుమార సౌందర్యభరిత మొకటి,
రమ్య కృత్రిమ నవకళారచిత మొకటి.

'ఏది సహజంబో, యిం దేది కృత్రిమంబో?
నుడువుఁడీ' యని ధరణీశు నడిగె రాణి;
పువ్వుగుత్తులవంక కీల్బొమ్మ వోలె
తేఱి చూచుచు నృపుఁ డట్టె యూరకుండె.

సభ్యు లెల్లరు తల లూఁచి సంభ్రమమున
ముక్కుపై వ్రేలి నిడికొని గ్రుక్కుమిక్కు-
రనక యుండిరి; క్రమ్మఱి నడిగె రాణి
యధిపుమౌనంబు పొడఁగని యాత్మ నలరి.

'ఏది సహజంబో, ఎయ్యది కృత్రిమంబో?
అరసి వేగమె దేవర యానతిందు;
అఖిలశాస్త్రవిశారదులైన మీకు
ఎఱుఁగరానట్టి మర్మముల్ ధరణిఁ గలవె?'

ఏమియును మాఱు పలుకక భూమివిభుఁడు
దేనికో వేచియున్నట్లు దెసలు చూచె;
వినఁబడియె నంత గద్దియవెనుక నున్న
ద్వారమవతల భ్రమరఝుంకారరవము.

చిఱునగవు నెమ్మొగమ్మున చెంగలింప
'తలుపు తెఱుఁ' డని మెల్లగ పలికె తాఁను;
పెదవి దాఁటెనొ లేదొ భూవిభుని పలుకు
పరుగువాకి కవాటమ్ము తెఱచె తలుఁపు.

ఝుమ్ము ఝుమ్మని చంచరీకమ్ము లెగసి
రభసమున నా సభామందిరమ్ము చొచ్చి
జాజి యగు రాణివామహస్తమున నున్న
తనుసుమంజరి చుట్టును ముసరికొనియె.

అదియె నిక్కపుపూగుత్తి యనుచుఁ దోఁప
సార్వభౌముఁడు మందహాసమ్ము చేసె;
ప్రజల ముసిముసినగవులు గుజగుజలును
ఒక్కపెట్టున కొలు వెల్ల పిక్కటిల్లె.

అచ్చెరువు తిచ్చపాటును విచ్చలింప
శిరము ముందుకు వంచి యా శిబిరాణి
పుడమియేలిక మ్రోలను మోఁకరిల్లి
వేయినోళుల వినుతించె విభునిప్రజ్ఞ.

# నాదు ప్రియమైన కుడిచేయి

కష్టములు హెచ్చె, పేదరికంబు వచ్చె;
ఇట్టితఱి నాదు స్నేహితు లెవ్వరైన
ఆదరంబున ధన మిచ్చి యాఁదుకొనరె;
అనుచు వెదకితి వారికై యాస మీఱ.

అకట! నా యాస లన్నియు వ్యర్థ మయ్యె-
ఒక్కఁ రొకరుగ హితు లెల్ల నోసరిలిరి,
మూర్మొగంబులు పెట్టిరి కూర్మిసఖులు,
పెదవి విఱుచుచు బంధువుల్ విడిచి చనిరి.

ఎన్నఁ డైనను కష్ట మాసన్నమైన
ఉనుకు లైన నొసంగి న న్నుద్ధరింతు
మనుచు వీరంబులాడిన యట్టివార
లొక్కరును నాకు తోడ్పడ నొల్లరైరి.

రేపు మా పని జరుపుచు త్రిప్పు నొకండు,
అన్న! ఇటు సేయు మటు సేయు మను నొకండు
ఉన్న రని వేడినిట్టూర్పు నూర్పు నొకండు,
కాని తోడ్పడువాఁ డెందు గానరాఁడు.

త్రిమ్మరిల్లుచు నిల్లిల్లు సొమ్మసిల్లి,
ఇట్లు తలపోసికొంటి నా హృదయమందు:
“పరులసాయ మపేక్షించి బ్రతుకు టరయ
ఎండమావుల జల మాస నెంచినట్లు.

వలదు, నా కేల యింకను వారిగోలి?
కలఁడు నా కొక్క కూరిమి చెలిమికాఁడు,
అంత నెప్పుడు బాయక యుండువాఁడు;
ఆశ్రయించెద వానినె యనవరతము.

కుడువ, కట్టఁగ, వస్తువుల్ ముడిచిపట్టు,
చదువ, వ్రాయఁగ, కార్యముల్ చక్కఁబెట్ట
సంతతంబును తోడయి సాఁకుచుండు
నాదు మేలైన కుడిచెయ్యి నాకు దిక్కు.”

అనుచు మానసమున నిశ్చయంబు చేసి
నమ్మికొనియుంటి వానినె నాఁటినుండి;
అధికదయతోడ నన్ను వాఁ డాదరించి
నూతనోత్సాహ ధైర్యముల్ నూలుకొలిపి,

బుజ్జగించి, భయం బెల్ల నుజ్జగించి,
దుఃఖ మెడఁబాపి. కష్టంబు తొలఁగ ద్రోపి,
కుడువ కూడును కట్టంగ గుడ్డ నిచ్చి,
తనివి తీరఁగ ధన మిచ్చి మనిచె నన్ను.

మున్ను నను జూని మాటలు ముడిచికొనుచు
చనిన మిత్రులు మందహాసమున నేఁడు
చనవుమై వచ్చి యింద్రుఁడు చంద్రుఁ డంచు
స్తోత్రములు చేయసాగిరి చుట్టు మూఁగి.

అంత నే నిట్లు తలఁచితి స్వాంతమందు:
'నీ వొకానొకండగిన దేవుని, నిన్నుదక్క-
అన్యు లెవ్వరి నింత నే నాశ్రయింప
దక్షిణాతరంబు! నీ కిదే దండ మయ్య!'

# అంధ బాలుఁడు

దేని వెలుఁ గన్న పిలుతురో, నేను నిరత
మనుభవింపఁగరాని పదార్థ మేదొ.
ఏమి లాభంబు కలుగునో దృష్టివలన,
పలుకుమీ నఖు! కీ యంధ బాలకునకు.

వేయిరాంతుల భానుండు వెలుఁగు ననుచు
అఖిలజనులును చెప్పుదు, రతఁడు వేడి
యనుచు నే నెఱుఁగుదుఁ గాని, యాతఁ డెల్లు
రేయి పగలును గావించునో యెఱుఁగ.

పగలు రే యని వింతగాఁ బలుకుచుంద్రు,
పగలు రేయియు నా కొకపగిదిఁ దోఁచు;
ఏను మేల్కొనియున్నప్పు డెల్ల పగలు,
ఏను నిద్రించి యున్నప్పు డెల్ల రేయి.

ఎన్నరానట్టి దురవస్థ యెదియొ నాకు
కల్గె నని మీరు ననుగూర్చి మూల్గ నేల?
ఇట్టి దని నేను మదిని నూహింపరాని
కష్ట మవలీల సహియింపఁ గలను సుమ్మి.

దుర్లభం బగుదానికై దుఃఖ మొంది
చెఱుతు రేటికి మీరు నా చిత్తశాంతి?
మీకు బ్రొమొక్కెద నాజోలి రాకుఁ డయ్య
గ్రుడ్డి నయ్యును దేవుని బిడ్డఁ గానె?

కోరి నాకయి దైవంబు కూర్చినట్టి
దెట్టిదైన వరంబుగా నెంచికొందు;
కనులు గల్గియు గ్రుడ్డియై మనుటకంటె
గ్రుడ్డి యయ్యు వివేకంబు గొనుట మేలు.

వింతవింత పదార్థముల్ గాంతు మంచు
చెప్పుచుందురు జను లెల్ల చిత్రముగను;
చూతురే కాని వానిని స్థూలదృష్టి,
సూక్ష్మదృష్టిని నావలె చూడఁగలరె?

'తనులు కలిగిన మానవు లనుదినంబు
సలుపు దుష్కృతముల నేను సలుపకుండ
పుట్టుగ్రుడ్డిగ నను బ్రహ్మ పుట్టఁజేసె'
ననుచు పొగడుచునుందు నే ననవరతము.

# చెవిటి భాగవతము

కుంటిమేఁకపిల్ల వెంటఁ గొనిపోవుచు
చెవిటిగొల్లఁ డొకఁడు చెలువుగట్టు
కడకు నేగి, యచట గట్టుపైఁ గూరుచున్న
పల్లెవానిఁ గాంచి పలికె నిట్లు:

"దప్పి గొంటి, జలము త్రాగి వచ్చెద నిప్డె,
అరయుచుండు మయ్య యంతదనుక
మేఁకపిల్ల దీని నీకడ నుంచెద-
నిట్టు నట్టు పరుగులెత్తకుండ."

అనుచు గొల్లవాఁడు తనతోడఁ బలుకంగ,
పల్లెవాఁడు తాను బధిరుఁ డగుట
వాని మాట లించుకేనియుఁ దెలియక
సరియె యంచు నట్టె శిరము నూఁచె.

"కొలనిలోని నీరు గ్రోలంగ నేగితి
వీనిచెంత మేఁకపిల్ల నునిచి,
మగుడి వచ్చినంత మటుమాయ మొనరించె;
చూడు మెంత మోసగాఁడో వీఁడు."

"కొలనిచెంత నేను కూర్చుండ, నీతండు
కుంటిమేఁక నొకటి వెంటఁదెచ్చె;
మఱికకాలు నేను విఱుగఁగొట్టితి నంత
ఔర! ఎంత మాయదారి వీఁడు!"

అనుచు నిరువు రిట్లు తనతోడ మొఱవెట్ట
బ్రాహ్మణుండు తాను బధిరుఁ డగుట,
తెలియలేక వారి పలుకుల నించుక
బదులు పలికె నిట్లు వారితోడ.

"ఏల మీర లిట్లు గోలపెట్టెద రయ్య?
బ్రహ్మ వచ్చి పట్టు పట్టెనేని,
కాపురంబు సేయ నా పొడుముండతో
ఒడలిలోనఁ బ్రాణ మున్నదాఁక."

# లక్క గేదె

విప్రుఁ డొక్కఁడు లేమిచే వెతఁబడుచు
తన కుటుంబము పోషింపఁగానఁగ లేక
ధనము నార్జింప మానసంబునఁ దలంచి
జలనిధిని దాఁటి దూరదేశముల కేగె.

కొంతకాలము గడచినయంత, నతఁడు
ధనము గడియించి తనపురంబునకు వచ్చెఁ;
బౌరు లెల్లరు నత్యంత గౌరవమున
వానిఁ దోడ్కొని వచ్చిరి స్వగృహమునకు.

భర్త రాకకు ముదమంది వానిభార్య
కమ్మనెయ్యియు, కూరలు, గట్టిపెరుఁగు,
పిండివంటలు వడ్డించి ప్రీతితోడ
తనివి దీఱఁగ పతికి భోజనము పెట్టె.

అత్త దవి యెల్ల కడుపార నారగించి
ఇట్లు వచియించె, "సాధ్వి! నే నింటనుండి
అరుగునప్పుడు చిల్లిగవ్వైన లేదు,
ఇన్ని కూరలు భక్ష్యంబు లెట్లు వచ్చె?

ఇందు తక్కిన వన్నిటి కేమిగాని-
ఇట్టి పెరుగును చవిచూచి యెన్నఁ డెఱుఁగ,
ఎట్లు లభియించె నీ కిట్టి గట్టి పెరుఁగు?
గేదెపెయ్యయు మనయింట లేదు గాదె!"

అనుడు, నవ్వుచు నా యింతి యనియె నిట్లు:
"గట్టిపెరుఁ గన్న మీ కెంతొ కాంక్ష యంచు
కొంటి నొక గేదె మన పొరుగింట నున్న
కంసలికి గుల్ల గుత్రు తాకట్టు పెట్టి."

ఎచట కొంటివి? మనయింటి కెదుటనున్న
యట్టి కంసాలిచెంతనా? అమ్మచెల్ల!
నిక్కమగు గేదె కా దది లక్కగేదె
సుమ్మ, కంసాలి యకట! మోసమ్ముచేసె."

అనుచు నాతఁడు వచియింప, సతియు నంత:
"నీదు వచనంబు చోద్యంబు గాదె నాథ!
లక్కగేదెలు కలుగునే యెక్కడైన?
ఎవ్వ రేనియు విన్నచో నవ్వ రొక్కొ?"

"ఎవ్వ రెన్నివిధంబుల నవ్వ నిమ్ము:
నిక్క మగు గేదె కా దది లక్కగేదె
అందు ముమ్మాటికిని వచియించుచుంటి"
అనుచు గట్టిగ సతితోడ ననియె నతఁడు.

'గడ్డి మేయుచునున్నది' 'గడ్డి మేయు'
'పాల నిచ్చుచు నున్నది' 'పాల నిచ్చు'
'పేఁడ వేయుచునున్నది' 'పేఁడ వేయు'
'దూడ ఈనుచున్నది' 'దూడ ఈను.'

ఆలుమగలకు నీరీతి చాలసేపు
జరగె వాదము; సతిమాట సరకుగానక
తాను పట్టిన మాటయే తథ్య మనుచు
పెనఁగులాడె 'నసేమిరా' యనుచు భర్త.

అంత నీరీతి భర్తతో ననియె భార్య:
"'వాద మేటికి?' అది లక్కగేదె యనుచు
మీరు దృఢముగ మదిని నమ్మితిర యేని
ఋజువు చేయుఁడు హేతు వేదేని చెప్పి"

"అట్లు లైన వచించెద నతివ! వినుము,
మున్ను నే నీ పురంబున నున్నయపుడు
కుండలంబులఁ జేయించుకొనఁ దలంచి
మూఁడు బంగారుకాసులఁ గూడఁబెట్టి.

ఎదుట నున్నట్టి కత్తునియింటి కేగి,
'కంసలీ! నీదు నే ర్పెల్లఁ గానిపింప
గట్టి కుండలముల జత కట్టవలయు'
అనుచుఁ బలికితి, నీరీతి ననియె నతఁడు:

'ఇరుగుపొరుగున నుంటిమి యిన్నినాళ్లు
లాఁతివాఁడనె పలుక నీరీతి?' ననుచు
మంచిమాటల నన్ను నమ్మంగఁ బలికి
శీఘ్రముగ కుండలంబులు చేసి యిచ్చె.

లక్కపోఁగులు చేయఁగలట్టివాని
కొక్క లెక్కయె చేయంగ లక్కగేదె?
కాన చెప్పుచునుంటి నో కాంత! వినుము
గేదె కాదిది మఱి లక్క గేదె కాని.''

# జీవహింస

పురము వెలుపల నొక సరోవరముపొంత
వాస మొనరించె మార్జాలపల్లభుండు;
ఒక్కదినమున నచటికి నక్క యొకటి
దారివెంబడి తిరుగుచు తారసిల్లె.

'స్వాగతము నీకు జంబుకస్వామి!' యనఁగ,
'సేమమే నీకు మార్జాలశ్రేష్ఠ?' యనుచు
కుశలప్రశ్నంబు గావించుకొనుచు, వారు
సరససల్లాప మాడిరి చాలసేపు.

'ధారుణి నహింసకంటె సద్ధర్మ మొండు
కలుగఁబో' దని వాదించి పలికె పిల్లి;
'భూతదయకంటె మించిన పుణ్యకార్య
మవని లే' దని గొంతెత్తి యఱచె నక్క.

అనుచు వారు ప్రసంగించుకొనుచునుండ,
పొదలమాటున తోడేలు పొంచియుండి,
గఱిక మేయుచు నచ్చట తిరుగుచున్న
గొఱ్ఱెపైఁ బడి గొబ్బున గొంతు నులిమె.

పిల్లి నివ్వెరపడె, నక్క తెల్లవోయె;
'ఇట్టి ఘాతుక మృగము నే నెందుఁ గాన'
ననుచు వచియించె మార్జాల; 'మనుజుః యిట్టి
హత్య లసులారఁ జూడరే' యనియె నక్క.

'జీవి జీవిని బట్టి భక్షించుకంటె
ఆకలంబులఁ దినరాదె?' అనియె పిల్లి;
'మాంసభక్షణమును జేసి మనుటకంటె
అసువు దొరఁగుట మేల్గాదె?' అనియె నక్క.

అట్లు శ్రీరంగనీతుల నాడుకొనుచు
ఆ బిడాల సృగాలము లరుగుచుండ,
కొంతదవ్వున నొక పూరిగుడిసెపొంత
గింజ లేరుక తినుచుండె పుంజొకండు.

దానిఁ గనినంతనే నక్క తమక మెదను
బట్టఁజాలక, నీతులఁ గట్టిపెట్టి,
చంగు మని యొక్క పెట్టున చౌకళించి
పుంజుపైఁబడి దానిని నంజుకొనియె.

ఎలుక యొక్కటి యాచెంత కలుఁగునుండి
వెలుపలికి వచ్చి మెల్లన వెడలుచుండె;
దాని గనినంత నోరూర, తోనె పిల్లి
ఒక్కగంతున దానిపై నుఱికి చంపె.

బల్లి యొక్కటి యీ దృశ్య మెల్లఁ గాంచి
'ఇస్సి! జగమెల్ల పాపభూయిష్ఠ' మంచు
గుటుకు మని యొక్క దోమను గుటకవైచి
శివధ్యానం బనె 'హా! శ్రీహరీ!' యటంచు.

# కవి-ధనికుఁడు

కలఁ డొకానొక పురమున కవివరుండు;
అతఁ డొక భాగ్యవంతుని నాశ్రయించి
చిటిమాటికి నాతండు చేయునట్టి
పనుల నెల్ల 'బళాబళి' యనుచు పొగడు.

కులటలను జేరి ధనికుండు కూడిమాడ,
భోగి యని వాని కవిరాజు పొగడుచుండు;
దుండగీండ్రకు విత్తమాతం డొసంగ,
త్యాగి యని కవి వాని సంస్తవ మొనర్చు.

వెల్లుగాఁ ద్రావి ధనికుండు ప్రేలెనేని,
జ్ఞాని యని వాని కొండాడు కవివరుండు;
కైపుచే వాఁడు మత్తెక్కి కనులు మూయ,
ధ్యాని యని కవి వాని సంస్తవ మొనర్చు.

ధనికుఁ డొక్కదినంబున తానమాడ
చెఱువునకుఁ బోవ, వానితో నరిగి యతఁడు
కాలనిలో దిగి స్నానంబు సలుపుచుండ,
గట్టుపైఁ దాను కూర్చుండె కవివరుండు.

మోము ముంచిన, దేహంబు తోముకొన్న,
పుక్కిట నతండు నీరంబు పుక్కిలించి
యుమ్మివైచిన, చీఁదిన, తుమ్మిన, కవి
'బళిర! సెబాషు! భే!' షని పలుకుచుండె.

కాలవశమున ధనికుని కాలు జారి
దిగ్గు రని వాఁడు నీటిలో మొగ్గవైవ,
ఈఁతలో నది యొక వింతరీతి యగుట
'బళిర! నీదు నే' ర్పని కవి ప్రస్తుతించె.

ఈఁత నేర్వనివాఁ డౌట, లోతునీళ్ళఁ
బడి పెనంగుచు, తబ్బిబ్బుపడుచు, కాళ్లు
తాఁకుమాఁకుగ విలవిలఁ దన్నికొనుచు,
అంత ధనికుండు కొట్టుమిట్టాడుచుండె.

సంభ్రమంబున ధనికుండు సలుపుచున్న
చేఁతలను నీఁతలోని విశేషములుగ
చిత్తమున నెంచి కవికులసత్తముండు
'బళిబళీ! నీదు కూ' ర్పని ప్రస్తుతించె.

సొక్కి సోలుచు నుక్కిరిబిక్కి రగుచు
సారె కాతఁడు కడుపుబ్బ నీరు ద్రావి
నాలుక వెలార్చి కన్నులు దేలవైచి
మునిఁగి తేలుచు కొట్టుకపోవుచుండె.

నీటు దేలుటు యీఁతలో నిపుణులైన
జనులు గావించు నొక విశేషంబె గాన,
సొంపుగా వాని నేర్పు వర్ణింపఁ గోరి
'బళిర! నీదు తీ' ర్పని కవి ప్రస్తుతించె.

ధనికుఁ డంత బుడుంగున మునుక వైచి
తేలకుండెను నీటిపై చాలసేపు;
అది జలస్తంభవిద్యగా మదిఁ దలంచి
'అవుర! ఏమి నీ యో' ర్పని కవి నుతించె.

తనదు మిత్రుండు నీటిలో మునిఁగి యెంత
తడవునకు తేలకుంటకు తల్లడిల్లి,
'కటకటా! ఎంత గజయీఁతగాఁడు చచ్చెఁ
గదర!' యని బిట్టు దురపిల్లె కవివరుండు.

కొంతకాలము జరిగినయంత, నతఁడు
తనదు మిత్రుని సద్గుణగణము గూర్చి,
ఈఁతలో వాని మహితవిఖ్యాతి గూర్చి
రమ్యముగ వ్రాసె స్మారకగ్రంథ మొకటి.

సరస మగు వాని కవనచాతురికి మెచ్చి
భాగ్యవంతుని తనయుండు ప్రమద మంది
'సరసకవితాధురీణ' యన్ బిరుద మొసఁగి
కవివరేణ్యుని మిక్కిలి గారవించె.

# గాలి పడగ

పడగ, తోఁకయు, నొక్కింత వాయుబలము
నమరినంతన, పెనుబాము నైతి నంచు
ఇనుని మ్రింగఁగ నింగిపై కెగసె దౌర!
కాలి కూలవె మని యోచు గాలిపడగ?

గగనమున పక్షికై వడి నెగిరెద వని
ధారుణీస్థలి నిన్ను పతంగ మనుచు
పిలిచినంత, పతంగుని పిలుకుమార్ప
మింటి కెగసెద, వెంతటి మిడిసిపాటో?

పెంటఁ బొరలాడు గోచుల నంటఁగట్టి
తోఁక యొక్కటి తగిలింప, త్రుళ్లిపడుచు
అల్ల హనుమంతుతో సాటి నైతి ననుచు
గంతు లిడియెదవే హనుమంతు మ్రింగ.

దారుణోజ్జ్వలకిరణుండు తపనుఁ డేచ,
ఉల్లిపొరవంటి నెమ్మేన నల్లలాడు
నట్టి నీ వేడ? అక్కటా! ముట్టినంత
భగ్గు మని కాలి తూలవె బుగ్గి యగుచు?

సూత్ర మొక్కటి మెడయందు సూటిపడిన
యంతమాత్రాన, ద్విజరాజు నైతి నంచు
చెంగుచెంగున గుప్పించి నింగి కెగసి
చంద్రుఁ జెనకెద వెంతటి సాహసంబొ?

విల్లు నాచెంతఁ గల దని విఱ్ఱవీఁగి
రాజు లెవ్వరు నా కీడు రా రటంచు
నాక మెగసెదు రాజుతో డీకొనంగ
కొండతోడ పొటేలు డీకొన్నయట్లు.

చిరుగుడ్డలు, చింపిరికాకితములు,
పుడకలును గల్గి, అతుకులబొంత యైన
గాలిపటమవు నీ వేడ, కాంచి చూడ
సహజలావణ్యరాశి యా చంద్రుఁ డేడ?

గాలి యదరిన నెగురుచు, గాలి యడఁగ
డింకికొట్టుచు వడిఁ బల్లటీలు వైచి
తోఁక త్రెంచుక నేలపై దొరలియాడు
గాలిపడగరో! నీ కింత కావరంబు?

# యోధుఁడా!

మాత: యోధుఁడా! చెప్పు మెందుండి నీదురాక?
ఎన్నఁడో నిన్ను దిలకించియున్నయట్లు
జ్ఞప్తి యున్నది, వచియింపఁ జాల నెట్లొ-
చోదు లందరు-అందఱుఁజోలి యేల?-
నాదు కూరిమితనయుండు మాధవుండు
సేమముగ నున్నవాఁ డేమొ చెప్పుమయ్య!
దిక్కుమాలినయట్టి యీ దీనురాలి
దీవనలు నిన్ను సాఁకును తెలుపు మయ్య!

యోధు: జననిరో! నీదు మేలి దీవనలచేత
సుఖముగా నున్నవారలు చోదు లెల్ల;
నీదు కూరిమి తనయుండు మాధవుండు
నీకుఁ బంపినయట్టి సందేశ మిదిగొ
తెలుపుచుంటిని, ఆశీర్వదింపు మమ్మ.

మాత: ఏమి యంటివి? చెప్పుమా-ఏమి యంటి?
నాదు నందనుడే!-నాదు నందనుండె!-
నాదు చిన్నారి పొన్నారి నందనుండె!-
నాకు సందేశ మంపెనా? నాకె-నాకె!

ఏమి యంపెను? సందేశ మేమి యంపె?
అతఁ డాడినయట్టి ప్రత్యక్షరమును
కడమ యొక్కింత వడకుండ నుడువు మయ్య!
యోధుఁడా! నీవు నమ్మెదో లేదొ కాని-
అతఁడే నాదు జీవన మతఁడె ప్రాణ,
మాతఁడే నాదు చేయూత, అతఁడె ప్రాపు;
చెప్పు మేటికి తడసెదు; చెప్పు మయ్య!
పిదప సంగతు లన్ని చెప్పెదువు కాని-
ముందుగాఁ జెప్పు మొకమాట, నందనుండు
చెక్కుచెదరక యున్నాఁడె సేమముగను?

యోదు: చెక్కుమాట లిఁకేల? నే నొక్కమాట
చెప్పుచుంటిని విన వమ్మ శీఘ్రముగను!
జననిరో! నీదుతనయుండు సమరమందు
శత్రు బలముల నెల్లను జక్కడంచి

వచ్చుచున్నాఁడు తలపువ్వు వాడకుండ
నీదు చరణరాజీవసన్నిధికి వేగ.

మాత: చల్లఁగా వేయియేండ్లు వర్ధిల్లు మయ్య!
ఆర్తరక్షక! ఈ శుభవార్త వినఁగ
నిలిపితివె జీవనంబుల నేఁటిదాఁక?
వీరుఁడా! నీదు పల్కులు వినక యుండ,
నడుమ నడ్డంబు వచ్చితి - నుడువు మయ్య
తనదు ముదుసలి తల్లికి అనుఁగుబిడ్డ
ఏమి సందేశ మంపెనో ప్రేమ మీఱ,
విందు చెప్పుమ వీనులవిందు గాఁగ,

జోదు: పగతురకుఁ జిక్కి మనరాజు పట్టువడఁగ,
సైన్యములు పటాపంచలై దైన్యవృత్తి
పరుగువాఱుచునుండ, నీ వరసుతుండు
మెఱపు మెఱసినచందాన నురవడించి,
"పాఱిపోయెద రేటికో పందలార!
దోర్బలంబున రిపులతో దుర మొనర్చి
చంపుకొండెను, వారిచేఁ జచ్చుకొండె

చేయ నగుఁ గాని, యీరీతి చేవ దఱిగి
పాఱిపోవుట మీ కది పౌరుషంబె?
నిక్కముగ మీర లాంధ్రులై నెగడి రేని,
చోడవీరుల కీర్తులు వాడకుండ
ఆహవంబున రిపులతో మోహరించి
మించి పోరుఁడు, జయలక్ష్మి మిము వరించు"
అనుచుఁ జెదరిన చోడసైన్యంబులకును
నూతనోత్సాహశక్తిని నూలుకొలిపి
మరల నాజికి వారి నెల్లర మరలిచ్చి
ఒక్కపెట్టున రిపులపై నుఱికి తఱిమి
చించి చెండాడి శాత్రవసేన లెల్ల,
వసుమతీశుని విడిపించె వైభవమున.
తల్లి! నీ సుతు సాహసధైర్యములకు
అంత మన నృపుఁ డెంతయు స్వాంతమందు
పొంగి, యాతని గ్రుచ్చి కవుంగిలించి
కంఠహారంబు ఖడ్గంబు కానుక నొసఁగి
వానిఁ దనసేనలకు దళవాయి చేసె.
జనము లెల్లరు జయజయధ్వను లెసంగ
వినుతి చేసిరి నీ సుతు విమలకీర్తి,
అంగనలు పాడి రంతట మంగళములు.

మాత: చాలు చాలును, నిలు మింక తాళు మయ్య!
ఇంక వినఁ జాలఁ దక్కిన దెప్పు డైన
చెప్పెదవు కాని-ముందుగా నిప్పు డొకటి
అడుగుచుంటిని, తప్పక నుడువు మయ్య!
కన్న తనయునిఁ గని చిరకాల మయ్యె
ఇప్పు డేరీతి నున్నాఁడొ యెఱుఁగఁజాల
నయ్య! వర్ణించి చెప్పుమా యతని రూప
మెట్టు లుండెనో, కన్నులఁ గట్టినట్లు.

జోదు: మాతరో! వానిరూపంబు మాఱిపోయె.
వ్రేలుగడ్డము మీసము పెంచి నేఁడు
పెద్దవాఁ డయ్యె: వాఁడు నీయొద్ద కిపుడు
వచ్చి నిలిచిన పోల్ప నీ వశము కాదు:
ఇంత యేటికి? నీ సుతుఁ డిటకు వచ్చు
తరుణ మయ్యెను, కన్నులకఱవు దీఱ
గాంచు భాగ్యము నీ కిదే కలుగు నమ్మ!
ఏల నీ కింక తత్తర మింతలోనె!

మాత: వచ్చుచున్నాఁడ? చెప్పుమా నిశ్చయముగ;
ఎపుడు వచ్చును? ఏమంటి? విపుడె యనియ?

కన్నులారఁగఁ దన కూర్మి కన్నసుతుని
గాంచు ముచ్చట యింతలోఁ గలుగు నొక్కొ
పనికిమాలిన పరమనిర్భాగ్యురాలి?
కకట? నిక్కంబుగాఁ దెల్పు మయ్య నాకు.

జోదు: తల్లిరో! ఇంత నీకత దాఁచ నేల?
నీదు కూరిమితనయుండు మాధవుండు
అప్పుడే వచ్చి చాలసే పయ్యె నమ్మ!
ఇంత తడవును వాఁడు నీచెంత నుండె,
ఈవు పోల్చంగ లేకుంటి వింతె కాని.

మాత: యోధుఁడా! నీవు నా ముద్దు మాధవుఁడవె?
జోదు: మాతరో! నేను నీ ముద్దు మాధవుఁడనే.

# విలియమ్ టెల్

వినుఁడు జనులార! వినిపింతు వింతకతను
జరిగినదె కాని, కల్పితచరిత కాదు:
దివ్య మైన స్విజ్జర్లాండు దేశమందు
కలఁడు 'విలియము టె' ల్లను కాఁపువాఁడు:

ఏటియొడ్డున నొక చిన్న తాటియాకు
గుడిసెలో కాఁపురము చేసి, గొఱ్ఱెమంద
తోలుకొని వాఁడు మడిమట్ర దున్నుకొనుచు,
కష్టపడి జీవయాత్రను గడపుచుండు.

పొడమె నతనికి చిన్నారి బుడుతఁ డొకఁడు;
వాని పలుకులు తేనియసోన లొలుకు,
తేటకన్నులు ముద్దుల మూట గట్టు
లేఁతనవ్వులు వెన్నెలపూఁత వెట్టు.

గొఱ్ఱెపిల్లలతో వాఁడు కూడిమాడి
వేడుకలు మీఱ నెప్పుడు నాడుచుండు;
చంగు మని యవి చేలలో చౌకళింప
చెలఁగి తానును వానితో చెంగలించు.

కూడు గుడ్డకు నొక్కింత కొఱఁత లేక
దేవుఁ డిచ్చినదానికి తృప్తి నొంది
వెత లెఱుంగక హాయిగా స్వేచ్ఛ మీఱ
గడపుచుండిరి వారలు కాల మెల్ల.

కాల మొకరీతి క్రమముగాఁ గడవఁబోదు-
సౌఖ్యముల వెంట దుఃఖముల్ సంభవించు;
చల్లనైనట్టి యామని చన్నపిదప
మండువేసఁగి యెండలు మసలుఁ గాదె?

ప్రకృతిరమణీయ మగు స్విట్జర్లాండుసీమ
పడయలే దింక స్వాతంత్ర్య భానురేఖ;
వైరి యగు నాస్ట్రియాదేశ క్రూరవిభుని
పాలనంబున కృశియించి డీలుపడియె.

అతఁ డొకనాఁడు రాజ్యమదాంధకార
మదర, స్విజ్జరులాండున కరిగి, యందు
విలియ మున్నపురంబున విడిసి, తనదు
టెక్కెమును నాటుకొల్పి, చాటించె నిట్లు:

'వినుఁడి, ఎవఁడైన నీ వీథి వెంటఁ జనుచు
టెక్కెమును గాంచి తలవంచి మ్రొక్కఁడేని
తోడనే వాని మూర్థంబు తునిసిపడును
మందులార! యో బానిసపందలార!'

విలియ మానాఁటిప్రొద్దున పొలము వీడి
సుతునిఁ దోడ్కొని నగరంబు జొచ్చి చనుచు,
దారిలోఁ గాంచె ధ్వజమును, దానిచుట్టు
సంభ్రమంబున మూఁగిన జనులగుంపు.

చౌకులో నొక్క యున్నత స్థలమునందు
ధ్వజము నెలకొనియుండెను, దాని దిగువ
విచ్చుకత్తులు కరముల వీఁగియాడ
భటులు బారులు దీర్చిరి ప్రభునిచుట్టు.

'ధ్వజమునకు భక్తి మ్రొక్కుఁడీ దస్యులార!'
అనుచు గొంతెత్తి యఱచిరి యతని భటులు;
చిత్తరువు వోలె నడుమున చేయి జేర్చి
ఠీవి మీఱఁగ కూర్చుండె భూవరుండు.

జనులగుంపును జూచి, ధ్వజంబు జూచి,
పొగరుబో తగు నా ఱేని మొగము జూచి,
మది నొకింతయు నదరును బెదురు లేక
నిట్టుతాడివిధంబున నిలిచె కాఁపు.

అతని సాహసమును గాంచి యక్కజంబు
నంది, భటు లిట్లు గద్దించి రతనిఁ గదిసి:
'కనులు గానవ? నీ కింత కావరంబు!
మ్రొక్క వేటికి సాఁగిలి టెక్కెమునకు!'

అనుడు, ధీరత తోఁపంగ ననియె కాఁపు:
'ఈశునకె కాని, మనుజున కేను మ్రొక్క;
తుచ్ఛజీవము తొలఁగిన తొలఁగుఁ గాక,
విడువఁ జాలను స్వాతంత్ర్య విమలవాంఛ.'

'పట్టి బంధింపుఁడీ వీని బంటులార!'
కనుల నిప్పులు రాలంగ ననియె ఱేఁడు-
'తెగువతో వీఁడు నా యాన ధిక్కరించె,
ద్రోహి యగు వీని శిరమును ద్రుంతు నిపుడె.'

క్షణము తాళుఁడు-మా కొండు జ్ఞప్తివచ్చె-
మేలివిలుకాండ్రలో వీఁడు మేటి యనుచు
వింటి మొకసారి, యీతని వింటినేర్ప
కని వినోదింత మొక్కింత, గడియసేపు.

చిట్టిబాలుని గొని తెండు రెట్టఁబట్టి,
వృక్షమూలమునకు వాని వీఁకిచిఁకట్టి
నిలుపుఁడీ రేఁగుకాయను నెత్తిమీఁద'
అనుచు శాసించె ఱేఁడు కట్టలుక గదుర.

ఆనతిచ్చెనొ లేదొ యిట్లవనివిభుఁడు-
భటు లొనరిచ్చిరి సర్వంబు చిటికలోన;
ప్రభునిచేఁతకు వగఁజెందె పలికె కాఁపు
గద్గదిక తొట్రుపాటును కడలుకొనఁగ.

'నేర మేదేని నున్నచో, నేనె కాని,
పాప మీతఁడు పసిపాప, బాధ్యుఁడగునె?
కుఱియఁ దగుఁ గాని నామీఁద క్రోధవహ్ని,
చిన్ని బాలుని శిక్షింపఁ జన్నె మీకు?'

వికటముగ నవ్వి తోడనే విభుఁడు పలికె:
"చెనఁటినే చిన్నిబాలుని శిక్ష సేయ?
వీని తలనుండి యొక రక్తబిందు వైన
ధరణిఁ బడెనేని, కర్తవు దాని కీవె.

పెక్కు లేటికి!-నీ విల్లు నెక్కు వెట్టి
సూటిగా నొక్క బాణంబు మీటు మయ్య
రేఁగుకాయను లక్ష్యమ్ము గాఁగఁ జేసి,
కైకొనుము స్వేచ్ఛ కాన్కగా కమ్మతీఁడ!"

పిడుగు బోలిన యా మాట వినినతోనె
జనుల హాహారవంబులు చదలు ముట్టె,
నతుల యాక్రందనంబులు సందడించె,
పిల్ల లెల్లరు భీతిచే తల్లడిలిరి.

ఉల్లమున నీను రోసంబు మల్లడింప
మొగము బిగియించి కనుబొమల్ ముడివడంగ
శీఘ్రముగ విల్లు నమ్ములు చేతఁ దాల్చి
నిబ్బరంబుగ విలియము నిలిచియుండె.

చలన మొందక, కొంకును జంకు లేక
నిర్భయంబున నిట్లనె నర్భకుండు:
'ఏయుమా తండ్రి! తడసెద వేల యింక?
బన్న మొందెనె నీ గుఱి యెన్నఁడేని!'

తనయు తెగువకు మది మెచ్చి జనకుఁ డంత
'ఈశ్వరుఁడు నీకు శుభముల నిచ్చుఁ గాత!'
అంచు, శరమును వింట సంధించి యేసె
రివ్వురివ్వున గాలిలో రెచ్చి పాఱ.

'బాపురే! ఎంత చక్కని నైపుణంబొ!
చెక్కుచెదరక యున్నాఁడు చిన్నిబిడ్డ
దేవుఁ డెన్నఁడు దీనుల దెసనె నిలుచు'
అనుచు గొల్లున నఱచిరి జనులు చెలఁగి.

నూటి నేగిన యా తూపునేటు తగిలి
రెండు చెక్కలుగాఁ జీలి రేఁగుకాయ
ధరణిపైఁ బడె చూపరుల్ వెఱఁగుపడఁగ,
బాలుఁ డలరారె తలపువ్వు వాడకుండ.

బళిర! మెచ్చితి నీవు నీ బాలకుఁడును
నేఁడు చూపిన తెగువకు! వేడు కలర
నీదు నెలవున తేగుమీ, నిన్ను విడిచి
పుచ్చితిని గాన, నను నీవు మెచ్చవలయు.'

అనుచు నృపుఁ డన, చల్లగా ననియె కాఁపు
"నిన్ను నే మెచ్చ టటు లుండ, నన్నె నీవు
మెచ్చుకొనవలె, నిను బొరిపుచ్చకుండ
ప్రాణదానంబు చేసితిఁ గాన తేఁడ!

ఓయి! నీ చావు నాచేత నుండె సుమ్మి;
నాదు బాణము గుఱి తప్పి నా కొమరుని
శిరము తెగెనేని, తెగును నీ శిరము కూడ
వాడి యగు నాదు రెండవ బాణమునను.

చూడుమా యిదె రెండవ వాడితూపు
డాఁచియుంచితి నా చల్లడంబునందు;
నీదు ప్రాణము కాపాడి నిన్ను విడిచి
పుచ్చినందుకు నను నీవె మెచ్చవలయు.

ఎల్లజగములఁ గాపాడు నీశ్వరుండు
నన్ను నిన్నును కాపాడినాఁడు నేఁడు;
వాని కర్పించుకొందము భక్తి మీఱ
వర కృతజ్ఞతాపూర్వక వందనములు.''

# యతి-నృపతి

విభునితో భృత్యుఁ డీరీతి విన్నవించె:
"యతివరేణ్యుఁడు దేవాలయమ్ము వీడి
గుడికి వెలుపల గుడిసెల నడుమఁ జేరి
చెట్లనీడను బ్రార్థన చేయుచుండె.

తమ్మిపువ్వునఁ దూఁగాడు తుమ్మెద లన
వానిచుట్టును మూఁగుచు భక్తు లకటా!
ఒక్కఁడును లోని కడుగిడ నొల్లఁ డయ్యె;
శోభ చెడి దేవళం బెల్ల శూన్య మయ్యె."

సంభ్రమంబును చిడుముడి సందడింప,
యతివరునిచెంత కేతెంచి, యనియె నృపతి:
"స్వర్ణగోపుర మున్న దేవళము వీడి
చెట్లనీడను బ్రార్థింపఁ జెల్లు నయ్యా?"

చేతమున నించు తేనియు ఖీతి గొనక
ప్రభునితో మౌనివర్యుఁడు బదులు వలికె:
"ఎవరి పూజింతు నచ్చుట? ఈశ్వరుండు
అవలఁ జనె-నీదు దేవాలయంబు వీడి."

"లచ్చలకొలంది రూప్యముల్ వెచ్చవఱిచి
మేటిశిల్పంబు మెఱయ నిర్మించినట్టి
పైఁడి శిఖరంబు దేవుండు వీడి చనునె?
అక్కటా! ఎట్లు నమ్మెదు?" ననియె రాజు.

అనుడు మునివర్యుఁ డి ట్లనె "అవనినాథ!
కుడువ కూడును, పడియుండ గుడిసె లేక
గొల్లు మని నాఁడు ప్రజ లెల్ల గోలవెట్ట
గెంటితివి కాదె వారి నీ యింటినుండి?

తనదు బిడ్డలు తలదాఁచికొనఁగ నింత
నీడ యైనను లేక యల్లాడుచుండ,
కనకభవనంబు నా కేల? యనుచు మదిని
కినిసి దేవుండు గుడి వీడి చనియె-నధిప!"

అనుడు, నా మాట లాలించి యాగ్రహమున
కనుల నిప్పులు రాలంగ మునిని గాంచి
"తోడనే నాదు రాజ్యంబు వీడి యవల
తొలఁగిపొ"మ్మని యదలించి పలికె ఱేఁడు.

"దేవునే గెంటివైచిన దిట్ట వీవు
ఇంక నను గెంటివైచుట యేమి లెక్క?
ఇంతకాలముదనుక నీచెంత నుండి
వెడఁగునైతిని" అని పల్కి వెడలె మౌని.

# బంతిపూలు

గగనతలమున నల్లాడు మొగులు రీతి
ఒంటిమై నేను విపినంబు వెంటఁ దిరుగ,
దరిని గాంచితి తండోపతండములుగ
బంతిపువ్వుల కన్నుల పండువుగను.

మొలకనంజల పసిమికి ప్రోదివెట్టు
మేల్మిబంగరు రంగుల మిసిమితోడ
చెలువుచుట్టును గట్టుపై తరులనీడ
బంతు లలరారె మరుచేతి బంతు లనగ.

నింగిపైఁ దోఁచు నాకాశగంగదరిని
తళుకు తళుకున మెరసెడు తారలట్లు,
కొలని పొదుగున మిఱుమిట్లు గొలుపుచుండె
వింతకాంతుల దీపించి బంతిపూలు.

నాలిపయ్యెదగాలికి నాట్యమాడు
చెఱువుతరగల మేలంబు సేయుపగిది,
శిరము లూపుచు నృత్యంబు చేయుచుండె
బంతిపువ్వుల గుత్తులు సంతసమున,

సుమముగుత్తుల కనులారఁ జూచి చూచి
సంతసంబున పారవశ్యంబు నొంది
చిత్తరువు వోలె సంతనె చేష్టలుడిగి
నిట్టనిలువున బ్రమాస్పడి నిలిచియుంటి.

చలువతెమ్మెర గమగమల్, కొలని యలల
గలగలలు, సంజకెంజాయ మిలమిలలును,
బంతిపువ్వుల నిగనిగల్ స్వాంత మెల్ల
నొక్కపెట్టున నుఱ్ఱూత లూగఁ జేసె.

సెజ్జపైఁ జేరి పలుమాఱు చింతఁగూరి
తోచ కేమియు నటు నిటు చూచునపుడు,
నాటి దృశ్యము మదిలోన నాటి నాటి
కుతుకమున నోలలాడుదు వెతల మఱచి.

ప్రకృతి రమణీయ సౌందర్యభరితమైన
ఇట్టి దృశ్యము కన్నులఁ గట్టినపుడు,
ప్రవిమలానందమునఁ దేలి కవివరుండు
అలరుగుత్తుల లీల లాస్యంబు సలుపు.

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడా, హైదరాబాద్-1

# సూర్యోదయము

చిమ్మచీఁకటిసోకులఁ జెండియాడ
ప్రాచ్యభూధర మనెడి పిరంగినుండి
కాలపురుషుండు వెడలించు గోళ మనఁగ
అరుణరుచితోడ తరుణభాస్కరుఁడు వెలిఁగె.

పండుటాకులు సంజలు, వక్క విరులు,
లేఁతయీరెండ సున్నంబు రీతిఁ జెలఁగ,
తమ్ములము వైచు ప్రాగ్దిశాతరుణియధర
బింబమో యన మార్తాండబింబ మలరె.

సప్తవర్ణముల్ తనయందు సంతరించి
కరము లను తూలికలచే జగంబు లెల్ల
వింతవన్నెల రచియించె వేడ్క మెఱయ
చిత్రభానుని పేరిటి చిత్రకరుఁడు.

భానుబింబము రాట్న, మఖ్రంబు దూది,
చదలు మగ్గము, సంజకెంజాయ రంగు,
కిరణములు నూలిపోఁగులై వఱలుచుండ,
సమయ మను సాలె కాంతివస్త్రంబు నేసె.

కటికిచీఁకటి పేరిటి కారుమొసలి
ఉప్పరం బను గజరాజు నొడిసిపట్ట,
సమయవిష్ణుఁడు వైచిన చక్ర మనఁగ
భానుబింబము దేదీప్యమాన మయ్యె.

సవితృఁ డను బంతి సమయేంద్రజాలికుండు
అస్తగిరి యను చిప్పచే నణఁచిపట్టి,
అందు లే, డిందు చూపెద నన్నకరణి,
ఉదయగిరిచక్కి చూపట్టె నుష్ణకరుఁడు.

సాంధ్యరాగాగ్నిహోత్రంబు సాక్షి గాఁగ
ఇనుఁడు పద్మినిని కరగ్రహణ మొనర్చె
కుత్తుకను నల్లపూసల కుత్తికంటు
కట్టె నన, తేంట్లు తమ్మిపైఁ జుట్టుకొనియె.

# శత్రు మిత్రులు

చెవికి నింపగు పలుకులచే హితుండు,
పరుషనిష్ఠురవాక్కాలాపముల వైరి
తనదుచేతల నారసి తప్పు దిద్దు;
మిత్ర శాత్రవభేదంబు ధాత్రిఁ గలదె?

ఎక్కసక్కెపుమాటల నెత్తిపొడిచి
తాను చేసిన దుష్టకృత్యములఁ దెగడు;
శత్రుఁ డెన్నఁగ శత్రువేషమున నున్న
మిత్రుఁడే కాని, కేవలశత్రు వగునె?

తనదుదోసంబు లారయు, తప్పు లెన్ను,
ఎగ్గులను జాటు, పాపంబు లుగ్గడించు,
దుర్నయంబులు వెలివుచ్చు, దొసఁగు లెంచు;
శాత్రవునికంటె నాప్తుండు జగతిఁ గలఁడె?

చండకరుఁడయి తమమెల్లఁ జెండు నొకఁడు;
శీతకరుఁ డయి మనసు రంజించు నొకఁడు;
శత్రు మిత్రులు భాస్కర చంద్రులట్లు
వారు పరమోపకారులు కారె జగతి ?

తన్ను పగతురు నొంచిరి, తాను పగర
నొంచితి నటంచు కించిజ్ఞుఁ డెంచుచుండు;
అరయ దేహంబునకె కాని ఆత్మ కెందు
చెలిమికారంబు వైరంబు కలుగఁబోవు.

# ఆముదపు చెట్టు

దారుణాటవిలో నొక్క తపసితేఁడు
తనదుగుహాయందు కూర్చుండి కనుల మోడ్చి
ఘోరతపమును గావించె; కొన్నినాళ్ల
కతని కీశుండు ప్రత్యక్ష మయ్యె నెదుట.

"వత్స ! నీ కేమి వలయునో వరము వేఁడు"
మనుచు దేవుండు కృపతోడ నానతిచ్చె;
కనుల నానందబాష్పముల్ క్రమ్ముకొనఁగ
అనియె నీరీతి నీశుతో మునివరుండు.

"విమలభక్తిని నిన్ను సేవించుకంటె
వలయునే యొండు ? నిను పూజ సలుపుపొంటె
వరద ? దివ్వెకు చమురు కావలయుఁ గాన,
ఆముదపుచెట్టు దయచేయు మయ్య నాకు."

అనుచు ప్రార్థించి కన్గవ నట్టె విచ్చి
చూచినంతనె, యాచెంత చోద్య మొప్ప
అముదపు మొక్క యొక్కటి యవతరించె;
ప్రీతితో దాని నాతండు పాతిపెట్టె.

'ముదము మీఱఁగ నాచిన్నిమొలక యెదిగి
రెమ్మలును కొమ్మలును గల్గి వృద్ధి చెందఁ
గాంచు టెన్నఁడొ కన్నులకఱవు దీఱ?'
అనుచు మనమునఁ దలపోసి యతివరుండు.

"కోరినంతన నాకోర్కి కొనలుసాఁగ
మొక్క నిచ్చితి, వయ్యది మోసు లెత్తి
పెంపు చెందంగ వాన రప్పింపు మయ్య!
భక్తవత్సల!" అని వేఁడె భావమందు.

కారుమబ్బులు చదలిపై కడలుకొనియె,
చిమ్మచీఁకటి జగ మెల్లఁ గ్రమ్ముకొనియె,
జోరుజోరునఁ దోరంపుధార లడర
కుంభవృష్టిగ వర్షంబు కురియఁ జొచ్చె.

"చాలు చాలును పరమేశ ! తాళు మింక
వెల్లుజల్లున కోర్చునే పిల్లమొక్క ?
నెండపిసరుల దానిపై నిండఁ జేసి
సేదదేర్పవె" అని వేఁడె సిద్ధవరుఁడు.

ఆతఁ డిట్లనియెనో లేదో - అంతలోనె
మొగులు లన్ని పటాపంచ లగుచు విచ్చె,
నింగి నంతట సూర్యుండు తొంగిచూచె,
మెండుగాఁ గాసె మిటమిట మండుటెండ.

"వేడియెండలచే మొక్క వాడె దేవ !
మంచు నించుక దానిపై నించు మయ్య"
అంచు బ్రార్థించె, తోడనే మంచు కురిసె;
బ్రొద్దు గ్రుంకెడిలో మొక్క మొగము వాల్చె.

తపసి యంతట వేఱొక్కతపసికడకు
నేగి, యచ్చట నేపుగా నెదిగియున్న
ఆముదపుచెట్టుఁ దిలకించి అక్కజపడి,
"చెప్పుమీ మొక్క నెట్లు పెంచితివో సఖుఁడ !

"అడిగితిని మొక్క నీశుని, నాతఁ డిచ్చె,
వాన నెండయు మంచును వరుస నొసఁగు
మనుచు వరములు వేఁడితి, నాతఁ డన్ని
యిచ్చె; నది యేమిచిత్రమో- చచ్చె మొక్క."

అనుచు వచియింప, రెండవముని వచించె
"లీల జగముల నెల్లఁ గల్పించినట్టి
సృష్టికర్తకె దాని నరిపించినాఁడ;
నారు వోసినయాతఁడే నీరు వోయు.

"ఇట్లు చేయుము సర్వేశ! అట్లు చేయు
మనుచు శాసించి వరముల నడుగలేదు;
అఖిలసృష్టినియామకుఁ డైనయతఁడు
లేఁతమొక్కను పోషింపలేఁడె చెపుమ.

"ఎప్పు డేరీతి నెవ్వని కేది హితమొ,
అప్పు డారీతి నవ్వాని కది యొనర్చు;
అఖిల బ్రహ్మాండనాయకుఁ డతనికంటె
అల్పమతి యగు మానవుం డధికుఁ డగునె!"

# ఊసరవెల్లి

పాంథు లిరువురు దారిలో పాదపంబు
నీడఁ గూర్చుండి ముచ్చటలాడుచుండి;
రంత నెచ్చటనుండియో యరుగుదెంచి
వృక్ష మెగఁబ్రాఁకె నూసరవెల్లి యొకటి.

"చూచితే సఖ! ఎంతటి చోద్య మొక్కొ!
వింతగా నిప్పు డెద్దియో జంతు వొకటి
సరగుసరగున నరుదెంచి తరువు నెక్కె,
దానిఁ బోలిన జంతువు ధరణిఁ గలదె?

"బాపురే! దానిరూపంబు బల్లిరూపు,
మోము చేపది, నాలుక పామునాల్క,
మేఘమును బోలె నీలంబు మేనిచాయ"
అనుచు నొక్కఁడు రెండవయతని కనియె.

"ఆగుమాగుము" - రెండవయాతఁ డనియె-
"నీలమా దానితనుకాంతి? మేలు మేలు!
ఇట్లు పలుకంగ నీకు నో రెట్లు లాడె?
చిలుకరీతిని పచ్చనై వెలయుచుండ."

"పిచ్చియెత్తెను కాఁబోలు, పచ్చ ననుచు
వదరుచుంటివి నోరికివచ్చినట్లు"
"నీల మని యింక నొకసారి ప్రేలితేని
దౌడపండ్లూడ గట్టిగా తన్నువాఁడ."

అనుచు నిరువురు వాదంబు లాడి యాడి
కినుక రెట్టింప సిగపట్లకును బెనంగి
దొమ్ములాడిరి; అప్పు డాత్రోవఁ జనుచు
వచ్చె నచటికి మూడవ బాటసారి.

వారిఁ గనుఁగొని పలికె నా బాటసారి;
"చెల్లరే! మీర లీరీతి సిగ్గు మాలి
కోడిపుంజులతై వడి కుమ్ములాడ,
ఎవ్వరైనను గన్నచో నవ్వరొక్కొ?

"దాని నిప్పుడ బొత్తఁగంటి దారిఁ జనుచు
కాదు నీలము, పచ్చయుఁ గాదు సుమ్ము;
వినుడు వచియించెదను- దానితనువుకాంతి
నిప్పుచందాన నెఱ్ఱనై యొప్పు మీఱు."

"తగవరి నటించు తా నొక్కఁడంట వోలె
ఔర! పిలువని పేరంటు మరుగుదెంచి
ప్రల్లదంబుల నేమేమొ పలుకసాఁగె,
విడిచిపుత్తుమె యూరక వీని నిపుడు?"

అనుచు నిరువురు నా క్రొత్తయతని గదిసి
ఆగ్రహంబునఁ దలఁపడి; రంతలోనె
వృక్షమునసుండి యూసరవెల్లి డిగ్గి
తటుకు మని వారియెదుట ప్రత్యక్ష మయ్యె.

దాని బొడఁగని వారలు తత్తరమున
'నేను గెల్చితి' 'నామాట నిజము చూడు'
'నాది పైచేయి' అనుచును వాదులాడి
దాడివెడలిరి యొకపెట్టు దాని బట్టు.

ముప్వురును మూడువైపుల ముట్టడించి
ఎట్టకేలకు దానిని బట్టుకొనిరి;
వింతగా దానితనుకాంతి వెల్లనయ్యె,
విన్ననై వారి మొగములు వెల్ల నయ్యె.

తిచ్చపడి వార లంతట ముచ్చముడిగి
చిత్రములరీతి నిలిచిరి చేష్ట లుడిగి;
ఉట్టిపడినట్టు లింతలో నిట్టె వచ్చె
వారిచెంతకు నాల్గవ బాటసారి.

"ఏల యీలీల మొగముల వ్రేలవైచి
ఉస్సు రని వెచ్చనూర్చుచు నుంటి" రంచు
అడిగె నాతఁడు; వార లాగోడవ యెల్ల
పూసగ్రుచ్చినగతి వెలిబుచ్చి రంత.

పకృ-మని నవ్వి యాతండు పలికె నిట్లు:
"చిత్రముగ మీర లిప్పుడు చెప్పినట్టి
వింతజంతువు నూసరవెల్లి యందు,
రన్నివన్నియలును దానియందుఁ గలవు.

"కాన మీపల్కు లెల్ల నిక్కములై యయ్యు
అవ్వి యన్నియు నమృతంబు లయ్యె నిపుడు,
చపలచిత్తుని హృదయంబు చందమునను
సారెకును దాని రంగులు మాఱుఁ గాన."

# వైదికుఁడు - వైష్ణవుఁడు

ఘోర మగు నొక్క జడివాన గురియుచుండ,
ఒకదినంబున రాత్రి వైదికుఁ డొకండు
వైష్ణవునియింటి కేతెంచి, పండుకొనఁగ
స్థలము నిమ్మని ప్రార్థించె దైన్య మలర.

స్మార్తునకు తన గృహమున స్థల మొసంగ
వలనుపడ దని వాదించె వైష్ణవుండు;
ఇంటి కేతెంచు నతిథిని గెంటివైచు
టనుచితం బని వారించె నతని గృహిణి.

మగఁడు పొమ్మన, రమ్మని మగువ పెనఁగ,
జరగె వాదము వారికి చాలసేపు;
భార్యపోరును పడలేక వైష్ణవుండు
పండుకొన తా నొసంగెను వైదికునకు.

'బ్రతుకు జీవుఁడ' యంచు లోపలికి నేగి
బల్లపై మేను వాలిచి వైదికుండు
పండుకొని, యంత తెలతెల్లవాఱ లేచి,
పాడుచుండెను 'శివ రామ బ్రహ్మ' యనుచు.

ఆతని పలుకులు ములుకులై యాత్మ నాఁట,
వైష్ణవుఁడు దిగ్గురని లేచి, భార్య లేపి,
నెత్తి నోరును లబలబ మొత్తుకొనుచు
దాని కిట్లనె పెదవులు తడఁబడంగ:

"ఏమె లేలెమ్మ - వింటివే యింటిదాన !
వైదికుని కాఱుకూఁతలు ? పండుకొనఁగ
చోటు నిచ్చితి మన్న మోమోట లేక
వదరుచున్నాఁడు నోరికి వచ్చినట్లు."

తత్తరంబున మేల్కాంచి తరుణి యంత
"నాథ ! వైదికుఁ డేమి యొనరెచ్చె ?" ననుచు
నడుగ, "మనవాని నిదువుర నడుమ నొక్కి
నులిమి చంపుచునున్నాఁడు చలము మీఱ."

అనుచు తన భర్త వచియింప, నతనిమాట
తెలియఁ జాలక వెండియుఁ బలికె భార్య,
"నాథ ! నీ వాక్యములు నాకు బోధపడవు,
స్మార్తుఁ డెవ్వని చలమునఁ జంపుచుండె ?"

"తెల్లముగ నీకు నటులైన తెలిపెద విను,
శివుని మొదటను, బ్రహ్మను చివరఁ బెట్టి,
నడుమ రాముని నిఱికించి నలిపి నలిపి
చంపుచున్నాఁడు మనదేవు స్మార్తుఁ డతఁడు !

"స్మార్తు నెన్నటికైన నమ్మంగ నగునె ?
అనుచు నే నెంత మొఱపెట్టుకొనినఁ గాని
చెవిని బెట్టక యాతనిఁ జేరఁదీసి
ముప్పు దెచ్చితి వక్కటా ! మూర్ఖురాల ?"

అనుచు వైష్ణవుఁ డెంతయు నలుక గదుర,
"ఎట్లు సహియింతు నీ పెండెకట్లవాని
చేష్ట ?" లని వాని పైఁ బడి చెవులు నులిమి
ఇంటిలోనుండి యవలికి గెంటివైచె.

# రేఁగుచెట్టు భాగవతము

వినఁగ వీనులు, కానంగ కనులు లేని
మూఁడుకాళుల ముదుసలిముండ యొకతె
వీథినాటకమును జూడ వేడ్కఁ జెంది
అడిగె తోడ్కొని పొమ్మని పడుచుదాని.

"అకట! వినలేవు, కనఁజాల, వటకు వచ్చి
ఏమి యానంద మొందెద వీవు చెపుమ!
ఎల్లరును నవ్వుచుండఁగ, తెల్లఁబోయి
నీవు చూడంగ, నవ్వరే నిన్ను జూచి?"

అనుచు నాకాంత వచియింప, ననియె ముసలి
"ఆటలో రక్తికట్టినయప్పు డెల్ల
గిల్లుచుండును నామేను; గొల్లు మంచు
నలువురును నవ్వ, నేనును నవ్వుచుందు."

'ఈ పిశాచంబు నా కేడ దాపరించె'
ననుచు నొకరేఁగువృక్షంబునండఁ జేరి౽,
'అదిగొ! నాటక మాడుచో' టనుచు దాని
నచట దిగఁబెట్టి మెల్లనాయతివ జాఱె.

రేఁగుకొమ్మలు గాలికి నూఁగులాడి
చుఱుకు మని మేన ముండ్లు గ్రుచ్చుకొనుచుండ,
తన్ను పడుచుది గిల్లుచు నున్న దనుచు
నవ్వారే! యని యాయవ్వ నవ్వుచుండె.

ఇట్లు నవ్వుచు నవ్వ రే యెల్లఁ గడపి
యందె పడియుండె వేకువ యైనఁ గాని;
చోద్య మందుచు జను లెల్ల చుట్టు మూఁగి
"ఏల నవ్వెద వవ్వరో! ఇహిహి యంచు?"

అనుచు ప్రశ్నింప, వానితో ననియె నవ్వ
"కాంతతో నాటకంబును గాంచుచుంటి,
ఆటలో రక్తి మీఱినయప్పు డెల్ల
నలువురును నవ్వ, నేనును నవ్వుచుంటి."

# మూఁగ యిల్లాలు

పాఱుఁ డొక్కఁడు కలఁ డొక్క పట్టణమున;
వాని యిల్లాలు సద్గుణవంతురాలు,
బుద్ధులకు ప్రోవు, సోయగంబునకు తావు,
చక్కగా నింటిపను లెల్ల చక్కఁబెట్టు.

మగనికనుసన్న మెలఁగుచు మగువ యెపుడు
ఆకుమఱుఁగున పిందెయై యలరియుండు;
ఎందు నాపెకు లోప మొక్కింత లేదు,
అకట! మూఁగతనం బది యొకటె కాని.

దాని కెంతయు దురపిల్లి ధరణిసురుఁడు
శస్త్రవైద్యమునందు ప్రశస్తుఁడైన
వెజ్జుకడ కేగి యంతయు విన్నవింప,
వైద్యుఁ డీరీతి వచియించె వానితోడ:

"ఎట్టి దుర్భరరోగంబు లేని గాని,
అట్టి యవలీల కుదురఁజేయంగ నేర్తు,
లెక్కయే మూఁగతనమును చక్కఁజేయ ?
చిటికలో నామె మాటాడఁ జేయువాఁడ."

అతని మాటల కెంతయు నాత్మ నలరి
వెంటఁ గొనె వాని బ్రాహ్మణుఁ డింటికడకు;
అంత నింటికి వైద్యుండు గొంతులోన
శస్త్ర మొనరించి రోగంబు చక్కఁజేసె.

ఏమి చిత్రమొ కాని- ఆయింతినాల్క
అంతనుండియు క్షణ మైన నాగకుండ
అనుక్రోవి విధంబున నల్లలాడి
వాఁగ సాగెను జేగంట మ్రోఁగినట్లు.

మగువ యంతట నిత్యంబు మగనితోడ
కడఁగి కయ్యాల క్రచ్చయై కాలు త్రవ్వి
చీటిమాటికి జగడంబు చేయుచుండె;
గరిత కా దది గయ్యాళిగంప గాని.

దానిపోరున కొక్కింత తాళలేక
మరల విప్రుఁడు వైద్యునిదరికి నేగి,
నెత్తి నోరును లబ్బున మొత్తుకొనుచు
ఇట్టు లాతనితో మొఱ్ఱవెట్టుకొనియె:

"కొలువఁబోయిన గుడి మీఁదఁ గూలినట్లు,
మూఁగ మాన్పిన, నది యట్టె తూఁగ యయ్యె;
చెలిని గ్రమ్మఱ మూఁగఁగాఁ జేసితేని
నీదుతలనిండ విత్తంబు నించువాఁడ."

అనుడు, నాతనితో వైద్యుఁ డనియె "విప్ర!
ఎట్లో మూఁగను మాటాడునట్లు చేయ
శక్య మయ్యెను గాని, నాసాధ్యమగునె
వాఁగుబోతును గ్రమ్మఱ మూఁగఁజేయ?"

# పిచ్చికుక్క

వినుఁడు జనులార! శ్రద్ధగా వీను లలర
చెప్పుచుంటిని మీ కొక్క చిన్నకతను;
కుఱుచ యని రక్తి యొక్కింత కొఱఁతవడదు,
చిట్టి దయ్యును మిరియంబు చెడునె ఘాటు?

జంగ మొక్కఁడు కలఁడు కళింగపురిని,
అతని నామము 'పశుపతి' యనఁ బరంగు;
లింగపూజాధురీణుం డనంగ నతఁడు
భూతలంబున మిక్కిలి ఖ్యాతి కెక్కె.

సతత మాతఁడు కావివస్త్రములఁ దాల్చి
నుదుట వీబూదిరేకలు కుదురుగొలిపి
మెడను రుద్రాక్షమాలిక మేళవింప
అపరశంకరుఁడో యన నలరుచుండు.

—:—

నిగమవిదుఁ డంచు సత్కర్మనిరతుఁ డంచు
నుతు లొనర్తురు జను లెల్ల నతనిగూర్చి;
ఎపుడు చదివెనొ వేదంబు లెఱుఁగ రెవరు,
ఏమి సలిపెనొ సత్కర్మ లెఱుఁగ రెవరు.

'దీనచింతామణి' యటంచు, 'దానకర్ణు',
డంచు బిరుదంబు లెన్నొ యార్జించె నతఁడు;
ఇట్టి లోకైక విఖ్యాతి, యిట్టి బిరుదు
లెట్లు వానికి కలిగెనో యెఱుఁగ రెవరు.

వానిఁ బొడఁగని గోముఖవ్యాఘ్ర మనుచు
గొణుగుచుందురు కొందరు; 'కుక్క కూయ
చెడునె జంగంబుపరు' వని చిత్తమందు
లేశ మేనియు నాతండు లెక్కగొనఁడు.

మక్కువ నతండు నల్లని కుక్క నొకటి
పెంచుచుండెను; ఒకనాఁడు వేడు కలర
దానితో నాడ, నాతనిదౌడ నొడిసి
పీకె నయ్యది అక్కటా! పిచ్చియెత్తి.

నొగులుచే వాఁడు మూల్గుచు వొగులుచుండ
పరుగుపరుగున పౌరుగువా రరుగుదెంచి
నెత్తుటను దోఁగు నాతనినె మ్మొగంబు
చూచి, శోకంబు చోద్యంబు నుడిగొనంగ

"గంగిగోవును బోలు నీజంగమయను
దౌడమీదను కఱచె నీ పాడుకుక్క;
'ముద్దు చేసిన శునకంబు మూతి కఱచె'
అనెడి పెద్దల వాక్యంబు వ్యర్థ మగునె ?

చచ్చనే కాని మనుజుండు పిచ్చికుక్క
కఱవ, క్రమ్మఱ బ్రదుకుట కలదె ?" యంచు
ఉస్సురను రని వేడినిట్టూర్పు పుచ్చి
వీడి రానలు వాని జీవితముగూర్చి.

ఎల్ల రిఁక వాఁడు బ్రతుకుట కల్ల యనిరి,
కాని వారలపలుకులే కల్ల లయ్యె;
ఏమిచిత్రమొ- ఇంతలో నీల్గె కుక్క,
ఉసురు దాలిచె వాఁ డెంత వినపువిత్తొ ?

# నేను నేను కాను

కేలఁ గోలయు, నెత్తిపై మీలబుట్ట
పెట్టుకొని యేగె సంతకు వృద్ధురాలు;
కొంతసేపటి కామెకు కునుకు రాఁగ,
ఒరిగె నాబాటుదరి నున్న తరువుక్రింద.

బండఁ డొక్కఁడు ముదుసలియందఁ జేరి
నున్నఁగా తలవెంట్రుక లన్ని గొఱిగి
మొగముమీఁదను, తలనిండ ముగ్గుపూసి
బొగ్గుపొడితోడ నెడనెడ బొట్లు పెట్టె.

దృష్టిపిడుతను బోలి వికృతము గొల్పు
యామెవదనంబు దిలకించి యక్కజమున
గుంపులుగఁ గూడి జను లెల్ల గొల్లు మంచు
కడుపు చెక్కలుగా నవ్వఁ గడఁగి రంత.

ఉలికిడికి నుల్కిపడి, తోనె మెలకువ గని,
తలయు మొగమును చేతులఁ దడవికొనుచు
తల్లడంబును చోద్యంబు మల్లడి గొన,
మదినిఁ దలపోసె నీరీతి ముదివెలంది:

“అమ్మ చెల్లరొ! యిది యేటి యబ్బురంబొ?
నేను నే నగుదునొ కానొ? నేన యైన
తోక యాడించు నాకుక్క, కాకయున్న
మొఱిగి నామీఁది కొకపెట్టు యుఱికి కఱచు.”

ఇట్లు చింతించి ముదుసలి యింటి కరిగె;
బొంయి బొం యని యాకుక్క బొబ్బరించె;
ఉలికిపడి యామె వెనుకకు నొదిఁగి యొదిఁగి
‘అక్కటా! నేను నేను కా’ నంచు నేడ్చె.

# పిల్లసిగ

సింహపురమునఁ గలఁ డొక్కసిద్ధవరుఁడు,
సోముఁ బోలిన నెమ్మొగముగోమువాఁడు;
వాని లావణ్యలక్ష్మికి వన్నె వెట్టె
వెనుక నల్లాడు నల్లారు పిల్లపిలక.

అతఁ డొకనాఁడు సిగ దువ్వి యద్దమందు
తనదురూపంబు గాంచి సంతసము నొంది
" అకట ! యీసిగ వెనుక వ్రేలాడుకంటె
ముందుగా నున్న నింకను మురువు గాదె ?"

అంచు నొక్కింతతడవు యోచించి యతఁడు
తుదకు నొక్క యుపాయంబు మదికిఁ దట్టి,
తన మొగంబు గిరుక్కున వెనుకఁ ద్రిప్పె;
పిలక యెప్పటియట్టుల వ్రేలె వెనుక.

మగుడ ముందున కాతండు మొగము ద్రిప్పె,
ముందువెనుకకు, వెనుకకు ముందు కిట్లు,
తేపతేపకు దిన మెల్లఁ ద్రిప్పెఁ గాని,
పిలక యెప్పటితీరున వ్రేలె వెనుక.

సారెసారెకు కుమ్మరిసారెరీతి
తలను గిరిగిర మంచు నాతండు ద్రిప్పె;
ఎన్నిసారులు ద్రిప్పిన యేనిఁ గాని,
పిలక యెప్పటిచొప్పున వ్రేలె వెనుక.

ఏటిచిత్రమొ కాని- ఆనాఁటఁగోలె
బొంగరమురీతి నాతనిబుఱ్ఱ తిరిగె;
ఎట్లు లేరీతి తిరిగిన యేనిఁగాని
పిలక యెప్పటిచొప్పున వ్రేలె వెనుక.

# చావుకబురు

ధనికుఁడగు నొక్కవణిజుని తనయుఁ డొకఁడు
చాలకాలము దూరదేశమున నుండ,
సేవకుఁడు వచ్చె నాతనిచెంత; కంత
జరిగె వారి కిరీతి సంభాషణంబు:
'ఏమిపని గల్గి వచ్చితి విచటి కిపుడు?'
'స్వామి! మిము జూచుకాంక్షచే వచ్చినాఁడ.'
'ఓరి! నాకుక్క బాగుగా నున్న దఁటర?'
'ఇంక మీకుక్క యెక్కడ?'
'ఏమి యయ్యె?'
'వెక్కసంబుగ మాంసంబు మెక్కి చచ్చె.'
'ఏమిమాంసము తిని చచ్చె?'
'ఏన్గుమాంస.'
'యేన్గుమాంసము దానికి నెట్లు దొరకె?'

' ఏమి చెప్పుదు ? మీపట్టపేన్గు చచ్చె.'

' పట్టపేనుంగె- చచ్చెనా ?- ఎట్టు చచ్చె ?'

' శక్తి మించినపని చేయ చచ్చుఁగాదె ?'

' ఏమిపని చేసె ?'

'దిన మెల్ల నేటినుండి

మోసికొని వచ్చె జలమును మోటబండ్ల.'

' బండ్లపై జల మేల కావలసివచ్చె ?'

' మంట లార్పఁగ.'

'ఎవరియి ల్లంటుకొనియె ?'

' ఎవ్వరిది కాదు మీయిల్లె.'

'ఎట్లు కాలె ?'

' కాఁగడా లంటి.'

'ఏటికి కాఁగడాలు ?'

' అక్కటా! ఎట్లు తెలుపుదు, అమ్మగారు

రాత్రివేళను కాలధర్మంబు నొందె.'

' సేవకా! ఏమి యంటివి, చెప్పు మయ్య

అమ్మ మృతి నొందెనా, ఏమివ్యాధిచేత ?'

'వ్యాధి యేమియు లేదు, దుర్వార మైన
పిడుగు బోలిన యవ్వార్త వినుటకతన.'
'ఏమిదుర్వార్త నాలించి యామె చచ్చె ?'
'అకట ! వచియింప నాకు నోరాద దయ్య !
దుర్భరం బగు మీతండ్రి దుర్మరణము
నాలకించినతోడనే యసువు బాసె.'
'ఏమి యంటివి ? సేవకా ! ఏమి యంటి
వమలచారిత్రుఁ డైన మాయయ్య యకట !
జీవముల నేల కోల్పోయె చెప్పు మయ్య.'
'దారుణం బగు నామాయదారివార్త
వినినయంతన గుండెలు వ్రీలి చచ్చె.'
'ఎట్టి దుర్వార్త విని తండ్రి గిట్టె చెప్పుమ.'
'భయద మైనట్టి పెద్దతుపానుచేత
ఉదధిలోపల నున్న మీయోడ తెల్ల
మునిగె ననువార్త విని-'
'కటా ! వినఁగఁ జాల
ఎట్టికష్టంబు లోకపెట్టఁ జుట్టుకొనియె ?

తొలుత నీ వార్త లెల్లను తెలుపకుండ
ఏల దాఁచితి సేవకా! యింతతడవు ?'

'ఘోర మగు నిట్టి వార్తల గుండె పగిలి
ప్రాణములు బోతు వనియెడు భయముచేత,
చల్లఁగా చెప్పవలయును చావుకబురు
అనుచు పెద్దలు చెప్పు వాక్యంబు తలఁచి,
ఒక్కసారిగఁ జెప్పక, యొకటివెనుక
నొకటి వినిపించితిని నీకు నోర్మి మీఱ.'

# బ్రాహ్మణుఁడు - వంటవాఁడు

బ్రాహ్మణుఁ డొకండు తనయింట వంటచేయ
వంటవానిని కుదిరించి, వాని కనియె:
"ముందు నీ తెల్వి యభివృద్ధి నొందుకొలఁది
వృద్ధి గావించుచుందు నీ వేతనంబు."

పోయెఁ గొంతకాలము; వంటపాటి కంత
బిలిచి వానికి రెండుకాసుల నొసంగి
"ఓయి! ఒక కాని మజ్జిగ, యొక్క కాని
నూనె తె" మ్మని నియమించి వానిఁ బంపె.

చిత్త మని యాతఁ డొకగిన్నె చేతఁ బట్టి
కొంతదనుక నేగి, యేదియో నందియంబు
మదిని దట్టు, గిరుక్కున మరలి, వేగ
నింటి కేతెంచి, విప్రున కిట్టు లనియె.

"నా కొసంగిన యీరెండుతూకలందు
నూనె దేనికి, మజ్జిగ దేని? కనుచు
నడుగ మఱచితి నంగడి కరుగునపుడు,
తెల్లముగ దేని కేదియొ తెలుపు మయ్య."

వాని తెలివికి నవ్వి యాబ్రాహ్మణుండు
కానులను రెండు వేర్వేరుగా నొనర్చి,
"దీనికి పెరుంగు, దీనికి నూనె తెమ్ము"
అనుచు వచియించి క్రమ్మఱఁ బనిచె నతని.

వల్లె యని పల్కి యాతండు గొల్లవాని
గృహమునకు నేగి, కానికి గిన్నెలోన
పెరుగు పోయించుకొని, యంత పెద్దసెట్టి
కడకుఁ జని నూనె యిమ్మని కాని యిచ్చె.

కాని గైకొని కోమటి నూనె తూఁచి
'ఎందుపోయుదు?' నన, నాతఁ 'డిందు బోయు'
మనుచు గిన్నెను బోర్లించి యడుగు చూప,
బొళుకు మని లోనిపెరు గెల్ల నొలికె నేల.

పెరుగు పడె నని యించుక యెఱుఁగ కతఁడు
'సెట్టి ! యింకను తడ వేల చేసెద ?' వన,
'సోద్దె మందుచు నుంటి నీబుద్ధి' కనుచు
నుడివి, యాసెట్టి మట్టులో నూనె పోసె.

వంటవాఁ డంత వెంటనే యింటికడకు
వచ్చి, 'పెరుఁగును నూనెయు తెచ్చితి' నని
నుడువ, 'పెరుఁ గేది ?' యని విప్రుఁ డడుగ 'ఇదిగొ'
యంచు నాతఁడు గిన్నె బోర్లించి చూపె.

మట్టులో నున్న చము రెల్ల మట్టిపాలు
గాఁగ, పెరుఁ గిట్టులే యయ్యెఁగాఁ దలంచి
వానిచేతకు నవ్వుచు బ్రాహ్మణుండు
'అవుర ! ఎంతటి నేర్పుకాఁడవుర ?' యనియె.

తోడనే వంటవాఁ డంత బాడబుండు
తనదు తెలివికి మెచ్చినాఁ డనుచు మదిని
వేడ్క జెందుచు, 'స్వామి ! నా వేతనంబు
వృద్ధి గావింపుఁ' డని వాని వేఁడికొనియె.

# యోగి - నాస్తికుఁడు

దారుణం బగు నొక్క కాంతారమందు
ఆశ్రమంబున నొకయోగి యధివసించె;
అతఁ డెప్పుడు తనపంక్తి నతిథి లేక
ఒక్కసారియు భుజియింపఁ డోగిరంబు.

అంత నొకనాఁటి మిట్టమధ్యాహ్న వేళ
బడుగుదేహము, వంగిననడుము గలిగి
తొంబదేడుల ముదుసలి తొక్కొకండు
అతనిగృహమున కేతెంచె నతిథి యగుచు.

అతనిరాకకు ముద మంది యతివరుండు
భక్తి మీఱఁగ పూజించి, వాని కనియె:
"స్నాన మొనరించి పిమ్మట సంధ్య వార్చి,
మిరువురము నంత భుజియింత మింపు దనర.

వృద్ధుఁ డీరీతి ననె తాను బౌద్ధుఁడగుట,
" ఈశ్వరుఁడె లేఁడు, నాకేల యింక సంధ్య ?
ఆఁకటను ప్రేగు నకనకలాడుచుండె
తడవు సేయక భోజన మిడఁగదయ్య."

" నాస్తికుం డగు వాని కన్నంబు నిడుట
కంటె వేఱొండు పాపంబు కలదె ?" యనుచు
కినుకచే వాని నవలికి గెంటివైచి
తాను నాపూట పస్తుండె తపసిఱేఁడు.

అతని కీశ్వరుఁ డంత ప్రత్యక్ష మగుచు,
వాని కిట్లనె "ఎట్టివాఁడైనఁ గాని
అతిథి యై వచ్చె నేనియు నన్న మిడక
తఱిమివైచుట ధర్మమే తాపసేంద్ర !

" వీనితో నీవు గడె యైన వేఁగలేక
గెంటితివి అన్న మొసఁగక యింటినుండి;
వీనిచేష్టల సహియించి వేఁగుచుంటి
తొంబదేడులనుండి తుందుడుకు పడక.

"మూఢుఁ డగు వీఁడు దేవుండు లేఁ డటంచు
పదరినంతనె లేకపోవుదునె నేను ?
ఇంతమాత్రన నీయట్టి శాంతిపరులు
అలుక బూన వివేకమే యతివరేణ్య ?

"ఆస్తికుం డయి నిర్దయుఁ డైనవాని
కంటె, నాస్తికుం డై దయ గల్గియున్న
వాని నెక్కుడు ప్రేమింతుఁ గాన, నీవు
భూతదయ గల్గి యుండుము బుద్ధి గలిగి.''

# మూఁడు ప్రశ్నలు

పాటలీపుత్ర మను నొక్క పట్టణమున
పరమనాస్తికుఁ డగు నొక్క ప్రభువు గలఁడు;
కొలువులో నాతఁ డొకనాఁడు కూరుచుండి
తనదుమంత్రిని పిలిపించి, అనియె నిట్లు:

"దీర్ఘకాలమునుండి బాధించుచుండె
సంశయంబులు మూఁడు నాస్వాంతమందు,
వాని నన్నిటిఁ దీర్చి సత్వరమె నన్ను
సదమలాత్మునిఁ జేయుమా సచివవర్య!

1. ఈశుఁ డొకచోట నుండిన; నెట్లతండు
నిఖిలజగములయం దెల్ల నిండియుండు?
2. ఆతఁ డొకవైపు చూచిన, అఖిలదిశలు
కలయ నొకసారి యేకరీతిఁ గాంచగలఁడు?

౩. ఇంక నొక ప్రశ్న యడిగెద - ఎట్లతండు
నీచు నుచ్చుని, ఉచ్చుని నీచునిఁగను,
సేవకుని రాజు, రాజును సేవకునిఁగను
చిత్రముగ నొక్కత్రుటిలోన చేయఁగలడు ?

పదిదినంబులు గడు విత్తు, ప్రశ్నములకు
నుత్తరంబుల నందాక నొసఁగవేని,
నీదుశిరమును ఖండింతు నిశ్చయముగ''
అనుచు వచియించె నాతండు వ్యగ్రుఁ డగుచు.

ప్రభుఁడు పలికిన యాఘోరవాక్యములకు
మాఱు మాటాడఁజాలక మంత్రివరుఁడు
చిత్తమున కొంత ధైర్యంబు చిక్కఁబట్టి
'సరియె' యని పల్కి, యింటికిఁ జనియె వేగ.

దీనుఁడై యున్న తన యజమానుఁ జూచి
చింత నొందుచు నాతని సేవకుండు
కారణ మెఱింగి మంత్రిని నూరడించి
గడువునాఁటికి నారాజుకడకుఁ జనియె.

చింకిగుడ్డలు, తలపైని వంకపాగ,
కేల గునుపులకఱ్ఱను లీలఁ దాల్చి
కన్టెదుట నున్న సేవకుఁ గాంచి రాజు
అచ్చెరువునొంది, 'నీ వేల వచ్చితి ?' వనె.

"భూవరా! నీయమాత్యుని సేవకుండ,
వ్యాధిచే నాదు నేలిక బాధపడుచు
లేవఁజాలక నన్నంప, దేవ! మీదు
ప్రశ్నముల కుత్తరము లీయ వచ్చినాఁడ."

సేవకుం డిట్లు వచియింప, భూవరుండు
పలికె, "ఎవరైన నేమి - నా ప్రశ్నములకు
ఉత్తరము చెప్పవలయు, లేకున్న నతఁడు
ఉసురు గోల్పోవ సిద్ధమై యుండవలయు."

అనుడు, నారాజుపల్కుల కనియె భటుఁడు:
"ఉత్తరము చెప్పుటకు పూర్వ మొక్కమాట
విన్నవించెద, నది విన్నపిదప, మీదు
చిత్తమునకు నచ్చినట్టులు చేయవచ్చు.

ధర్మములు నేను బోధించుతరిని, మీకు
గురుఁడ నగుదును కావున ధరణినాథ!
అంతతడవును నే నున్నతాసనమున
నుండ, నేలపై మీరు కూర్చుండవలయు."

భటునివాక్యము లాలించి, వల్లె యంచు
అధిపుఁ డాతని తనదు సింహాసనంబు
మీఁద కూర్చుండఁగా నియమించి, తాను
క్రింద కూర్చుండె, సభ్యులు ఱిచ్చవడఁగ.

ఠీవిగా నట్లు కూర్చుండి సేవకుండు
భటు నొకని పిల్చి, యొక గాజుపాత్రలోన
పాలు పోయించి, "అయ్య! ఈపాలయందు
వెన్న యున్నదఁ?" అనుచు భూవిభుని నడిగె.

'ఉన్న' దని రాజు వచియించి మిన్నకుండె;
'ఎచట నున్నది?' యని తోనె, భృత్యుఁ డడిగె;
'అంతటను నిండియున్నది' యనుచు తేఁడు
బదులు పలుకఁగ, నీరీతిఁ బలికె భటుఁడు.

1. "వినుము భూవర ! పాలలో నణఁగియుండి
వెన్న యంతట నిండారియున్నయట్లు,
ఈశుఁ డొకచోట నుండియు నెల్లయెడల
నిండి నిబిడీకృతుఁ డయి యుండుఁ జూవె."

దివ్వె వెలిఁగించి భటుఁ డంత, 'దీని కాంతి
అధిప ! ఏదెస నున్నది ?' యనుచు నడిగె;
'అన్ని దిక్కుల వెలుఁగుచునున్న' దనుచు
వాఁడు బదులిడె, భృత్యుఁ డీరీతి ననియె.

2. "దివ్వె యొకచోట నుండియు, దిశల నెల్ల,
నిండుకాంతిఁ బ్రకాశించుచుండురీతి,
ఈశుఁ డొకవైపు చూచియు, నెల్లదెసల
నొక్కసారిగఁ జూచుచునుండు వాఁడ !"

అనుచు క్రమ్మఱ ధరణినాయకుని జూచి
'ఇప్పు డే నెట నుంటినో చెప్పుఁ' డనుచు
నతఁడు ప్రశ్నింప, 'నాదుసింహాసనంబు
నందు కూర్చుంటి' వని చెప్పె నవనివిభుఁడు.

వికటముగ నవ్వి. తోడనే భృత్యుఁ డనియె;
'అహహ! దేవర యెంత మాటాడినారు!
మీరలో ?-' 'నేను నేలపైఁ గూరుచుంటి'
ననుచు బదులిడె గొణుగుచు మనుజవిభుఁడు.

3. "నీచు నుచ్చుని, ఉచ్చుని నీచునిఁగను,
సేవకుని రాజు, రాజును సేవకునిఁగ
చిటికలో తాఱుమాఱుగ చేయుచుండు
చిత్రముగ దేవుఁ, డిదె వానిసృష్టిమహిమ."

అనుచు వచియించి, భటుఁడు సింహాసనంబు
తోడనే డిగ్గి కేల్దోయి దోయిలించి,
"ప్రభువతంసమ! మీ మూఁడు ప్రశ్నములకు
నుత్తరంబులు చెప్పితి యుక్తి మెఱయ;

శిరము తఱిఁగింతురో, లేక శిరమునిండ
గుమ్మరింతురో ధనరాశి కూర్మి మీఱ?
నాథ! మీచిత్త, మవ్వాల నాదుభాగ్య
మెట్టులున్నదో యట్లు చేయింపు డయ్య."

అనుచు వచియింప, నాతనియాత్మబుద్ధి
చాతురికి రాజు తద్దయు సంతసించి,
చాల సమ్మానములఁ జేసి సత్కరించి
వాని నాస్థానపండితుఁగా నొనర్చె.

౪౨

# కోఁతులు

ఊరము క్రింది కిశోరంబు లూఁగియాడ,
తరువుపైనుండి వేఱొక్క తరువుపైకి
లీలఁ గుప్పించి, పండ్లికిలించికొంచు,
ముక్కు నులుముచు, వింతగా బొమలు త్రిప్పి,
ఎక్కసక్కెము లాడుచు వెక్కిరించి
కనులు చికిలించి కిచకిచ మనుచుఁ గూసి,
కొమ్మ నొకచేతితోఁ బట్టుకొనుచు వ్రేలి
యూఁగులాడుచు, నొకచేత నొడలు బఱికి,
గోట నిఱికినపేలను నోట నిడుచు,
ఇలకు లంఘించి కుప్పిగంతులను వైచి,
వాలములఁ ద్రిప్పికొంచును వానరములు
వికృతచేష్టలఁ జేయుచు వెలయుచుండె.

# పచ్చిబాలెంత

తలఁగ విరు లింగ, గారియు చలి విఱుఁగదు,

బాటు చిత్తడి, పొల మొక్క పరువునేల,

పురిటివరుసను మార్చ్నెళ్లు వోసికొనవు,

విడవు తలకొంగు, పత్తెపుపిడుచ దినవు,

గనిమపై ఈతపొదనీడ, జినుఁగుబొంత

పఱచి పాలిచ్చి నినుఁగును పండఁబెట్టి

పదము పాడుచు జోకొట్టి నిదురవుచ్చి,

బురదమళ్లను వరియూడుపులకు దిగుదు;

వెంత మొఱకవె పచ్చిబాలెంత వయ్యు!

కూలిగింజల కింత కక్కుఱితి యేల?

పేదరిక మెంత తెగువ నేర్పెనో గదమ్మ!

# బిచ్చకత్తె

కాఁపురము చెట్టునీడ, మగండు రోగి,

పాలు చేపమిఁ బోరిడు పాప చంక,

కూటికై యెదపిల్లలగొల్లు వెంట,

నెత్తిపై, ప్రొద్దు నడువీథి, ఉత్తజోల,

పస్తు, ప్రేఁకటి, సాగదు బాట- దవ్వు,

వాడవాడల కసరులు, వేడియూర్పు,

బుజ్జగింపుల బుడుతలబొజ్జ నింతు,

వాకులత జూప, వింత చిరాకుపడవు,

ఈసడింపవు, విసువవు, వేసటఁగొన

వకట ! మనుగడ లేబర్వ మైనఁ గాని;

పేదఱిక మెంత యోర్పు నేర్పినదె తల్లి !

# చిన్ని పువ్వా

ఏల పూచితి వో చిన్ని నీలిపువ్వ !
ప్రజలు నడయాడు పచ్చికబయలి నడుమ ?
మనుజు లెవ రైన నాదారి మసలి రేని
వారి యడుగులఁ బడి నల్గి వాడిపోవె ?

శిరము నేటికి వంచెదే చిన్నిపువ్వ !
పరుల దృష్టిపథంబునఁ బడకయుండ ?
ఇంచు కొకసారి నెమ్మోము నెత్తి తేని
జనులు తమ కన్నుఁగవ నద్దుకొనరె నిన్ను ?

నీకు పే రేమి లేకున్న నీలిపువ్వ !
సౌకుమార్యమునందును, సౌరభమున,
సోయగంబున నీ సాటి సుమములందు
కొంచె మేనియుఁ గలిగెనే కొఱఁత నీకు ?

వన్నె చిన్నెలు గల పువ్వు లెన్ని యున్న
నిన్నె ప్రేమింతు మనసార చిన్నిపువ్వ!
నీ నిరాడంబర వివిక్త నిష్కళంక
జీవనంబును నలవడఁ జేసికొనఁగ.

ఒరుల మెప్పుల నాసింప నొల్ల వెపుడు,
తళుకుబెళుకుల వాంఛింపఁ దలఁప వీవు;
పావనంబగు తావక జీవనంబు
గడియ యైనను ధన్యంబు గాదె పువ్వ!



# పసి పాప

ప్రియము గూర్తురు, కూర్ప రప్రియము నెపుడు
మోదమే కాని ఖేదంబుఁ బొరయనీరు;
పెద్దవారలకంటెను పిన్నవారె
కొల్లగొందురు పితరుల యుల్లములను.

తల్లిదండ్రులు కినుకచేఁ దన్ను గొట్టఁ
దన శిరంబును వారి యక్కున గదించి
జాలి పుట్టఁగ నేడ్చెడు బాలుఁ జూడ
ఉల్ల మెవ్వరి కైన రంజిల్ల కున్నె?

ఇంతలో నవ్వు, నేడుచు నంతలోనె,
ఇంతలో వేఁడు, బెదరించు నంతలోనె,
ఇంతలో నల్గు, మనసిచ్చు నంతలోనె;
చిత్రములు గావె పసిపాప చేష్ట లౌర!

వింతవస్తువో తాయమో వెంత నిడిన
యంత, కనకాభిషేకంబు నందినట్లు
పొంగి గంతులు వైచును నింగి ముట్టు;
అల్పసంతోషి కాఁ డఁటే యర్భకుండు?

పువ్వుఁదేనెయు తావియు పుప్పొడియును
చిందకున్నను చెడకున్న చెదరకున్న,
ముద్దుబిడ్డల నవ్వుతోఁ బోల్పవచ్చు
క్రొత్తఁకా విచ్చు పున్నాగ గుచ్ఛకంబు.

కన్నె వెన్నెలకన్నను, వెన్న కన్న,
మంచుబిందులకన్న, క్రొమ్మించుకన్న,
కుసుమమకరందమునకన్న కోమలంబు
చిఱుతపాపల చిన్నారి చిన్ని నగవు.

నల్లనివి యెల్ల నీళ్లును, తెల్ల వెల్ల
పాల టంచును సూటిగా, బలుకుచుండు,
కల్లకపటంబు లెఱుఁగఁడు పిల్లవాఁడు;
బిడ్డఁ డన దేవుఁడన వేఱె భేద మున్నె?

ఆడు, నేడుచు, పలవించు, పాడు, సోలు,
తేఱిపాఱఁగఁ దిలకించు, తేరు, నవ్వు,
గొణుఁగుఁ దనలోన, వేదురు గొన్నభంగి
నుండు; పసిపాప కేవల యోగి కాఁడె!

తీవి బొటవ్రేలె పిల్లనగ్రోవి గాఁగ
మోవిఁ గీలించి, యెల్లరు మోహజలధి
నోలలాడఁగ కలరవ మాలపించు
ముద్దుబిడ్డఁడు గోపాలమూర్తి కాఁడె?

తనదు నవ్యాత్త మధుర గీతంబులకును
కాలుసేతుల యల్లార్పు తాళములుగ,
వెలికిలఁ బరుండి క్రీడించు బిడ్డ డెన్న
లోకకళ్యాణమునకు మాఱాకు గాఁడె?

వెండిపళ్లెరమునయందు వెలుఁగుచున్న
కప్పురపుదీపమో యన నొప్పు మీఱు
తెలుఁగు వెల్లని దుప్పటి సెజ్జమీఁద
తీవిఁ గూర్చుండి క్రీడించు డింభకుండు.

# ఎట్లు వచ్చితి?

"ఎట్లు వచ్చితి? నన్ను నీ వెచటినుండి
తెచ్చికొంటివి? అమ్మరో! తెలుపు" మనుచు
పలుకుపలుకున తేనియ లొలుకుచుండ
అడిగె నొకనాఁడు తనతల్లి ననుఁగుబిడ్డ.

కనుల నానందబాష్పముల్ తొనఁకియాడ
చిన్నిబాలుని నక్కునఁ జేర్చి తల్లి
మోవి మోవిని గదియించి ముద్దుగొనుచు
ఇట్లు వచియించె మక్కువ యుబ్బిపడఁగ.

"నాదు వలపుల మొలకవై, నా తలంపు
పంటవై, నా తపంబుల ఫలమ వగుచు
దాఁగియుంటివి నాదు డెందంబునందు
ఇన్నినాళ్లును నా ముద్దు చిన్నికూన!"

చిన్నతనమున కూర్మి నెచ్చెలులఁ గూడి
మంటిముద్దల చిన్ని బొమ్మలను జేసి
వేడుకలు మీఱ నే నాట లాడునపుడు
బొమ్మలను దాఁగి యుంటివి ముద్దుబిడ్డ!

అనుపమం బగు భక్తి నే ననుదినంబు
ఎలమి గృహదేవతల పూజ సలుపువేళ,
దేవతలలోన నీవు మూర్తీభవించి
నిలిచియుంటివి నాదు మందిరమునందు

యౌవనం బను తొలకరి యంకురించి
మవ్వ మగు నా మనం బను పువ్వుగుత్తి
విరిసి యల్లన తేకులు విచ్చునపుడు,
అంటియుంటివి తావివై యందు బిడ్డ!

నాదు జీవితమునయందు, నీదు కూర్మి
తండ్రి జీవితమున, వాని తల్లిదండ్రి
జీవితంబుల వేయేల — సృష్టి మొదలు
నిలిచియుంటివి యీ యుంట నేఁటిదనుక.

ఆ యనంత తేజోరాశి నవతరించి
విశ్వజీవన పావనీవీచిఁ దేలి
నాదు మానస సింహాసనమున నేఁడు
కట్టికొంటివి పట్టంబు పుట్టుదకు

భువనమోహన మైన నీ మూర్తి నేను
కనులపండువుగాఁ జూడఁగాంచునపుడు,
నిలువునను నాదు మే నెల్ల పులకరింప
అట్టె ప్రమాస్పది నిలుతు నీ యెట్టయెదుట.

ముద్దు లొలికెడు నీదు నెమ్మోముదమ్మి
కాంతి చిఱ నెగాదిగఁ గాంచునెడల
దృష్టి తాఁకెడినో యంచు దిగులు చెంది
తేఱిపాఱఁగఁ బరికింప నేర నెపుడు.

ఎన్నఁ డైనను నను నీవు కన్ను మొఱఁగి
జాఱఁగిపోదువో గికురించి యనెడు భీతి
మంజులం బగు నా బాహుపంజరమున
పట్టి బంధించితు మంతు నో చిట్టిపట్టి!"

# ఏల యేడ్చుచునుంటివి ?

చిన్ని కన్గవ ముత్తెంపుచిప్పలందు
జాతి కన్నీటిముత్తెముల్ జాలువాఱ,
ఏల యేడ్చుచునుంటి వో బాలపాప ?
చెనకి నిను గొట్ట నెవనికి చేతులాడె ?

చిట్టిచేతుల సొరె కట్టిట్టు త్రిప్పి
నేలపై నీవు పొరలాడ, ధూళి యంటి
ముటువు గులికెడు నీ మోము మురికివాఱె
ననుచు కొట్టిరె యెవ రైన ననుఁగుబిడ్డ ?

చలువవెన్నెల తెల్లెడ చిలుకరించి
ఎల్లజీవులఁ గడు నుల్లసిల్లఁజేయు
చందురునియందు నొక్కింత కందు గలుగ,
తక్కు వయ్యెనె యాతని చక్కఁదనము ?

గల్లు గల్లున చిఱుగజ్జె లల్లలాడ
అల్లనల్లన మెల్లఁగ నడుగు లిడుచు
చింకిచొక్కాఁయితో నీవు చిందులాడ,
కొట్టిరే నిన్ను నెవ రైన చిట్టిబిడ్డ ?

విన్ను వీధిని జాబిల్లి వెడలువేళ
చివికి శిథిలమై యెడనెడ చెదరియున్న
సన్న తొలకరిమబ్బులు తన్ను గప్ప
కొఱఁతవడియెనె యాతని కొమరుఁదనము ?



# ఏల నవ్వుచునుంటివి ?

చేల నొకతేల విఱిగిన కోలఁ బట్టి
హాయలు మిఱఁగ పచ్చికబయలుమీఁద
ఓహో ! ఎంత హాయిగ నాడుచుంటి వోయి ?
ముచ్చటగుఁ గాదె నిను జూడ ముద్దుబిడ్డ !

సంతసంబున త్రుళ్లుచు, గంతు లిడుచు,
పరుగు లెత్తుచు, పాడుచు, తెరలి తెరలి
ఏల నవ్వుచునుంటి వో బాలపాప ?
కనులపండువ యగుఁ గాదె నిను గనంగ.

చేతి కందిన వస్తువుల్ ప్రీతిఁ గొనుచు
వేడుకలు మీఱ నీ వాట లాడుచుండ,
అందఁజాలని వస్తువు లాసఁ జేసి
వెచ్చనూర్పుచు నే ప్రొద్దు పుచ్చుచుండు.

చలువవెన్నెలగుత్తితో, సంజతోడ
హాయి మీఱఁగ నీ పాట లాడుచుండ,
వెండి బంగరురూకల పిండు పేర్చి
తనివి నొందని యాసలఁ దవిలియుండు.

అందరాని ఫలంబుల కళ్లు సాఁచి
పొందనేరని పదవులఁ బొందఁ గోరి
చేయరానట్టి పను లెన్నొ చేసి చేసి
గడుపుచుందును రిత్తఁగా కాల మెల్ల.

ఆస లనియెడు సాగరమందు నీది
మునిఁగి తేలుచు, తేలుచు మునిఁగి నేను
జడుఁడనై జీవయాత్రను గడపుచుండ,
నవ్వుచుంటివి తాఁవోలు నన్నుఁ జూచి.



# కేసబియాంక

గుప్పు మని మండు నోడపై కప్పుమీఁద
నిట్టనిలుచుండె బాలుండు నిబ్బరముగ,
తనదు జనకుని యానతిఁ దలను దాల్చి ;
పఱచి రెల్లరు నాతఁ డొక్కరుఁడు దక్క-

సంజకెంజాయనడుమ భాస్కరుఁడు వోలె,
దట్టముగ మండు మంటల నట్టనడుమ
విమలకాంతుల బాలుండు వెలుఁగుచుండె,
వీరరస మౌర ! మూర్తిభవించె ననఁగ

ఉజ్జ్వలంబుగ జ్వాలలు ప్రజ్వరిల్లె
కాని, యా బాలుఁ డొక్కింత కదలఁడయ్యె
తండ్రియానతి భక్తిమై దలను దాల్చి;
బళిర ! ఎంతటి ధీరుండో బాలకుండు ?

'చెప్పుమా తండ్రి ? నే నింక నిప్పుడైన
ఆవలి తేగుదునే' యంచు నఱచె నతఁడు,
ఎఱుఁగఁ డక్కట ! తన తండ్రి యింతమున్నె
అగ్నిహోత్రుని కాహుతి యయ్యె నంచు.

భీకర కరాళ సర్పజిహ్వికల భాతి
బుస్సు బుస్సని చిచ్చులు బుగులుకొనియె;
విలయకాలము శాసించు విభునిఁ బోలె
నిర్భయంబుగ నిలుచుండె నర్భకుండు.

వేడ్కమై మృత్యుదేవిని పెండ్లియాడ
తమక మొందెడు పెండిలికొమరుఁ డనఁగ,
ఠీవి మీఱగ నిలుచుండె డింభకుండు
వీర శృంగారరసములు పెనఁగులాడ.

'ఏల పలుకవు ? నా పని యిప్పుడైన
అయ్యెనే ?' యని క్రమ్మఱ నఱచె నతఁడు;
వాని పలుకులు చిటపెటార్భటులనడుమ
నడగెఁ యవలికి వెలివడ వయ్యె నకట !

పాదముల నో(కి యూరులపైకి( బ్రాకి,
కౌనున( బెనంగి(, కంఠంబు కౌ(గిలించి,
చిట్టిచుబుకంబు చుంబించె; ఎట్టితీపొ
వీతిహోత్రుని కా ముద్దుబిడ్డమీ(ద?

జ్వలన మొందెడు వహ్ని కాజ్వాలలపయి
అతని జీరాడు కురులు నాట్యంబు సలిపె,
విరియ(బూచిన మందారతరువుమీ(ద
వాళిమై మూ(గు తుమ్మెదపాళి యన(గ

మరల గొంతెత్తి కడసారి యఱచె నత(డు
'నిలుతునే యింక? నీయాజ్ఞ తెలుపు మయ్య'
జాలి గుల్కెడి యా పల్కు లాలకించి
కొందలము జెంది జలనిధి ఘోషవెట్టె.

అంతకంతకు పెనుమంట లగ్గలించి
గుప్పుగుప్పున కుప్పించి యుప్పరమున
కెగసి, యట్టిట్టు గాలిలో నెగురుచున్న
ధ్వజముమీ(దికి దండెత్తి దాడి సలిపె.

అక్కటా ! ఏమి చెప్పుదు ?- నంతలోనె
భెడిద మగు భీషణధ్వని పిడుగు వోలె
ఉదధిమధ్యమునందుండి యుద్భవించి
బోరుకలఁగెను దిక్కులు మాఱుమ్రోఁగ.

ఫెళ్లుమని యంత నా నావ బ్రద్దలగుచు
చావకొయ్యయు, చుక్కాని, చాపతోడ
చిదుర చిదురలై జలధివీచికలఁ దేలె
అక్కటా ! ఎందు నున్నాఁడొ యనుఁగుబిడ్డ ?

కడలికడుపున నడఁగెనో ? గాలిలోన
లీన మయ్యెనో ? బాలుండు కానరాఁడు;
మిణుఁగురులఁ బోలె ధగధగ మింట మెఱయు
అగ్నికణముల నడుగుఁడీ యతనిజాడ.

దారుణం బగు నానాఁడు తరణియందు
మ్రంది రెందరో మనుజులు మంట మ్రగ్గి ;
నిలిచెనే వారి నామములో నేఁటిదనుక
ధీరుఁ డగు బాలుఁ డీతని పేరు దక్క ?

# బాలవీరుఁడు

చిట్టిచీమయు చొరరాని దట్టమైన
నట్టడవి, నొక్కదినమున, నడికిరేయి,
నొంటిమై నేగుచుండెను యోధుఁ డొకఁడు
పదియు నెనిమిదియేఁడుల పడుచు వాఁడు.

భీకరం బగు నా ఘోరవిపినసీమ
నిండు వెన్నెలతీఁగలు నిగుడ వయ్యె
చుక్కగుంపుల మిసమిసల్ చొరఁగరావు
హొటకరించిన కటికిచీఁకటులె కాని.

చిమ్మచీఁకటియే తన చెలిమికాఁడు,
తోర మగు ధైర్యసంపద తోడునీడ,
స్వామిభక్తియె రమ్యభూషణము గాఁగ
ఎటకొ చనుచుండె యోధుఁ డా కటికిరేయి

అధిపునానతి తలఁ దాల్చి యాతఁ డపుడు
అరులజాడల నరయంగ నరుగుచుండె,
ఎక్కడే చీమ యింత చిటుక్కు మన్న
వేయికన్నుల గనిపెట్టి వెదకుచుండె.

'మూఁడుజాముల రాతిరి ముగిసె నిపుడు
ఎట్టి యలికిడి వినఁబడ దింతదనుక ;
జరిగెనా రాత్రి, సిద్ధంబు జయ' మటంచు
మోద మందుచు నాతఁడు మురియుచుండె.

ముగిసె రాతిరి, కానయు ముగియవచ్చె,
కూఁతవేటునఁ గన్పట్టె కోటబురుజు,
మింట నరుణంపుఛాయలు మినిమిపెట్టె,
కూసె తొలికోడి కొక్కొరో కో యటంచు.

మించి దినరాజు రేరాజుమీఁది కెత్తి
పగతుజాడల నరయంగఁ బంప, వేఁగ
వేఁగుజామున దూతయై వేఁగు నెఱప
నేఁగుదెంచెనో యనం దోఁచె వేఁగుచుక్క.

ఆ ప్రశాంత విశాంతమునందు, వాని
యుల్ల ముప్విళులూరించు నూహ లెవియొ ?
తనదు జనకుని చిఱునవ్వొ, అనుఁగుజనని
కౌఁగిలింతయొ, ప్రభుని క్రేఁగంటిచూపొ ?

గౌతమీ పూతసలిలావగాహనంబొ ?
విమల కృష్ణాసరిత్తీర విహరణంబొ ?
కేళికోద్యానవనతటీ క్రీడనంబొ ?
ఏమి తల పోయుచుండెనో యెవని కెఱుక ?

ఉన్నయటు లుండి, అక్కటా ! యోధుఁ డట్టె
నిట్టనిలువున గ్రాన్పడి నిలిచె నేమి ?
పొదలమాటున నడుగు చప్పుడుల వినెన ?
దవుల నెవ్వియొ గుసగుసధ్వనుల వినెన ?

అడుగుసడి గాదు, పెనుగాలి యగ్గలించి
గుమురులై యున్న యాకుజొంపములు వీవ
అటమటించెడు రెమ్మల తటపట లవి ;
గుసగుసలు గావు, పాముల బుసబుస లవి.

అదిగో ! అది యేమి ! ఎవ్వఁడో పొదలనుండి
దొంగ కాఁబోలు - మెల్లఁగా తొంగి చూచి
చెంగు మని యొక్కగంతున చెంగలించి
పెఱికె ఖడ్గంబు బాలుని కరమునుండి,

ఒక్కరుఁడు కాదు - పదుగురు - పెక్కు రగుచు
పుడమి యీనినచందాన పొదలనుండి
ఒక్కరొకరుగ నాతనిచక్కి కుఱికి
చుట్టుముట్టిరి యీఁగలతుట్టెలట్టు.

బాలుఁడా ! నీదు కోర్కెలు భగ్నమయ్యె,
నిన్ను జయలక్ష్మి వరియింప నున్నతఱిని
చిక్కువడితివి పగతురచేతఁ దక్కు
చీమగమిచేతఁ జిక్కిన చిలువవోలె.

'మిన్నకుంటివ సరె, నోరు మెదపితేని
నిశితకరవాలధారల నీ శిరంబు
చెండు మీటినగతి చించి చెండువార'
మనుచు బాలుని గద్దించి రరులు గదిసి.

విచ్చుకత్తులు చుట్టును వీఁగియాడ
బాలవీరుని వదనబింబంబు వెలసె,
వేయికరములనడుమను వెలుఁగుచున్న
చండమార్తాండబింబంబు చందమునను.

మరణదేవతా వదనగహ్వరమునందు
కొమరు మీఱఁగ బాలుండు కొలువుదీర్చి
'దండు విడిసెను రిపుసేన, లెండు రండు'
అనుచు నెలుఁగెత్తి చీరెను తనబలంబు.

శంఖరవములు, నడుగుల చప్పుడులును,
సింహనాదంబులును వాని చెవులఁ బడియె;
'పొండు, రిపుసేనలను దాఁకి పొడువుఁ' డనెడి
అట్టహాసంబు లోకపెట్టు ముట్టె మిన్ను.

తళుకుకత్తుల మెఱపులు తాండవింప
వాని నెమ్మేన నెత్తురువాన కురిసె,
ఘూరి గర్జారవంబున వీరుఁ డఱచె
'దండు విడిసెను రిపుసేన, లెం' డటంచు.

పుష్పితాశోకవృక్షంబు పొలుపు గులుక
చిలుతఁ డొకచేత సేనలఁ జేయి వీచి,
ఎత్తి యొకచేత శంఖంబు నొత్తి యూఁదె
ప్రాణవాయువు కంఠంబు బాయుదనుక.

*　　　　*　　　　*

ఉభయదళములు తలఁపడె నొక్కపెట్టు,
తెల్లవాఱెను, రిపుమోము వెల్లఁబాఱె;
గెలుపు గలిగియు ఱేనికిఁ గలుగ దయ్యె
నిండుమోదము బాలవీరుండు లేమి.



# సత్యకాముఁడు

క్రుంకె తపనుండు, పక్షులు గూండ్లు సేరె,
ఆలకదుపులఁ జయ్యన తోలికొనుచు
ఆశ్రమమునకు మునిబాలు రరుగుదెంచి
చేరియుండిరి బారులై చెట్టునీడ.

అది మహాముని గౌతము నాశ్రమంబు;
శిష్యు లెల్లను తనచుట్టు చేరి కొలువ,
వీతిహోత్రము పొంత నా గౌతముండు
ఆలరుచుండెను రెండవయగ్నివోలె

అంత నొక వింతబాలకుఁ డరుగుదెంచి
ఫలము పుష్పము లర్పించి, భక్తిమీఱ
మౌనిపదములపైఁ దనమౌళి సోఁక
మ్రొక్కి యీరీతి వచియించె ముద్దులొలుక.

"సత్యకాముఁడు నాపేరు, జబల తల్లి,
బ్రహ్మవిజ్ఞానమును నేర్వ వచ్చినాఁడ:
నీదు పాదరాజీవసన్నిధిని జేర్చి
శిష్యునిఁగ నన్ను ధన్యాత్ముఁ జేయు మయ్య.

స్వచ్ఛ మగు బ్రహ్మతేజము వదనమందు
ఉట్టిపడ, నెట్టయెదుటను నిట్టనిలిచి
యున్న బాలుని బొడఁగని యోగివరుఁడు
పలికె నీరీతి కూరిమి మొలకలెత్త.

"ఈశ్వరుఁడు నీకు శుభముల నిచ్చుఁ గాక!
ఏ కులము నీది? నీ తండ్రి యెవఁడు వత్స?
బ్రహ్మవిజ్ఞానమును నేర్వ బ్రాహ్మణుండు
గాక యన్యుఁడు యోగ్యుండు గాఁడు సుమ్ము.

"తల్లినే కాని కూర్మితండ్రి యెవఁడొ
యింతకాలమువఱకు నే నెఱుఁగ నయ్య,
అమ్మకడ కేగి కులము గోత్రమ్ము నడిగి
తెలిసికొని వత్తు పంపుమా సెల వొసంగి."

బాలుఁ డీరీతి నొయ్యన బదులు పలికి
మునిని వీడ్కొని, మింటిపై మినుకు మనుచు
మెరయు చుక్కల గుంపులే తెరువు సూప
ఏటిదరి నేగి తన తల్లియిల్లు చేరె

తనయు రాక నిరీక్షించి తమక మొప్ప
తలుపుచెంగట నిలుచున్న తల్లి యతని
గాంచినంతనె బాళిమై కౌఁగిలించి
శిరము మూర్కొని యిట్లనె పెరిమ గులుక.

“కాంచితివె యోగిసత్తము గాంచ దీవు?
ఆదరించెనె దయతోడ నతఁడు నిన్ను?
యతివరేణ్యుఁడు నీ కేమి యానతిచ్చె?
చెప్పుమా యేమి జరగెనో చిట్టిపట్టి?”

“కాంచ కడలొత్త మునివరుఁ గాంచినాడ,
అతిదయతోడనన్నతఁ డాదరించె,
బ్రాహ్మణుఁడు తక్క యన్యుడు బ్రహ్మతత్వ
మరయరా దని మౌనీంద్రుఁ డానతిచ్చె.

"అమ్మ ! ఎన్నియోసార్లు నిన్నడుగఁ దలఁచి
నుడువఁ దలఁకితి నీ మది నొచ్చు ననుచు;
ఎవఁడు నా తండ్రి ? ఆతని దేమి కులము ?
నుడువుమా" యని మెల్లన నడిగె నతఁడు.

సిగ్గుచే నంత నేలకు శిరము వంచి
ఉస్సు రని యామె వేడినిట్టూర్పు పుచ్చి
గద్గదిక తొట్రుపాటును కదలుకొనఁగ
పలికె నీరీతి సన్ననియెలుఁగుతోడ.

"పేదనై జవ్వనంబున పెండ్లి లేక
పెక్కుపతుల సేవించితి స్వేచ్ఛ మీఱ;
పొడమితివి నాఁడు నీవు నా కడుపునందు
ఎట్లు వచియింతు నీ తండ్రి యెవఁడొ కుఱ్ఱ !"

* * *

సంజకడ లేచి శిష్యులు స్నానమాడి
చదువుచుండిరి గురునొద్ద శాస్త్రములను;
బాలుఁ డంతట చనుదెంచి కేలు మోడ్చి
మౌనిపాదాబ్జములకు నమస్కరించె

"నీదు కుల మేది ! ఎవ్వఁడు నీదు తండ్రి ?
నుడువుమా వత్స ! యని బాలు నడిగె మౌని;
జాలి గులుకంగ వినిపించె బాలుఁ డంత
తల్లి తనతోడ చెప్పిన దెల్ల మునికి

"సిగ్గు నెగ్గును విడిచి యీ చెడిపెకొడుకు
ఎట్టి సాహసమున కొడిగట్టె నౌర !"
అనుచు వడుగులు గుసగుసలాడికొనుచు
చులుకుచూపుల నతనిపైఁ బఱపి రంత.

కనుల నానందబాష్పముల్ తొనకియాడ
దిగ్గు రని లేచి బాలుని బిగ్గఁ బొదివి
కౌఁగిట గదించి మౌని గద్గదిక గమర
ఇట్లు వచియించె మక్కువ యుట్టిపడఁగ.

"తల్లిగుట్టైన నించుక దాఁచకుండ
సత్యము వచించితివి గాన 'సత్యకాము'
డనెడు నీ పేరు సార్థక మయ్యె వత్స !
నిక్క మగు బ్రాహ్మణుండవు నీవ కావె ?"



# ఏడుగురము

ఏమి యెఱుఁగని యొక యమాయికపు బిడ్డ
తన్ను లైనను తెలుపని చిన్నిదాన
చెక్కు గిలిన పొల్గాలు చిలుతపాప
ఎఱుఁగునే యది యెట్టిదో మరణ మన్న !

కంటి నొకబాల మార్గంబు వెంటఁ జనుచు ;
ఆమె యాఱేండ్ల తేతపాయంపు పూప,
పల్లెలో పుట్టి పెరిగిన పిల్ల యగుట
అన్నెమును పున్నె మెఱుఁగని యట్టి బేల

నిగనిగలు దేఱు ముంగురుల్ నెఱులు దిరిగి
ఆమె మొగమున దోబూచు లాడుచుండె,
తేటకన్నులు ముద్దులు మూట గట్టె
ఆమె యందము నన్ను మోదాబ్ధి దేల్చె.

'అమ్మ ! నీ నామ మెవ ? రని యడిగియుంటి,
'సరళ' యని యామె బదులిడె; 'సదన మెచట
నున్న ?' దని యంటి. 'నెదుటనే యున్న' దనియె
పలుకుపలుకున తేనియ లొలుకుచుండ.

'చిన్ని బాలరో ! నీకెంద రన్నదమ్ము
లక్కచెల్లెండ్రు గల ?' రని యడిగియుంటి,
'ఎందరో యేల- నాతోడ నేడ్గు' రంచు
పలికె నను జూచి యబ్బురపాటు నొంది.

'చిన్నికన్నెరో ! వారెందు నున్నవారు ?'
ఇట్టు లనె నామె, 'మే మంద రేడుగురము,
అన్న లిరువురు పొరుగూర నున్న వారు,
ఇరువురక్కలు పతులిండ్ల కేగినారు.

మఱియు నిరువురు కలరు సమాధులందు
అక్క యొక్కతె, సోదరుం డొక్కరుండును;
వారిచెంతనె యీ పుష్పవనమునందు
ఇంటిలో నేను తల్లితో నుంటి నయ్య.'

—౨౫—

"అన్న లిరువురు పొరుగూర నున్నవారు,
ఇరువురక్కలు పతులిండ్ల కేగినారు;
ఇంటిలో నుంటి నే' నని యంటి వమ్మ.
ఏడ్గు రెట్లైరి? నీ మాట లెట్లు పొసఁగు?"

తరవుకొనకుండ నా బాల నుడివె నిట్లు,
'ఏడ్గురము మేము, చెప్పితి నింతమున్నె -
అందు నిరువురు గలరు సమాధులందు
తోటయందలి మామిడితోపునడుమ.'

'ఈవు చెప్పిన మాటలే యియ్యకొందు,
ఏడుగురు మీర లందఱు, ఇరువు రందు
ఉసురు వాసి సమాధుల నున్నవారు,
ఐదుగురు కాదె మిగిలియనట్టివారు?'

'ఇట్టి మాటల నాడంగ నేటి కయ్య?
ఉసురు వాసియు నెదుటనే యున్నవారు
అల్లదే! యా సమాధులయందుఁ జొచ్చి,
వారిపై మట్టి యింక తడియారలేదు.

అనుదినంబుఋను మధ్యాహ్న మచట నేను
కూరుచుండి రుమాళ్లను కుట్టుచుందు;
జననితోఁ గూడి పలుమఱు సంజవేళ
ప్రార్థనాగీతముల నట పాడుచుందు.

రమ్య మగు పండువెన్నెల రాత్రులందు
చలువఱాతిన్నెపైఁ జేరి, చల్లగాలి
వీచుచుండఁగ, భక్ష్యముల్ వేడ్క మీఱ
నారగింతుము నేను మా యమ్మ యచట.

'నిర్మల' గతించి నెల యైన నిండలేదు,
చనియె 'విమలుండు' మొన్ననె స్వర్గమునకు;
తోటలో నవె యా సమాధులును రెండు
వరుస నున్నవి యొకదానిప్రక్క నొకటి.'

'బాలరో! వార లిరువురు స్వర్గమందు
నున్నచో, నింక మీ రెంద రున్నవారు?'
అనుచు నడిగితి, తోడనే యామె నుడివె,
'ఇంత యేటికి- మే మంద రేడుగురము.'

'వారలిరువురు మృతినొంది స్వర్గమునకు
నేగినా' రని నొక్కి నే నెంతసెప్పు
నుడివినను గాని, తనపట్టు విడువ దామె
పాడుచుండెను 'మేమంద రేడుగురము.'



# విచ్చుకత్తె

జీర్ణమై కడు మాసిన చీరగట్టి
విరియఁబాఱిన నిడువాలుకురులు వ్రేల
కేలుదోయి నురమ్మునఁ గీలుకొలిపి,
వచ్చె భూవరుకడ కొక్క విచ్చుకత్తె.

అఱవ నల్లంతదవ్వున నట్టె చూచి
వెఱఁగుపాటును నివ్వెఱ పెనఁగొనంగ
దిగ్గు రని లేచి గద్దియ డిగ్గి ఱేఁడు
ఎదురుగా నేగి స్వాగతం బిచ్చె నెలమి.

తళికిచీఁకటిమొత్తమ్ము తఱకుఁ వోలు
తళికిమై ఱిగి మిఱుమిట్లు కొలుపఁ, జూచి
'అద్దిరా ! యామెసోయగ ! మౌర ! హాయను !'
అనుచు తలలూచి మెచ్చిరి యచటి ప్రజలు

ముఱికివాఱిన యా మేలిముసుఁగునందు
కాంతనెమ్మోము చెలువమ్ము కానిపించె,
చిఱుతమబ్బులమాటునఁ దుఱఁ గలించు
నిండునెలవోలె కన్నులవండు వగుచు.

'వాలుఁగన్నుల జగ మెల్ల నేలఁ జాలు
తరుణిమిన్నను నే మిచ్చి తనుపువాఁడ?
జాలి మీఱఁగ నన్నె యప్పనము చేసి
దన్యుఁడు నగుదుఁ గా' కని తలఁచె రాజు.



# సామాన్య యోధుఁడు

ఒక దినంబున సాయంత్ర మోరుగల్లు
నగరవీథుల నొకవ్యక్తి నడచుచుండె;
అతని దుస్తులు సామాన్య మైన వగుట
ఆతఁ డెవ్వరో యెఱుఁగ తేరైరి జనులు.

దారుణంబును కడు విషాదంబు నైన
దృశ్య మొక్కటి యాతని దృష్టిఁ బడియె.
శకటశకలంబుపై నొక్క శవము బెట్టి
లావుమై నొక్క మనుజుండు లాగుచుండె.

బండిపై కప్పు, శవముపై బట్ట లేదు,
అతనివెనువెంట నొకఁడు సాయంబు లేఁడు,
బరువుచే క్రుంగి యాయాసపడుచు నతఁడు
లాగఁజాలక సారెకు నాగుచుండె.

దానిఁ గనినంత పథికుండు తల్లడంబు
నొంది యి ట్లనె. 'అన్న! నే నొక్కమాట
యడుగుచుంటిని, దయచేసి నుడువు మయ్య
శకటమున నీవు గొనిపోవు శవ మెవరిది?'

'యుద్ధమునఁ బోరి మరణంబు నొందినట్టి
యొక్క నిరుపేద సామాన్యయోధుఁ డితఁడు'
అనుచు నాతఁడు మాఱు మాటాడకుండ
తిరిగి చూడక తనదారి నడచుచుండె.

"ఏమి యంటివి? ఆంధ్రుఁడా! ఏమి యంటి!
'ఒక్క నిరుపేద సామాన్యయోధుఁ' డనియ?
పేద యగుఁ గాక, రణమున వీరమరణ
మందు యోధుఁడు సామాన్యుఁ డగునె తలఁప?

ఆస మానుమ అయ్యఁడా! ఆత్ర మేల?
అక్కటా! యిట్టి పీనుంగు దిక్కు లేని
యనదవై పడి కాటికి నరుగ నేల!
అన్న! నీవెంట కానిమ్ము నన్ను గూడ."

అనుచు వచియించి తోడనే యతఁడు తనదు
నుత్తరీయంబులో దాఁచి యుంచికొనిన
మణిమయం బగు మకుటంబు మౌళిఁ దాల్చి
వెనుకఁ జనుచుండె నాతండు గనకయుండ.

దారివెంబడిఁ జనుచు, ప్రతాపరుద్ర
చక్రవర్తిని గాంచి యాశ్చర్య మొంది,
ప్రజలు మంత్రులు ప్రభువులు భటులు కాపు
లరిగి రాజాగోపాల మధిపువెంట.

రాజరాజులకు లభింపరాని యట్టి
వైభవంబున, ధారుణీవల్లభుండు
ఊరుపేరును లేని యా యోధవరుని
యంత్యవిధుల యథావిధి నాచరించె



# మనశ్శాంతి

పావనం బగు గౌతమీపరిసరము న
అల్లిబిల్లిగ పూఁదీఁగ లల్లుకొనిన
రమ్యతలమున నొక కుటీరంబునందు
కాపురం బుండె నొక పేద కాఁపువాడు

కలఁత యెఱుఁగని వాని కన్గొలుకులందు
అనిశ మానందలక్ష్మి తా నధివసించు,
వలుద యగు వాని వక్షఃకవాటమందు
నిలిచి ఆరోగ్యదేవత నృత్యమాడు

ఆతఁ డొకనాఁడు తనయింటి యరుగుమీఁద
పిల్లవాయువు మెల మెల్ల వీచుచుండ,
కొమరులును దాను భార్యయు కూరుచుండి
వేడు కలరఁగ నీకీతి పాడుచుండె

"పరులపదవుల కెప్పుడు వాంఛ సేయ
పరులు నాదగు పదవికి వాంఛ గొనరు,
ఉన్నదానికి సంతుష్టి నొందువాఁడ
లేనిదానికి లేశంబు క్లేశ మొంద."

వేఁట ముగియించి ఆ దారివెంట మరలి
తనదు పరివారజనులతోఁ జనుచు రాజు,
అతని పాటల నాలించి యట్టె నిలిచి
హయముపై నుండి వానితో ననియె నిట్లు:

'బాపురే! ఏమి యంటివి కాఁపువాఁడ?
నీదు వాక్యము నిక్కంబు గాదు సుమ్మి
ఈ జగం బెల్ల పాలించు రాజ నేను
నాకు లేని మనశ్శాంతి నీకుఁ గలదె?

జంకు గొంకును లేక నిశ్శంకముగను
శ్రావ్య మగు నీదు మంజులస్వరముతోడ
హాయిగా పాట పాడెదు హాళికుండ!
చెప్పుమ యెటు కల్గె నీ కిట్టి చిత్తశాంతి?"

అనుచు, నవ్వుచు ఱేనితో ననియె కాఁపు :
"చెమట యూడ్చి దినం బెల్ల చేను దున్ని
కూడుగుడ్డకు నేమియుఁ గొఱఁత లేక
జీవయాత్రను సాగింతు స్వేచ్ఛ మీఱ.

సతియు బిడ్డలు నా కనుసన్న మెలఁగి
పనులు గావింతు, రెన్నఁడు బదులు గొనను
పరులకడ పైన యైన, నెల్లపుడు నాకు
మిత్రులే కాని లేఁ డొక్క శత్రు వైన.

కమ్మ తెమ్మెరబుడుత నా కమ్మతీఁడు
గౌతమీనది నా యూడిగంపుటింతి
పగలు రేయియుఁ గాయక ప్రకృతి కాంత
నాకు పరిచర్య చేయుచు సాఁకుచుండు."

విన్న రని రాజు పెద్దనిట్టూర్పు పుచ్చి
పల్కె నీరీతి నా కృషీవలునితోడ,
'నిజము నీ మాట లెల్లను నిక్కువములు
వెయ్యియేఁడులు వర్ధిల్లు మయ్య నీవు.

విశ్వ మెల్లను పాలించు విభుఁడ నయ్యు
స్వాంతమున నాకు సుంతయు శాంతి లేదు,
అందఱును నాకు శత్రులే యగుటఁ జేసి
కుదురుగా నొక్కరేయియు నిదుర పోవ.

ఎలమి నీ విప్పు డాడిన పలుకులందు
ఉన్న మూర్ఖుడికి నిజంబె యగును గాని,
'పగలు నాదగు పదవికి వాంఛసేయ'
నను వాక్య మొక్కటియె సత్యంబు గాదు.

మాత్రమిత్రుఁడ! నీవియ్యకొంటి వేని,
రక్షితమై నాదు రాజ్యసర్వస్వ మెల్ల
నీకు నప్పన మొనరించి, నేను పదవి
హృదయపూర్వకముగ స్వీకరించువాఁడ

రత్నమయ మగు నాదు తురాయి కంటె
బాగు మీఱిన నీ కుచ్చుపాగ మేలు;
నాదు బంగరుసింహాసనమ్ము కంటె
అలికి ముగ్గుల నిడిన యీ యరుఁగె మేలు.

నిత్యసంతోషభరితుఁడౌ నిన్ను బోలు
ఉత్తమోత్తముఁ డొక్కరుఁ డున్నఁ జాలు,
నాదు సామ్రాజ్య మొకటియే కాదు- తనదు
విమలకాంతుల వెలయించు విశ్వ మెల్ల.''



# అక్బరు నిర్వేదము

ఆమె యెవ్వరు ? తేలఁ జంద్రాయుధంబు
రాణ మెఱయఁగ పంచకల్యాణి నెక్కి
సమరభూమి విహారంబు సలుపుచుండె,
వీరరస మెల్ల మూర్తీవించె ననఁగ

నెన్నుదుటఁ దూలి ముంగురుల్ నృత్యమాడఁ
జెక్కు దోయిని గ్రమ్మిన చెమ్మటలను
మాటిమాటికి కొనగోట మీటికొనుచు
దెసలఁ బరికించుచున్న యా తెఱవ యెవరు ?

ఆహవంబున రిపులపై మోహరించి
ఓహటిల్లక పోరాడి, యుర్వి నొరఁగి
యున్న తనసేనఁ దిలకించి యున్న రనుచు
వేడినిట్టూర్పు బుచ్చు నా చేడె యెవరు ?

కట్టు! ఏ మిది? ఎంతలో నెట్టి మార్పు?
లలిత శృంగారమున కవలంబ యైన
వనిత రౌద్రమునకు నాలవాల మగుచు
భీకరాకృతి ధరియించి భీతి గొలిపె.

కరుణ కిర వైన యా వాలుఁగన్నుదోయి
గ్రక్కుచున్నది విస్ఫులింగములనిప్డు;
మొలకనవ్వుల నొలికించి ముద్దు మొగము
కురియుచున్నది దారుణ క్రోధరసము.

అరరె! యామె జరీలున హాయము దిగ్గి
చికురములు విచ్చి పాయలై చిందులాడ,
వాలు ఝళిపించి నిష్ఠురస్వరముతోడ
నన్ను కాఁబోలు పిలుచుచునున్న దదిగో

ఏమి యనుచుంటి? నీవు పాటేశ్వరివియు?
'రాజ్ఞులము మేము మేవాడురాజ్యరమకు,
ఉసురు లీ దేహమున నిల్చియుండుదాఁక
పోటిగొందుమె నీ సార్వభౌమపదవి?'

అనియు నీ వనుచుంటివె?- అమ్మ! నిజము,
దేవి! నీ చిత్తవృత్తిని తెలిసికొంటి,
మేటి మేవాడురాజ్యంబు మీదె సుమ్మి
నొక్క ముమ్మాటి కే నిదే నుడువుచుంటి.

పలసు నా కింక నీ సార్వభౌమపదవి,
ఇదిగో, నా రాజబిరుదంబు వదలుచుంటి,
తరుణులును గూడ సవిరళ త్యాగవహ్ని
నుఱుకుచుండఁగ నిం తెట్టు లొప్పువాఁడ?

ముదతిశయమున కన్నులు నీరంబు గ్రమ్మ
పలికితివి యిమ్ము నగచాట్లపాలు గాఁగ,
మానవతు లైన మానినీ మణుల కెదుర
నిలిచి సమరంబు నే నింక సలుపఁ జాల.

తల్లి! భారతమహారాణుతల్లు లిట్టి
దివ్యపరతంత్రభరితలు, దేశభక్తి
నిరత లంచును మున్నె నే నెఱిఁగియున్న
వారు పడుదురె యకట! యీ పాడుపనికి?

తరతరంబులనుండి మీ తాతతండ్రు
లెల్లజనములు రంజిల్ల నేలుచున్న
పూజ్య మైనట్టి మేవాడురాజ్యలక్ష్మి
జోలి నా కేల ? మీరలే యేలికొనుఁడు

రిపుభయంకరమై దుర్నిరీక్ష్య మైన
నీమ వదనంబు వీక్షింప నేర నింత
దేవి ! భవదీయమూ ర్తి శాంతింపఁ జేసి
సుప్రసన్నవై నను దయఁ జూడు మమ్మ.

సెల వొసంగుము, పోయి వచ్చెదను తల్లి !
నిరుపమం బగు నీ శౌర్యనిధికి మెచ్చి
ఒక్క మేవాడె కాదు- వేఱొక్క రాజ్య
మొసఁగెదను నీకు, గైకొను పసదనంబు



# శివాజీ శీలము

లగ్గవట్టి శివాజీ కల్యాణికోట
ముట్టడించి పరాక్రమమున జయించి
సఖులు మంత్రులు పరివారజనులు తన్ను
గూడి సేవింప నొకనాడు కొలువు దీర్చె.

అరుణకిరణుడు చరమాద్రి నొరగుచుండె,
చిమ్మచీకటిచీర కుచ్చిళ్లు దిద్ది
పైట సవరించుకొనుచుండె ప్రకృతికాంత,
మెల్లగ నవ్వుచుండె జాబిల్లికొదమ.

సద్దు మణిగెను సభయెల్ల, గద్దెనుండి
యింక దిగలేదు భూవరుఁ, డెల్లజనులు
దృష్టి సారించి యెద్దియో దృశ్యముదెస
చూచుచుండిరి తద్దయు చోద్య మొప్ప.

తేఁటి తోడనె యావైపు దృష్టి బఱపె,
మబ్బుమాటున చంద్రబింబంబు వోలె
మేలిముసుఁగున నెమ్మోము మెఱుఁగు లీన
తరుణి యొక్కతె నిలుచుండె శిరము వంచి.

"జయము జయము మహారాజ ! జయము జయము
దేవరకు పట్టమహిషియు, దేవి మాకు
కాఁదగిన విశ్వమోహనాకార యీమె
బందెగొని తెచ్చినారము ప్రభునికొఱకు"

అనుచు సేనాని వచియించి యుచితభక్తి
గదుర చేతులు జోడించి యొదిగి నిలిచె,
ప్రభువు తల యెత్తి యా యింతివైపు జూచె,
జనుల కలకలారావము ల్ సందడించె.

క్షణములో నొక్క పెట్టున జనులచూపు
లొక్కపరి తేనివైపున, నొక్కసారి
యింతివైపున ద్రుళ్లింత లిడుచునుండె ;
[illegible]స్సు రసి రాజు క్షణ మట్టె యూరకుండె

''చారు సుకుమార సుందరాకార మైన
యీ మెకడుపున నే నుదయించియున్న
అహాహా! ఎంతటి ధన్యుఁడ నగుదునో కద''
యనుచు గద్గదస్వరమున ననియె ఱేఁడు.

అధిపుఁ డాడిన యా మాట లాలకించి
తెల్లవోయిరి సభలోని యెల్లవారు;
మేడచుట్టును నిలుచున్న మెలఁత లెల్ల
మేలు మే లని తలలూచి మెచ్చుకొనిరి.

అదిగో! ఎవ్వరో శుభలక్షణాంగి యొకతె
రాజ్ఞి కాఁబోలు - సౌధాంతరముననుండి
ప్రణయదృష్టులతోఁ బాటు ప్రభునిమీఁద
కుసుమవర్షము కురిపించె కూర్మి మీఱ

''విలువనగలును సన్నదువ్వలువ లొసఁగి
వెంటనే యామెఁ దోడ్కొని యింటి కేగి,
బల్మిమై నామె బందెగాఁ బట్టికొనిన
నేరమునకు క్షమాపణ కోరి రమ్ము.''

అనుచు సేనాని కిరీతి నానతిచ్చి
డిగ్గు రని పీఠమునుండి డిగ్గె తేఁడు,
సభ్యులెల్లరు లేచిరి సంభ్రమమున,
సిగ్గుచే నంత సేనాని శిరము వాల్చె.

*                    *                    *

కొండయెలుకంచు దొంగలగండఁడంచు
ఛత్రపతిఁ గూర్చి పాశ్చాత్యచరితకారు
లెన్నికల్లలు రచియించియున్న నేమి,
వాని సత్కీర్తి యొకింతయేని చెడెనె!



# బ్రూసు - సాలీఁడు

స్వీయదేశము స్కాట్లండు స్వేచ్ఛ కొఱకు
తనమ జీవిత మెల్లను ధాతవోసి
ఆంగ్లసేనలఁ దలఁపడి ఆఱుమార్లు
పోరు గావించి జితుఁ డయ్యె బ్రూసురాజు.

తిరిగి రాజ్యము నెట్లో సాధించి తనదు
ప్రజల నెల్లర సంతోషపఱుప, నతఁడు
ఎన్నియెన్నియొ వ్యూహముల్ పన్నెఁ గాని
కార్యసాఫల్య మించుక గాంచఁ డయ్యె.

సొమ్మసిలి యాతఁ డూరూర దిమ్మదిరిగి
నిలిచి తలదాఁచికొన నింత నీడ లేక
కడకు నెట్టులో యొక పాడుగుడిసెఁ జేరి
వెచ్చనూర్పుచు దినములు బుచ్చుచుండె.

విసిగి వేసారి మొగ మెత్తి వేలవైచి
నిస్పృహంబున నతఁడు చింతించు చుండ,
సాలెపురు గొందు పోఁగున వ్రేలియాడి
తటుకు మని వాని దృష్టిపథమునఁ బడియె.

దానిఁ బొడఁగనినంతనే ధరణీవిభుఁడు
తనదు యోచన యొక్కింత తడవు మాని,
లూత యేమి యొనర్చునో చూత మనుచు
దానిచర్యలఁ గనుచుండె తమక మొప్ప.

గుడిసెనడికొప్పునం దున్న గూఁడునుండి
నూలు వెంబడి సాలీఁడు వ్రేలుచుండె;
"చేరునా యది తనయిల్లు? చేరలేక
అల్లలాడున నావలె నిల్లు దొరఁగి?"

అనుచు నా రాజు వింతగా నరయుచుండ,
సాలెపురు గట్టె పోఁగున వ్రేలియాడి
చీటిమాటికి పదముల జిమ్ముకొనుచు
కడఁకమై మీఁది కెగఁబ్రాఁకఁ గడఁగుచుండె.

అరిగెనో లేదో నాలుగైదంగుళములు-
తోడనే యది క్రిందికి తూలి జాఱె;
మరల వెంటనె మీఁదికి నురికెఁ గాని,
తొంటికంటెను క్రిందికి తూలిపడియె.

తడవుకొనకుండ త్రుటి యైన తడయకుండ
పైకి చర చర క్రమ్మఱ ప్రాఁకె చెలఁది;
ఔర! అది యేమి! పదములు జాఱెనేమొ-
నేలమీఁద గుబాలున కూలి పడియె.

తెప్పిఱిలి కొంతవడి కది తేఱి లేచి
తెంపుచే లేని సత్తువ తెచ్చికొనుచు
గుప్పు మని పైకి కుప్పించి కొప్పరించె.
చేప యెటనుండి వచ్చెనో చెలఁది కపుడు?

తాఁకినంతన తెగిపోవు దారమంట,
మిగుల నెత్తైన నడికొప్పుమీఁది కంట,
గాలిచే నూఁచుకొనిపోవు సాలెపురుగు
అక్కటా! ఎట్లు తెగఁ బ్రాఁకు సంతదవ్వు?

మగుడ దిగజాఱి పొలిఁడు దిగువఁ బడియె,
తోడనే యొక్కఁదూఁకున దుమికె పైకి;
పైకి క్రిందికి క్రిందికి పైకి, నిట్లు
బంతి మీటినగతి సారె గంతులిడియె.

ఏల తడఁగెద వింక నో సాలెపురుగ?
వమ్ములై చనె నీ ప్రయత్నమ్ము లెల్ల
జాఱి కూలితి వింతలో నాఱుమార్లు
కటకటా! చేరఁ గలవె నీ గమ్యసీమ?

మరల నొకసారి మీఁదికి నుఱికె పురుగు
అడుగు మాత్రమె తనగూఁటి కవధి యుండె;
జాఱెనాఁ యింక తనగూఁడు చేరలేదు;
జయము నొందున? తుదిసారి జాఱిపడున?

అల్లనల్లన క్రమముగా నడుగు లిడుచు
మీఁది కెగఁబ్రాఁకె పొలిఁడు మెల్లమెల్ల;
చంగు మని యొక్కఁగంతున చౌకళించి
ఎట్టకేలకు గూటియుయ్యెలను జేరె.

''భళిర! సాలీఁడ! నీపూన్కి ఫలము నొందె,
ధృతి దొలంగక నీవలె నేను గూడ
విజయలక్ష్మి వరించెద వేడ్కమీఱ''
అనుచు నెలుఁగెత్తి యఱిముఱి నఱచె ఱేఁడు.

కొంతకాలము గడచినయంత, నతఁడు
చెల్లచెదరైన సేనల నెల్లఁ జేర్చి
శత్రువులతోడ డీకొని జయము గాంచి
తనదు ప్రజలకు స్వాతంత్ర్యమును ఘటించె.

కార్య మేదైన సాధింపఁ గడఁగువారు
బ్రూసు సాలీని కత జ్ఞప్తి చేసికొనుచు
పెక్కుబన్నంబు లొదవిన లెక్కగొనక
కార్యసాఫల్య మగుదాఁకఁ గడఁగవలయు.



# ప్రణయ మహిమ

ఒక విషాదదినంబున నువిద యొకతె
యేమొ యోచించుకొనుచుండె, నామెవదన
మొక్కపరి గాఢనిస్పృహ, మొక్కసారి
యుంచుకించుక యాశ సూచించుచుండె.

తాను మనసార వలచిన తరుణుఁ డొకఁడు
నాఁటిరాతిరి చెఱువెన్క తోఁటయందు
ప్రభునియానతి నురిదీయఁబడఁగ నుండె,
ఖంగు మని గంట మ్రోఁగిన క్షణమునందె

పుడమి తల్లిను బంగారుపూఁత పూసి
అరుణబింబము చరమాద్రి నస్తమించె;
రమణి యంతట తన మందిరమును వీడి
రయమునం జని బంధనాలయముఁ జొచ్చె.

ఇంతి యచ్చట గంట వాయించువాని
తోడనిట్లనె పెదవులు తొట్రుపడఁగ,
"అన్న ! అల్లదె కారాగృహంబునందు
బంధియై యుండె నా కూర్మిబందు వొకఁడు

చల్లకై వచ్చి ముంత దాచంగ నేల ?
ఆతఁడే నాదు చిన్నారి యనుపుకాఁడు ;
నృపుని శాసనమునఁ జేసి నేఁటిరాత్రి
గంట మ్రోయంగనే వాని కంఠ మెగయు

చెప్ప నేటికి ?- వాని రక్షించువాఁడు
నీవు. దేవుఁడు తక్క నింకెవఁడు లేఁడు.
ఈ దినంబున గంట వాయింప మాని
ప్రేమతో నాకు పతిభిక్ష పెట్టు మయ్య."

"చిన్నతనమునుండి యో యమ్మ మిన్న !
ప్రభుని యుప్పును తిని నేను బ్రతుకుచుంటి
నేఁడు డెబ్బదియేఁడుల వాఁడనైతి
తెలిసి యాసతి యేగతి మానువాఁడ ?

చాలకాలమునుండియు స్వామియాజ్ఞ
నెఱపుచుంటిని, నేఁడును నెఱపువాఁడ
ఏది యెటులైన— గంటవాయింప మాన''
అనుచు వచియించె వృద్ధుఁడు వ్యగ్రుఁ డగుచు.

పిడుగు బోలిన యా మాట వినినయంత
ఉల్లమున నామె యెంతయు తల్లడిల్లి
మొదలు నఱకిన కర్పూరకదళి వోలె
నేలపై నొక్క పెట్టున కూలఁబడియె.

తెప్పిఱిలి కొంతవడి కామె తేఱి లేచి
తటుకు మని యొక్క యోచన తట్ట మదికి,
గంట వ్రేలాడు గోపురాగ్రంబుకడకు
నిట్టనిలువున నెగఁబ్రాఁక నిశ్చయించె

గంట లోపలి గుండునఁ గట్టియున్న
త్రాడు క్రిందికి వ్రేలాడ, దాని నామె
గట్టిగా రెండుచేతులఁ బట్టి, మీఁది
కెక్క నుంకించె, నయ్యారె! ఎట్టి తెంపొ?

కాలుసేతుల రక్తంబు కాల్వగట్టి
జాలువాఱుచు నున్నను సరకుగొనక
మీఁది కెగఁబ్రాకుచుండె నమ్మెలఁత, యౌర!
వలపు గలచోట ప్రాణంబు చులుక గాదె?

అల్లిబిల్లిగ లో నెల్ల నల్లికొనిన
చెలఁదిగూఁడులు చీకాకు గొలుపుచున్న,
కటికిచీఁకటిగొందిలో కట్టకడకు
చేరుకొనె నామె యెట్టెటో శిఖరమునకు

శిరముపై నున్న గంటను చేతఁ దడవి
ఉస్సురని యామె యొక్క నిట్టూర్పు పుచ్చె;
ముందు గనిన గుయ్యారంబు, క్రిందఁ గనిన
నంతకంటెను గుయ్యార మగుచుఁ దోఁచె.

అదిగో! అది యేమి? యాత్రాఁడు కదలుచుండె?
దరిసెఁ గాఁబోలు తన ప్రియు మరణవేళ;
ఏమి యొనరింపవలయునో యామె మఱచె,
చిత్తరువు రీతి నూఁగాడె చేష్టలుడిగి.

శ్వాస మరికట్టె, గుండియ జల్లు రనియే,
ముమ్మరమ్ముగ చెమ్మటల్ గ్రమ్మె మేన;
అంతరాళమునం దామె యెంత సేపు
వ్రేలియాడుచు నారీతి తాళఁగలదు ?

కొట్టు నిచ్చ్వస గంటను ? పట్టుకొనున ?
అదియు నిది గాక, సత్తువ ప్రిమలువడఁగ
పట్టు విడి నేలఁ గూలున పడఁతి ? యకట !
ఏది జరుగంగ నుండెనో యెవరి కెఱుక ?

వెంటనే యామెకన్నుల వింతకాంతి
తళుకు లీన, తటాలున తాల్మి నూని
పైకి గుప్పించి గంటను పట్టుకొనియె,
త్రాణ యెటనుండి వచ్చెనో తనకో తప్పుడు ?

మొగము బిగియించి కనుబొమల్ ముడివడంగ
సువిద యిట్లనె హుమ్మని హుంకరించి,
"ఏది యెట్లైనఁ గానిమ్ము నాదు ప్రతిన
యిదియె. యీ రేయి గంట వాయింపనీను"

తెంపుతో నిట్లు ఘోర ప్రతిజ్ఞ చేసి
ఒక్కచేతను త్రాడు, వేఱొక్కచేత
బలిమిమై గంట గట్టిగాఁ బట్టుకొనుచు
ప్రేల నుంకించె తొయ్యలి రేయి యెల్ల.

త్రాణతో రెండు చేతుల త్రాడుబట్టి
లాగుచుండెను గంటవా డాగకుండ,
గంట మ్రోగుచున్నది గాఁదలంచె
పాపమాతఁడు వినలేఁడు బధిరుఁ డగుట.

తన కరంబులు వడవడ వణఁకుచున్న
పడతి తన చేతిపట్టు తా విడువ దయ్యె,
హృదయ మదవదయ్యె కడు బెదరుచున్న
నదరుపెదవుల నిట్లామె వదరుచుండె:

"ఉసురు ఏ బొందిలో నిల్చియున్న దాక
పెనఁగి పెట్టిన నా పట్టు విడువజాల,
వేఁగుజా మైన నగుఁగాక, వ్రేలుదాన
ఏది యెటు లైన- గంట వాయింపనీయ."

ఖణ్ణుమని యంత నల్లదే తెల్లవాఱె,
ఓహో! ఏమి యా జనుల కోలాహలంబు ?
ఆతఁడెవ్వఁడు ? ముందుగా హయము నెక్కి
వడి హుటాహుటినడలతో వచ్చుచుండె.

గంటపై నాని యుంచిన కరము దిగిచి
పగ్గమన రెండుచేతులు బిగ్గఁ గూర్చి
గుప్పుమని జాటి నేలపై కుఱికె కలికి
మింటిపైనుండి తెగివడ్డ మినుకు వోలె.

కాఱుమబ్బులనుండి క్రొక్కాఱుమెఱుఁగు
కరణి, చిమ్మచీకటినుండి తరణి వెడలి
పరుగుపరుగున సరగున సరుగుదెంచి
తేనిపదములపైఁ దనమేను జేర్చె.

కాఱుచున్నట్టి కన్నీటిజాలుచేత
దొరఁగి స్రవియించు చెమటబిందువులచేత
ఏఱులై పాఱు నెత్తురుధారచేత
కడిగె తొయ్యలి ప్రభుపాదకమలయుగళి.

తోడనే లేచి చేదోయి దోయిలించి
చినుఁగువలువలు, నొగిలినతనువు జూపి
జాలి గులుకఁగ గద్గదస్వరముతోడ
వెలఁది ప్రభునకు సర్వంబు విన్నవించె.

రమ్య మయ్యును క్లేశభారమ్ముచేత
వన్నె దిగఁద్రావి వసివాళ్ళు వాఁడియున్న
తరుణిముఖబింబ మవలీల కఱఁగఁజేసె
వజ్రసన్నిభ మైన యా ప్రభునిమనము.

"పడఁతి ! ఎంతటి కష్టముల్ పడితి వమ్మ ?
పావనం బగు తావకప్రణయమహిమ
ప్రియునిఁ గాపాడె, నీ విఁక భయము మాని
ప్రేమలహరిని దేలుమా ప్రియునిఁ గూడి."

అనుచు నీరీతి భూవరుఁ డానతిచ్చి
అధికదయతోడ నాయింతి నాదరించి
భటుని నొక్కని వేగమె పంపి యామె
ప్రియుని చెరనుండి విడిపించి ప్రియము నించె.

కరము కరమునఁ గీలించి తరుణి, ప్రియుఁడు
ప్రభుని పదముల నెఱగిరి భక్తి గదుర,
'శీఘ్రమే మీకు కళ్యాణసిద్ధి రస్తు'
అనుచు దీవించె భూవరుఁ డధికదయను.

రేయి యెల్లను తమ్మిపూరేకు లనెడి
చెఱలలోఁ జిక్కి స్రుక్కి కృశించియున్న
యళులబంధము లెడలించి యార్తిదీర్చి
మిహిరబింబము పూర్వాద్రిమీఁదఁ బొడిచె.



# నా జన్మభూమి

అది మనోహర, మతిమహిమాన్వితంబు,
సౌఖ్యభరితంబు, సౌందర్యసంయుతంబు,
సకలసంపత్సమేతంబు, శాశ్వతంబు
స్వర్గసన్నిభసీమ నా జన్మభూమి.

పాడిపంటల కయ్యది పట్టుకొమ్మ,
భోగభాగ్యములకు నది పుట్టినిల్లు,
అఖిలశుభముల కయ్యది ఆటపట్టు,
స్వర్గసన్నిభసీమ నా జన్మభూమి.

అనవరతమును ప్రవహించు నచటి నదులు,
అన్నివేళల ఫలియించు నచటి వనులు,
అఖిలమణులకు నాకర మచటి గనులు,
అంబరంబును చుంబించు నచటి గిరులు.

అచట నిచ్చలు నిత్యకల్యాణములును
పచ్చతోరణములు నయి వరలుచుండు;
స్వర్గమునకన్న, నను గన్న జననికన్న
స్వర్గమంగళకరము నా జన్మభూమి.

అవనిలో నున్న యన్ని వస్తువులకన్న
నిన్నె ప్రేమింతు మిన్నగా కన్నతల్లి!
కామితార్థము లొనగూర్చు కల్పవల్లి!
సకలసుఖముల వెల్లి! నా జన్మభూమి.

నిన్ను ప్రేమించు నా ప్రేమ నిర్మలంబు,
నిరుపమానము, నిత్యంబు, నిబ్బరంబు;
నిన్ను సేవించు నాసేవ నిశ్చలంబు,
నిర్నిరోధము, నిద్దంబు, నిట్టలంబు.

పరులు నీపయి దండెత్తి వచ్చిరేని,
వారితోఁ బోరి యవలికిఁ బారఁద్రోల
నాదు ప్రాణము మానంబు నా ధనంబు
నర్పణమొనర్చి ధన్యుండ నగుదు నేను.

# నా యిల్లు

నందనంబులు, సుందరమందిరములు
ఈడువచ్చునె నా సొంతయింటితోడ?
అదొక పూరికుటీరమే యగును గాక,
స్వర్గమైనను దానితో సాటి రాదు.

చిన్నతనమున కూర్మినెచ్చెలులతోడఁ
గూడి వేడుకమీఱ నే నాడినట్టి
ఆటపాటల మఱువంగ నలవి యగునె?
గృహముకంటెను సౌఖ్యంబు మహిని లేదు.

అనుఁగుతల్లియు తండ్రియు నన్నదమ్ము
లక్కచెల్లెండ్రు నాతోడ నాడినట్టి
మధురభాషల నెన్నడు మఱువఁగలనె?
గృహముకంటెను సౌఖ్యంబు మహిని లేదు.

కాంచినంతనె తోఁక యాడించుకొంచు
మీఁది కెగఁబ్రాఁకు ప్రేమతో నాదుకుక్క;
పిలిచినంతనె నా చేతిప్రేలిమీఁద
వాలి పులుఁగులు కిలకిల పాడుచుండు.

ఏను గ్రామాంతరంబున కేగునపుడు
-అచటి మేడలు సొగసైన వైన నేమి-
మరల నా పూరిగుడిసెకు నరుగు టెపుడొ
అనుచు నామది తహతహలాడుచుండు.

ఎప్పు డేవీథి నేగిన నెలమి మీఱ
పలుకరింతురు నను జూచి పౌరు లెల్ల;
ఎన్న 'తా నున్న యూరును, తన్ను గన్న
తల్లి యొకరీతి' యని యందు రెల్లవారు.

# ఒంటరి పల్లెపిల్ల

అల్లదే చూడు, మొంటిగా పల్లెపిల్ల
సాయ మెవరును లేకయె సంజవేళ
చేలు దున్నుచు గింజలు నేలఁ బాతి,
పాడుచున్నది ప్రమోదులు పల్లవింప.

సద్దు సేయక మెల్లగా సాగు మోయి-
సేవ్య మొనరించి ఆబాల శ్రావ్యముగను
ఏదొ యొక్క ప్రశాంత విషాదగీతి
ఆలపించుచునున్నది, ఆలకింపు.

భువనమోహన మైన యా ముగుదపాట
వేణునాదముకన్నను వీణకన్న
హాయి గొలుపుచు, నా హొంతలోయనుండి
మాఱుమ్రోగుచు వినిపించు మరల మరల.

ఓహో! ఆ పాట యెంత మనోహరంబొ!
దరిని సెలయేటి గలగలధ్వనులె సరిగ
తనదు పాటకు శ్రుతియును తాళములుగ
పాడుచున్నది యాబాల వేడుకలర.

దవ్వుదవ్వులనుండి యాదారిఁ జనుచు
మ్రానినీడను శ్రమవాయ మేనువాల్చు
పథికజనులను కోయిలపాట కన్న
కోమలం బయి సొక్కించు నామెపాట.

ఏమి పాడుచునున్నదో యెఱుఁగ రెవరు;
కరుణరసపూరిత పురాణగాథ లెవియొ,
కాక పల్నాటివీరుల కదనకథలొ,
వీరబొబ్బిలి వెలమల విక్రమంబొ?

గేయమో, లేక త్యాగయ్యకృతియొ, లేక
జానపదగీతమో, లేక జావళియొ,
అదియుఁ గాక తరంగమో, అష్టపదులొ,
మువ్వగోపాలపదములో - ఎవ్వఁడెఱుఁగు?

ఏమి యైనను గానిమ్ము- ఆమెగాన
మంతమొందదు, ఎంతసేపైనఁ గాని;
చేనిలోనుండి సేద్యంబు చేయుచున్న
యప్పుడెల్లను వినిపించు నామెపాట.

ప్రక్కనే యున్న కొండపై నెక్కి చనుచు,
విందు నాపాట వీనులవిందు లొలుక;
చిత్తరువు వోలె నంతనె చేష్ట లుడిగి
నిట్టనిలువున మ్రాన్పడి యట్టె నిలుతు.

చెవులచేరల, నాపాట చవులుగులుక,
జుఱ్ఱుకొందును చుబ్బనచూరలుగను;
ఎంత యాలించినను గాని తృప్తి గనక
మగుడ మగుడంగ నాలింప మనసుపుట్టు.

ఇప్పుడును నేను కొండపై నేగునపుడు,
-పొలములోపల నాబాల కలదొ లేదొ-
ఎడద నాటిన యాపాట విడువ కెపుడు
రింగు మని మ్రోగు వీనుల పొంగిపొరలి.

# లూసీ గ్రే

విందు వేమఱు వీనుల విందు లలర
సుగుణములరాసి, 'లూసి' యన్ ముగుద గూర్చి;
ప్రొద్దుపొడుపున నాబాల ముద్దుమొగము
కాన దాటినయపు డెల్లఁ గాంచుచుందు.

ఒప్పులన్నియు నొకచోట కుప్పవోసి,
అందముల నెల్ల నొకచక్కి పొందుపరచి
చేసెఁ గాఁబోలు బమ్మ యా లూసిమోము,
అట్లు గాకున్నఁ గలుగునే యట్టి హొయలు.

కోనలో కొండదరి నున్న గుడిసెయందు
కాపురము సేయు నొంటిగా కన్నెమిన్న;
కట్టెలను కొట్టు జనకుండు కాన కేగు,
పుల్ల లమ్మఁగ నగరికిఁ బోవు తల్లి.

చెంగుచెంగున గుప్పించి చెంగలించు
కన్నెలేళ్లను దిలకింపఁగలవు, కాని
మురువు గులికించు నాకన్నె ముద్దుమొగము
గాంచఁజాలవు నీ వింక కానలోన.

'బాలరో! నేఁటిరేయి తుపాను వచ్చు,
పురమునకు నీవు వేగమే పోవవలయు;
చేత లాంతరు దాల్చి నీమాత నిటకు
తోడికొని రమ్ము మంచులో త్రోవ జూపి.'

'అట్లె కావింతు ముదమార ననుఁగుతండ్రి!
దెసల మలుసంజ యింకను మసలలేదు,
చదలిపై నింక రాలేదు చందమామ,
ప్రొద్దుగూకినయంతనె పోయి వత్తు'

జనకుఁ డామాట లాలించి పనికిఁ బూని
కట్టెమోపుల విడఁదీయ కత్తి తీసి
కోయుచుండెను బిగివాళ్ళు; కొంతవడికి
కేల లాంతరు గీలించి బాల వెడలె.

బంతి మీఁటినగతి, నామె గంతులిడుచు
త్రేళ్ళువాఱుచు కేళిమై కాళ్ల వ్రేళ్ల
మంచుముద్దల నెగఁజిమ్ముకొంచుఁ జనియె
దూదిపింజలవలె నవి మీఁది కెగయ.

బెడిదముగ నంత చెలరేగె పెనుతుపాను;
ఏమి చెప్పుదు- నాబాల యెన్ని యెన్నొ
గిరుల నెక్కుచు డిగ్గుచుఁ దిరిగెఁ గాని,
కట్టి! చేరంగలే దయ్యె పట్టణంబు.

పాప, మాతలిదండ్రు లా పాడురేయి
'లూసి లూసి' యటంచు నా లోయ లెల్ల
మాఱుమ్రోఁగఁగ నఱచిరి సారెసారె,
కాని, ఏసడి యేజాడ గానరైరి.

విసిగి వేసరి వనటచే వెక్కి వెక్కి
యేడ్చి, వారు హతాశులై యింటిదెసకు
మగిడి యఱచిరి 'లూసికో! మరల మనము
నాకమునఁ గూడుకొందము గాక!' యనుచు.

వేఁగుబోకను వా రొక్క వాగుదరిని
వెలయు నొక పెద్దమెట్టపై నిలిచియుండి;
రచటఁ గాంచిరి పొలమున కవల నున్న
కట్టెవంతెన నొకదాని నెట్టయెదుట.

కనుఁగొనియె తల్లి యా మంచుకరడులోన
అనుఁగుకొమరిత చిన్నారి యడుగుజాడ;
లేని ధైర్యము డెందమ్ములోన నూని,
వడిగ నేగిరి పొలమువెంబడిని వారు.

అచ్చుగుద్దినరీతి నా యడుగుజాడ
లన్నియును నొక్కపోలిక నమరియుండె;
వేయికన్నులఁ గనిపెట్టి వెంట నరిగి
కడకుఁ జేరిరి వంతెనకడకు వారు,

మంచు కప్పిన గట్టువెంబడిని వారు
ఒక్కటొకటిగ నా జాడ లుత్తరించి,
చనిరి వంతెన నడిమిపార్శ్వంబు దనుక;
అకట! ఆజాడ లంతతో నంతరించె.

'నెలత జీవించియున్నది నేఁడుఁ గూడ
అమెవదనారవింద మా సీమయందు
కాంచవచ్చును కన్నులకఱవు దీర'
అంచు కొందరు జనులు వాదించుచుండ్రు.

'చిగురుటడుగుల మెల్ల నా యెగుడుదిగుడు
నేలపై మోపి, చూపుల నింగిఁ బఱపి,
వేడు కలరఁగ నాబాల పాడుచుండు
గాలితెరటాల నాపాట యూలవెట్టు'

# ప్రశాంత జీవనము

భళిర ! ఎంతటి ధన్యజీవనుఁ డతండు !
తరతరంబులు తన తాతతండ్రు లెల్ల
దున్ని సేద్యంబు చేసిన చిన్నిపొలమె
వాని లోకంబు, వాని సర్వస్వ మదియె.

పిల్చునాతఁడు పొలములో వీచు గాలి,
త్రావు నాతఁడు స్వచ్ఛమౌ బావినీరు,
క్రోలు నాతఁడు చిక్కని యాలపాలు,
క్రుంకు నాతఁడు చొక్కపు కొలనినీట.

చేలఁ బండిన గింజ లిల్లాలు వండి
కొసరి వడ్డింప కడుపార మెసవు నతఁడు
ప్రోదిగాఁ దాను పెంచిన పాదునుండి
అపుడె కోసిన కూరల నారగించు.

పథ్యముగ చేల ఫలియించు ప్రత్తిచెట్లు
పశువులకు మేత, వానికి వలువ లొసఁగు;
చేల నేపుగ నెదిగిన చెట్లు తనకు
పూలు పండ్లును చల్లని గాలి నిచ్చు.

పగటివేళల తోటలో పను లొనర్చు,
సందెవేళల నాటపాటలయందుఁ దేలు,
రేయి పవళించు నరుగుపై హాయి మీఱ,
గడపు నీలీల హాళిమై కాల మతఁడు.

హృదయశాంతియు తనుకాంతి గదుర నతఁడు
రోగ మెఱుఁగని సంతతారోగ్య మొంది,
అనిశ మీశ్వరధ్యానంబునందుఁ దవిలి
యచ్చ మీఱఁగ దినములఁ బుచ్చుచుండు.

ఎవరి నెఱుఁగక, ఎవరిచే నెఱుఁగఁబడక
వానివలె నేను జీవింప వాంఛసేతు;
ఎవ్వరును నాదు మృతికయి యేడ్వకుండ
ఏకతమ్మున కనుమూయ నిచ్ఛగింతు.

# జీవిత గీతము

జీవితం బొక కల యంచు చిత్రముగను
కవులు వర్ణించుచుందురు, కాని మనము
కల్ల యని భ్రమించిన దెల్ల కల్ల గాదు,
నిక్క మని నీవు నమ్ముమా నిశ్చయముగ.

జీవితము మిథ్య కా, దది స్థిరము ధ్రువము,
మరణ మొందుట దాని గమ్యంబు కాదు;
'మట్టిలో మట్టి కలియు' నన్నట్టి మాట
తనువునకె కాని, ఆత్మకు తగదు చెప్ప.

సారెకును మాకు సుఖదుఃఖసంచయములు
జీవయాత్రకు ప్రాప్యముల్ గావు తలంప;
దినదినమ్మును నభివృద్ధి గనెడిరీతి,
కర్మ చేయుటయే దాని ఘనఫలంబు.

కళలు స్థిరములు, కాలంబు గమనవేగి;
హృదయ మెంతటి ధీరంబు దృఢము నయ్యు,
మృత్యుభేరిని మ్రోఁగించి చైత్యయాత్ర
సరగ సాగించుచున్నది సారెసారె.

ఈ మహావిశ్వ రణరంగభూమియందు
జీవితం బను ప్రస్థానసీమ నిలిచి,
పిరికిపందలరీతిని పరుగులిడక
పోరు గావించి గెలువుమా వీరుఁడ వయి.

మాసిపోయిన 'గతమును' మఱచిపొమ్ము,
'భావి' నమ్మకు మెప్పుడో వచ్చుదాని,
నిఖిల కల్యాణకర మైన 'నేఁడె' పూని
పనులఁ జేయుమి యీశుపై భార ముంచి.

వరమహాత్ముల జీవితచరిత లెల్ల
పావన మొనర్చు మానవజీవితముల;
దివికి నేగుచు కాలంపు దిబ్బమీఁద
విడిచెదరు వారు తమ కాలియడుగుజాడ.

జీవితం బను వార్ధివీచికలలోన
ఈఁదులాడుచు తలమున్క లిడుచునున్న
చకితమానసుఁ డా యద్గుణాఢలఁ గని
త్రాసమును మాని మదిని నుత్సాహ మొందు.

లెమ్ము- కర్మవీరుండవు' కమ్ము వేగ;
సరకు సేయక యెట్టి కష్టముల నైన,
నేర్పు మీఱఁగ కార్యముల్ నిర్వహించి
ఓర్మి మై వేచి ఫలసిద్ధి నొందు మయ్య.

ఎన్న మనుజుని జీవిత మేండ్లచేతఁ
గాక, యాతని ఘనకార్యగణముచేత
గణన సేయఁగఁ జెల్లును; కాకి వోలె
ఇలను నూరేండ్లు బ్రతికిన ఫలము కలదె ?

# రాలిన పూలు

కన్నెయామనిసిరులకు వన్నెవెట్టు
మవ్వ మగు చిన్ని చిన్నారి పువ్వులార !
ఏల రాలెద రక్కటా ! నేలమీఁద ?
ఏమి తొందరవచ్చె మీ కింతలోనె ?

ఏల పుట్టించె దేవుఁ డీ యిలను మిమ్ము ?
మింటు తళుకని మెఱసెడి మెఱుపులగతి
మూఁడు నాలుగు గడియల మురువు జూపి,
అంత తటుకున మటుమాయ మగుటకొఱక ?

మంచివారలు తాము జీవించియున్న
స్వల్పకాలములోననె వారి సుగుణ
సౌరభంబుల వెదచల్లి చనెద రనుచు
మీదు చరితంబు జగతికి బోధసేయు.

పగలు వికసించి, దిన మెల్ల సొగసు లీని
రాత్రి యైనంత నేలపై రాలుఁ గాక ।
లీలఁ దా నున్న యా యల్పకాలముననె
కమ్మతావుల విరజిమ్ముఁ గాదె సుమము.

# మృత్యువు సకలసమవర్తి

పదవి, సంపద, వంశంబు, వైభవంబు
శాశ్వతంబులు కా, వవి నశ్వరములు;
నృపుల శిరములపై నుంచు మృత్యుదేవి
చల్ల నగు తన మృదుహస్త పల్లవముల.

సార్వభౌముని కత్తి, కర్షకుని హలము
సమముగా రెండు నొకదానిసరస నొకటి
మృత్తులోపలఁ బొరలాడు; మృత్యుదేవి
అఖిలజీవుల నొకరీతి నాదరించు.

కైదువులఁ దాల్చి యోధులు కదనసీమ
రిపులశిరములఁ గూల్తురు, మృత్యుదేవి
విజయు లగువారి శిరములఁ బ్రీతి మీఱ
తనదు బిగియారు బాహుబంధమునఁ బొదువు.

ఇప్పుడో యెప్పుడో యింకొకప్పు డైన
మృత్యువాతకు లోనౌదు రెల్లవారు,
ఒడలిలో కొనయూపిరి యున్నదాక
ఉస్సురని మూల్గి యుసురు వాయుదురు తుదకు.

మిట్టిపడఁబోకు జయము చేఁబట్టితి నని,
వడిగ నీ కీర్తిమంజరుల్ వడలఁబాఱు;
వెచ్చ నగు నీదు నెత్తురు వెల్లివిరిసి
మిత్తిదేవత బలిపీఠిమీఁద పొరలు.

నీదు సుందరవదనంబు నిద్ర జెందు
మిత్తిదేవత యొడిలోని మెత్తమీఁద;
సుజను లగువారి సద్గుణసూన మొకటె
వారి గోరీల వికసించి పరిమళించు.

చావు చా వంచు భీరువు సారె వగచు,
ధీరుఁ డొకసారె మృతివేళ ధృతిఁ దొలంగు;
అఖిలజనులకు చా వెపుడైన నుండ,
మాటిమాటికి చావుకై క్రుంద నేల?

# చిన్న పురుగు

అడుగు మోపకు మర్కటా! దుడుకు మీఱ
దిక్కుమాలిన పురుగును త్రొక్కెదు సుమి;
నీచముగ నీవు నిరతంబు చూచుచున్న
చిన్నిపురుగును దేవుఁడే సృష్టి చేసె.

జీవకోటుల నెల్ల సృజించినట్టి
సృష్టికర్తయె నిన్ను సృజించినాఁడు;
తన యనంత కృపామృతధార నతఁడు
పురుగుపైఁ గూడ నొక్కింత దొరఁగఁజేసె.

చంద్ర సూర్యుల తారకా సముదయముల
సకలజీవుల కాతఁ డొసంగినాఁడు;
పురుగులును నీవు నడవంగ పుడమిమీఁద
గరికపోచతివాచీలఁ బఱచినాఁడు.

అల్పకాలము మాత్రమే యనుభవించు
చిన్నిసౌఖ్యము దానిని జెందనిమ్ము;
నీ వొసంగఁగఁ జాలని జీవములను
ఏల తీసెద వక్కటా: జాలిమాలి?

# గ్రంథము - ప్రకృతి

లెమ్ము! లేలెమ్ము! సోదరా! లేచి రమ్ము!
కట్టిపెట్టుము చప్పిడి గ్రంథములను;
శ్రమముపడ నేల? సతతంబు చదివి చదివి?
పఱపు మొకసారి నీ దృష్టి ప్రకృతి దెసకు.

చూడు, మల్లదె సోదరా, సూర్యుఁ డెల్లు
నింగిపైనుండి నిరతంబు నేలపైకి
పచ్చనైనట్టి తన నులివెచ్చ కిరణ
పుంజముల జిమ్ముచున్నాఁడొ సంజవేళ.

అదిగొ! యా గుజ్జుమామిడికొమ్మమీఁద
పాడుచున్నది కోయిల వేడు కలర;
ఓహొ! ఆ గాన మెంత మనోహరంబు!
గ్రంథములకన్న నందె విజ్ఞాన మలరు.

— ...ళ

చిమ్మచీఁకటిగొందిలో చివికె దేల?
ఇవల వెలుతురులోనికి నిట్టె రమ్ము;
పొత్తముల నేమి యున్నది చెత్త గాక?
ప్రకృతియె నీకు బోధించు పరమగురువు.

ప్రకృతియందలి సుందరవస్తుచయము
జనుల మనముల కుత్సాహజనక మగుచు,
సదమలజ్ఞాన మారోగ్య మొదవఁజేసి,
అభినవవికాస మొనఁగూర్చి యలరఁజేయు.

బుధవరేణ్యులు బోధించు బోధకన్న
ప్రకృతియందలి బహువిధ వస్తుసమితి
అవగత మొనరుచు సృష్టిరహస్యములను;
గ్రంథములకన్న ప్రకృతియే ఘనతరంబు.

ప్రకృతి యొదవించు జ్ఞానంబు రమ్యతరము;
శాస్త్రములలోని మిడిమిడి జ్ఞానమెల్ల
సృష్టివస్తుల సౌందర్య సౌష్ఠవమును
వికృత మొనరించి దాని తబ్బిబ్బు సేయు.

—విన్ని

చాలు చాలును - ఈ శాస్త్రచర్చ లేల?
రోత పుట్టించు పొత్తముల్ మూతవెట్టి.
ఈవలికి వచ్చి వేగ నీ యెడద విచ్చి
అవధరింపుము సృష్టిరహస్య మెల్ల

# నడపుమా !

ఓ నిరంతర దివ్యతేజోనిధాన!
దారి చూపుమ నీ సన్నిధానమునకు;
చిమ్మచీఁకటి దెసలెల్లఁ గ్రమ్ముకొనియె,
వడిగ వెలుతురులోనికి నడపు మయ్య!

దారి తప్పితి, దవ్వు నీ ధామ మిటకు,
అడుగు తడఁబడు, మై గడగడ వడంకు,
ఒక్క యడు గైన నడవంగ నోప నింక!
నడపుమా నీదు చేయూఁత నా కొసంగి.

దారిలో నిండి నిబిడీకృతముగ నుండె,
రాళ్ల గుట్టలు, బురదయు, ముళ్లపొదలు;
వాని దాటించి తెలతెల్లవారువేళ
రాజబాటను నన్ను జేర్పంగదయ్య!

కన్ను గానక మదముచే నిన్ను మఱచి
గడపియుంటి గతించిన కాల మెల్ల;
నీదు కృప యింత నేఁడు నామీఁదఁ బఱపి,
ఉద్ధరింపుమ దరిఁ జేర్చి ఓ యనంత!

నాదు జీవిత మెల్ల నీ పాదకమల
సేవ చేయఁగ నేర్పుమా దేవదేవ!
హృదయమునఁ గల్గు దైనికవ్యథల నెల్ల
తాల్మితో నోర్చుకొన నాకు ధైర్య మిమ్ము.

నాదు చేతలచేత మనంబుచేత
నీ యనుజ్ఞను తలదాల్ప నేర్పు మయ్యా!
నాదు సర్వము నీ కర్పణంబు చేసి
నిరతమును నిన్ను ధ్యానింప నేర్పు మయ్య

అఖిలజనులను ప్రేమతో నాదరించి,
అలుక యెఱుఁగక, మదియందు కలకలేక
అంత్యకాలము దాపించునంతదాక
ఓర్పుమై వేచియుండఁగ నేర్పు మయ్యా!

# ప్రకృతి - సృష్టికర్త

ఆ మహామహిమోన్నతం బైనయట్టి
గగనతలమును, అందలి గ్రహగణంబు
ఈశు ఘనదివ్యలీలావిలాసములను
వేయివిధములఁ బ్రకటించు విశ్వమునకు.

దినదినంబు నభోవీథిఁ దిరిగి తిరిగి
తనదు కిరణంపురాజిచే ధరణి కెల్ల
దివ్యకాంతుల వెదజల్లి దినకరుండు
విశ్వనాథుని మహిమల వెల్లడించు.

సవితృఁ డస్తమించినయంత చందురుండు
చదలిమీఁదను వెలుఁగొంది చల్లనైన
పండువెన్నెల లెల్లెడ నిండఁజేసి
ప్రకృతిలీలల నెల్ల నుపన్యసించు.

— రా

చంద్రునిచుట్టు తారకా సముదయంబు
మినుకు మినుకని మెఱయుచు మింటిమీఁద.
తమదు సందేశము లొసంగి ధరణి కెల్ల
స్వప్రకాశుని మహిమలఁ జాటుచుండు.

నీలిగోళంబు చుట్టును దేలియాడి
మెలఁగు నివి యన్ని తమ్ము నిర్మించినట్టి
పరమపురుషుని లీలలఁ బాడుచుండు
తమదు నీరవ ముక్తకంఠములతోడ.

# యత్నము

యత్న మొనరింపు సోదరా! అనుదినంబు;
తొలుదొలుత నీకు విజయంబు కలుగదేని,
పూన్కి వీడక ఫలసిద్ధి పొందుదాక
జతన మొనరింపు క్రమ్మర, జయము కలుగు.

ధృతి దొలంగక, మదిని నిస్పృహను వీడి
కార్యసాఫల్య మగుదాక కడఁగు మయ్య!
జయము గాంతువు తప్పక, భయముపడకు,
సాయ మొనరించు దైవంబు సత్క్రియలకు.

పోరు గావించి రిపులతో బ్రూసురేఁడు
ఆరుసారులు నపజయ మంది, తుదకు
జయము గాంచఁడె ఏడవసారి పోరి
వైరివీరుల నెల్లను పాఱఁదోలి?

పెక్కుబన్నము లొదవిన లెక్కగొనక
కడఁగి వేలుపు లమృతంబు బడయలేదె?
అట్టులే నీవు పట్టిన పట్టు విడక,
యత్న మొనరించి ఫలసిద్ధి నందు మయ్య.

భూరియత్న మొనర్చి భగీరథుండు
గంగఁ గొనితెచ్చె భువికి నాకమునుండి.
విఘ్నములు పెక్కు గలిగిన వెనుదివియక;
నిశ్చితార్థము విడుతురే నిపుణమతులు?

సకల జనులను గావింపఁ జాలినట్టి
కార్యములు నీవు నెఱవేర్పఁ గలవు గాన,
పట్టుదలఁ బూని చేయుమా పనుల నెల్ల;
కాలమే నీకు సమకూర్పఁ గలదు ఫలము.

# సత్పురుషుఁడు

ఎవని యకలంక హృదయంబు హేయమైన
యత్నములనుండి, పాపకార్యములనుండి,
దుష్టచింతనములనుండి దూర మగునొ,
వాఁడె రమణీయ నిర్మలవర్తనుండు.

వెతలు లేని ప్రశాంత జీవితము గడపి,
హాని యెఱుఁగని యానంద మనుభవించు,
లోనుగాఁ డాతఁ డెపుడు ప్రలోభములకు,
ఖేద మొందఁడు లేశంబు క్లేశములకు.

అరులదాడి నెదుర్కొన నాతఁ డెపుడు
కాంక్ష సేయఁడు కోటలు కవచములును;
అరులపై దాడి సలుపఁగ నాతఁ డెపుడు
వాంఛ సేయఁడు ఖడ్గముల్ బల్లెములును.

శోకమందలి యల్లకల్లోలములను,
భయద దారుణ ఘోర బీభత్సములను
లీల మైనను మదియందు లెక్కగొనక
కాల మవలీల స్వేచ్ఛమై గడపు నతఁడు.

విధికృతంబునఁ దొడరెడు వ్యథల నతఁడు
స్వాంతమున నించుకేనియు సరకుగొనక
తనదు సదనంబు నందనోద్యానముగను,
తనదు చరితంబు వేదశాస్త్రముగఁ జేయు.

సద్గుణంబులె తన యాత్మసఖులు గాఁగ,
వినయవర్తనమే తన ధనము గాఁగ,
ధరణియే తన ధర్మసత్రంబు గాఁగ,
జీవితమె తీర్థయాత్రగఁ జేయు నతఁడు.

# పర్వతము - ఉడుత

వినుఁడు జనులార! చెప్పతే దనెద రేమొ-
చెప్పుచుంటిని మీ కిదే చిత్రకథను,
చిన్న దని దాని చులకన చేయవలదు;
చిట్టి దయ్యును మిరియంబు చెడునె ఘాటు.

అనఁగ ననగ నొకానొక యద్రి గలదు,
దానిశిఖరాలు తారాపథాల నంటు;
ఉడుత యొక్కటి దానిపై నున్న తరువు
మీఁది తెగఁబ్రాకి ఫలముల మెక్కుచుండె.

ఉడుత యుడుతఁడు దుడుకునఁ దొడరి సేయు
దుండగంబుల కా కొండ మండిపడుచు,
ఇట్టు లనె దానితో "ఓసి తుట్టపురుగ!
కనులు గానవ! నీ కింత కావరంబ?

అరరె! నే నెంత, నీ వెంత? ఇరువురకును
హస్తిమశకాంతరము కాదె యరసి చూడ?
ఉప్పరం బంటు నా మేటి కొప్పరములు,
ఈవా నేలకు బెత్తె డెత్తేని లేవు.'

ఉడుత యా మాటల కొకింత యుదిలగొనక,
'అయ్య! పర్వతరాజ! నీ వన్నయట్లు,
అధికుఁడవు నీవు, అల్పుఁడ నగుదు నేను;
అయిన, ప్రజ్ఞలు తాఱుమా రగును గాదె!

అవని నీ వెంత యధికుండ వైన నేమి,
మెదల నేరవు నీ వున్న మేరనుండి;
అరయ నే నెంత యల్పుఁడ నైనఁ గాని,
ధరణి యెల్లెడ చుఱుకుగాఁ దిరుగఁగలను.

నేను నీవలె పెద్దను గాను గాని,
నీవు నావలె చిన్నవు గావు చూవె!
కటికిరాళ్లను మోయంగఁ గలవు కాని,
గుఱుములను నీవు నావలె కొఱుకఁ గలవె?

# ప్రేమ

గిరులమీఁదను, మబ్బుదొంతరలలోన,
కడలితరగలయందును, గహ్వరముల,
భూమిగర్భములోపల ప్రేమ జొచ్చు;
ప్రేమ చొరలేని చోటులు భూమిఁ గలవె?

కాననంబుల, తారకాగణములందు,
తరణి చంద్రులయందు, పాతాళమందు
ప్రేమ ప్రవహించు నెల్లెడ-వేయి యేల-
ప్రేమ చొరరాని తావులు పృథివి లేవు.

గాలి కవియని నెలవులఁ గవియఁ గలదు
ఇరులు దూరని యిరవులఁ దిరుగఁగలదు,
కవియు రవియుఁ గానని చోట్లఁ గాంచఁ గలదు;
ప్రేమ చనలేని సీమ ధరిత్రిఁ గలదె?

కొందరందురు ప్రేమను గ్రుడ్డి దంచు,
పిరికిపంద యటంచును, పిచ్చి దంచు;
ఎంద రెన్నివిధంబుల నెంచ నిమ్మ-
దాని వారింప నేరికి తరము కాదు.

కంచుతలుపుల నడుమ బంధించి దాని,
పిచ్చికత్తుల పహరాలఁ బెట్టనిండు,
వాని నన్నిటి నెటో పటాపంచ చేసి
ప్రేమ విహరించు నిచ్చలు విచ్చలవిడి.

ఒడిసి పులిమీస లుయ్యాల లూఁగవచ్చు,
కూడి చిలువతో చెలగాట లాడవచ్చు,
అలుగుమొనమీఁద నాట్యంబు సలుపవచ్చు,
తొడరి నిప్పులగుండాన దూకవచ్చు.

ప్రణయవాహినీ వీచీపరంపరలను
అడ్డువెట్టుట కెవరికి నలవి కాదు;
ప్రేమ యొక్కెడ దృష్టి సారించెనేని,
లీల రెక్కలు గట్టుక వాలు నచట.

ప్రేమకును లోనుగానట్టి దేది కలదు?
ప్రకృతిరమ్యప్రదర్శనరంగమునను
సకలమైన చరాచరజాలమందు
నిండి నిబిడీకృతం బయి యుండు ప్రేమ.

ప్రేమ దేవుండు, ప్రేమయే విశ్వ మెల్ల,
ప్రేమయే సృష్టికంతకు ప్రేరణంబు;
ప్రేమ యను వస్తు వొకటి లోపించెనేని
లోక మంతయు నల్లకల్లోల మగును.

# స్వతంత్ర జీవనుఁడు

ఒరుల యానకు దోసిలి యొగ్గనట్టి
వాఁడు ధన్యుఁడు, భాగ్యజీవనుఁ డతండు;
మంచిహృదయమె యాతని కంచుకంబు,
అమలవర్తనమే వాని యంగరక్ష.

చెడ్డపనులను చేయంగ సిద్ధపడఁడు,
లోకనిందల కాతండు లోనుగాఁడు,
యశము నార్జింపంగా నతఁడాశఁ గొనఁడు,
మరణ మన్న నొకించుక వెఱపు గొనఁడు.

పరుల కైవారములు సేయఁ బాలువడఁడు,
ఉబ్బుమాటల కతఁడు తబ్బిబ్బు గాఁడు,
లేమి కల్గిన లేశంబు క్లేశపడఁడు,
ఒరుల సంపదల కసూయ నొందఁబోఁడు.

హేయ మగు నూడిగము సేయ నిష్టపడక
సతత మీశ్వరసేవయు, సాధుగోష్ఠి,
గ్రంథపఠనంబు చేయుచు కాల మెల్ల
నిచ్చ మీఱఁగ నాతండు బుచ్చుచుండు.

వృద్ధి నొందఁగ నతని కపేక్ష లేదు,
పతన మొందఁగ నతనికి భయము లేదు;
ఏల లేకున్న జానెడు నేలయైన
సకల జగమున కాతఁడే చక్రవర్తి.

# కోయిల - మిణుగురు

చల్ల నగు నొక్క యామని సంజవేళ
గుజ్జుమామిడిగున్నపై కూరుచుండి
వేడు కలరఁగ కోయిల పాడుచుండె,
ఎల్లజనముల యుల్లంబు లుల్లసిల్ల.

అంత కొంతసేపటి కది యలసి సొలసి
ఆఁకటను కుక్షి నకనక లాడుచుండ,
దెసలఁ బరికించి పొదలపై మసలుచున్న
పురుగు నొకదానిఁ గనుఁగొనె ముదము మీఱ.

మినుకు మినుకను కాంతుల మెఱయుచున్న
దాని మిణుఁగురుపురుగుగా నెఱింగి,
ఖాళిమై దాని నారగింపంగ నెంచి
ధరణిపై వ్రాలె కోకిల తరువునుండి.

తన్ను కోయిల భక్షింపఁ దలఁచి యిట్లు
వచ్చియుండుట యెఱిఁగియు భయము గొనక
సరస గంభీర వాగ్ధాటి మెఱుఁగుపరుగు
ప్రియము గులుకంగ వచియించె పికముతోడ:

'చోద్య మగు నాదు తనుకాంతిఁ జూచు వేడ్క-
నరగ వచ్చితె గాయకసార్వభౌమ!
మధురతరమగు నీ గానసుధల నేఁడు
కాంతుమైఁ గ్రోలు భాగ్యంబు కలిగె నాకు.

నిన్ను చేసిన దేవుఁడే నన్ను చేసె;
సకల జీవులు నానందజలధిఁ దేల
గాన మొనరింప నిన్నును, కాంతి జూప
నన్ను దేవుండు నిర్మించినాఁడు కాదె!'

దాని పలుకుల కలరి యా గానమూర్తి
తనదు చేతల కెంతయు వనటనొంది;
ప్రీతి మీఱఁగ దానిని విడిచిపుచ్చి
అరిగె వేఱొక్కచోటికి నాహరింప.

# నిర్ణయింపఁజాల

కమ్మతావుల నొలికించు తమ్మి జూచి
సుందర మ్మగు నీ మోము జూచినపుడు,
తమ్మి నెమ్మోమొ, నెమ్మోము తమ్మిపువ్వొ
నిర్ణయింపఁగ లే కట్టె నిలిచియుందు.

కోమలం బగు కలువరేకులను జూచి
సోగ లగు నీదు కన్నులఁ జూచునపుడు,
కలువరేకులు కన్నులో, కనులు కలువ
రేకులో నిర్ణయింపఁగ లేకయుందు.

లలిత మగు లేత చివురుగుత్తులను గాంచి
కమ్ర మగు నీదు కెమ్మోవి గాంచినపుడు,
లేఁతచివురులు మోవియో, లేక మోవి
లేఁతచివురులొ తెలియంగ లేకయుందు.

తళుకు గులికెడు మెఱుఁగుటద్దములఁ జూచి
నున్న నగు నీదు చెక్కులఁ గన్నయపుడు,
అద్దములు నీదు చెక్కులో, నిద్దమైన
చెక్కులే యద్దములొ నేను చెప్పఁజాల.

# విరాగి

"సంయమివరేణ్య : ఓ దీనజనశరణ్య !
ఘోరవనముల గాఢాంధకారమందు
తెన్ను దెలియక యొంటిమైఁ దిరుగుచుంటి.
కావుమా నన్ను దరిజేర్చి కరుణతోడ !

ఏమి చిత్రమొ కాని-దవ్వేగు కొలఁది
ఘోర భీకర రవముల గొంద్రు మంచు
బొబ్బరింతలు వెట్టు బెబ్బులులె కాని,
కానరా దొక్కయిల్లైన కానలోన.

అడుగు తడఁబడు, మై గడగడ వడంకు,
ఒక్కయడుగైన నడవంగ నోప నింక;
దవ్వుగా వెల్గుచున్నది దివ్వె యదిగొ!
నన్నుఁ గొనిపొమ్మ, అ దివ్వె యున్న యెడకు."

"ఈశ్వరుఁడు నీకు శుభముల నిచ్చుఁ గాక!
రాత్రివేళల భీకరారణ్యములను
సంచరింపకు పాంథుఁడా! సాహసమున;
క్రూరమృగములు స్వేచ్ఛగాఁ గ్రుమ్మరిల్లు.

దారుణంబగు హృదయవేదనలఁ దూలి
సదనముల వీడి కానల సంచరించు
దీనజనులకు నేవేళ నైనఁ గాని
ఆశ్రయంబగు నా పేద యాశ్రమంబు.

ఖడలికలు వాయ నేఁడు నా గుడిసెలోన
మేను వాలిచి ప్రీతితో నే నొసంగు
ఆమెతల నెల్ల కడుపార నారగించి
విశ్రమింపుము నాదు దీవెనల నంది.

కొలదయడుగున పొలముల నుండి తెత్తు
పాలు కూరలు పండ్లు దుంపలు భుజింప;
పాన మొనరింప శుద్ధమౌ స్వాదుజలము,
పండుకొనుటకు వెచ్చని పరుపు నిత్తు.

తెరువరీ ! నీదు వెత లెల్ల మఱచి పొమ్ము-
ఐహికంబగు కోరిక లస్థిరములు;
జనుల వాంఛలు స్వల్పముల్ జగతియందు,
వాని నెల్లను సమకూర్చ వనమె చాలు.''

చల్ల నగు మంచు బిందులు చదలనుండి
తొరఁగు కరణిని, సంయమివరుని మధుర
భాషణంబులు తొలుకాడ, బాటసారి
మాఱు పలుకక వెడలె నా మౌనివెంట.

దట్టమైనట్టి యా కాన నట్టనడుమ
కొండచెంగట నా పూరిగుడిసె యలరె,
పతితజనముల పాలిటి పట్టుకొమ్మ,
పేదవారల పాలిటి పెన్నిధి యయి.

ఎపుడు జలజల ప్రవహించు నేటిదరిని
అల్లిబిల్లిగ పూఁదీఁగ లల్లుకొనిన
ఆ కుటీరము చెంతకు నరిగి వారు
గడప దాటిరి కాంతులు నడలు కొనఁగ.

లోన నడుగిడినంతనే మౌనివరుఁడు
గూటిలో నున్న దీపంబు కొడిని రాల్చి
పొయ్యిలోపలి నిప్పుల బుగులుకొలిపి
పీటమీఁదను కూర్చుండఁబెట్టె నతని.

అరటియాకున వివిధభక్ష్యముల నునిచి
కోరికలు మీఱ వడ్డించి కొసరి కొసరి,
వానిచెంగటఁ గూర్చుండె మౌనివరుఁడు
చిఱునగవు నెమ్మొగమ్మున తురగలింప.

మలయపవనుండు మెలమెల్ల మలయుచుండె,
కమ్మతావులఁ గుసుమముల్ గుమ్మరించె,
కొదమకోయిల కో యని కూయ సాగె,
నింగిపై నుండి జాబిల్లి తొంగి చూచె.

వీని యన్నిటి పథికుని మానసంబు
లోని నెవ్వగ లుపశమిల్లుచు మాఱు.
అంతకంతకు పెల్లుగా నతిశయిల్లి
కనులవెంబడి బాష్పముల్ కాల్వగట్టె.

అతని పరితాపమును గాంచి యతివరుండు
జాలిగొని తాను వానితోఁ బాలుగొనుచు,
పలికె నీరీతి కూరిమి మొలకలెత్త,
"ఏల యీలీల నేడ్చెదు బేలవోలె?

గెంటిరే నిన్ను తలిదండ్రు లింటి నుండి?
పంచితివె వైరివరులకు పెంచి నీవు?
ఆదరింపదె ప్రియురాలు నీదు వలపు?
డెందమున నిట్లు కొందల మంద నేల?

జగతియందలి సౌఖ్యసంచయము లెల్ల
శాశ్వతంబులు గా, వవి నశ్వరములు;
అల్ప మగు వాని నాసించి యఖిలజనులు
బెంగపడెదరు వానిని బడయలేక.

ప్రేమ యనునది యక్కటా! వెఱ్ఱి కాదె!
పై మెఱుంగులఁ గాంచి విశ్రాంతి పొంది
రమణిఁ బ్రేమింప, నామె నిరాకరించు;
ఎండమావుల వంటిది యింతివలపు."

అంచు నా మౌని యింక వచించుచుండ,
పెదవు లదరంగ, మానస మదవదవడ,
ఉస్సురుసు రని వేడి నిట్టూర్చు పుచ్చి
ఏమి పలుకక బాలుండు మోము త్రిప్పె.

ఔర! ఎటనుండి వచ్చెనో యతని కంత
బెళుకుచూపులు, నునుసిగ్గు, కులుకునడలు;
ఉన్నయటు లుండి యా బాలుఁ డొక్కసారి
సుదతిగా మాఱె తద్దయు చోద్య మొప్ప.

చరణముల నేల వ్రాయుచు, శిరము వంచి,
గద్గదిక తొట్రుపాటును గడలుకొనఁగ,
పలికె నా బాల సన్నని మెలుఁగుతోడ
పలుకు పలుకునఁ దేనియ లొలుకుచుండ.

"దిక్కుమాలినయట్టి యీ దీనురాలి
నేరముల నెల్ల నీవు మన్నింపు మయ్య;
ఈవు దేవుఁడు వసియించు నీ కుటీర
సీమ నపవిత్రపఱచితి, చోరి నేను.

వాడు జనకుండు 'శుచిమతి' నగరనేత,
రమ్యవిభవుండు, తేజోవిరాజితుండు;
వాని ఏకైక పుత్రికనైన కతన,
అతని యాస్తి కంతకు నేనె యర్హురాల.

నాదు ధనమును నన్నును నాదికొనఁగ
వరుస నెందరో యువకులు వచ్చి, నన్ను
స్తుతు లొనర్చిరి చక్కని చుక్క యంచు;
ఒక్కఁడును నాదు మనసున కెక్కఁ డయ్యె.

అరిగి రెల్లరు వారు హతాశు లగుచు;
ఒకఁడు మాత్రము నను వీడ నొల్లఁడయ్యె.
సిరి పదవియు నతనికి లేవు గాని,
సుగుణ మాతని పెట్టని సొమ్ము సుమ్మి.

చెలువు గలవాఁడు, చిఱునవ్వు గులుకువాఁడు,
హొయలు గలవాఁడు, మవ్వంపు వయసువాఁడు,
ఇవ్వి యన్నియు నటు లుండనిచ్చి-నాదు
చిత్తమును చాల రంజిల్లఁ జేయువాఁడు.

పూవులాదరింతుఁ గమ్మని తావు లొలయ,
ప్రేమగీతము లతఁ డాలపించుచుండు;
వాని తీయని చల్లని గాన సుధలు
విందు లొలికించు హాయిగా వీనుగవకు.

వాని వలపులగాలి నా వాంఛ లనెడి
యలల నుత్తుంగ తూగించె, నైనఁ గాని
త్రోసిపుచ్చితి నక్కటా! బైసిమాలి
వాని నిర్వ్యాజ నిర్మలమైన ప్రేమ.

క్రించుదనమున నేను గావించినట్టి
చేతలకు వాఁడు బ్రదుకుపై రోతఁజెందె
నన్ను నా గర్వమును వీడి, ఖిన్నుఁ డగుచు
వనములకు నేగి యచ్చట తనువు దొరఁగె.

క్రూర మగు నాదు ఘోరాపచారమునకు
ప్రతిఫలంబును ననుభవింపంగఁ దలచి,
అతఁడు చూపిన మార్గంబు ననుసరింపఁ
ద్రిమ్మరిలుచుంటి ఘోరవనమ్ములందు.

అతఁడు నాకయి గావించినట్టిరీతి
అతనికొఱకయి నేనును నాచరింప,
ఒంటిగాఁ గాననంబుల వెంటఁ దిరిగి
ఎటులో గ్రుక్కెడు ప్రాణంబు లీఁగుదాన."

"పాపము శమించుఁ గాక! నా 'ప్రమదరాణి'
ఎట్టి సాహసమున కొడిగట్టినావు!"
అనుచు నామెను బిగికౌఁగిటను గదించి
ఇట్టులనె యోగి యనురాగ ముట్టిపడఁగ :

"రమణి మిన్నరొ! నీదు సర్వస్వ మెల్ల
నెవని కొఱకయి త్యజియింప నెంచినావొ,
అమ్మహాభాగ్యరాశి 'సుధాకరుండు'
నిల్చియున్నాఁడు జీవమ్ము దాల్చి యిడుగో!

నేఁడు మొదలుగ గడెయైన వీడకుండ
అరమరలు లేని కూర్మల ననఁగి పెనఁగి,
కొదలు దీరని కోర్కులఁ గూడి మాడి
వలపు లిగురొత్త నుందము కలసి మెలసి."

పొమ్ము దుఃఖమ ! సౌఖ్యమా, రమ్ము వేగ !
ఎవతె యందని ఫలమని యిన్నినాళ్ళు
తలచిఁ యుంటినో, అట్టి యా లలన నేఁడు
దక్కినది నాకు నవలీలఁ దనకుఁ దానె.''

# ముక్కు—కన్ను సంవాదము

వినుఁడు, జనులార ! వినిపింతు వింతకతను-
'ముక్కు కన్ను వివాదంబు' ముచ్చటలర,
అల 'సులోచన' మెవ్వారి హక్కటంచు
కలహమాడిరి వారలు చలము మీఱ.

'కళ్లజో' డని పిలుతురు కాన, దాని
హక్కు నా దని వాదంబులాడె కన్ను ;
అందరును దాని 'ముక్కద్ద' మందురు గాన,
నాది హక్కని నాసిక వాద మాడె.

ఏరితో చెప్పుకొన్నను వారి తగవు
అంతకంతకు నతిశయం బగుచు, కాని,
దాని తీర్చెడువా రెందుఁ గానరామి,
అరిగి రంతట నిరువురు న్యాయసభకు.

చతురమతియును విజ్ఞానయుతుఁడు నీతి
మంతుఁడగు నాల్కయే వారి మధ్యవర్తి;
అఖిలశాస్త్రవిశారదుఁ డైన చెవిని
వారు న్యాయాధికారిగా కోరుకొనిరి.

ధర్మదేవత యెదుట ప్రత్యక్షమయ్యె
ననఁగ, కూర్చుండె చెవి యున్నతాసనమున;
నిండుకొలువున వాని సన్నిధిని నిలిచి,
వినయమున నాల్క యిట్లని విన్నవించె:

"అవధరింపుడు - దేవరా! సావధాన
చిత్తమున నాదు వాదము చిత్తగించి,
మేలు మే లని యెల్లరు మెచ్చుకొనఁగ
మీఁద సెలవిచ్చెదరు గాక మీదు తీర్పు.

ఉభయ పక్షమువారల యోగ్యతలును
చక్కఁగా పరామర్శించి చర్చచేసి,
ఓలి సారాంశములఁ దెల్పి, యుష్మదీయ
దివ్యచిత్తమునకు నివేదించువాఁడ.

ముక్కు పక్షము వాదింతు మొట్టమొదట:
తరతరంబులనుండి యద్దాలజోడు
పూనుచున్నది కావున, ముక్కు దాని
హక్కుభుక్తము లన్నియు ననుభవించు''

అనుచు వచియించి, యా సులోచనము నెత్తి,
తనదు ముక్కున ధరియించి, యనియె నిట్లు:
'అరసితిరె దీనినడుమ నున్నట్టి వంపు
చక్కఁగా నెట్టు లమరెనొ ముక్కుచుట్టు?

ఇంత యేటికి - ముక్కు లేదేని, నరుఁడు
దాని నేరీతి నెచ్చోట దాల్పఁగలఁడు?
ఇందుబట్టి విచారింప నెవరి హక్కొ,
తేటతెల్లముగా మీకె తెలియఁగలదు.

పెక్కుమాట లిఁకేల - ఇంకొక్కమాట
లోన విరమించుచుంటి; సులోచనంబు
నిక్కముగఁ జేయఁబడినది ముక్కుకొఱకె,
ధాత నిర్మించె ముక్కును దానికొఱకె.'

అంత నాతఁడు ధోరణి యట్టై మార్చి
కన్ను పక్షము వాదించెఁ, గాని వాని
మాట లొక్కింత సూటియు పాటి లేక
సారహీనములై తోఁచె సభ్యతతికి.

సరస గంభీర ధారాళశైలితోడ
ధాటిమై తీర్పు చెప్పె నా ధర్మకర్త:
'నేఁడు మొదలుగ నద్దాలజోడు ముక్కు
పూన్చినపు డెల్ల కన్నులు మూయవలయు.'

# జీవమా!

ఎవరవో నీవు జీవమా! ఏ నెఱుంగ
నీవు నేనును బాయుట నిక్క మంచు
ఎఱుఁగుదును, కాని మన మెప్పు డెచట నెట్లు
కలసికొందుమొ క్రమ్మర తెలియఁజాల.

ఇంతకాలమునుండియు నీవు నేను
కలసియుంటిమి కష్టసుఖంబులందు;
అకట! చిరకాల మిత్రుల మైన మనము
బాసియుండుట కరము దుర్భరము కాదె?

జీవమా! నేను నీ కిదే చెప్పుచుంటి:
ఎప్పు డైనను సరియె-నీ యిచ్చవచ్చి
నప్పు, డించుక నాతోడ చెప్పకుండ
చల్లఁగా మెల్లఁగా నీవు జారిపొమ్ము.

# ఆజ్ఞ యొసఁగుము

ఆజ్ఞ యొసఁగుము, జీవింపు మంచు నన్ను,
తరుణి! జీవింతు నీ పాదదాసుఁడనయి;
ముదలవెట్టుము, నా ప్రేమ మొసఁగు మంచు,
హృదయపూర్వకమైన నా ప్రేమ మిత్తు.

ఆనతి యొసంగు, మెన్నియేండ్లైన నన్ను
వేచియుండు మటంచు నో వెలదిమిన్న!
నీ యనుజ్ఞను తలదాల్చి నిలిచియుందు
నాదు తనువున జీవ మున్నంతదాక.

అనుమతింపుము, విలపింపు మనుచు నన్ను,
కనుల నశ్రులు కాల్వలు గట్ట నేడ్తు;
ఆనసేయుము, నీపయి నాస వీడు
మనుచు, తోడనె వీడెద నాస నేను.

సెల వొసంగుము జీవంబు తొలఁగు మనుచు
తొరనే యంత నీ పాదతోయజముల
మీద నా మౌళిఁ గిలించి మోద మొప్ప
ప్రాణ మవలీల నర్పించువాఁడ నీకు

నీకు నర్పించు నా ప్రేమ నిర్మలంబు,
నిరుపమానము, నిద్ధంబు, నిట్టలంబు;
అట్టి నిశ్చల నిర్వ్యాజమైన ప్రేమ
బడయఁజాలవు నిఖిలవిశ్వంబునందు.

నాదు ప్రణయంబు, మానంబు, నా ధనంబు,
నాదు హృదయంబు, నాదు ప్రాణంబు నీవె;
నేను జీవంబుతో నున్న నీదుకొఱకె,
నేను జీవంబు దొరఁగిన నీదుకొఱకె.

# నా చిన్ననాఁటి చెలికాండ్రు

ఏను తలఁచినయంత నా మానసమున
కానవత్తురు స్వర్గస్థు లైనవారు,
ఆ మహాత్ములు నా కూర్మి యనుఁగు సఖులు;
సంతతము నేను వారిని సంస్మరింతు.

అరమరలు లేని కూర్ముల ననఁగి పెనఁగి
లీలమై నాటపాటలఁ దేలియాడి,
మెలఁగితిమి వారు నేనును కలసిమెలసి
అకట! వా రెల్ల నను వీడి రొకరొకరుగ.

బాళి నా కష్టసుఖములఁ బాలుగొనుచు
వారు నా కొనర్చిన యుపకారములను
తలఁచినపు డెల్ల నా మేను జలదరించి
కనులవెంబడి బాష్పముల్ కాల్వగట్టు.

కొంతకాలము వారితోఁ గూడిమాడి
వారి యెనలేని ప్రేమను చూఱగొంటి;
మధురమగు వారి యుపదేశసుధలఁ గ్రోలి
అలవరచుకొంటి నా జీవితాశయముల.

వారితోనె గతించె నా కోరికలును,
ఆశయంబులు, నా యభిలాష లెల్ల;
అవనిలో నేను బ్రతికియున్నంతదనుక
వారి ఋణమును నేను తీర్పంగఁజాల.

వారితో నుండ, మాటాడ వారితోడ,
వారితోఁ గూడి తిరుగాడ వాంఛసేతు;
వారి విడనాడి యెక్కటా! బ్రతుకఁజాల,
నన్ను గొనిపొమ్ము దేవ! వా రున్నయెడకు.

వర మహాత్ముల చేతలు, వాక్యములును
అనుదినంబును మన జీవితాశయముల
సిద్ధి గావించి యున్నతస్థితికిఁ దెచ్చు;
వారి కొనరింతు నా నమోవాకములను.

# హరిజన సోదరా!

'అంటరానట్టివాఁడవు, కంటు నిన్ను
జూచినంతనె పాపముల్ చుట్టు' నంచు
పదరి తిట్టుచు నల్లరిపాలు చేసి
దూరముగ నిన్ను తఱుముచున్నారు జనులు.

తూములను కుళ్ళు, వీథుల తుక్కు నెత్తి,
దొడ్లయందలి మలమును తుడిచి నీవు
సకలజనులకు సేవలు సలుపుచుండ,
నైచ్యముగ నిన్ను చూచుచున్నారు జనులు.

అపరిశుద్ధత నోర్మిమై నపనయించి
విశ్వమున కీవు మేలు గావించుచుండ,
అపరిశుద్ధుఁడ వంచు ని న్నఖిలజనులు
పాఱఁదోలుచునున్నారు పరిభవించి.

పొలములను దున్ని, తెన్నుగా కలువు దీసి
ఎల్లజనులకు కూడు నీ విడుచునుండ,
తినఁగ తిండియు లేకుండ జనులు నిన్ను
కప్పిపెట్టుచున్నారు వస్త్రపెట్టి,

బహుదినంబులు శ్రమపడి బావి త్రవ్వి,
ఎల్లరికి నీవు జలముల నిచ్చుచుండ,
కుత్తుకెండిన, నక్కటా! గ్రుక్కెడైన
నీరు గ్రోలంగనీయరు నిన్ను జనులు.

హేయ మగు మలమూత్రంబు లెత్తివైచి
తనదు శిశువులఁ బోషించు తల్లిరీతి,
మలిన మెల్లను తొలఁగించి మానవులకు
కూర్చుచుందువు సౌఖ్యంబు కూర్మి మీఱ.

పాలకడలిని పొడమిన హాలహలము
దారుణోజ్వలకీలల ధరణితలము
దగ్ధ మొనరించుచుండఁగ, దాని మ్రింగి
ఉద్ధరింపఁడె యీశ్వరుఁడుర్వి నెల్ల?

మలిన మనెడు పిశాచంబు తొలఁగఁద్రోసి
పారిశుద్ధ్యము తిరముగాఁ బాదుకొలిపి
పృథ్విఁ గాపాడ వెలసిన వేల్పు వీవు;
ఔరౌర! ఎంతటి ధన్యజీవనుఁడ వయ్య!

ఏహ్య మగు దాని జూచి యసహ్యపడుట
తగదు తగ దంచు నీ చరితంబుచేత
చాటుచుంటివి ధర్మంబు జగతి కెల్ల;
పూజ్య మగు నీదు త్యాగంబు పొగడఁ దరమె!

అనుపమం బగు సహనంబు నాత్మఁ దాల్చి
కులజు లొనరించు నవమానముల సహించి
కులజులకె నీవు సేవల సలుపుచుందు;
ఔర! నీవంటి పరమోపకారు లేరి!

ఇలను నాలుగుజాతులే వెలయుఁ గాని,
ఐదవది యగు వర్ణంబు లే దటంచు
స్పష్టముగ నెల్లరకు గీత చాటుచుండ,
పంచమునిగ నిన్ జనులు కల్పించినారు.

వర మహాత్ముఁడు మి మ్మెల్ల దరిని జేర్చి
తనదు జీవిత మెల్లను ధారవోసి
సకలకులంబులలో నీకు సమత గూర్చి
'హరిజనుం' డను బిరు దిచ్చి యాదరించె.

వెన్నునకు నీవు కడగొట్టు బిడ్డ వగుట,
అతఁడు ధరియించు 'మాల'గా నతము నిన్ను;
హరికిఁ గూర్చినవాఁడవై యలరు నీకు
అర్హ మగుఁ గాదె 'హరిజనుఁ' డనెడు బిరుదు!

లెమ్ము! హరిజనసోదరా! తమ్ము! నీదు
పున్నెములు పండె తొలఁగె నీ బన్నములిఁక,
నిండుకౌఁగిట నిను జేర్చి నిఖిలజనులు
ఆదరింతురు తమ కూర్మి సోదరునిగ.

# కులము

కులము కుల మంచు నేటికి కలవరింత?
జన్మమాత్రముచేతనే జాతి యగునె?
గుణము గలిగిన కులము సత్కులము గాని,
గుణము లేకున్న కులము దుష్కులము గాదె?

జననికడుపున జను లెల్ల జనన మొంద,
బ్రహ్మముఖముననుండియు, బాహువులను,
ఊరువులనుండి, పదముల నుద్భవిల్లి
రనుట యెట్టివివేకమో అరయుఁ డయ్య.

బ్రహ్మతత్వము తెలిసిన బ్రాహ్మణుఁ డగు,
క్షాత్రమునఁ దేజరిల్లిన క్షత్రియుఁ డగు,
వర్తకంబును కృషి చేయ వైశ్యుఁ డగును
క్షుద్రసేవ యొనర్చిన శూద్రుఁ డగును.

అధమవృత్తులఁ జొల్పెడి యధికుల మని
విఱ్ఱవీగెద రేటికో విప్రులార?
పరులసేవన మొనరించు బ్రాహ్మణుండు
అధముఁ డగు గాని, అగ్రణుం డగునె తలఁప?

జన్మమునఁ దొల్త శూద్రులే సకలజనులు,
అవల సంస్కారమున ద్విజుఁ డగు నరుండు,
వేదపాఠంబుచే నంత విప్రుఁ డగును,
బ్రహ్మ మెఱిగినపిదప తా బ్రాహ్మణుఁ డగు.

'వృత్తులనుబట్టి జాతు లుత్పత్తియయ్యె'
ననుచు మున్ను దయానందయతి వచించె.
'జగతి గుణకర్మలనుబట్టి జాతు లౌదవె'
ననుచు శ్రీకృష్ణభగవానుఁ డానతిచ్చె.

'పాపపంకిలచరితుండు బ్రాహ్మణుండె
యయ్యు. శూద్రునికంటె వాఁ డధమతముఁడు.
సత్య శౌచాది సద్ధర్మశాలి శూద్రుఁ
డయ్యు, వాఁడె విప్రుం' డనె వ్యాసమౌని.

‘మాల మా’ లని యేల గగ్గోలు సేయ?
‘మాట తప్పినయాతఁడే మాల గాని,
కులము చండాలుఁ డయ్యును కొఱత గలదె?’
అనుచు వేమనయోగీంద్రుఁ డాడలేదె?

జన్నిదము దాల్చినవె అగ్రజన్ములనుచు
పొంగిపొరలెద రేటికి వెంగలు లయి?
ధర్మదీక్షయె తన జన్నిదంబు కాని,
జన్నిదం బౌనె బారెడు కన్నెత్రాడు?

బొట్టు జుట్టును దాల్చుట ముక్తి యనుచు
పట్టి పెనఁగెద రేటికి పందలార?
జ్ఞాన వైరాగ్య సద్గుణగణమె కాని,
జుట్టు బొట్టును జ్ఞానంబు చూపఁగలవె?

భూతి పూసిన మాత్రన మోక్ష మనుచు
మురిసిపడియెద రేటి కో మూర్ఖులార?
నీతివర్తనమే భూతిపూత గాక.
బూడిదను పొర్లు గాడిద ముక్తిగనునె?

జలములను మున్గినంతనె కలదె ముక్తి ?
ఆత్మతీర్థమె ముక్తిద మగును గాక !
తీర్థజలముల మునుఁగుచుఁ దేలియాడు
మొసలి మీనుల కబ్బునే మోక్షపదవి ?

బ్రాహ్మణ బ్రాహ్మణేతర భావములను
పెనచి కలహింతు రేటి కో చెనటులార ?
బ్రాహ్మణుఁ డౌకండె మోక్షసామ్రాజ్య మెల్ల
నూగులాడునె కలకాల ముట్టిగట్టి ?

కులవిభేదన నిగళంబు కూలఁద్రోయ
లేనివాఁడు స్వారాజ్యంబు బూనలేఁడు;
ఉట్టి కెగురంగఁ జాలని యట్టివాఁడు
స్వర్గమెగురంగఁ దలఁచుట భ్రాంతి కాదె ?

మతము మత మంచు మాటికి మచ్చరించి
కాలు ద్రవ్వెద రేటికి కయ్యమునకు ?
మతికి సమ్మత మైనదే మతము సుమ్ము,
సర్వమతములయందలి సార మిదియ.

ఈ గ్రంథముద్రణకు ఔదార్యముతో
పదిహేను వందల రూప్యములను
విరాళముగా నొసగి తోడ్పడిన
శ్రీ వాసవీ సేవాకేంద్రము
హైదరాబాదు వారికి
కృతజ్ఞతా వందనములు.

# అంకితము

ఆంధ్ర మహిళాగాన కళావ్యవస్థాపకురాలు

శ్రీ నాళము కృష్ణారావుగారి సతీమణి

నా ప్రియ మాతృదేవత

శ్రీమతి నాళము సుశీలమ్మగారికి

# కావ్యవీధి

# దీపావళి

నాఁడు దీపాలయమవసి—నభమునుండి
తార లెల్లను డిగివచ్చి ధరణిమీఁద
చిత్రకాంతుల నవతరించెనో యనంగ,
దీపికారాజి పుర మెల్ల తేజరిల్లె.

సాటి లేనట్టి సిరులచే మేటికెక్కి
మున్ను శ్రీనగరంబున చెన్ను మీఱు
దేవదత్తుని సుందరదివ్యగృహము
నేఁడు పాలుపడి యేటికో పాడు వాఱె.

వీటియం దెల్ల యెడలను వెలుఁగుచున్న
దీపికాకోటికాంతికి సైఁపలేక,
అంధకారపరంపర లాశ్రయించె
దేవదత్తుని శూన్యమందిరము నేఁడు.

బల్లెములఁ గేలఁ దాలిచి బారు దీఱు
యోధవరులకు బదులుగ, సౌధమెదుట
బమ్మచెముడులు బలుసులు తుమ్మపొదరు
లీతచెట్టులు దట్టమై యేపు సూపె.

గోరువంకలు చిలుకలు పారువములు
మధురగానంబు సలిపిన మందిరమున,
కాకములు గుడ్లగూబలు గబ్బిలములు
నెలుకలును జేరి చీకాకు గొలుపుచుండె.

మదగజంబులు, తురగముల్ మసలుచోట
ఊరపందులు గాడిదల్ తారుచుండె;
వింతవన్నెగులోబులు వ్రేలుచోట,
సాలెపట్టులు బూజులు వ్రేలుచుండె.

ఒంటి గంటయ్యె-దీపంబు లొకటొకటిగ
సన్నగిల్లెను, బాణసంచాల మాని
తలుపులను మూసి జనులు నిద్రావధూటి
నిండుకౌఁగిట నోలాడుచుండి, రంత.

ఆ గభీర నిశాసమయంబు నందు
దీర్ఘ నిశ్వాసములు పుచ్చి దేవదత్తుఁ
డొక్క గదిలోనఁ గూర్చుండి చెక్కుమీఁద
చేయి నానించి, యేదొ యోచించుచుండె.

వాని వజ్జనె సెజ్జపై వాలి, యతని
గృహిణి సర్వాంగసుందరి గిరిజదేవి
దుర్భరం బగు వ్యాధిచేఁ దూలి సోలి
చిక్కి శల్యావశిష్టయై సుఖ్రిక్కుచుండె.

వారములు నాల్గు గతియించె వ్యాధిపొడమి
అంతకంతకు నతిశయం బగుటె కాని,
ఇంచుకంతయు స్వస్థత గాంచదయ్యెఁ;
కటకటా! ఎట్టి మొండిరోగంబొ కాని.

ఎందరో వైద్యులై, రెన్నొ మందు లయ్యె,
ఎంతయొ ధనంబు వ్యయ మయ్యె, నుంతయైన
కుదురు వడదయ్యె రోగంబు; తుద కతండు
అప్పుసప్పులపా లయి ముప్పు జెందె.

కోట్ల కొలదిగ రూప్యముల్ నోట్లు వ్రాసి
ము న్నతనితండ్రికడ బదుల్ గొన్నవార
లుండి రెందరొ, వారిలో నొక్కడైన
సాయపడఁడయ్యె ధనమిచ్చి సమయమునకు.

ఆపురంబునఁ గలఁ డొక్క కాఁపువాఁడు
చండిదా సను పేరి భిషగ్వరుండు;
వైద్యమున వాని కెంతటి ప్రజ్ఞ గలదొ,
ధనము గుంజుటయం దంత ఘనత గలదు.

ఊసు రొకించుక కుత్తుక నుండె నేని,
ఎట్టి రోగము నిట్టె బోఁగొట్టఁ గలఁడు;
వాఁడు శవమును బ్రతికింప లేఁడు కాని,
పెనగి శవమున విత్తంబు పిండఁగలఁడు.

ముందు ధన మిచ్చినను గాని మం దొసంగ
ననియె నావైద్యుఁ డెంత వేఁడినను గాని,
కనికరం బింత యతనికి కలుగదయ్యె;
నిర్ధనుని జీవితం బిల వ్యర్థము గద.

అఖిల సౌభాగ్యసంపద లనుభవించి
నట్టి భోగికి, తనదు నర్ధాంగలక్ష్మి
మరణవేళను గొంతులో మందు బోయ,
కటకటా ప్రాప్తి లేదయ్యె-కాలమహిమ!

నాఁటిరాతిరి గిరిజకు గాట మగుచు
జ్వరము ముమ్మర మయ్యె, శ్వాసంబు హెచ్చె;
వెంటనె యతండు వైద్యుని యింటికడకు
తత్తరంబున పరుగెత్తి, తలుపు తట్టె.

అలికిడికి లేచి వైద్యుండు తలుపుతీసి,
'ఎవరు వా?' రని ప్రశ్నించి, 'ఈవటోయి!
పైకమును తెచ్చితివ సరే-లేకయున్న,
శీఘ్రముగ నింటికడకు వేంచేయవచ్చు.'

అనుడు, గుండెలు జల్లన, కనుల నీరు
నిండ నేడ్చుచు దేవదత్తుండు పలికె,
'నీదు పాదాంబుజంబులమీఁద వ్రాలి
వేఁడువాఁడను, నన్ను కాపాడు మయ్య.

నిలిచియున్నది నీచేత నెలఁత బ్రతుకు-
మనిచెదవొ యామె ప్రాణంబు మం దొసంగి,
మునిచెదవొ నన్ను శోకసముద్రమందు?
చెప్ప నేటికి-నీదివ్యచిత్త మింక.'

అంచు నేమేమొ యింక వచించుచుండ,
తటుకునను లేచి వైద్యుండు తలుపు మూసి
రివ్వు మని యేగె; 'హా! శ్రీహరీ!' యటంచు
నేలపై దేవదత్తుండు కూలఁబడియె.

అట్లు పడి కొంతసేపటి కతఁడు లేచి
తెప్పిరిలి, లేనిసత్తువ తెచ్చికొనుచు,
ఎట్లొ కాళ్ళీడ్చుకొని తనయిల్లు జేరి,
ఇట్టు తలపోసె నిస్పృహ తట్టుముట్ట.

'ఎన్నిలక్షల పత్రంబు లున్న నేమి-
గిరిజప్రాణము నేఁడు రక్షింప వయ్యె;
గవ్వకైనను కొఱగాని కాగితంబు
లకట! ఉండిన మండిన నొకటి కాదె.'

ఇట్టు తలపోసి, చందువా పెట్టె తెఱచి,
ఆతఁ డందలి వేఱువే ఱరలనుండి
ఒక్క టొకటిగ పత్రింబు లూడఁబెఱికి,
చించి కుంపటి కాహుతి చేయుచుండె.

వేఁగుజా మయ్యె నింతలో వీధితలుపు
తట్టినట్టులు వినవచ్చె; తత్తరమున
నులికిపడి లేచి వేగమే తలుపు తీసె
దేవదత్తుఁడు కరమున దివ్వె దాల్చి.

తత్తడుల నెక్కి భటుఁ లిరుతట్టు గొలువ,
మారుఁ బోలిన సుందరాకారుఁ డొకఁడు
గజము డిగి దేవదత్తుని కౌఁగిలించె
చిఱునగవు మోముదమ్మిని తుఱఁగలింప.

విస్మయంబును మోదంబు పెనఁగొనంగ,
దేవదత్తుఁడు మో మెత్తి తేఱిపాఱ
వానిఁ దిలకించి, యొక్కింతవట్టు తనదు
వెతల నన్నిటి నొకసారి విస్మరించె.

ఆతఁ డంతట నా క్రొత్త యతని తోడ
'ఎవరు మీరలు? మీరాక యెచటినుండి?
ఏమిపని కల్గి వచ్చితి రిచటి కిపుడు?'
అనుచు ప్రశ్నింప, నవ్వుచు నాతఁ డనియె.

"ఎఱుఁగవా నన్ను? నాపేరు హిమకరుండు,
మున్ను నీతండ్రి జీవించి యున్నయపుడు,
నీదు చిన్నారిచెల్లెలు నేను గూడి
ఆడుకొంటిమి కాదె యీ మేడ యందు?

'ఇందుకళ' యప్డు పదియేండ్ల యీడు బాల
చికిలిసేయని మారుని చిన్నికోల
అన్నెమును పున్నె మెఱుఁగని యట్టి వేల
నన్ను తలపెట్టుచుండునే యెన్నఁ డైన?

ముఖ్యముగ నొక్కవిషయంబు ముచ్చటింప
నేను వచ్చితి–ఆకార్య మైనపిదప,
సావకాశముగా నన్నిసంగతులను
గూర్చి మాటాడుకొందము కూర్మిసఖుఁడ!

నాదు జనకుండు మున్ను నీ నాయనకడ
ఆఱులక్షల రూప్యంబు లప్పు గొనియె;
నిన్న రాతిరి యాతండు నన్ను బంప,
వడ్డితో దాని దీర్పంగ వచ్చినాఁడ.

నాఁడు మీజనకుఁడు మా కొనర్చినట్టి
సాయమునఁ గాదె,మా కిప్డు సంభవించె
భూరిసంపద, కీర్తియు, గౌరవంబు
వేయు నేటికి-నేఁటి యీ విభవ మెల్ల.

అనుచు నతఁడు మాటాడుచున్నంతసేపు,
దేవదత్తుఁడు తన్నట్టె తేఱి చూచి
ఊరకుండుటయే కాని, మాఱువలుక
కుంటఁ గనుగొని, యచ్చెరు వొంది యతఁడు.

'ఏమి మిత్రమ! నేఁడు నీమోము జూడ
విన్నసై యున్న దేటికి చెన్ను దొరఁగి?
తేఱి యటు లేల చూచెదు తెల్లఁబోయి?
సేమమే కద భార్యకు చెలియలికిని?.

అనుడు, నామాట వినినంత తనదుచేతలు
చిపుకు మని యొక్క పెట్టున స్మృతికి రాఁగ
నాకమునసుండి తోడనే నరకమునకు
తూలిపడినట్లు దేవదత్తుండు తలఁచి.

'అక్కటా! ఏమి చెప్పుదు ననుఁగుసఖుఁడ!
నాదు దురవస్థ? పెక్కుదినాల నుండి
ప్రబలతర మగు వ్యాధిచే బాధపడుచు
మరణవేదన పడుచుండె గిరిజదేవి.

నీవు నాపాలి సౌభాగ్యదేవత వయి
వచ్చి యామెప్రాణంబు గాపాడినావు;
నీవు రాకున్న నాగతి యేమి యగునొ
లేబరము గాదె విత్తంబు లేని బ్రతుకు!'

అనుచు నీరీతి వచియించి, యతఁడు లోని
కేగి, యిందుకళను లేపి యిట్టు లనియె;
'చెలియలా! నీదు చిననాఁటి చెలిమికాఁడు
హిమకరుం డిదె మనయింటి కేగుదెంచె.

అతని లోనికిఁ దోడ్కొని యాదరించి
వలయు నుపచారముల నెల్ల సలుపుచుండు,
మింతలో నేను వైద్యునియింటి కేగి
వేగ వచ్చెద నాతని వెంటఁ గొనుచు.'

తోడనె యతండు వైద్యుని తోడికొనుచు
గృహమునకు వచ్చె; వైద్యుండు గిరిజఁ జూచి
తల్లడిల్లియు-ధైర్యంబు దాల్చి, యామె
కుతుకలో వైచి మ్రింగించె ఘుటిక యొకటి.

భానుఁ డుదయించె దేదీప్యమానుఁ డగుచు,
దెసలు తొలివొందె, గిరిజయు తెలివి గాంచె;
ఇనకరంబుల విరిసిన హిమము వోలె,
మందుచే నామె రోగంబు డిందువడియె.

కొంతపడి కామె యించుక కుదుట నొంది,
కాలుసేతుల నల్లార్చి, మేలు కాంచి,
కన్నుదమ్ముల నరవిచ్చి కాంతుఁ జూచి
పలికె నీరీతి సన్నని యెలుఁగు తోడ.

'చూచితే నాథ! ఎంతటి చోద్య మొక్కొ!
వేగుజామున నెవ్వఁడో యోగివరుఁడు
మన గృహంబున కరుదెంచి, ధన మొసంగి
నన్ను రక్షించినట్లు స్వప్నంబు గంటి.'

ఆ సుధామధురోక్తుల నాలకించి
నింగి ముట్టిన భంగి నుప్పొంగి యతఁడు
హిమకరుని బిల్చి యాపె కట్టెదుట నిలిపి,
పలికె నీరీతి చిఱునవ్వు మొలక లెత్త.

'నీదు కలలోఁ బ్రసన్నమై, నిన్ను నన్ను
నుద్ధరించిన యట్టి యాయోగి యడుగొ,
నీ యనుంగుమఱందలి చేయివట్ట
నిన్ను నర్థింపఁగా వచ్చియున్నవాఁడు.'

కలిమి గలవాఁడు, చెలువంబు గులుకువాఁడు,
హొయలు గలవాఁడు, మవ్వంపు వయసువాఁడు,
ఇవ్వి యన్నియు నటు లుండ-ఇందుకళకు
చిఱుతప్రాయమునాఁటి నెచ్చెలిమికాఁడు.'

అనుడు, నబ్బుర మందుచు ననియె గిరిజ:
'ఎట్టెటూ! నామనోహర! ఏమి యంటి?
వీతఁడా నాదు మఱఁదలి యెమ్మెకాఁడు!
విందు చెప్పుమ వీనులవిందు గాఁగ'

అనుచు మోమున దరహాస మంకురింప
గిరిజ, తనచెంత సిగ్గుచే శిరము వంచి
తలుపుచాటున నోరఁగా నిలిచియున్న
యిందుకళఁ జూచి యామెతో నిట్టు లనియె.

'ఓసి వగలాడి! నీసిగ్గు మాసిపోను–
నంగనాచివై యేమి యెఱుంగనట్టు
లింటఁ గూర్చుండి తగిలించుకొంటి వౌర!
కొమిరెపాయపు చక్కని కోడెకాని.

ఏమె నా ముద్దుమఱఁదలా! ఇట్టు రావె!
ఓసరి ల్లిన నామీఁదియొట్టు సుమ్ము–
బెట్టుసరి చేసి పిరువీకు వెట్టితేని,
పెనఁచి పట్టింతుఁ జువ్వె నీ పిర్రియునిచేత,'

ఇందుకళచేయి వట్టుక హిమకరుండు
గిరిజపదములపైఁ దనిశిరము జేర్చె!
'శ్రీఘ్రమే మీకు కల్యాణసిద్ధిరస్తు'
రనుచు దీవించి గిరిజ మోదాబ్ధిఁ దేలె.

## కుంద

కాంచిపురమునఁ గలఁ డొక్కకాఁపువాఁడు-
అతని నామము గోవిందుఁ డనఁగఁ బరఁగు;
నందుఁ డాతని గారాబు నందనుండు,
కుంద యాతని చెల్లెలి కూర్మితనయ.

ఈడుజోడుగఁ గూడి వా రాడుచుండ
మోదమునఁ జూచి ముదుకండు మురియుచుండు,
'బళిర! వీ రిర్వు రొకటియై మెలఁగి రేని,
నాదు కోరిక ఫలియించుఁ గాదె' యనుచు

కుంద యాతనిభావంబు గుర్తెఱింగి
నందుఁడే తన హృదయాధినాథుఁ డనుచు
నమ్మె; నక్కట! దైవమ్ము వమ్ము చేసె
నామె నిర్వ్యాజ నిర్మలప్రేమ మెల్ల.

అంత నొకనాడు వృద్ధుండు సంతసమున
దనదు కూరిమితనయుతో ననియె, "వత్స!
వయసు గడచెను, ముదుసలివాఁడ నైతి,
ఎపుడు మృత్యువు వచ్చునో యెఱుఁగరాదు.

అనుభవించితి సకలసౌఖ్యంబు లెలమి,
కోర్కు లెల్లను కొనసాఁగె కొదవ లేక:
మక్కువను చిన్నిమనుమని నక్కుఁజేర్చి
ముద్దులాడుట యెన్నఁడో ముచ్చ టలర?

పోతబోసిన బంఁగారుబొమ్మవోలె
ఒక్క చిన్నారి చక్కనిచుక్కఁ దెచ్చి
పరిణయ మొనర్తు, వేగమే పడయు మయ్య
పండుపంటి కుమారుని నిండువేడ్క

చల్లకై వచ్చి ముంత దాఁచంగ నేల!
కుందయే నీకు సరివచ్చు సుందరాంగి,
జనని పోయినదాదిగా చనవు మెఱయ
పెంచితిని దాని నీ కిచ్చి పెండ్లి చేయు."

తనయుఁ డిట్లనె గద్గదస్వనముతోడ:
"నాన్న! నీయాన జవదాఁటి యెన్నఁ డెఱుఁగ
నేఁడు నీకోర్కె నెఱవేర్పనేరకునికి
చింత నొందుచు నుంటి నా చిత్తమందు.

కుంద నీవు వచించినచందమునను
నిఖిలలావణ్యలక్షణాన్వితయె యయ్యు,
ఇంచుకంతయు నామది కెక్క దయ్యె-
ఏమి కారణమో వచియింపఁ జాల.

చిన్నతనమునునుండియు 'చెల్లె' లనుచు
పిలిచితినిదాని, నేనిప్డు 'పెండ్ల' మనుచు
ఏగతిఁ దలంతు? నక్కటా; యిట్లు చేయ,
నన్ను పరికించి నలువురు నవ్వ రొక్కొ?"

కనుల నిప్పులు రాలంగ జనకుఁ డనియె:
"అక్కటా! తండ్రియాజ్ఞను ధిక్కరించి
ఇట్లు వచియింప నీకు నో రెట్టు లాడె?
ఆవుర! ఎంతటివాఁడ వైతివిర నీవు?

సరియె కానిమ్ము - రెండుమాసముల లోన
దాని( జేపట్టితివ సరే. లేనియెడల,
నేను జీవించునందాఁక నింటిలోని
కడుగుపెట్టంగ వలవదు గడప దాఁటి.

ఏమియును మాఱు వలుకక మోము వాల్చి
నేల జూచుచు నందుండు నిలిచియుండె!
తటుకు మని లేచి కినుకచేఁ గటము లదర
వడిగఁ జిందులు ద్రొక్కుచు వెడలె తండ్రి.

గడువు దాఁటకమున్నె యాపడుచువాఁడు
తండ్రి యిలు వీడి యవలికి తలఁగిపోయి,
పొలముకాఁపరికూఁతును 'వున్న' యనెడు
పేదబాలిక నొక్కతెఁ బెండ్లియయ్యె.

కొంతకాలము జనినంత, కుందఁ బిలిచి
ముదుకఁ డిట్లనె, "సుతుఁడు నాముదల మీఱి
యిల్లు వెడలెను, బాల! నీ వెట్టిలీల
మోద మొనగూర్తువో నాకు ముదిమియందు?

కన్నకూఁతురు కన్నను కరము ప్రేమఁ
బెంచితిని నిన్ను, నను కష్టిపెట్టినట్టి
వానితోడను మాటాడితేని, వినుము -
గెంటివైచెద నిను గూడ నింటినుండి."

కుంద తలపోసె నీరీతి డెందమందు;
'తనయు పైనింత తెగిపడు తండ్రి గలఁడె?
కొన్ని దినముల కంతయు కుదురుపడక
యున్నె? అందాఁక సైరించి యుందుఁ గాక.'

పుణ్యదినమున నొకనాఁడు పున్న గనియె
నిండుచందురుఁ బోలిన నిసుఁగు నొకని;
తనకుటుంబము పోషించుకొనఁగ లేక
ఏగె నందుఁడు తనతండ్రి యింటి కడకు.

కటకటా! వృద్ధుఁ డెంతటి కటికవాఁడొ!
కొడుకు నవలికి గెంటించె కోప మడర;
అతనిదురవస్థ కెంతయు నాత్మఁ గుంది
సాయపడె కుంద ధన మిచ్చి శక్తికొలఁది.

కడచె కొన్నాళ్ళు, అంతట కఱవు వచ్చె;
ఏమి చెప్పుదు - నక్కటా! లేమిచేత
తాళఁజాలక సందుండు తనువు విడిచె!
వాని మరణంబునకు కుంద వనట నొందె,

పున్నయింటికి నేతెంచి, కన్నుదోయి
బాష్పములు జాలువాఱంగ బాలు నెత్తి
అక్కునను జేర్చి విలపించు నామెఁ జూచి,
బాళి నాలింగనము చేసి పలికె నిట్లు.

"కుంద యందురు నను వినియుందు గాదె!
నిన్ను జేపట్టి నాకంబు చన్నవాని
నుల్లమారఁగ ప్రేమించియున్నదాన-
తడవ నేటికి యిప్పు డాగాదవ యెల్ల?

నీదుసుతుమీఁద నీ కెంత యాదరంబు
కలదొ, అంతయు నాకును కలదు గాన,
వాని జూడఁగ వచ్చితి, వాని హితము
మనకు నిరుపుర కొక్కసమంబు గాదె?

చిన్నిబాలుని మనుమామచేత నిడిన,
తనదు తనయుని మరణంబు తలఁచి యతఁడు
బుడుతఁ గౌఁగిటఁ జేరిచి బుజ్జగించి
ప్రీతి నల్లారుముద్దుగఁ బెంచు సుమ్ము."

అనుచు నొప్పించి బాలుని గొనుచు కుంద
వేగ తనమామపొలమునఁ కేగి, యచట
గుబ్బుగా నున్న యెలమావిగున్ననీడ
నొదిఁగి కూర్చుండె బిడ్డని నొడిని జేర్చి.

ఆమెఁ బొడఁగనిముదుసలి యనియె, "బాల!
ఒంటిమై యేల వచ్చితి వింటినుండి?
ముద్దు లొలికెడి యా చిన్నిబుడుతఁడెవఁడు?"
అనుడు, గొదుకుచు నీరీతి ననియె కుంద.

"ఎవ్వడు నీయాన జవదాఁటి యే నెఱుంగ,
నేఁడు చేసినతప్పు మన్నింపు మయ్య,
అన్యుఁ డెవ్వఁడు కాడు-నియనుఁగుసుతుని
కన్నతనయుఁడు సుమ్మి యీచిన్నిబిడ్డ."

కుంద యీరీతి వచియింప, క్రుద్ధుఁ డగుచు
పలికె వృద్ధుఁడు పటపట పండ్లు కొఱికి;
"సిగ్గు లేదటే? మును నీకు చెప్పలేదె
వానితో నెట్టిజోక్యము వల దటంచు."

గోలుగోలున నేడ్చుచు కుంద యిట్లు
చెప్పె, "న న్నేమి చేసిన చేయు మయ్య,
అన్నమును పున్నె మెఱుఁగని యట్టి చిన్ని
బాలుఁ గైకొను, మద్దియే చాలు నాకు."

అనుడు, వృద్ధుఁడువచియించె నాగ్రహమున
"ఔ నెఱుంగుదు, నిది యెల్ల నాగయాళి
జంతయును నీవు పన్నిన మంతనంబు,
బేలనే యిట్టిమాయల బేలుపోవ?

ఇంతకాలము నుండి న న్నెఱిఁగి
ఎట్టి సాహసమున కొడిగట్టినావె?
కాని, నీమాట యేటికి కా దనవలె?
బుడుత నా కిచ్చి, అవలికి వెడలు మీవు."

అనుచు వచియించి గోవిందుఁడలుక గదుర
బలిమిమై చిన్ని బాలుని పులిమి లాగి,
రెట్టబట్టుక కుందను నెట్టివై చె,
బోరు మని యేడ్చి బిడ్డండు పోరువెట్ట.

కనుల జలజల బాష్పముల్ కాల్వగట్ట,
వెడలె నాబాల పదములు తడఁబడంగ,
బిడ్డ యేడుపు వీనులఁ బడ్డయప్పు
డెల్ల జల్లని గుండియల్ తల్లడిల్ల.

'కన్నతల్లి యు తండ్రియు చన్నదాది
మామయే యన్ని తానయై మనిచె నన్ను;
అట్టి యాతఁడె నన్నిప్పు డవలఁ ద్రోసె;
కంచెయే చేను మేసినఁ గలదె దిక్కు?'

కుంద యీరీతి డెందంబు నందుఁ గుంది
పున్నయింటికిఁ జనుదెంచి, పొంగి పొరలి
నెట్టుకొని వచ్చు శోకంబు నెట్టకేని
మట్టు పఱచుచు, నామెతో నిట్టు లనియె.

"ఏమిచిత్రమొ! అక్కరో! మామ నీదు
తనయుఁగైకొనె, వెడలి పొమ్మనుచు నన్ను
నెట్టె నవలికి. నామాట యెట్టులైన
నేమి-బాలుండు సుఖముండె, నింతె చాలు-

"చెల్లె! నీ విట్టు లాడంగఁ జెల్లు నొక్కొ?
ఈవు నాకయి వెతజెంద నేటి కమ్మ?
వానికడ కేగి వేఁడెద, బాలు నాకు
నిమ్మటంచును, మగుడ నిన్ గొమ్మటంచు.

వృద్ధుఁ డొకవేళ నాదగు వేఁడికోలు
కియ్యకొనఁడేని, చెల్లెలా! యీవు నేను
ఒక్కచోటనె వసియించి యుందమమ్మ
అరమరలు లేక బ్రతికియున్నన్ని నాళ్ళు."

అంచు నీరీతి పున్న వచించె; తోనే
వార లిరువురు పయనమై వానియింటి
కేగి నిలిచిరి ద్వారంబునెట్టయెదుట;
అంతఁ గనుపట్టె లో నొక్కయద్భుతంబు.

పాన్పుమీఁదను వృద్ధుండు పవ్వళించి
గట్టిగా బాలు నక్కునఁ గదియఁజేసి
వానిబుగ్గల జిగిముద్దువర్షములను
ఒక్కపెట్టునఁ గురిపించుచుండెఁ జెలఁగి.

గల్లుగల్లున చిఱుగజ్జె లల్లలాడ
ఱొమ్ముమీఁద దువాళించి, హుమ్మటంచు
బలిమిమై తాతగడ్డంబు పట్టి పీఁకు
చుండె బుడుతఁడు-వాఁడెంతదుండగీఁడొ?

సందిదే యని వారలు సంభ్రమమునఁ
జనిరి లోనికి; బాలుండు జననిఁ జూచి
'అమ్మ' యని చిట్టిచేతుల నట్టె చాఁచి
దిగ్గు రని పాన్పు నుండి డిగ్గనుఱికె.

మామపదములపైఁ దనమౌళి సోఁక,
వున్న యిట్లనె, "నీసుసుఁ డున్నయపుడు
ప్రేమమైనిన్ను నోరార 'మామ' యనుచు
పిలుచు భాగ్యము నాకు లభింపదయ్యె

'జనకునానతి పాలింపఁజాల నైతి,
నంచు నీసుతుఁ డెపుడు చింతించుచుండె;
అంత్యకాలము దాపింప, నతఁడు సారె
నాన్ననాన్నయటంచు ప్రాణములు విడిచె.

పావనంబైన నీదుగర్భమునఁ బుట్టి
అంతిమంబున నీసుతుడుఁ డనుభవించి
నట్టి దైన్యము వర్ణింప నలవి యగునె?
వాని నన్నిటి నిట తడవంగ నేల?

వినుము నావిన్నపం బిదె విన్నవింతు-
'అనుఁగుకోడల, నీకృప కర్హురాల'
అనుచు నిను వేఁడ, వేఁడెద తనయు నాకు
కూర్మి దయచేసి, కుందఁ గైకొను మటంచు.

నీదుతనయుండు చేసిన నేరమునకు
నన్ను దండింప నగుఁ గాని, యెన్నడేని
ఎట్టి నేరంబు గావించి యెఱుఁగనట్టి
ముగుద కుందను శిక్షింపఁ దగునె నీకు?

పతిని బాసిన పరమనిర్భాగ్యురాల,
నేను బ్రతికిన చచ్చిన నేమిలెక్క?
దిక్కుమాలిన యట్టి యీ దీనురాలి
కుందఁ గైకొని కావుము కూర్మి గదుర."

అంచు నీరీతి పున్న వచించుచుండ,
ఉస్సురుసు రని వేడినిట్టూర్పు పుచ్చి
నేలవ్రాయుచు మిన్నక నిలిచియుండె
కుంద, శోకంబు రూపంబు నొందె ననఁగ.

ఆమెపలుకులు ములుకులై యాత్మ నాఁట
వృద్ధుఁ డంతట విలపించె వెక్కివెక్కి,
"అక్కటా! నాదుచిన్నారియనుఁగుసుతుని
చేతులారఁగఁ జంపిన ఘాతుకుండ.

తాను మనసార వలచిన తరుణిఁ గూడి
సుతుఁడు సుఖముండ, చల్లగాఁ జూడలేక
కోతవెట్టినయట్టి కర్కోటకుఁడను;
అకట! నావంటి పాతకి యవనిఁ గలఁడె?

వగవ నేటికి వచ్చినవారిఁ గూర్చి:
కొడుకు లైనను మీరలే, కూఁతు లైన
మీరలే గాని యన్యు లెవ్వారు లేరు,
కావరే నన్ను మన్నించి గరితలార!"

అనుచు నాతఁడు వాపోయి, యంతనుండి
వారి నిరుపమ దయతోడ గారవించె;
తనదునాథుఁడు నందుఁడే యని తలంచి
అన్యు నెవ్వని వరియింపదయ్యె కుంద.

దీపావళి

కుంద

ఈఁగ – సాలీఁడు

నళిని – నందుఁడు

కెన్యూటు చక్రవర్తి

## ఈఁగ, సాలీఁడు

సాలీఁడు

ఎచటి కేఁగెద వీఁగరో, ఇట్లు రమ్ము!
మేల్మిబంగరుఱెక్కలు మెఱుఁగు లీన,
మింటి కెగిరెద వేల? నా యింటిలోకి
వచ్చి యొకసారి విశ్రమింపంగరాదె?

చుట్టు ప్రాకారములు గల్గి, నట్టనడుమ
ముద్దు గులికెడు నా చిన్నిమిద్దె గలదు,
మిద్దెపై కేగ నెల్లెడ మెట్లు గలవు;
సాటి వచ్చునె దానితో స్వర్గమైన?

ఈఁగ

రాను సాలీఁడ, నీ యింటి కేను రాను,
సాలెగూఁడది యీఁగలపాలి సూడు;
సుందరం బగు నీ యిల్లు జొచ్చువారు
ప్రాణముల తోడ మరల నీవలకు రారు.

సాలీఁడు

ఉల్లిపొర వంటి నునుఱెక్క లల్లలాడ,
ఏటి కాయాసపడెదవే యెగిరి యెగిరి?
నిద్ద మగు నాదుసెజ్జపై నిన్ను జేర్చి,
నెమ్మి జోకొట్టి హాయిగ నిదురవుత్తు.

ఈఁగ

అమ్మచెల్లరో! నీ మాట నమ్మనగునే?
అడుగు మోపగఁ జాల నీ గడపలోన;
లీల నీ పాన్పుపై పవ్వళించువారు
మేలుకొన రింక, నెన్నఁడు మేలుకొనరు.

సాలీఁడు

ప్రియము మీఱఁగ నెన్ని చెప్పినను గాని,
నమ్మవేటికె మిత్రమా, నాదుమాట?
వలపు లొలికించు కమ్మని వంటకములు
కుడువఁబెట్టెద, రమ్ము, నీ కడుపునిండ.

ఈఁగ

చెలఁదిరో, నీకు నామీఁదఁ గలుగుప్రేమ
చాలు వదివేలు, నాజోలి యేల నీకు?
కుడువఁబెట్టెదవో నాకు కడుపు నిండ,
అరగింతువొ నను నీవె హాయి మీఱ?

సాలీఁడు

ఔనె! యీఁగరొ, ఎంత మాటాడినావె!
ఇన్ని వగ లెందు నేర్చితె వన్నెలాడి!
నిగనిగలు దేఱు నీలాలు నీదు గఱులు,
నిద్ద మగు జాతికెంపులు నీదు కనులు.

ఎంత చక్కనిదానవే ఈఁగ నీవు!
పొగడఁగూడదు కాని నీ సొగసుఁదనము–
అదిగొ, ఇటు వచ్చి యీ నిల్వుటద్దమెదుట
నిలిచి యొక సారి చూచిన, నీకె తెలియు."

తన్ను సాలీఁడు పొగడు స్తోత్రముల కుబ్బి
ఈఁగ తబ్బిబ్బు నొందుచు, నిట్లు తలఁచె:
"అక్కటా! నాదు కులవైరి యనుచు నెటీఁగి
ఎట్లు నమ్మదు మనసార 'ఈఁగపులి'ని"

ఇట్టు తలపోసి పాప మా చిట్టియీఁగ
మాఱు పలుకక యట్టిట్టు తారుచుండె;
తనదు పాచిక పాఱెఁగా యనుచు మదిని
నలరి, సాలీఁడు క్రిమ్మర నందుకొనియె.

"రమ్ము, చక్కనిచుక్కరో, రమ్ము వేగ;
రెక్కలా యవి, అబ్రంపురేకులు గదె!
కన్నులా యవి, రతనాలగనులు గాదె!
మాటలా యవి, ముద్దుల మూటలు గదె!

మెఱయు చున్నది నీ చిన్నిశిరము మీఁద,
కుచ్చుకెంపుతురాయిని కూర్చి రేమొ!
నిగనిగలు దేఱుచున్నది నీదు మేను,
చికిలివచ్చలు నీలాలు చెక్కి రేమొ!

రాఁగదే చిన్ని యీఁగలరాణి, రావె!
రాఁగదే నాదు భాగ్యంపురాసి, రావె!
రాఁగదే తళుకు మెఱుపులతీఁగ, రావె!
రాఁగదే ముద్దుగుమ్మరొ, వేగ రావె!"

కట్టా! సాలీఁడు పలికిన కల్ల బొల్లి
బేలుమాటల కా యీఁగ బేలువోయి,
వానిమాటలె నిజ మని భ్రాంతి జెంది
పొంగి పొరలుచు కెరలుచు నింగి ముట్టె.

తనదు కన్నుల తళతళల్, తనదు మేని
నిగనిగల్, తనరెక్కల ధగధగలును,
తనదు పలుకుల మురిపంబు, తన శిరంబు
మురువుతలపోసి యాయీఁగ మురిసిపడుచు,

ఝుంయి ఝుం యని యెగురుచు, ఝుమ్మటంచు
పాట పాడుచు, సాలీని గూఁటిచుట్టు
చెలఁగి గుట్టునఁ దిరుగుచు, చెంగలించి,
చంగు మని యట్టె లోనికి చొకళించె.

ఏమి చేయుచు నుంటివే ఈఁగ నీవు?
పవ్వడించితొ మవ్వంపు పాన్పు జేరి?
ఊఁగుచూంటివొ హాళిమై నుయ్యెలపయి?
కజ్జముల మెక్కుచుంటివొ బొజ్జనిండ?

నిలువుటద్దముచెంగట నిలిచి, నీదు
సొబగు దిలకించుచున్నావొ చోద్యమొప్ప?
సరసమాడుచు నున్నావొ సఖుని గూడి?
ఏమిచేయుచు నున్నావొ యెవ్వఁ డెఱుఁగు?

ఈఁగ యారీతి గూటగం తిడిన యంత,
ఒక్క పెట్టున దానిపై కుఱికి, తనదు
కాళ్ళతోఁ బట్టి యటిట్టు కదలనీక
గుటుకు మని దాని సాలీఁడు గుటకవైచె.

# నళిని–నందుఁడు

మహిషపురమునఁ గలఁ డొక మంత్రివరుఁడు,
నందుఁ డాతని కూరిమినందనుండు;
పుడమియేలికకూఁతురు పువ్వుఁబోఁడి
నళిని యాతని హృదయంబు నాఁచికొనియె.

అతని యకలంక మగు ప్రేమ యందరాని
మ్రానిఫల మని భావించి, వానితండ్రి
పంపివైచెను నందుని పరిసరంపు
పట్టణంబున కెద్దియో వ్యాజమునను.

జరిగె మూఁడేఁడు, లొకనాఁటి సంజవేళ,
నందుఁ డీరీతిఁ దలపోసె డెందమందు:
'పడఁతి నేను తలంచని గడియ లేదు,
తలఁచునే యాపె న న్నొక్కతడవయైన'

అంత నొకనాఁడు మైసూర సంత జరుగ,
నచటి కేగిరి వేడ్కతో నతివ లెల్ల
నళిని యొంటిగ నెవరికిఁ దెలియకుండ
పయనమై యేగె ప్రియుఁడున్న పట్నమునకు.

విలువనగలును వలువలు విడిచి, యామె
చిరుఁగుబట్టలు ధరియించి, పురమువెంట
నుల్ల మురియాడ, నాదిన మెల్ల తనదు
ప్రియుని వెదకుచు తిరుగాడె వీధివీధి.

సొమ్మసిలి యామె యూరెల్లఁ ద్రిమ్మరిల్లి,
దారుణం బగు నెండకు తాళలేక,
చేనిగట్టున గూర్చుండె సేదదేఱ;
హయము పై నెక్కి తన మనోహరుఁడు వెడలె.

ప్రియునిఁ గన్గొన, డెంద మువ్విళులు గొనఁగ.
చివ్వనను లేచి కళ్ళెంబు చేతఁ బట్టి,
'ఓ దయామయ, నే నిఱుపేదరాల,
కావుమా నన్ను దయతోడ కాని యొసఁగి,'

'కాను లెన్నని యిచ్చెదఁ గాని, ముందు
కన్నెరో, చెప్పు మేఁది నీ యున్నయూరు?'
'తిరుప మెత్తుచు నూరూరఁ దిరుగుదాని
కూరు పేరేటి కయ్యా? - మైసూరు నాది,'

'వెలఁదిరో, నిన్ను తద్దయు వేఁడువాఁడ-
చిన్నమాట వచింపుమా, ఎన్నఁడైన
సుందరాంగిని నళిని నిని చూచినావె?'
'చచ్చి యెన్నఁడొ స్వర్గఁబు జొచ్చెనయ్య'.

'అకట ! నళిని గతించెనా? అట్టు లైన,
రమణిరో, నీకు నాదు సర్వస్వ మెల్ల
నప్పన మొనర్తుఁ, గై కొను, మాపె లేని
నావిభవ మేల, ఇంక నాజీవ మేల.'

'వలదు, తాళుము - నీదు సర్వస్వ మెల్ల
ఎవతెకొఱకయి త్యజియింప నెంచినావొ,
అమ్మహాభాగ్యరాశి జీవమ్ములోడ
నిలిచియున్నది సుమ్మిదే నీదుచెంత.'

'పొమ్ము దుఃఖమ, సౌఖ్యమా, రమ్ము వేగ!
ఎనతె యందనిఫల మని యిన్నినాళ్ళు
తలఁచియుంటినో, అట్టి యా పొలఁతిమిన్న
దక్కినది నాకు నవలీల తనకుఁ దానె.'

౪–౨

## కెన్యూటు చక్రవర్తి

సమరము లొనర్చి, శత్రుల సంహరించి,
కోటలను కూల్చి, పురముల కొల్లఁగొట్టి,
పాలనము చేసె ధారుణిన్ వైభవముగ,
విక్రమంబున 'కెన్యూటు' చక్రవర్తి.

తనదుచేతల కొతంశు మనమునందు
కొందలము నొంది, యొకనాఁటి సందెవేళ
అబ్ధితీరము నందు వాహ్యాళి వెడలి
తనదు పరివారజనులతో ననియె నిట్లు:

'భీకరం బగు సైనికవితతిఁ గూర్చి,
వ్యూహములఁ బేర్చి, వైరుల మోహరించి,
భండన మొనర్చి, విజయముల్ బడసినాఁడ!
ఏఁడి నను బోలు వీరుఁ డీ పృథివియందు?'

'ఏలికను బోలు వీరుం డీయిలనె కాదు-
మూండులోకములందును లేం డటంచు
నొక్కి మువ్వాటికిని మేము నుడువంగలము'
అనుచు నఱచిరి పరిచారకులు చెలంగి.

దాన్ని రగి రాజు బిట్టు నిట్టూర్చి యనియె:
"ఎంత విభవంబు కలిగిన, నేమి సౌఖ్య
మనుభవించిన నెన్నాళ్ళు? తనువు సడలె,
ఎపుడు మృత్యువు వచ్చునో యెఱుంగరాదు.

అంత యేటికి-నాదు రాజ్యంబు గోరి
నన్ను తెగటార్పం జూతురు నాదుసుతులు
వారిచే నిల్లుకంటె నీవారిరాశి
మేను దొరంగుట యెంతయు మేలు కాదె?"

"పాపము శమించుం గావుత-పలికె మంత్రి,
"ప్రభుండ, ఇట్టి యమంగళవాక్కు లాడం
జనునె? నీమేనిజిగి యింక సడలలేదు;
చల్లగా వెయ్యియేండ్లు వర్థిల్లు మయ్య.

పూర్వకాలమునం దొక భూవరుండు
భాను చంద్రుల నాకాశపథము నందు
నిలిపె నంచును వినలేదె? నీవు నట్లె
తలఁచి నంతన అవలీల నిలుపఁగలవు."

అనుడు. మనమున నుప్పొంగి. అనియెఱేఁడు:
"సచివసత్తమ, నీమాట సత్యమేని,
భాను చంద్రుల నొకచోట పాదుకొలుపఁ
గలనొ కలకాల మట్టిట్టు తొలఁగకుండ?

తరణి చంద్రులు నాయాన దాఁటరేని,
ఉబ్బి తబ్బిబ్బు నొందుచు బొబ్బరించి,
నింగి కెగయుచు నేలపై పొంగి పొరలు
జలధి వెనుకకు మరలునే సచివవర్య?'

మంత్రి యిట్లనె, 'గగన భూమండలములు
నీదునానతి తలఁదాల్చి నిలుచు ననఁగ,
అబ్ధి వెనుకకు మరలుట యబ్బురంబె!
ఇంచు కొకసారి నీవు శాసించితేని!' -

బెడిదముగ నిట్లు శాసించె పుడమిఱేఁడు:
'ఓ యనంతగభీరపయోధిరాజ!
వినుము, నీ కిదె ఆజ్ఞ గావించుచుంటి,
విశ్వముల నెల్ల పాలించు విభుఁడ నేను,

పావనం బగు మామక పాదయుగళి
నంటఁ బోకుమి, ఇంత నీ యకటవికట
మైన యట్టహాసము లెల్ల మానివైచి,
అంబుధిస్వామి, వెంచేయు మయ్య వేగ.'

ఒడయఁ డీరీతి త న్నానయిఁడుకొలంది,
అంతకంతకు పెనుగర్జ లగ్గలింప
వట్టి లొడ్డుచు పాఱుచు మిట్టి బాఱికి
పుడమిమీఁదికి దండెత్తె కడలిఱేఁడు.

భీషణకఠోరరవముల ఘోష లిడుచు
భాసురం బగు ఫేనాట్టహాస మొప్ప
అలలచేతుల నల్లన నల్లలార్చి
తాండవంబాడె వేడ్క రత్నాకరుండు.

ఒత్తికొనివచ్చు నుదధియుద్వృత్తి చూచి
గద్దియలు డిగ్గి, గుండియల్ దద్దరిల్ల,
దవ్వుదవ్వుగ వెనుకకు తలఁగి చనిరి
పరిజనంబులు, మంత్రులు. ప్రభువరుండు.

కనుల నిప్పులు రాలంగ. ననియె ఱేఁడు:
'ఎవనిముదలను తలఁదాల్చి భువియు దివియు
నబ్ధి మెలఁగుచునుండు, నయ్యాదిశక్తి
వొక్కనినె కాని, మనుజుల మ్రొక్కవలదు.'

నాఁడు మొదలుగ ధారుణీనాయకుండు
భాగ్యభోగ్యము లెల్లను పరిహరించి,
మణిమయుంబగు మకుటంబు మౌళిఁదాల్పఁ
దలఁప డయ్యెను జీవితాంతబుదనుక.

గ్రీష్మఋతువు

వర్షఋతువు

హేమంతఋతువు

# గ్రీష్మ ఋతువు

దివస మంతకు నంతకు దీర్ఘ మయ్యె,
సవితృఁ డుత్తరదిక్కున సంచరించె,
నాఁటినాఁటికి నెండలు గాఢ మయ్యె,
వేడిగాడ్పులు మెండుగ విసరఁజొచ్చె.

ఏళ్ళు కొలఁకులు వాడి యిట్టింకు లింకె,
కీలజాలము వనములఁ గేళి సలిపె,
గగనతలమున సుడిగాలి కెగసె ధూళి,
ఎండమావులు దండిగ మెండుకొనియె.

వేడియెండల మలమల మాడి మాడి
పాముపడగలక్రింద కప్పలు వసింప,
నెమలిపింఛంబుగొడుగలనీడఁ జేరి
పడగలను వాల్చి పన్నుండె పన్నగములు.

మెండుగాఁ గాయు నెండకు మిడికి మిడికి
నోరు తెఱచుచు సెలవుల నురువు గాఱ
బొలసుముద్దలఁ బోలు నాల్కలు వెలార్చి
దున్నపోతులు తిరిగె దుందుడుకు సెంది.

మిటమిటని కాయు నెండకు కటకటఁబడి
కుతుక లెండఁగ దప్పిచే కొదమలేళ్ళు
చదల కాటుకమబ్బులు జలము లనుచు
బమ్మరిల్లుచు నానచేఁ బరుగులెత్తె.

దండిగాఁ గాయు నెండల మండి మండి
కొండ లోర్వక మొఱవెట్టి కూసె ననఁగ,
గహ్వరంబులఁ బోలు వక్త్రములఁ దెఱచి
బెబ్బులులు గాండ్రు గాండ్రని బొబ్బరించె.

దారుణం బగు నెండకు తాళ లేక
నీరు లింకిన మడుఁగులఁ జేరి పంది
ముస్తె లెత్తఁగ నిడువాడిముట్టెతోడ
గొప్పిచ్చికోర్వాడె పుడమిలోఁ జొచ్చుకరణి.

చండతరమైన యెండకు జలము లెండి
పడియయందలి యడుగు గెల్ల పగులువాఱ,
బీఁటికలవెంట తన నిడుపాటి త్రోటి
గ్రుచ్చి, బొమ్మిడాయల మెక్కెకొక్కరాయి.

దావపావకకీలల దగ్ధ మొంది
చెట్లయాకులు సుడిగాలిచేత ఊఁగి
గగనమున పల్లటీల్ గాని యెగురుచుండ,
పావురము లంచు డేగలు పట్టఁ దఱిమె.

భీకరం బగు నెండకు భీతి జెంది
పాదపచ్ఛాయ నిదురించు పథికజనులు
మాటిమాటికి తావుల మార్చి మార్చి
పొరలియాడిరి నీడలు జరుగుకొలఁది.

మల్లెపువ్వులు సిగఁదాల్చి మాపులందు
చెఱకురసమాన గానుఁగచెంత జనము
కూడె, రానున్న వృష్టికై గ్రుడ్లు మోచి
మధువుచుట్టును మూఁగు చీమలో యనంగ.

మిగులఁ గాసిన మిడియెండసెగల నొగిలి
ఆశ్రయించిన గంగయు యమున యనఁగ,
మల్లియలతోడి కీల్జడ లల్లలాడ
చలువపందిళ్ళఁ బొలిచిరి జలజముఖులు.

లలిత మంజీరరవ మొప్ప, లత్తుకలను
జొత్తువాఱిన పదములు శోభిలంగ,
అమలవస్త్రంబులను దాల్చి, అంచ లనఁగ
మందయానలు నడచిరి మద మెలర్ప.

భీష్మతరమైన దారుణ గ్రీష్మమందు
గాలిచే మింటి కెగసిన ధూళి యొప్పె,
దండిగాఁ గాయు నెండకు తల్లడిల్లి
పుడమిచేడియ దాల్చిన ముసుఁ గనంగ.

చండమార్తాండు నెండకు మండి మండి
జగము రగులంగ, గాలిచే నెగసినట్టి
బూదియో యన, బూరుగుదూది పిగిలి
పింజపింజగ నంబరవీధి కెగిరె.

తరణిబింబపురాట్నాన, కిరణము లను
సన్నినూలును, వడికి, గ్రీష్మంబు పేరి
సాలె నేసిన జిలుఁగువస్త్రంబు లనఁగ.
ఎండమావులు కన్పట్టె నిండుజిగిని.

తలఁపు తలఁచినమాత్రి డెందంబు కందు,
మోవి కదలింప నో రెల్ల పొక్కిపోవు,
కనులు పై కొత్త అెప్పలు కమరు; నౌర!
నిండు వేసఁగియెండ వర్ణింపఁ దరమె?

పాలకడలిని వెన్నుండు పవ్వళించె,
మంచుకొండను నివసించి మనియె హరుఁడు.
తమ్మిగద్దియపై నెక్కి బమ్మ యుండె,
నందనంబున విహరించె నాకవిభుఁడు.

మెండుగాఁ గాయు వేసంగియెండ సెగకు
బీతుచే తల్లడిల్లి తబ్బిబ్బు వొంది
వేల్పు పెద్దలె యీరీతి వెగడు గుడువ,
పుడమిజనముల గొడవలు తడవ నేల?

## వ ర్ష ఋ తు వు

దీప ముడివోవఁ జీఁకటి, కోప ముడుగ
నిర్మలం బగు శాంతంబు నెలకొనుగతి.
భీష్మతర మగు గ్రీష్మంబు వెడలినంత
వర్షకాలంబు చల్లనై హర్ష మొదవె.

ప్రాచిదిక్కున వాయువుల్ వీచియాడె
ఉత్తరంబున ప్రతిసూర్యుఁ డుదయ మొందె
పశ్చిమంబున నింద్రచాపంబు తోఁచె
దక్షిణంబున మేఘసంతతులు గూడె.

ధగధ గంచును మెఱుఁగులు తాండవించె
పెళపెళంచును నుఱుములు పెటిలి యుఱిమె
పెటపె టంచును బెడిదంపుపిడుగు లడరె
గుప్పగుప్పున వడగండ్ల గుంపు రాలె.

మొగులు మొగులున మెఱుఁగులు నిగిడి మెఱసె
మెఱుము మెఱుమున నుఱుములు మెండుకొనియె
ఉఱుము నుఱుమునఁ బిడుగులు తఱచు రాలె
పిడుగులను మించి వడగండ్లు పెచ్చుపెరిగె.

చిమ్మచీఁకటి జగ మెల్లఁ గ్రమ్ముకొనియె;
కలయ మిన్నును మన్ను నేకంబు గాఁగ,
బోరుబోరునఁ దోరంపుధార లడర
కుంభవృష్టిగ వర్షంబు గురియుచుండె.

బెకబెకంచును కప్పలు బిట్టు కూసె
తకపి కంచును నెమలి తైతక్కలాడె
చాతకంబులు నింగిని సంచరించె
ఇంద్రగోపము లొప్పారె నెల్లయెడల.

ఆకసంబున తూనీఁగ లాడఁ జొచ్చె
గుంపులుగఁ గూడి చీమలు గ్రుడ్లుమోచె
కొంగకదుపులు బారులై నింగి కెగసె
త్రాఁచుపాములు పుట్టల దాఁగియుండె.

మెడలు సారించి తొండలు మిన్ను జూచె
దుమ్ము మైనిండ పిచ్చుకల్ జిమ్ముకొనియె
బురదలో సూరపందులు పొరలియాడె
దున్నపోతులు తిరుగాడె దుండగమున.

మేఁత సాలించి యావు లంబే యటంచు
మరలి యింటికిఁ జనుచుండె మందగొనుచు,
పొదుఁగుదూఁటులు వదలి క్రేపులుతొలంగి
మొదవుకదుపులమాటున నొదిఁగియుండె.

ఒండుపిఱుఁదను వేఱొండు పిండుగట్టి
నీడలను జేరి మేకలు నెమరుపెట్ట;
కొట్టకొనకొమ్మ డిగి క్రిందకొమ్మమీఁద
నిలిచి పులుఁగులు కిలకిల యెలుఁగులిడియె.

నీలజీమూతపటలంబు నింగినుండి
ఇంద్రచాపంబుతోఁ గూడి యిలకు డిగ్గి
స్వేచ్ఛ మీఱ విహారంబు చేసె నసఁగ,
నెమలి పురివిచ్చి నృత్యంబు నెఱపుచుండె.

మత్తభృంగములకు తేనె రిత్త యయ్యె
గండుకోయిలకూఁతలు కట్టువడియె
పంకజాతకులంబుల పొంక మడఁగె
కాకిమూఁకలరొదలు చీకాకు గొలిపె.

వెల్లువలు తటాకంబులు వెల్లివిరిసె
ఇవురఁబాఱిన మ్రాఁకులు చివురుతొడిగె
పసరుపచ్చికగుబురులు మిసిమిదేఱె
పాదరక్షలు గొడుగులు ప్రబలమయ్యె.

మంకెనలు పూఁచె, మాలతి బింకమెక్కె,
కడిమిపువ్వులగుత్తులు కడిమి నూపె,
మొల్లలును కొండమల్లెలు నుల్లసిల్లె,
కన్నె గేదంగిఱేకులు చెన్నుమిగిలె.

పెక్కువన్నెలకాంతుల విరులు గ్రాలు
నీలిగోరంటమొక్కలచాలు దనరె,
విడువ కెప్పుడు దివి నుండ విసుఁగుజెంది
వసుధ విహరించు నింద్రచాపంబొ యనఁగ.

ముంపుగొను కారువానల ముసురుచేత
చలిని వడఁకుచు ధారుణీలలన మేన
కప్పుకొనినట్టి పచ్చని కంబళి యన,
పసరుపచ్చికజొంపముల్ మిసిమిదేఱె.

ముమ్మరపువానఁ దన పువ్వుటమ్ము లెల్ల
వమ్ములై చన, విరహిగ్రీవములఁ గోయ
మరుఁడు గైకొన్న పై డిరంపంబొ యనఁగ,
పొలుపుమీఱెను గేదంగిపువ్వుఱేకు.

దారుణం బగు వర్షాంబుధారచేత
సారహీనము లైన యబ్జముల వీడి
తుమ్మెదలు వ్రాలె గంధబంధురము లైన
వికసితకదంబపుష్పగుచ్ఛకము పైని.

క్రమ్ముకొనియున్న కారుమేఘములచేత
కాల మెల్లను నొకతీరె కానఁబడఁగ,
ప్రకటజలజాతమాలతీవికసనములు
జనుల కిది పగ, లిది రేయి యనుచుఁ దెలిపె.

సతతవర్షాంబుధారాభిహతులచేత
కలఁగి తారలు నింగిని నిలువలేక
కుప్పతిప్పలుగా నేలఁ గూలె ననఁగ,
గుప్పగుప్పున వడగండ్ల గుండ్లు రాలె.

ఏటిదరి బారులై యున్న తాటిచెట్లు
కొసరి యొండొంటి డిక్కీలు కొట్టుకొనియె;
చింతకొమ్మలఁ గూర్చుండి జెముడుకాకు
అల్లనల్లన ఱెక్కల నార్చుచుండె.

ఇఱుకుసందుల వెంబడి మొఱకనుండి
వట్టిలొడ్డుచు ప్రవహించె వాననీరు,
తల్లి దరినుండి అల్లరిపిల్లవాఁడు
కేరి గంతులువైచుచు పాఱినట్లు.

నిండిపోయిన చెఱువులనుండి పొంగి
పొలములోనికి పొరలిన జలముతోడ
కొట్టుకొనివచ్చు చేఁపలఁ బట్టుకొనఁగ
సంభ్రమంబున మూఁగిరి జనము తెల్ల.

రయముగాఁ బాఱు వానగుఱ్ఱాల నెక్కి
మెఱుపుకొరడాల ఝుళిపించి తఱటుచేసి
మబ్బురౌతు ఉడాయించి ఝుబ్బు మెఱయ
నింగి పేరిటి పందెంపునేల యందు.

వానచినుకులు చొరకుండ పాములు తమ
పుట్టగొఱియలపై నెత్తిపెట్టు తెల్ల
పట్టుగొడుగులౌ యనులీల, పుట్టగొడుగు
లలరి చూడ్కికి వేడ్కలు గొలుపుచుండె.

ఒయ్యనొయ్యన తనపుట్టనుండి వెడలి
మిన్ను పేరిటి పెనుగోడమీఁదఁ బ్రాఁకు
వింతవన్నెల యూసరవెల్లి యనఁగ,
ఇంద్రచాపంబు కాంతితో నెసకమెసఁగె.

పెక్కువన్నెలతంతులఁ బేర్చి కూర్చి
లీల నల్లిన మరుని యుయ్యాల యనఁగ,
సాంద్రకాంతులఁ జూపట్టె నింద్రధనువు
కనులపండువు చేయుచు గగనవీధి.

ఘననృపాలుఁడు పాలించు గగనపురిని
ఇంద్రచాపపు గోపుర మెత్తువేళ,
విరసవాక్కుల వర్ణించు భేకనామ
కాకవులకు పంకాభిషేకము లభించె.

బలిమిమై తీవ్రకరములఁ బఱపి యినుఁడు
ధరణిఁ దా మున్ను గుంజిన ద్రవ్య మెల్లఁ
గ్రక్కె, పరులను పీడించి బ్రతుకువారి
పాటు లిట్టివె గద యని చాటె ననఁగ.

జడముకంటె జలంబును, జలముకంటె
వాయు వెక్కుడు బల మంచు పగటె ననగ,
ధూళి చెలరేఁగి వానచేఁ దూలిపోయెః
గాలి యడరంగ వర్షంబు డీలువడియె.

## హేమంతఋతువు

ధరణి యెల్లను సస్యసంభరితమయ్యె,
ఆలకదుపుల పొదుఁగుల పాలు కురిసె,
కొలఁకులందలి జల మెల్లఁ గలకదేఱె,
కడిఁదిచలిచేత గజగజ వడఁకె జగము.

బిరుసువాఱెను ప్రజమేను, బురద లివిరె,
పైరువచ్చలు మెఱుఁగెక్కె, పాఁడి హెచ్చె,
దహన మిం పయ్యె, పానీయ మహిత మయ్యె.
దినము కుఱు చయ్యె, రాతిరి దీర్ఘ మయ్యె.

ఇంటనింటను చలిమంట లేపు మీఱె
వచ్చడంబులు కంబళ్ళు పెచ్చుపెరిగె
తాళవృంతంబు లటకలమూల కెక్కె
ఆతపత్రంబు లందంద యడఁగిపోయె.

పసులమందలు పొలముల మసలియాడె
క్రేళ్ళువాఱుచు గుప్పించె లేళ్ళగుంపు
జలవిహంగమ కలకలంబులు సెలంగె
నట్టుపిట్టల యాటలు కట్టువడియె.

బంతి విరివిగఁ బూఁచె, చేమంతి విరిసె,
ఊసిరిక లెసంగె, లొద్దుగు లెసక మెసఁగె,
రేఁగు చెలరేఁగె, నిమ్మలు సోగదేఱె,
పొంకమున ప్రేంకణంబులు బింకమెక్కె.

వంగ చిక్కుడు గుమ్మడిపాదు లలరె
చెఱకు మిరెముల చేనులు చెంగలించె
వెలగ నారింజపండులు విస్తరించె
కూరగాయలు కుప్పనఁగూర లయ్యె.

నల్లగల్వలు చెంగల్వ లుల్లసిల్ల
క్రౌంచములు సారసంబులు సంచరింప,
కలఁకదేఱిన చల్లనిజలము గలిగి
సరసు లొప్పారె కన్నులకఱవు దీఱ.

కలిత ఖర్జూరసుమముల కాంతి గలిగి
చక్కఁగా పండి బంగారుఛాయ వెలయ
ఎన్ను వ్రేఁగున ముందు కొక్కింత వంగి
పొలిచె వరిపైరు తండులపూర్ణ మగుచు.

సురలఁ బితరుల సంతుష్టిపఱచుపొంటె,
అపుడ పండిన క్రొత్తధాన్యములఁ దెచ్చి
ముంగిలుల ముందు పొంగళుల్ పొంగఁజేసి,
వెలసి రెల్లరు నపగతకలుషు లగుచు.

లేఁతపచ్చికజొంపముల్ మేఁత మేసి
కొలఁకులను దేఱు నిర్మలజలము ద్రావి
రంతుగొనుచు కడిల్లని బంతెపైచి
చియ్యబట్టిన యాఁబోతు చెంగలించె.

కొలనుదరిఁ జేరి దప్పిచే కుంజరములు
స్వచ్ఛమై శీతలం బగు జలము దాకి
జల్లుమని దేహ మెల్లను జలదరింప
పూత్కరించుచు తొండముల్ ముడిచికొనియె.

సహజభావంబుచేతనే చల్లనగుచు
వీచు నుత్తరవాయువు ద్విగుణ మైన
శీతలంబున నిపుడు ప్రభాతమందు
విసరుచున్నది నీహారవిద్ధ మగుచు.

గుట్టపై నొప్పు పచ్చికకొనలఁ గదురు
మంచుబిందులు తళతళ మంచు మెఱసె,
పడమిచేడియ బొమిడికమున తురాయి
కుచ్చుపై గ్రుచ్చు మణులట్లుకొమరు మివిలి.

పొడుపుగుబ్బలిమీఁదను పొడుచు టాది
చలికి గజగజ వడకుచు చండకరుఁడు
గురువువాఱుచు బిరబిర పరువు లెత్తి
చరమభూధరగుహలందు మఱుఁగుఁజొచ్చె.

తుహినకణములఁగిరణముల్ దోఁగియుంట,
కరము దవ్వున నుదయంబు గాంచియుంట,
వేడియెల్లను దిగఁద్రావి పోడిమి చెడి
శీతకరుఁ డయ్యె సీతున శితకరుండు.

తనదుసౌభాగ్య మంతయు నినున కొసఁగి
శవము మైనిండఁ గురియుంగ సెట్టివాఁడి
ఊర్పుచే మాఁగువాఱిన దర్పణ మన,
హిమకరుం డొప్పె తేజోవిహీనుఁడగుచు.

మంచు పడుటను, తపనుండు మందుఁ డగుట,
సరసులందలి నీరెల్ల చల్ల నగుచు
సురుచిరం బయి మధురమై శుద్ధ మయ్యు
పానయోగ్యము గాదయ్యె పాంథతతికి.

విరియఁబాఱిన చెంగల్వవిరులమీఁద
వ్రాలి తూఁగాడు మధుకరజాల మొప్పె,
తుంటవిలుతుని హోమపుమంటపైని
బుగులు బుగులున నెగసెడుపొగలో యనంగ.

చేగదేఱిన బారెడు చెఱకువింట
నల్లగలువ లకోరి సంధిల్లఁ జేసి
ఝుమ్మరఝుంకార టంకృతుల్ వఱలఁగ మరుఁడు
విరహిజనములపైఁ బడి వేఁటలాడె.

# విరిదండ

---

ద్వితీయ ముద్రణము.
ప్రతులు 1000



సంవత్సరము
1980

మూల్యము
4—00.

ముద్రణ
మాతృశ్రీ ప్రింటర్సు
బాపట్ల

మధురకవి

నాళము కృష్ణరాయ

శతజయంతి ప్రచురణ

ఈ గ్రంథముద్రణకు

ఔదార్యముతో

వేయిరూప్యముల విరాళము నొసంగిన

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ

వారికి కృతజ్ఞతాంజలి

విరిదండ

పైఁడిలేడి

అపవాదము

గోగితము

కేరళరాణి

# మధురకవి ప్రశంస

పుడమితల్లి పురుటినొప్పులు పడే పుణ్యసమయాలలో, విక్రమనామ సంవత్సర పుష్యమాసంలో మాన్యులు, శ్రీ మధుర కవి నాళము కృష్ణరావుగారు, సుప్రసిద్ధ నౌకావ్యాపారదక్షుడు, మహావితరణశీలి అయిన శ్రీ.నాళము కామరాజుగారి కడగొట్టు కుమారుని గా జన్మ గైకొన్నారు.

నాళము కామరాజుగారు మద్రాసునుండి, కలకత్తా వఱకు, బాటలే లేని ఆకాలంలో, బాటసారుల వసతిసౌకర్యార్థం, ఆరు సత్రాలు నిర్మించిన మహావ్యక్తి, గౌతమీక్షేత్రమాహాత్మ్యాది గ్రంథాలను ముద్రణచేయించి, ప్రచురించిన ధీశాలి! కావ్యస్వీకారము గావించిన రసపిపాసి! ఆమహానుభావుని గారాబుపట్టియైన కృష్ణారావుగారు అనేక విషయాలలో తండ్రి గారి కీర్తిని, తన ఉజ్జ్వల సేవాకార్యక్రమాలతో, అతిశయింప జేసిన, సార్థక పుత్రుడు!

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు చిన్నవయస్సు లోనే, **IV th** ఫారం పరీక్షాపత్రానికి పద్యాలలో సమాధానా లిచ్చిన ప్రతిభాశాలి! కృష్ణరావుగారు!

మిత్రులకు కూడా పద్యాలలోనే వ్రాసే అలవోకగా ఉత్తరాలు వ్రాసే అలవాటు కల్గిన అమలమనీషి!

తనకు ఇరువదేండ్ల ప్రాయము వచ్చీరాని వయస్సునందే సోదరదేశీయులలో విజ్ఞానదీప్తి పెంపొందింపజేయుడానికి గ్రంథాలయం స్థాపించి, ఆగ్రంథాలయాన్ని గౌతమీ గ్రంథాలయం అనే పేరున, ఆంధ్ర దేశమందలి సర్వోన్నత గ్రంథాలయంగా తీర్చి దిద్దడమేకాదు,

గ్రంథనిలయంబుగల నరకమందు
నైన నివసింప గాక్షింతు గాని
గ్రంథ నిలయంబు లేని స్వర్గంబు నందు
నిముస మేనియు నివసింప నిచ్ఛగింప

అని కంఠోక్తిగా చాటిచెప్పిన గ్రంథాలయారాధకుడు!

మానవసేవ అనే తొలి తెలుగు సచిత్ర మాసపత్రికను ప్రచురించిన ప్రత్రికోద్యమాభిమాని! శ్రీ చాగంటి వీరభద్ర కవి, శ్రీ సత్యవోలు అప్పారావు మున్నగు ఎనమండుగురు కవులతో కొలువుదీరి 'అభినవ కృష్ణదేవరాయ'డై, చదువుల తల్లిని, తలపుగద్దెపై అధివసింపజేసి అర్చించిన సారస్వత పోషకుడు!

జాతీయములు, లోకోక్తులు, న్యాయములు తెలుగు భాషాసరస్వతి కామెత లైన పదివేల తెలుగు సామెతలను ప్రబంధోదాహరణములతో సేకరించిన, భాషాపరిశోధకుడు!

అన్ని రంగములయందును అతిశయ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించి భరతదేశానికే ఖ్యాతిదెచ్చిన, ఆంధ్రుల అత్యున్నత సంస్కృతికి దర్పణము పట్టినట్టి, 5, 6 వందల మకుటములలో 2, 3 వందల గ్రంథములనుండి ఏర్చి కూర్చిన ఉదాహరణ ములతో, ఆంధ్ర సరస్వతికలంకారముగా గైసేసిన ముత్యాల హారమువంటి సాహిత్యవిజ్ఞాన సర్వస్వమునకు తొలిసంకలన కర్తయైన అఖండధీశాలి!

భవిష్యత్పౌరులగు బాలల అభివృద్ధికై గోరుముద్దలు, మీగడతఱకలు, తేనెచినుకులు, పాలతరగలు, వెన్నబుడగలు. వెన్నెలవెలుగులు, దీపావళి, విరిదండ అను శీర్షికలతో "మధురగీతికలు" అను మకుటమునను, ఇతర కావ్యములను ప్రచురించిన ప్రప్రథమ బాల వాఙ్మయస్రష్ట!

గౌతమీ గ్రంథాలయమునుండి ఉత్తమ గ్రంథము లను గృహిణుల సౌకర్యార్థము, వారివారి యిండ్లకు పంపి,

సంవత్సరాంతమున, ఆ స్త్రీలకు పరీక్షలు పెట్టి, విజేతలను బహూకరించి స్త్రీ విద్యను ప్రోత్సహించిన స్త్రీ విద్యాభిమాని!

శ్రీ వీరేశలింగముగారి అన్ని ఉద్యమములయందును వారికి కుడిభుజము గా నిలిచి, తన శక్తియుక్తులను, సంపదను సంస్కారోద్యమము నందు వెచ్చపెట్టుటే కాక, అత్యంత ధైర్య సాహసములు ప్రదర్శించి అనాటి మూఢవిశ్వాసముల రోజులలో, ఎన్నోకష్టముల నెదుర్కొని, పంతులుగారికంటె ముందు జందెముతీసివేసి సర్వమతసహపంక్తిభోజనములను తనయింట నిర్వహించి, బ్రహ్మసమాజసంస్కారమునకును, వితంతువివాహసంస్కారోద్యమమునకును తనువు నంకితము చేసిన ధైర్యశాలి!

గౌతమీ గ్రంథాలయమునకు ప్రతిష్ఠాపకుడేకాక, జీవితాంతము అధ్యక్షుడు ఆ మహావ్యక్తియే.

శ్రీ పంతులుగారి సత్ప్రతిష్ఠాపనమైన హితకారిణీ సమాజమునకు పంతులుగారి తర్వాత ఆజీవితాధ్యక్షుడును కృష్ణరావుగారే.

అట్లే గౌతమీ గోసంరక్షణ సంఘమునకును జీవితాంత మధ్యక్షుడా మాననీయుడే.

ఒకటననేల బాలభక్త సమాజము అనుగ్రంథాలయము నకు ముఖ్యప్రోత్సాహ మా సహృదయునిదే. అన్నగారైన నాళము రామలింగయ్యగారు ప్రతిష్ఠాపించిన వైశ్యసేవా సదనమును తొలుదొ్త నడిపించినఖ్యాతి వీరిదే.

శ్రీ పంతులుగారు స్థాపించిన పురమందిరమునకు, ప్రార్థనాసంఘమునకు కార్యదరిగానుండి ఆ సంస్థలను ఉజ్జ్వల ముగా నిర్వహించి శ్లాఘనీయమైన సామర్థ్యము ప్రదర్శిం చిన యువసింహ మీ ధీరుడే.

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రథమ కార్యదర్శి ఈ గ్రంథాల యారాధకుడే.

టౌను కాంగ్రెసు కార్యదర్శిగానుండి పూజ్యబాపూజీ సన్నిధిని తనభార్య సుశీలమ్మ విదేశవస్త్ర దహనముచేయు టకు ప్రోత్సాహ మొసగిన పరమదేశభక్తుడీ పోటుమానిసియే.

తన సతీమణి సుశీలమ్మ స్థాపించిన ఆంధ్రమహిళాగాన సభకు ఆధారదండమై ఆద్యంతములు ఆ సంస్థను అభివృద్ధి పఱచిన గానకళోపాసి! శ్రీ దేవత శ్రీరామమూర్తిగారితో కలిసి

గానసభల పెక్కు నిర్వహణముచేసియు, చరిత్ర ప్రసిద్ధమైన జెండా కేసులో అయునతో బాటునిలచియు తర్వాత పెద్దాపురం కాంగ్రెసు సంఘసమావేశంలో పిఠుపీకు జావక లాఠీఛార్జికి గురియైన అసమాన సత్యాగ్రహయోధుడీ వీరాగ్రణియే!

సర్వశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటకవి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, వడ్డాది సుబ్బరాయుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, భావరాజు కృష్ణరావు, శ్రీపాద కామేశ్వరరావు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మున్నంగి శర్మ, బాలదారి వీరనారాయణదేవు, దీవత శ్రీరామమూర్తి, వెల్లంకి కృష్ణమూర్తి, హరీంద్రనాథఛట్టోపాధ్యాయ, అజాడ ఆదిభట్ల నారాయణదాసు, చిలుకూరి నారాయణరావు, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, టంగుటూరి శ్రీరాములు, టంగుటూరి ప్రకాశం పంతులు, గిడుగు రామమూర్తి పంతులు, వైణికులు పొడుగు రామమూర్తి హేమచంద్ర సర్కారు మున్నగు ప్రముఖకవి పండిత, గాయక, నటశేఖరుల, సంఘసంస్కర్తల సమకాలీన గౌరవము పొందుటేకాక, ఆయా ఉద్యమములలో వారలకు సహకారమిచ్చి, ఆశ్రేణిలో మహోన్నతులకు కొంత అర్థిక సాహాయ్యమందించి జీవితాం

తము తోడ్పడి, అనుంగు మిత్రుడైన ఆచార్య రాయ
ప్రోలు సుబ్బారావుగారిచే 'మధురకవి' బిరుదమందిన
మహనీయుడీ నాళము కృష్ణరావుగారే.

ఆనాటి పౌరహిత, దేశసేవాకార్యక్రమములలో, ఉద్య
మములలో నిస్స్వార్థముగా పాల్గొని, నిర్వహించి, దేశస్థులకు
స్ఫూర్తిని కల్గించు సచ్ఛీలాచరణదీప్తితో భరతమాతకు కీర్తి
ప్రతిష్ఠాకరమైన సదుద్యమాకృతితో జీవితాంతము పాటుబడిన
మధురకవి నాళము కృష్ణరాయడు నాకు పితృదేవులగుట
నాభాగ్యమని గర్వించుచు ఆ మాననీయుని శతజయంత్యు
త్సవసందర్భమున, నేను తలపెట్టిన వారి గ్రంథపునర్ముద్రణ
మునకు నాకు బాసటగా నిలిచి, ప్రోత్సాహమిచ్చి. వైశ్యకులా
లంకారుడైన కృష్ణరాయుని కృతులలో ఒకటైన ఈ విరిదండ
కావ్యమునకు వేయి రూప్యముల విరాళమొసంగి నన్నాశీర్వ
దించిన పూజ్యసోదరులు, ఆస్తిక్యచూడామణి, మహాదాత,
సేవాశీలి ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభాధ్యక్షులైన శ్రీ
కాసంసెట్టి రాధాకృష్ణమూర్తిగారికి ఆం. ప్ర. ఆర్యవైశ్య
మహాసభవారికి నిండైన మనస్సుతో నా కృతజ్ఞతాంజలిని
చెల్లించుకొను చున్నాను, నేనడిగినదే తడవుగా ఈ కావ్యము
నకు శోభాదర్పణముగా ఆముఖము వ్రాసి ఈ కావ్యము
నలంకరించిన, న్యాయాధిపతి, కవిశిరోమణి, సహృదయ

శేఖరులు, సోదరులు శ్రీ దేవత సుబ్బారావుగారికి నా ధన్య వాదములు.

చక్కగా ముద్రించియిచ్చిన బాపట్ల మాతృశ్రీ ప్రింటర్సువారికి నతిశతము.

డా. ఈ. లక్ష్మీకాన్తమ్మ

## తొలిముద్రణ పీఠిక.

'కావ్యమునకు సత్కావ్యమని, అసత్కావ్య మనీ భేదము లేదు. సరసమా, విరసమా? అని సమీక్ష. అంతే.

— ఆస్కార్ వైల్డ్.

'విరిదండ' 'మధురగీతికలు' పేరి పూలతోటలో పూచి పూన్చిన క్రొవ్విరిదండ. దీని ప్రణేత 'మధురకవి' శ్రీనాళము కృష్ణరావుగారు. వీరి జానుకైత తెనుగునాటికి సుపరిచితము. వీరును సుపరిచితులు.

ఈ రసవత్కావ్యనేత ఆంధ్రరసజ్ఞుల గౌరవ తాత్పర్యముల నేనాడో పుణికిపుచ్చుకొన్నాడు. ఇందలి యితివృత్తములు సహితము సకలాంధ్ర సాహిత్యసార్వభౌముల హృదయసీమల స్థాయీభావము చెంది, స్మృతిమాత్రమున నానందరసోన్మేష ములై, స్వర్గలోక మర్త్యలోకములను రససూత్రములో నేకీ కృతము చేయుచున్నవి. ఇట్టి నవమందార మరందనిష్యంద నములగు వస్తువుల రచనాసామగ్రిగ నుపయోగించుట వలన ఈకవి సహృదయుడు.

కావ్యము నైకభేదము. అందు కరుణాత్మక మైన కావ్యమునకే కళాభిజ్ఞులు పట్టము గట్టినారు. ఈ చిన్ని కావ్యములు కరుణాంచిత భావద్యోతకములు; మనోహరములు; రసోన్మీలనములు. పాలనిగ్గులు చిందువాలు పసిపాపల నోళ్ళ కను వగు రీతుల నేర్చి, గీతికల గూర్చుటలో ఈతని 'అందె వేసిన చేయి' కరుణగీతాభివర్ణనమున పరాకాష్ఠ నెందినది.

నిజభావాభివ్యక్తతకు గీతివృత్తమును లక్ష్యముగా నుంచుకొనుట చూడ, ఈ కవి కవిత్వతత్వమహత్వమును కూలంకషముగ తఱచి జీర్ణము చేసికొన్నా డనుట తెల్లము. అంతటి సంస్కృతహృదయమునుండి సురభీకరించిన గీతా సుమపాళి తెనుగుగడ్డకు నాశాశల నాహరించుకొన్నది. ఆహరించుకొననున్నది.

కవితామూర్తికి నవజీవన లావణ్యము నొసగు నమేయ శక్తి భాషాసరస్వతికి గలదు. ఆ సరస్వతి నేటి కావ్యరచన లలో నీ కవితిలకుని లేఖినిమొన నిలిచి లలిత లాస్యము చేసినది.

పసపులు వోని పడములతో, వన్నెచిన్నెలు వెలారించు అలంకారములతో, జుంటితేనెపెరలు బురుడించు తలపుదొంతరలతో నీ కవి కవితాలతాంగి నిత్యము పిసాళించుచుండును.

పఠనయోగ్యము లగు కావ్యగీతికలలో తెనుగు తీపి, తెనుగు జిగి, తెనుగు తీరుతీయము తీగలు సాగుచున్నది. ఈ గీతికాపఠనమువలన తెనుగుబిడ్డలకు భావనాశక్తియు కవితాభిరుచియు నొకేసారి రేకెత్తి ననలెత్త గలదు.

'మధురగీతికలు' పేరిటి దామస్తోమమునుండి ఈ 'విరిదండ' వింతవింత నెత్తావుల గుబాళించి, ఆంధ్రకుమారుల పొరపొచ్చెము లేవి హృదయములకు జుబ్బనచూఱ లిచ్చుగాక!

సహదేవ సూర్యప్రకాశరావు.

# కృతి సమర్పణము



తనదు పదునెన్మిదవ యేట ధరణి విడిచి
అమరపురి జూచు వేడుక నరిగినట్టి
వాదు చిరంజీవి హొవిన్నరి నందనుండు
రామకృష్ణుని కిది సమర్పణ మొనర్తు.

# ఆ ము ఖ ము

మధురకవి నాళము కృష్ణారావుగారి కవితా సంకలనమీ "విరిదండ". ఇది ఒక మల్లెపూలపోగు. కృష్ణారావుగారు ఆగర్భశ్రీమంతులు, ఆబాల్యకవితావసంతులు, సాహితీ మంత్రోపాసి. కావ్యము వారి సాహితీ తపస్సుయొక్క మహస్సు. చిరుతప్రాయంనుంచీ కవిగా, సంస్కర్తగా, జాతీయవాదిగా కృష్ణారావుగారు ఎన్నికకువచ్చినవారు. వీరిది బహుముఖప్రజ్ఞ. మితభాషి, అమృత హృదయులు, అయిన వీరు వీరేశలింగంగారి అనుయాయులు. 'మానవసేవ' అనే పత్రిక, గౌతమీగ్రంథాలయము వీరి నిర్విరామ కృషిఫలితాలు. వీరికలంలో తేటగీత తేనెలుచిందింది. మధురకవి అనే బిరుదు వీరికి సార్థకము. తెలుగుసాహితీరంగములో చాలామంది మధురకవు లున్నారు, వుంటారు కూడా. చాలామంది కవులకు బిరుదు ఒక అలంకారము. కాని కృష్ణారావుగారి విషయంలో ఆ బిరుదునకే వారు అలంకారము. వీరికవిత లలిత సుకుమార మనోజ్ఞశిరీషపేశలము. ముద్దు, పాపాయి, మీగడతరకలు, తేనెచినుకులు, విరిదండ ఇత్యాది, భావస్ఫోరకములు, విశ్లేష ణాత్మకములు అయిన 10, 15 కావ్యాలు వీరి సాహితీతపః

ఫలితాలు. కృష్ణరాయాంధ్ర విజ్ఞానసర్వస్వము వీరి సంకల నము. దానిలో వీరి అపారగ్రంథ పరిశీలనాసక్తి, విశ్లేషణా శక్తి. గోచరమవుతవి వీరి భావాలు జాతీయతాస్ఫోరకాలు. అందుకే దేశీయ పదప్రయోగాలు. లోకోక్తులు వీరికవితలో ఎంతగానో చోటు చేసుకున్నాయి, మచ్చునకు కొన్ని-"కట్టు కొంగున చిచ్చును కట్టినట్లు", "కొఱవిచేబూని తలగోకికొన్న రీతి", "బొడ్డుమావియు నూడని పురిటిపాప," "నిప్పుతునకకు చెదలంట నేర్చునమ్మ," "అంటుసంటులు," "తువ్వ" "గుమ్మపాలు", "మట్టిపాలు," "చంపుమాట," "పల్లెత్తుమాట," "ఆవగింజంత ఆయువు", "గుక్కెడు ప్రాణము," "చెక్కు చెదరక," "కడుపుతీపి"-ఇత్యాదులు. అల్పాక్షర ప్రయోగ ముతో అనల్పార్థమును సాధింప గల నేర్పరి వీరు. పదలాలి త్యానికి వీరిది అందెవేసినచేయి. ప్రతీ శీర్షికలోనూ వీరి కవితాత్మ గోచరిస్తూ వుంటుంది. ప్రతీ గీతమూ ఒక రసరాజ్య రమావిభూతి. ప్రతీ కావ్యమూ ఒక మధుకలశము, వెన్నెల జల్లు, తెలుగు సాహితీసీమకు వీరు ఆమనికోయిల, తాత్త్విక చింతనమేకాకుండా, తార్కిక పుష్టికూడా ద్యోతకమవుతవి వీరి కవితలో, అందువల్లనే కాబోలు అర్థాంతరన్యాసాలంకారాలు విరివిగా దొరలుతవి వీరి కవితలో, తర్కానికి అవి గీటురాళ్లు కదా.

ప్రకృతకావ్యము, విరిదండ, పైడిలేడి, అపవాదము, గోగీతము, కేరళరాణి, అను అయిదు ఖండికలసంపుటి, విరిధండ మహాకవి కాళిదాసుని రఘువంశమునుండి గ్రైకొన బడిన అజవిలాపము. పైడిలేడి ఆదికవి వాల్మీకి కృతరామా యణారణ్యపర్వమునుండి సంగ్రహింపబడిన సీతాపహరణ గాధకు ముందలిభాగము. అపవాదము, వాల్మీకి రచన మని చెప్పబడే ఉత్తరకాండ నుండి స్వీకరింపబడిన సీతాపరిత్యాగ ఘట్టము. గోగీతము, పురాణేతిహాసప్రబంధములయందు, గోవ్యాఘ్రి సంవాదముగా చిత్రింప బడిన నీతికధ. కేరళరాణి కవినిర్మితమగు రసవత్తరగాధ.

అజవిలాపము, రఘువంశ మహాకావ్యమున అష్టమా శ్వాసమందలిది. అజుడు వంశకర్తయైన రఘువు తనయుడు. దశరధునితండ్రి. విదర్భరాజపుత్రికయగు ఇందుమతి, స్వయం వరాహూతులగు రాజన్యులను నిరాకరించి అజునివరిస్తుంది. ఇందుమతీస్వయంవర సందర్భమున కాళిదాసమహాకవి చెప్పిన "సంచారిణీ దీపశిఖేవరాత్రౌ - - - - " (8-67) అనుశ్లోక మా మహాకవి కెనలేని ఖ్యాతి నార్జించినది. అజుడు, ఇందుమతి, కలసి అయోధ్యలో వనవిహారం చేస్తూవుండగా, గోకర్ణ క్షేత్ర మునకు గగనచారిగా పయనిస్తూవున్న నారదుని మహతికి

అలంకారార్థమై ఉంచిన స్వర్గలోక కుసుమహారము గాలితాకున ఎగిరివచ్చి, ఇందుమతిని స్పృశింపగా ఆమె క్రిందపడి మరణించును. అజు డామెకై హృదయవిదారకముగా విల పించును. అతని విలాపఘట్టమే యీ ఖండికలోని ఇతి వృత్తము. ఇందుమతి పూర్వభవమున హరిణి అనేపేరుగల దేవకాంత. తృణబిందు వను మునియొక్క తపస్సుకు విఘ్న మాపాదింప ఇంద్రునిచే హరిణి నియుక్త అవుతుంది. ముని కోపావిష్టుడై మానవాంగనగా పుట్టు వందు మని ఆమెను శపిస్తాడు. ఆమె ప్రార్థింపగా, స్వర్లోకసుమహారపు తాకున మృతిచెంది, మరల నచ్చరలేమగా నగుదువని శాపమోక్షమును చెబుతాడు. ఆ విరిదండను

"కడు రయంబున గొనిపోయె గంధవహుడు
కమ్మతావుల నానెడు కాంక్షవనగ"

అంటాడుకవి. గంధవహునకే సుమసౌరభాన్ని ఆఘ్రాణించే ఆకాంక్షకలిగినదట. ఇది మూలమున కనిపింపని శిల్ప చాతుర్యము. ఇందులోని ఉపమాలంకారాలు, రూపకాలు దాదాపుగా అన్నీ కాళిదాసుని మూలంలోనివే. కాని అవి చక్కని జానుతెనుగు లోనికి అనువదింప బడినా, అవి అను వాదాలుగా కనుపింపవు, అదే కవిప్రతిభ. పూలదండ

వెనుక వస్తూవుండే భ్రమరాలు "వీణచాన --- విడుచు కాటుక కన్నీటి బిందువుల" వలె వున్నవట. విరిదండతాకున ఇందుమతి "మొదలునటికిన కర్పూరకదళి" వలె పడిపోయినదట. ఈ "కర్పూర" ప్రయోగం మూలములోలేనిది. కర్పూరము ఎంతోకాలం వుండక హరించిపోతుంది. అలాగనే ఇందుమతి కూడా చిరుతప్రాయం లోనే అసువులను వీడినది అని ధ్వనిస్తున్నది యీ "కర్పూరం"లో. కర్పూరకదళి తెలుగు దేశంలోనే లభ్యమవుతుంది.

అజవిలాపాన్ని పఠితల హృదయాలకు హత్తుకొనేలా చిత్రించాడుకవి, శిల్ప చాతుర్యంతో, శబ్దం కవిచేతిలో వెన్నముద్ద లాగ మెత్తనై పోతుంది; మలచడానికి వీలుగా. చనిపోయిన ఇందుమతి" శ్రుతి దొలంగిన వల్లకి" వలెనున్నదట. అప్పుడు అజుడు "వేకువను వెల్లబారిన విధుని" వలెనున్నాడట. ఎంతటి స్వాభావికాలు?. పూలదండతాకున ఇందుమతి మరణించడం "తమ్మిపువ్వు, మంచు పడినంతమాత్రనే మాడిపోదె" అనే అర్థాంతరన్యాసతో సమర్థింపబడుతుంది. ఆ విరిదండపాటును "వింతపిడుగు" అంటాడు కవి. ఎంతభావగంభీర యుక్తమైన ప్రయోగము?. మూలంలో అజవిలాపంలో కాళిదాసు సురతప్రసక్తిని తెస్తాడు (8-51). పవిత్రమగు

మృత్యుసాన్నిధ్యంలో యిది చాలా అనౌచిత్యమని, కవి భావించి "మన విహారశ్రమంబున నీ వదనమందు, క్రిందుకొని యున్న చెమ్మట బిందువులును ఆఱలేదింక" అని మార్పు చేసి మూలంలోని అనౌచిత్యాన్ని పరిహరిస్తాడు. ఆమెమృతివలని చింతతో ఆమె ధరించిన కనకమేఖల "మధురమంజుల రవములు మాని యుండె" నట అతిసుకుమారసుందర శిరీషము వలె నున్నదీ లలితప్రయోగము. కనకమేఖలకే మంజులారావములు స్వాభావికముకదా.

కాళిదాసు "విలపన్నితి కోసలాధిప - - - స్రుతశాఖార సబాష్ప దుర్దినాన్" (8-70) అంటూ అజుని శోకానికి ప్రకృతి కూడా విలపించిన దంటాడు. "వృక్షములును, గూఢ కన్నీటి వర్షంబు కురిసె సనగ, కుసుమముల నుండి మకరందరసము జారె" అంటాడుకవి. మూలములో వృక్షశాఖలు రసబాష్పము లను కురిసిన వని వుండగా, కవి ఆ శాఖలమీది కుసుమములు మకరందమును బాష్పబిందువుల వలె కురిసిన వనడంలో చాలా ఔచిత్యం కనిపిస్తుంది. ఇలా యిది అనువాదంవలె కనుపింపక, మూలానికే వన్నె పెట్టబడింది.

## పైడిలేడి

ఇందలి ఇతివృత్తం ఆదికవి వాల్మీకులవారి రామాయణ కావ్యంలోని అరణ్యపర్వంలోని 45వ సర్గనుండి సంగ్రహింప బడినది. సీతకోరికపై శ్రీరాముడు బంగరులేడి వెంట నరిగి, దానిపై శరప్రయోగమును గావింపగా, ఆ ఆకారములో నున్న మారీచుడు మృతినందుతూ "హాసీతా, హాలక్ష్మణా అని అరుస్తాడు. ఆ ఆర్తనాదాన్ని ఆలించి, రాముడాపదలో చిక్కు కున్నాడని సీతభావించి, రామసహాయార్థమై లక్ష్మణుని వెళ్ళ మంటుంది, అది రాక్షసమాయ అని అతడు దానికంగీక రింపడు. ఉద్విగ్నయైన సీత ఆతనిని పరుసములాడుతుంది. చివరకు ఆమె పలికిన నిందాలాపములను సైరింపలేక, లక్ష్మణుడు రామునికి సహాయంగా వెళ్తాడు.

"పెనగి మృత్యువు పైకొన్న వేళగాని కలుగదెన్నడు నట్టి యాక్రందనంబు" అని సీత అనడంలో సత్యం లేకపోలేదు. అయితే అది మృత్యుసమయంలో మారీచు డొనర్చిన ఆక్రందనము. అది రాముడొనర్చిన దని సీత భ్రమిస్తుంది. స్నేహము కీడునే శంకిస్తుం దంటారు పెద్దలు. ఖండిక అంతటా సరళమైన భాషలో, స్త్రీ సహజమైన ఉద్విగ్నత

ద్యోతకమవుతుంది. ఇదికూడా అనువాదంకాదు, ....
ఆక్రందనంబు "వినబడెనో లేదొ యింత నీ వీనుగవకు"
అంటుంది సీత. ఇది స్త్రీ సహజము. "ఎంతచెప్పినా వినబడ
టంలేదా" అనేమాట ప్రతీయింటా వినబడేదేకదా." యింత
నీ వీనుగవకు" అనే ప్రయోగం పెద్దనగారి" యింతలుకన్ను
లుండ" ని స్ఫురింపజేస్తుంది. "ఎంత పిలిచిన మాటాడ
వించుకైన", లోకూడ సహజత్వ ముట్టిపడుతూంది. సీత
విసిగి పోయి రాముని సోదరులను నిందిస్తూ "మంచితమ్ముల
గూర్చెరా మాయబమ్మ" అని అంటుంది. అలా ఆ దెబ్బ వెళ్ళి
బ్రహ్మదేవుడికి కూడా తగులుతుంది. ఈ ఖండికలోని సీత
పాత్ర చిత్రణలో వాల్మీకి రామాయణంలో కనిపించని శిల్పం
గోచరిస్తుంది.

> "భ్రాతగాపాడ నీ కంత భీతియున్న
> నిలిచియుండుము నీవిట, నేనెపోయి
> శత్రువులనెల్ల నొకపెట్ట జక్కడంచి
> స్వామిగొనివత్తు తలపువ్వు వాడకుండ

అని సీతచేత పలికిస్తూ కవి, ఆమెను బొత్తిగా చేతగాని
దానినిగా చిత్రింపక ఒకధీరగా చిత్రిస్తాడు, సీత సామాన్యవనిత

కాదు సుమా అని, ఆమె కారణజన్మ అని, యీ విధంగా మనకు తెలియబరుస్తాడు కవి.

సీత చేసిన నిందాపూరితములగు ఆరోపణలను, లక్ష్మణుడు తల్లీ అని ఆమెను సంబోధిస్తూ ఎగురగొట్టి వేస్తాడు. అంతే కాకుండా యిలాంటి నిష్ఠురాలను ఎలాగ పలుకగలిగినా వమ్మా అంటూ "మంచుముద్దను పట్టునే మండుచిచ్చు" అంటాడు. ఇది ఇలా భావగర్భితమైన ప్రయోగం. ఇటువంటి ప్రయోగాలు కృష్ణారావుగారికే చెల్లినవి. " - - - నీపాదపద్మములనెగాని, కన్నెత్తి నీమోముకాంచి యెఱుగ" అని వాపోవుతాడు లక్ష్మణుడు. కిష్కింధకాండలో సీతయొక్క నూపురములను తప్ప తక్కిన ఆభరణాలను గుర్తింపలేనని చెబుతూ లక్ష్మణుని చేత వాల్మీకి పలికించిన

"నాహం జానామికుండలే
నాహం జానామికేయూరే
నూపురేత్వభి జానామి
నిత్యం పాదాభి వందనాత్"

శ్లోకాన్ని దృష్టిలో పెట్టుకొని కవి అనిపించినమాట. ఈ ఒక్క మాటలోనే లక్ష్మణుని శీలసంపద, యావత్తు ప్రపంచానికే

విదితమవుతుంది. "రాముడెన్నగ నాదినారాయణుండు" అని వాల్మీకంలోలేని మరోవిషయాన్ని లక్ష్మణునిచేత కవి యిక్కడ చెప్పించాడు. వాల్మీకి చిత్రించిన శ్రీరాముడు "ఆత్మానం మానుషంమన్యే" అనే చెప్పుకుంటాడు, కడకు "సతులకోపంబు సైరింప శక్యమగనే" అని లక్ష్మణునిచేత పలికిస్తాడుకవి. ఇది దక్షిణ నాయకుడనవలసిన మాట. ఇలా చెప్పించి కవి తన రాసికాన్ని తెలియపరుస్తాడు. లక్ష్మణుడు వెళ్ళిపోతూ సీత చుట్టూ ఒక గిరి గీసి దానిని దాటవద్దని ఆమెను శాసించినట్టుగా కొన్ని రామాయణాలలో వున్నది. అది అవాల్మీకం. కవి అలాంటి గిరిని గీయించకపోయినా "ఎవ్వడైనను నినుముట్టనేని, వాడు పుడమిపై గూలుగావుత బూదియగుచు" అని శాపం యిస్తాడు. ఇదికూడా అవాల్మీకమే అయినా, యిందులో నాటకీయత ద్యోతకమవుతుంది. లక్ష్మణుని నిష్క్రమణ తరువాత, సీత ఆత్మశోధన చేసుకుంటూ

" – – – – లక్ష్మణు దూరియుంటి
కట్టి కుడువక యున్నె యీకర్మఫలము"

అనుకుంటుంది. దాని ఫలితమే యీపదారామాయణగాథ కదా.

## అపవాదము

ఇందలివస్తువు రామాయణ ఉత్తరకాండనుంచి స్వీకరింవబడినది. ఈ ఉత్తరకాండనే కంకంటి పాపరాజు బహురసవత్తరంగా అనువదించి మూలానికే వన్నె దెచ్చాడు. లోకాపవాదానికి వెఱచి రాముడు సీతను త్యజించి, వాల్మీకుల ఆశ్రిమమువద్ద ఆమెను విడచిరమ్మని లక్ష్మణుని నియోగిస్తాడు. అక్కడ అరణ్యంలో నడచిన సీతాలక్ష్మణుల సంభాషణే కవి ఎత్తుకున్న ఘట్టము. దీనిలోకూడా నాటకీయత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సీతపాత్ర లలితమనోజ్ఞంగా మలచబడి, స్త్రీ సహజమైన ఆతురత, సౌకుమార్యము గోచరిస్తాయి. ఆమె మానసికానుభూతి అతిస్వాభావికంగా దర్శనమిస్తుంది. తొలుతనే లక్ష్మణుని విన్నబోయిన వదనాన్ని పరికించి "అన్నదమ్ములు కుశలులై యున్నవారె" అని ప్రశ్నిస్తుంది." "ఓడితివో శత్రులకు - - - " అనేఅమె మలిప్రశ్న పోతనగారి పద్యాన్ని, "గురు నిందయాచరించితొ - -" అనే పాపరాజు గారి పద్యాన్నికూడా తలపిస్తుంది. "కానలకు ద్రోసిపుచ్చెనో ప్రాణవిభుడు" అని సంశయాన్ని వెలిబుచ్చుచూ, భావిని సూచిస్తుంది. రాముణ్ణి సమర్థిస్తూ లక్ష్మణుడు

"భవుని కోదండమును వంచె వాలి నొంచె
శరధి బంధించె, పంక్తికంధరుని దుంచె
నీ నిమిత్తము కాదమ్మ - - -"

అని సీతకు సైరణ కలిగింప యత్నిస్తాడు. ఎంతచేసినా "కడకు కడతేరదయ్యె నీకాపురంబు" అని విచారిస్తూ విషాద వార్తను చల్లగా చెబుతాడు. ఈ శబ్దప్రయోగంలో దేశీయత జాలువారుతుంది. అందులోని సీత "ముక్కు మొగమును నెఱుగని మొఱటులెవరొ - - - - ఎగ్గులువల్క - - - అంత మాత్రసెనమ్మి నాకాంతుడిట్లు, కానలకు నన్ను దోయునే కరుణమాలి", "విభుడిట్లు చేసిననోర్చుటెట్లు", ఇంతతెగువకు ధవుడేల యిచ్చగించె" అని రామునిచర్యను నిరసిస్తూ ప్రశ్నించగలిగినధీర, పతి తనపై చూపిన ప్రణయాన్ని కపటనాటక" మనితోసిపుచ్చుతూ, రాముని మాటలునమ్మి "అన్నియు నిజమంచు మోసపోతి" అంటుంది. అంతలోనే తన దురుసుతనానికి తానే చింతించి "లోకాపవాదమునకు, పతిని గుఱిసేయ నే నెట్లు పాలువడుదు, విభునియానతిబడి యుందు విపినమందు" అని నిశ్చయించు కుంటుంది. ఇక్కడ సీత మనోవిశ్లేషణను కవి అతినైపుణ్యంతో చేస్తాడు.

# గోగీతము

ఇది పురాణేతిహాస ప్రబంధములలో గోవ్యాఘ్ర సంవాద మనే పేరున చిత్రింపబడిన నీతిబోధాత్మకమగు సరికొత్త పాతకథ. అయితే కవిచెప్పినతీరు, ఉపయోగించిన భాష, పాత్రల చిత్రణ వినూత్నముగా వుంటుంది. గోవువర్ణన, దాని శీలమూ, హృదయంగమంగా వుంటవి. "శాంతమున గెల్వరానిది జగతిగలదె" అని కవి సిద్ధాంతీకరిస్తాడు ఒక అర్థాంతరన్యాసప్రయోగంతో. ఇది గాంధీమహాత్ముని దృష్టిలో నుంచుకుని చేసినదిగా కనిపిస్తుంది. కవి గాంధేయుడు. ఇటీవల అపురూపమై పోతూవున్న ముక్తపద గ్రస్తాన్ని యిందులో ప్రయోగించాడుకవి.

"తువ్వ కాదది తేనియ గవ్వ గాని
గవ్వ కాదది నునువెండి మువ్వ గాని
మువ్వ కాదది తెలిమల్లె పువ్వ గాని
పువ్వ కాదది జిగివెన్నముద్ద గాని" అనీ

ధేనువుకు తన వత్సముమీదనున్న వాత్సల్యాన్ని మనకన్నుల ఎదుట ఆ 'తువ్వ' కనుపించేలా చిత్రించాడుకవి. మనచేత కన్నీరు పెట్టించేటంతటి స్వాభావికంగా వున్నది ఆచిత్రణ.

"వీకమైె నేను తన మేను నాకుచుండ
తోక పైకెత్తి వీనుల దోరవైచి-"

యీ వర్ణనవల్ల తువ్వ మన ఎదుట సాక్షాత్కరిస్తుంది చెంగు చెంగున గెంతుతూ. "సమ్మతించునె చావ నే జంతువేని", "తల్లిదయలోతు నెన్నంగ తరముకాదు" యిత్యాదులు పరమ సత్యాలు ఈ వ్యంగ్యాన్ని చూడండి.

"మహిత విజ్ఞానయుతులైన మనుజులందె
మాటతప్పంగ నేరని మానధనులు
కానరారన్న, మాటికి గట్టిగఱచు
పసరముల మాటవేఱ చెప్పంగ నేల"

"ఆడితిరిగిన చండాలుడందుగ్రిగాని - - - -" లోవేమనయోగి దర్శనమిస్తాడు. చివరిఘట్టంలో గోవు తిరిగి వచ్చి తనను గ్రసింపమని పులిని వేడుతుంది. పులిమనస్సు మారిపోయి గోవును వెళ్ళి పొమ్మంటుంది. గోవు పులిని నిర్బంధిస్తుంది. "నీకు మ్రొక్కెద నాజోలిరాకుమమ్మ" అని పులిగోవును బ్రతిమాలుతుంది. అది కవికల్పించిన వినూత్న మగు మలువు చాలాహృద్యంగా నడిచింది యీ ఘట్టం దీనివల్ల గోవుయొక్క ధర్మవీరం సువ్యక్త మవుతుంది. ఇదే కవిబ్రహ్మ తిక్కన చెప్పిన ధర్మాద్వైతము.

## కేరళరాణి

ఇది కవికల్పితగాధ. విషయం చిన్నదైనా శిల్పం మహోన్నతము. సరళ కేరళదేశపు రాజుగారి కుమార్తెగా పరిగణింపబడుతూవున్న దాసీకన్య. ఆరహస్యం రాజుకు, దాసికేతెలును. రాజుగారి మేనల్లుడు సుధాకరుడు, సరళ పరస్పరం ప్రేమించుకుని వివాహమాడ నిశ్చయించుకుంటారు. దాసి (తల్లి) వల్ల తన జన్మరహస్యాన్ని తెలిసికొని సరళ రాజ్యత్యాగం చేయడానికి ఉద్యుక్తురాలవడమే కాకుండా, సుధాకరునికి తాను వివాహార్హకాదని భావించి సన్యసింప తల పెడుతుంది. సుధాకరు డీ విషయాలను సరళవల్లనే తెలుసు కుని తనకు రాజ్యవాంఛలేదనీ, రాణి అయినా దాసి అయినా సరళే తనప్రేయసి అనీ, తన నిస్వార్ధప్రేమను ఆమెకు తెలియజేస్తాడు.

వరూధినివలెనే "ఇంపుమీరగ వీణవాయించుతూ సరళ మనకు దర్శనమిస్తుంది యీ ఖండికలో, వీరేశలింగంగారు తన శాకుంతలానువాదంలో

"తుల్యగుణ యుక్తులగు దంపతులనుగూర్చి
బ్రహ్మ చిరకాలముకు నేడు బాసెనింద" అన్నారు.

ఆలాగునే యిందులో "అన్ని విధముల సమరూపులైన మీకు సఖ్యమొనగూర్చి నలువ తాచతురుడయ్యె"

అంటాడు కవి. ఈ 'చతుర' ప్రయోగంతో చాతుర్యమూ, నాలుగు ముఖాలు ధ్వనిపూరితమైన శ్లేషలో యిముడ్చబడింది. సకల సౌందర్యాన్ని కవి వర్ణించిన తీరు హృదయాలకు హత్తుకొనే లాగవుంది.

> "విమల భానురకాంతిచే విశ్వ మెల్ల
> భాసిలగ జేయు తేజోవికాసి"

అంటాడుకవి. ఆమెను. రాజ్యాన్ని, సంపదనుకూడా త్యజింపగలిగిన పవిత్రప్రణయమూర్తులు సరళాసుధాకరులు. ఈ ఖండికలో కవి చెప్పదలచుకున్న మహత్తరసత్యం, పవిత్రప్రేమ మహదైశ్వర్యానికి కూడా అతీతమని. ఇది బహుశా King Edward VIII ని దృష్టిలో పెట్టుకొని వ్రాసినట్లున్నది.

కృష్ణారావుగారు నామాతామహికి సోదరులు. అందువలన నాకు తాతగారు. వారిపైగల భక్తితో వారిపై నేను గూర్చిన పద్యసుమాంజలితో యీ ఆముఖమును ముగిస్తాను.

---

# పద్య సుమాంజలి

ధీరుడు, కవిమాన్యుడు, కృ
ష్ణారాయ కవీంద్రు కవిత నవనీత మ్మై
ధారాళ మగుచు జనులా
రౌరా యని సంతసింప నవని జెలంగున్.

మల్లె పూలపోవు మంచిగంధపు తావి
ఇతని కైతగాంచ స్మృతికి దగులు
పలుకులకును సౌరభమ్మును జేకూర్చి
సేసె తెలుగు బాస సేవనితడు.

పంచదార కన్న పాలమీగడ కన్న
తేనె కన్న ద్రాక్ష తీపి కన్న
పాప లేత వైన పలుకుల కన్నను
కరముతీపి తాతగారి కవిత.

కదళీఫలము వోలె ఖర్జూరమును బోలె
ఇక్షురసము వోలె హిమము వోలె
సుధల జల్లు వోలె సుదతిహాసము వోలె
హాయి గూర్చు నితని దైన కవిత.

తెలుగుల మానసమ్ములను తీయని కోర్కెలు నిండ మావి కొమ్మల గమినుండి పాడు, పిక మాధురితో రసికాంతరాత్మలన్ పులకల నింపి యెల్లరకు మోదవిభూతిని గూర్చితయ్య, నీ సలలితసత్కవిత్వసరసత్వమహత్వపటుత్వసంపదన్.

ఈ మహామనీషి రచించిన కావ్యమునకు ఆముఖమును వ్రాయగలుగుట నాభాగ్యమని భావిస్తాను. ఇట్టి భాగ్యమును నాకు కలిగించిన నిర్వాహకులందరికిని ఇవే నాకృతజ్ఞతా నమస్సుమాంజలులు.

హైదరాబాదు 32
21-4-1960

దేవత సుబ్బారావు

# పరిచ్ఛేదము

నందనంబున శచితోడ నాకవిభుఁడు
మించు వేడుకతో విహరించినట్లు,
మహితగుణవతి యగు నిందుమతిని గూడి
ఉపవనంబున విహరించుచుండె నజుఁడు.

అంత, దక్షిణసాగరప్రాంతమందు
వెలుఁగు గోకర్ణపురిని వేంచేసియున్న
శివుని సేవింపగాఁగోరి, దివిజమౌని
వెడలె వీణను ధరియించి విన్నువీథి

అమ్మహామునిచేతి వీణాగ్రమందు
వ్రేలుచున్నట్టి మందారపూలమాలఁ
గడు రయంబునఁ గొనిపోయె గంధవహుఁడు,
కమ్మతావుల నానెడు కాంక్ష ననఁగ.

వార లిరువురు నేలపైఁ బడుటఁ జూచి
పరిజనంబులు హాహారవంబు సలుప,
కెలనఁ గొలఁకుఁ గ్రీడించు పులుగు లెల్ల
రోదనము చేసెనో యన రొదలువెట్టె.

తేటె విభుఁ డంత శైత్యోపచారవిధుల,
ఆమె యించుక కదలక యట్టె యుండె;
అవనిపై నావగింజంత యాయు వున్నఁ
గాదె, ఫలియించు ప్రతికారకాదివిధులు?

శ్రుతి తొలంగిన వల్లకిగతిని నున్న
ప్రాణ మెడలిన యా యింతిఁ బట్టి యెత్తి,
భూమివిభుఁ డంత సమధిక ప్రేమతోడ
చేర్పఁగాఁ దగు తన యంకసీమఁ జేర్చె.

ఊసురు వాసి వివర్ణయై యున్న యామె
నొడిని జేరిచి భూవిభుఁ డొప్పె నపుడు,
అంకమున నాపిలం బగు జింకతోడ
వేకువను వెల్లఁబాఱిన విధునియట్లు.

ధైర్యమును వీడి బాష్పగద్గదికతోడ
ధరణిపతి యిట్లు విలపించె; తప్తమైన
నినుము సైతము మెత్తనౌ నసంగ, నింక
దేహధారుల మాట చింతింపనేల?

'మేన సోఁకినయంతనే ప్రాణములను
పూలు సైతము వీడుచుంగఁ జాలెనేని,
చెనటి జీవులఁ బెగటార్పఁ దనగు విధికి
జగతి నెయ్యది రాకుండు సాధనమ్ము

మృదువు లైనట్టివానిని మృదువు లైన
వానిచేతనే కాలుండు బూని చంపఁ
దలఁచె కాఁటోలు, నిక్కంబు—తమ్మిపువ్వు
మంచు పడినంతమాత్రనే మాడిపోదె?

పువుల దండయొ జీవంబు విడియునేని
సతము ధరియించు సన్నాల చంపదయ్యె?
విష మమృత మగు, నమృతంబు విషము నగును
అహహా! విధివిలాసం బెంత యద్భుతంబొ?

చిత్రముగ నాదు భాగ్యరాశిని హరింప
విధియె కల్పించియుండె నీ వింతపిడుగు;
కాకయుండిన, తరువుపైఁ బ్రాఁకు లతను
కాల్చి, విడుచునె తరువును గాల్పకుండ!

తప్పిదము నేను చేసినయప్పుడైన,
అలిగి పల్లెత్తుమాటైన నాడ వీవు;
ఏమి నేరంబు గావించి యెఱుఁగ నిపుడు,
ప్రేమతోఁ బిల్చినను పల్కరింప వేల?

మరల రాకుండ పరలోక మరుగ నున్న
యప్పు డైనను నాతోడఁ జెప్ప వైతి,
వకట! కపటవాత్సల్యంబు నభినయించు
వంచకుఁడ నంచు నీమది నెంచి తేమొ?

ప్రాణసమ యగు నీ ప్రియపత్ని తోడ
నరుగ నెంచియు, నీ విట్లు సురిగి తేల?
చెనటిజీవము! యింక నీ వనుభవింపు
మాత్మకృత మైన యాతన మనవరతము.

వనవిహారశ్రమంబున నీ వదనమందు
క్రందుకొనియున్న చెమ్మటబిందువులను
ఆఱలే దింక, నీ జీవ మాఱిపోయె;
అక్కటా! దేహ మెంతటి యస్థిరంబొ?

చిత్తమున నైన నీకు నేఁ జేసి యెఱుఁగ
నప్రియంబులు, నను వీడి యరుగ నేల?
పేరునకు నేను ధారుణీవిభుఁడఁ గాని,
బద్ధుఁడను సుమ్మి నీయెడ ప్రణయమునను.

పూలతోఁ గూడి తేఁటులఁ బోలు నీదు
నలకజాలంబు గాలి కిట్టట్టు కదల,
ఈవు క్రమ్మఱ బ్రతికితి వేమొ యనెడి
భ్రాంతి పీడించుచున్నది స్వాంతమందు.

చెలియరో ! నీవు క్రమ్మఱ తెలివి గాంచి,
హిమగిరిగుహాంతరమ్ముల తమము నెల్ల
జ్వలితకాంతుల నోషధుల్ తొలఁగఁజేయు
పగిది, నా మనోవేదనఁ బాపఁగదవె?

అళులు రొద మాన, ముకుళించు నళినివోలె,
ముంగురులు దోఁగ, మాటలు ముడిఁగియున్న
మురువు గులికెడు నీ చిన్నిముద్దుమోము
మాటిమాటికి వెరియించె మన్మనంబు.

పగలు శశితోడ నిశికాంత బాసియున్న,
మరలఁ గూడును గావున విరహ మోర్చు;
ఎన్నటికి నీవు నను బాసి యేఁగియుంట,
నీదు విరహాబ్ధి నే నెట్లు నీఁదువాఁడ?

చిగురుటాకుల మెత్తని సెజ్జమీఁద
నొత్తిగిలి పవ్వళించిన నొత్తికొనెడు
మవ్వ మగు నీదు మెమ్మేను పువ్వుఁబోడి!
మండుచిచ్చున కెట్లోర్చి యుండఁ గలదు?

నీదు మర్మంపు నర్మంపు నెయ్యురాలు
కనకమేఖల నీవు మ్రాఁగన్ను వెట్ట,
కుంది తాను మరణంబు జెందె ననఁగ,
మధుర మంజుల రవములు మానియుండె.

మధురభాషలఁ బికముల, మందగతుల
హంసముల, విభ్రమంబుల నలరులతల.
కులుకుఁజూపుల లేళ్ల నాకొఱకు నిలిపి,
యమరపురిఁ జూచు వేడ్క నీ వరిగినావె?

నీదు లీలల వీని యన్నింట నిలిపి
యిట్లు కావించితివి కాని, యివ్వి నీదు
విరహమునఁ గల్గు దుర్భరవేదనంబు
బాయఁజేయునె? యధికంబు చేయుఁ గాని.

గుజ్జుమామిడిగున్నపై కూర్మి మీఱ
బండిగురువిందతీవను బ్రాఁకఁజేసి,
వేడ్క వానికి పెండ్లి గావింపకుండ
వీడి యేగుట నీ కిది పాడి యగునె?

ప్రేమతో నీవు పెనుపంగఁ బెరిగినట్టి
అల యశోకము రేకెత్తి యలరు లీనె;
తురుమఁ దగుఁ గాని వాని నీ కురులయందు,
చితిని నర్పింప నా కెట్లు చేతు లాడు?

లలిత మంజీరరవములు సెలఁగ, నీదు
పాదమునఁ దన్ను సోఁకిన యాదరమున,
కుసుమబాష్పపరంపరల్ కురియఁజేసి
కరము శోకించు నియ్యశోకంబు గంటె?

అతివ! నీ యూర్పుతావుల ననుకరించు
పొగడపూదండ నాకయి సగము గ్రుచ్చి,
మిగిలిన సగంబు పూర్తిగా ముగియకుండ
కన్ను మోడ్చుట న్యాయమే యన్నమిన్న?

సతము సుఖదుఃఖములయందు సములు సఖులు,
క్రొదమజాబిల్లి రేక నీ కొడుకుకుఱ్ఱి,
ఏనా నీ తోడునీడనై యెనసియుందు;
నిష్ఠురము గాదె మము వీడి నిష్క్రమింప?

వీఁగె ధైర్యము, తలఁగెను భోగకాంక్ష,
గీతము లడంగె, కైసేఁత రోత పుట్టె,
వీడె క్రీడలు, ఋతువుల వేడ్క తొలఁగె;
నేఁడు నా పాన్పు శూన్యమై పాడుపడియె.

సతివి, మంత్రివి, శిష్యవు, సఖివి యైన
నిన్ను హరియించి హతవిధి నిర్దయుఁ డయి
నాదు సర్వస్వ మక్కటా! దోచికొనియె;
ఎట్లు జీవింతు మొండినై యింకమీఁద?

ఏను ముందుగ చవి చూచి యిడినఁ గాని,
ఆన వెన్నఁడు రసవంత మైన మధువు,
తరుణి! నీ వింక నేరీతి త్రావఁగలవు
బాష్పకలుషిత మైన నివాపజలము?

ఎల్ల విషయంబులకు నీవె యెల్ల వగుట,
నితర వాంఛలు లేవు నా హృదయమందు;
ఎన్ని విభవంబు లవని నా కున్న నేమి,
నీవు లేకుంట నవి యెల్ల నిష్ఫలములు.

జాలి నీలీల నజమహీపాలకుండు
ప్రియసఖిని గూర్చి విలపింప, వృక్షములును
గూడ కన్నీటివర్షంబు కురిసె ననఁగ,
కుసుమముల నుండి మకరందరసము జారె.

# పైఁడిలేడి

సీత

'అదిగో! సౌమిత్రి! వింటివే యార్తరవము
అకట! వీతెంచె 'హా! లక్ష్మణా!' యటంచు:
ఆ యెలుంగు నిజంబుగ నా యనుంగు
ప్రాణనాథుని కంఠస్వరమ్ము సుమ్ము.

కదిసి దైత్యులు పలువురు కోదివి తన్ను
చుట్టి చీకాకువెట్టంగ సొమ్మసిల్లి
సోలెనో యేమొ నీ కూర్మిసోదరుండు?
అట్లు గాకున్న నట్టి యా యఱపు లేల?

బెట్టిదం బగు నా ధ్వని పిడుగు వోలె
కాల్చుచున్నది నా యంగకముల నెల్ల;
నిముసమేనియు నీ వంక నిలువ నగునె!
వేగ నీ యన్నఁ గాపాడ నేగు మయ్య!

పెనఁగి మృత్యువు పైకొన్న వేళఁగాని
కలుగదెన్నఁడు నట్టి యాక్రందరవము;
ఇంతకును నాదు సౌభాగ్య మెట్లు కలదొ?
నాదు హృదయాధినాథుఁ డున్నాఁడొ లేఁడొ?

పైఁడిలే డని యక్కటా! భ్రాంతి జెంది
పట్టు మని నీదు సోదరుఁ బంచియుంటి,
సుఖముగా నింట కుడిచి కూర్చుండ లేక
చెఱుచుకొంటిని సర్వంబు చేతులార.

అదిగొ! అల్లదే! క్రమ్మఱ నార్తరవము
వినఁగవచ్చెడు వీనులు వ్రీలిపోవ;
లెమ్ము, బాణాసనము దాల్చి పొమ్ము వేగ,
తడసితేనియు కార్యంబు చెడునొ యేమొ?

ఏల యీలీల లక్ష్మణా! జేల వోలె
దెసలు చూచుచు నుంటివి తెల్లబోయి?
కఱకుటా లైన కరఁగు నా క్రందనంబు
వినఁబడెనొ లేదొ యింత నీ వీనుఁగవకు?

అన్నయెడ కన్న నాదెస నధికభక్తి
నెఱపుచుందువు, కటకటా! నేఁ డి దేమి-
ఎంత పిలిచిన మాఱాడ వించుకైన,
తొంటిచందము నీయందు తోపఁ దిపుడు.

మున్ను నా పాదములు భక్తి మ్రొక్కి కాని
అన్న మొగ మైనఁ జూడవు కన్ను లెత్తి,
ఇట్టి నయనిధి వైన నీ కింతలోనె
ఇట్టి భేదంబు కలుగుట కేమి కతమొ?

ఎఱుఁగుదును మున్ను రణభూమి నీవు నిల్చి
క్రూర రాక్షసనివహంబు గూల్చు టెల్ల,
మొక్కవోయెనె యానాఁటి మొక్కలంబు?
నీళ్లు నమలుచు నీ లీల నిలిచె దేల?

భ్రాతఁ గాపాడ నీ కంత భీతి యున్న
నిలిచియుండుము నీ విట, నేనె పోయి
శత్రువుల నెల్ల నొకపెట్ట జక్కడించి
స్వామిఁ గొనివత్తు తలపువ్వు వాడకుండ.

ఇంతకాలము పనుక నా కొంతు చెంత
మేకవన్నియపులి వయి మెలఁగినావు,
తెల్ల మయ్యెను నీతత్త్వ మెల్ల నేఁడు
అవుర! ఎంతటి కుటిలాత్ముఁడవుర నీవు?

'వాఁడు చచ్చినతోన నా పీడ వదలు,
వాని భార్యను జేపట్టి వైభవంబు
మించ నేలేదఁగా' కంచు నెంచి తేమొ?
నిలువు నీ అయి కూలవే తులువ యపుడె?

తనకు నమ్మిన గారాబు తమ్ముఁ డంచు
కూర్మి నీ యన్న ని న్నెంతొ కొండ సేయు,
కాంక్షతో వాని మృతికయి కాచియుంటి,
వనుజుఁడవె నీవు, దనుజుఁడ వగుదు గాక.

తమ్ముఁ డొక్కఁడు రాజ్యంబు తస్కరించె,
బలిమి నొక్కఁడు భార్యఁ జేపట్ట నెంచె,
ఏమి కావింప నుండెనో యింక నొకఁడు?
మంచితమ్ములఁ గూర్చెరా మాలబమ్మ.

కట్టుకొంగున చిచ్చును కట్టినట్లు
లెట్టి సాహసమున కొడిగట్టినావు?
కెరలుచుంటివె నీకు దక్కెద నటంచు?
నీచ! అటులైవ వినుము నా నిశ్చయంబు,

ధవుఁడు నా కింక దక్కక తక్కె నేని
నెటులొ గ్రుక్కెడు ప్రాణంబు లీగుదాన,
కత్తి కఱ వౌనె? చిచ్చు చిక్కకయ యున్నె?
తల్లి చల్లని గౌతమి దరిని లేదె?

చెప్పవలసిన దంతయు చెప్పియుంటి-
నన్ను కాచు నెపంబున నాదుచెంత
నిలిచియుండుటొ, వైరులఁ బిలుకుమార్చి
విభుని గాచుటొ, ఏదొ కావింపుమయ్య.

అన్నఁ గాపాడ వేగమే యరిగితేని,
చిరతరం బగు కీర్తి నార్జింపఁగలవు;
నీచచింతలఁ బొల్పడి నిలిచితేని,
ఘోర నరకానలంబునఁ గూలఁగలవు.

లక్ష్మణుఁడు.

హరిహరీ ! తల్లి! ఎంత మాటాడినావు!
శాంత మగు నీదు హృదయకోశమునను౦డి
ఇట్టి నిష్ఠురవచనంబు లెట్లు వెడలె!
మంచుముద్దను పుట్టునే మండుచిచ్చు?

కొఱవితోఁ గాల్చినట్టులు, సురియ వెట్టి
ప్రచ్చినట్టులు, కొఱ్ఱున గ్రుచ్చినట్లు,
కఱకుఱంపాన కోసినకరణి, నీదు
కఠినవాక్కుల నా మది కలఁగఁబాఱె.

ఎన్నఁడైనను నీవు పల్లెత్తుమాట
నాడి యెఱుఁగుదె? అక్కటా! నేఁడు నన్ను
పిడుగులను బోలు బెడిదంపు నుడులచేత
నిట్లు నొప్పింప నీ మన సెట్లు లొప్పె?

పావనం బిదు నీ పాదపద్మములనె
కాని, కన్నెత్తి నీ మోము కాంచి యెఱుఁగ,
అట్టి భవదీయదాసుని, అనుఁగుసుతుని
చంపుమాటల నన్ను వేచంగ నగునె?

నిన్ను నొంటిగ విడనాడి యేను చనిన,
అదను కనిపెట్టి వైరులు కదిసి నీకు
హాని తప్పక కావింతు రనెడి భీతి
వెడలకుంటిని, అంతియె - వేఱు కాదు.

మనలఁ గికురింప నెవ్వఁడో మాయదైత్యుఁ
డన్న యెలుఁగున నను జీరె, మిన్ను విఱిగి
మీఁదఁ బడ్డ చలింపఁ డా మేటివీరుఁ,
డిట్టు లూరక వాపోవ నేటికమ్మ?

మూఁడులోకంబు లొక్కట మొనసి యైన
జానకీరాము గెలువంగఁ జాల వనిన,
ఇంక మ్రుక్కిడిరక్కను లెంతవారు?
నిప్పుతునుకకు చెద లంట నేర్చు నమ్మ!

'రాముఁ డెన్నఁగ నాదినారాయణుండు
కాని కేవల సామాన్యమానవుండె?
అవనిభారంబు హరియింప నవతరించె'
ననుచు మౌనులు వచియింప వినవె తల్లి

అఖిలలోకంబు లెవని సాయంబు లేక
నిముసమేనియు నించుక నిలువలేవొ,
అట్టి రాముని కేను సాయంబుపడుట
భానునకు దివ్వె చూపించుభాతి కాదె?

'ఏకతంబున సతి వీడి యే కతమున
నీవు నా యాన జవదాఁటితి' వటంచు
అలుకమై చూచి నా యన్న యడుగ, నవ్వా
డేమి వచియింతు నమ్మరో! యీవె చెపుమ.

చండతర మైన యాతని శాసనంబు
నిఖిలజగములు తలదాల్చి నిలిచియుండు,
వాని యానతి జవదాఁట భావ్య మగునె?
భ్రాతృసేవాపరాయణ వ్రతుఁడ నేనె.

నిన్ను గాపాడు మని యన్న నిలిపె నన్ను,
అన్నఁగాపాడఁ బొ మ్మని యనిపె దీవు;
ఏది కర్తవ్యమో నిర్ణయింపఁ జాల,
ముందు జన నూయి, వెనుకకు బోవ గోయి.

దారుణంబులు, హృదయవిదారణంబు
లైన నీ వాక్కులకు గురి యగుటకంటె
అన్నకోపాగ్ని కాహుతి యైన మేలు
కాన, బోయెద నేది యె ట్లైనఁ గాని.

తమ హితము తా మెఱుంగరు, తమ హితంబు
గోరి యొరు లాడు పల్కుల జీరగొనరు,
తాము చెప్పిన మాటలే తథ్య మనుచు
ఫెనఁగెదరు చాన, లెంతటి వెడఁగు లౌర!

క్రూరభీకరదావాగ్నిఁ గూలవచ్చు,
ఘోరకాకోలవిషమును గ్రోలవచ్చు,
ఉదధిగంభీరజలముల నుఱుకవచ్చు,
సతులకోపంబు సై రింప శక్య మగునె!

సెల వొసంగుము పోయివచ్చెదను తల్లి!
ప్రభుని దోడ్కొని మగుడ నే వచ్చుదాక
ఎవ్వఁ డైనను నిను ముట్టె నేని, వాఁడు
పుడమిపైఁ గూలఁ గావుత బూది యగుచు.

# సీత

అకట! కుడికన్ను మాటికి నదరఁ దొడఁగె,
చదల గ్రద్దలు గూబలు సంచరించె,
దుర్నిమిత్తము లెల్లెడ తోఁచుచుండె,
ఏమి కీ డొనగూడునో యెఱుఁగరాదు.

ఏల బంగారులేడి తా నేగుగేఁచె?
దానిఁ బట్టఁగ విభు నేల తఱిమియుంటి?
ఏల విసవచ్చె నారీతి నీరెలుంగు?
మఱఁది నేటికి తిట్టితి కఱకునుడుల?

దొసఁగు లెన్నొ ని పొసఁగిన పొసఁగు గాక,
వానికిఁ దలంక, వాకొనరాని నుడుల
చారుగుణశీలు, సన్నుతాచారలోలు
మఱఁదిఁ దిట్టితి, దానికి మ్రగ్గుదాన.

ఆత్మసుఖమును వర్జించి, అన్నకొఱకు
అడవులం బడి యిడుమలఁ గుడుచుచున్న
దురితదూరుని లక్ష్మణు దూఱియుంటి,
కట్టి కుడుపక యున్నె యా కర్మఫలము?

# అ ప వా ద ము.



**సీ త**

ఏమి లక్ష్మణ! నేఁడు నీ మోము జూడ
విన్న నై యున్న దేటికి చెన్ను దొరఁగి?
అన్నదమ్ములు కుశలులై యున్నవారె?
కన్నదమ్ముల నశ్రువుల్ గ్రమ్మ నేల?

అడవులను దొల్లి యిడుమలఁ గుడుచునాఁడు,
శత్రునివహంబుతో నాజి సలుపునాఁడు,
క్రూరరావణు శక్తిచే సోలునాఁడు,
బన్న మొందవు. నేఁ డేల విన్నఁదనము?

తల్లులుగ నాత్మ భావింతు వెల్లసతుల,
దైవతము లంచు గురువులఁ దలఁతు వెప్పుడు,
సోదరులరీతి సెల్లర నాదరింతు,
వేమి యాపద ఘటియిల్లె నిట్టి నీకు?

వీడితివా రామపాదారవిందసేవ?
ఓడితివా శత్రువులఁ దాఁకి యుద్ధమందు?
కూడితివా మందబుద్ధిని కుటిలమతుల?
ఆడితివా నిష్ఠురంబుల నార్తజనుల?

అన్నయానతి లేకయె నన్ను నిటకు
తోడి తెచ్చితొ? ప్రేముడి వీడి నన్ను
కానలకుఁ ద్రోసిపుచ్చెనా ప్రాణవిభుఁడు?
నుడువుమా తండ్రి! నీ విట్టు లడల నేల?

'విమలగంగానదీతటీవిపినవాటి
మునుల పల్లెల వసియింప మనసు పుట్టె
నాదు ముచ్చట దీర్పవే నాథ!' యనుచు
వేఁడ, నీ వెంటఁ బంపఁడే విభుఁడు నన్ను?

ఏమి మాయయొ కాని – దవ్వేగుకొలఁది,
ఘోరభీకరరవముల గోండ్రు మనుచు
బొబ్బరింతలు వెట్టు బెబ్బులులె కాని,
కానరా దొక్క మునిపల్లె కానలోన.

మున్ను పదునాలుగేండులు మన్నియట్టి
ఘోరవనములఁ గ్రమ్మఱఁ గుమ్మరిల్లి
విభుని నే నేల వేఁడితి వెకలి నగుచు
గొఱవి చేఁబూని తల గోఁకికొన్నరీతి?

దిగులు పుట్టెడు నిను జూడ - తెలుపు మయ్య!
కడుపు చల్లఁగ కౌసల్య కన్న కొడుకు,
నీదు కూరిమి సైదోడు, నాదు విభుఁడు
చెక్కుచెదరక యున్నాఁడె సేమముగను?

లక్ష్మణుఁడు

ఏమి చెప్పుదు నమ్మరో! యిట్టి వార్త
నుడువుకంటెను ప్రాణంబు విడుట మేలు,
విమల మగు నీదు పాదాంబుజములచెంత
నిదిగొ వాలితి, నను శపియింపు మమ్మ.

మునులవల్లెలఁ జూపింతు ననుచుఁ బలికి
మంచిమాటల నిన్ను నమ్మించి, యిట్లు
నట్టడవిఁ ద్రోయ నెంచిన బెట్టిదుండ,
అకట! నావంటి పాతకి యవనిఁ గలఁడె?

ఎట్టి పాతకమున కైన, నెట్టి ఘోర
కార్యమున కైన నోడికట్టు ఘాతుకుఁ డని
యెంచెఁ గాఁజోలు, లేకున్న నిట్టి పనికి
విభుఁడు నియమించునే నన్నె వెదకి వెదకి ?

ఇట్టి తెగువకుఁ బూనిన యట్టి నేను
వెనుకదీయుదునె వచింపఁ? వినుము తల్లి -
లోకనిందను సైరింప లేక విభుఁడు
వనుల నిను డింపు మనఁ గొనివచ్చినాఁడ.

దానవునిచేతఁ జిక్కిన చానఁ దెచ్చి
ఏలుచున్నాఁడు రాఘవుఁ డెంత వెడఁగొ ?
అంచు జను లాడు నింద సైరించ లేక
వనుల నిను డించి ర మ్మనె జనవిభుండు.

పావనం బగు భవదీయవర్తనంబు
తెలిసియుండియు, లోకనిందలకుఁ దలఁకి
వనములకు నిన్ను మా యన్న పనిచెఁ గాక;
నినుఁబ మేనియు నిను వీడి నిలుచువాఁడె ?

భవుని కోదండమును వంచె, వాలి నొంచె,
శరధి బంధించె, పంక్తికంధరుని ద్రుంచె
నీ నిమిత్తమ కా దమ్మ? నిన్ను బాసి
రాముఁ డక్కట! ఏరీతి బ్రదుకఁ గలఁడు!

కటికి పగవాని కైనను కలుగ రాని
యిట్టి యాపద నెట్లు సహింతు వమ్మ?
అన్న యానతి యిచ్చెఁ బో, అట్టె నేను
ఇట్టి కట్టిడిపని కేల యియ్యకొంటి?

అలరుఁదోఁటల విహరింప వలయు నీవు
ఘోరవనముల నేరీతిఁ గ్రుమ్మరిలెదు?
కొదమచిలుకల పలుకుల బెదరు నీవు
పులులబొబ్బల కేగతి నిలువఁ గలవు?

అడవులం బడి యగచాట్ల నంది యంది,
క్రూరదైత్యుని బాధల కుంది కుంది,
చిచ్చులోఁ జొచ్చి వల్లభుఁ జెందినావు;
కడకు కడతేఱ దయ్యె నీ కాఁపురంబు.

అడల నేటికి లక్ష్మణా! అన్నయాన
దాఁటవచ్చునె నీకు? విధాత నన్ను
అడవులం బడి యిడుమల బడలు మంచు
వ్రాసియుండఁగ, తప్పింప వశమె తండ్రి?

ఎన్న డే దంపతులు భాగ్యహీను లగుచు
నొండొరుల బాసి వెత నొందుచుండఁ జూచి
నవ్వియుంటినో పూర్వజన్మంబునందు,
అనుభవింపక తీఱునె యా ఫలంబు?

ఎల్లరును నన్ను సాధ్వీమతల్లి యనుచు
ఎంతొ వినుతింప విని సంతసింతు గాని,
కల్లనిందలఁ బాల్పడి కానలందు
ఇట్లు కడగండ్ల బడుదు నం చెఱుఁగ నైతి?

పిడుగు కంటెను కటకటా! బెడిద మైన
పలుకు వినియును గుండియ పగుల దయ్యె.
పాడుబొందిని ప్రాణంబు బాయు దయ్యె;
ఎట్లు వేగింతునో కాల మింకమీద?

కళవళము నొందియుంటివో, కాకయున్న
కలయొ, భ్రాంతియొ, నిక్కంబు తెలుపు మయ్య!
అక్కటా! ఎన్నఁడేని నా యనుఁగువిభుఁడు
నన్ను కానలఁ ద్రోయునే! నమ్మఁ జాల,

కొందలమ్మున డెందమ్ము కుదురు వాయ,
ఎఱుఁగ కాడితి, నను క్షమియింపు మయ్య;
చందకరున కైన కళంక ముండుఁ గాని,
నీ కొక కళంక ముండునే నిర్మలాత్మ!

ముక్కు మొగము నెఱుంగని మొఱకు లెవరొ
కొంద రెగ్గులు పల్క పల్కుదురు గాక!
అంతమాత్రనె నమ్మి నా కాంతుఁ డిట్లు
కానలకు నన్ను ద్రోయునే కరుణ మాలి?

అరమరలు లేని కూరిమి ననఁగి పెనఁగి,
కొదలు దీరని కోర్కులఁ గూడిమాడి,
కపట మెఱుఁగని మమతల గలసి మెలసి
యున్న విభుఁ డిట్లు చేసిన నోర్చు టెట్లు?

ఆ కరుణ, యా ప్రసన్నత, యా ప్రియంబు,
ఆ రసికత, యా ప్రేమ, యా గౌరవంబు
మఱచెఁ గాఁబోలు నింతిలో మానధనుఁడు
తులువ లాడిన తుచ్ఛనిందలకుఁ దలఁకి.

అవని నే నయోనిజ నయి యవతరించి
జనకు నింటను పెరిగిన జాడ వినఁడొ?
తొల్లి యనసూయ మన్ననతోడ నాకు
అంగరాగ మొసంగు టెఱుంగు కనఁడొ?

దుష్టదైత్యునిచెఱనుండి తొలఁగునాఁడు
సురలు గనుగొన వహ్ని నే నుఱుకలేదొ?
నాఁ డెఱుంగదె లోకంబు నాదు శీల?
మింత తెగువకు ధవుఁ డేల యిచ్ఛగించె?

అంత యేటికి— వనముల కనుచునాఁడు
హాలుపుమై తాను న న్నెంతొ బుజ్జగించి
ఎన్ని నయగారములు పల్కె? ఎన్ని వగలు
చేసె? అన్నియు నిజ మంచు మోసపోతి.

లోకనిందను సైరింప లేక విభుఁడు
వనములకు నన్ను పనిచిన పనుచుఁ గాక !
నాఁడె యీ మాట నాతోడ నాడరాదె?
అకట ! ఈరీతి కపటనాటక మి దేల ?

అంకమునఁ జేర్చి బాళి న న్నదిమికొనుట
అకట ! అనురాగమున కది యవధి యేమొ ?
మోము మోమున గదియించి ముద్దు లిడుట
చెలిమి కయ్యది కడసారి చీటి యేమొ ?

పూర్ణచంద్రుని బోలు నెమ్మోమువాని
చంద్రికల నీను మందహాసంబువాని
కలువఱేకుల నేలు కన్గవలవాని
రాము విడనాడి నే నింక బ్రదుకఁగలనె ?

'మున్ను లంకాపురంబున నన్నినాళ్ళు
ఈవిధ నను బాసి జీవించియుండ లేదె ?
అట్లె నేఁడును బ్రదుకదే యడవులందు ?'
అంచు నాథుఁడు మదిని భావించె నేమొ ?

వగతుఁ దునుమాడి నాథుండు మగుడ నన్ను
గైకొను నటన్న పేరాసకతనఁ గాదె
అపుడు బ్రిదికితి, నే, డేమి యాస గలదు?
గంగమడు గుండె, నా మేనిబుంగ యుండె.

వగపుచే నిట్లు నోరికి వచ్చినట్లు
వదరితిని గాక, లోకాపవాదమునకు
పతిని గుఱిసేయ నే నెట్లు పాలుపడదు?
విభునియానతిఁ బడియుందు విపినమందు.

జాల మేటిక లక్ష్మణా! సరగ చనుము,
మువ్వురత్తలకును నాదు మ్రొక్కులనుము,
అనుఁగుమఱఁదుల నిరుపుర నడిగి తనుము,
ప్రాణవిభునకు మ్రొక్కి యీ వగిది ననుము.

ప్రజల బిడ్డలఁ బోలెఁ గాపాడు మనుము,
తలప నా కేడుగడ 'యెప్డు తానె యనుము,
భావ మెప్పుడు తన మూర్తి బాయ దనుము,
నెమ్మి యొకయింత నామీఁద నిలుపు మనుము.

# గో గీ త ము.

అనఁగనఁగ, నొక్క చక్కని యావు కలదు;
కుఱుచకొమ్ములు, బటువైన గుల్లపొదుగు,
మెత్తనై కుఱుమట్టంపు మేను కలిగి
కనులపండువు సేయు నా గంగిగోవు.

పొడువ దెవ్వరి, కయ్యంబుపొంతఁ బోదు,
చెనఁటియావులతో చెల్మి చేయ దెప్పుడు
బుడుతఁ డైనను పిదుకుచో పొదుఁగు చేఁపి
కుంభధారఁగ క్షీరముల్ కురియఁజేయు.

మిసమిసను దాని నిద్దంపుమేను జూచి
మవ్వ మగు దాని జిగి కండక్రొవ్వు జూచి
పోతరించిన దాని మూఁపురము జూచి
గండుపులి యొండు దానిపై కన్నువైచె.

ఒక్క దినమున నా ధేను వూరిబయట
కానలో మేయుచుండఁగ, కాంచి పొంచి
చెంగు మని యొక్క గంతున చెంగలించి,
గోవుపైఁ బడె నా పులి గోండ్రు మందు.

గుప్పు మని యిట్లు తనపైకి కొప్పరించి
బొబ్బరింతలు పెట్టు బెబ్బులిని జూచి,
కొంచెమేనియు నయ్యావు కుదిలగొనక
ఇట్టు లనియెను ధీరత యుట్టిపడఁగ.

'ఆగు మాగుము పులిఱేఁడ! యాత్ర మేల!
చిడుముడి యొకింత మాని, నేఁ జెప్పబోవు
చిన్నవిన్నప మొకసారి చిత్తగించి,
ఆరగింపుము కడుపార నవల నన్ను.'

అనుడు, నా మాట బెబ్బులి యాలకించి,
వెఱఁగుపాటును నివ్వెఱ పెనఁగొనంగ,
మీఁది కెత్తిన కేల ట్టె మీఁద నిలిపె,
చిత్తరువులోని బొమ్మ నా చేష్ట లుడిగి.

కోలుపులి యంట, ఆఁకలి సోలె నంట,
చియ్యబట్టిన యావు చేఁజిక్కె నంట,
నిలువు మన నావు, పులి యట్టె నిలిచె నంట,
ఎన్నఁడేనియు వింటిమే యిట్టి వింత?

మరణ మన ధేను విఁచుక వెఱపు గొనక
సాహసంబునఁ జూపిన శాంతమునకు
పులియె యద్దిర! పిల్లియైపోయె ననఁగ,
శాంతమున గెల్వరానిది జగతిఁ గలదె?

అంత పులితోడ నీరీతి ననియె మొదవు:
'ఓయి పులిరాజ! ఈ శాంతయూరఁ గలడు
పాఱుఁ డొక్కఁడు సన్నుతాచారపరుఁడు;
మురిపమున వాఁడు పెనుపంగ పెరుగుచుంటి.

నిరత మాతఁడు నులివెచ్చనీటఁ గడిగి,
కసవుపోచల నా మేనికసటు వోవ
సవరగాఁ దోమి, గంగడోల్ నివిరి, దువ్వి
అంటుసంటుల కొనగోట నంటి తివియు.

ఏమి చెప్పుదు నాతని ప్రేమగరిమ !
ఎట్టి రుచిరపదార్థము నేనిఁ దాను
మున్నుగా నాకు పెట్టక ముట్టఁ డెపుడు;
తడవ నేటికి యిప్పు డా గొడవ యెల్ల ?

పుట్టె నా కొక తొలిచూలి ముద్దుపట్టి,
మూఁడునాళ్లైన చనలేదు వాఁడు పుట్టి,
బొడ్డుమావియు నూడని పురిటిపాప-
పూరి ముట్టఁడు, త్రావఁడు నీరువట్టు.

తువ్వ కా దది, తేనియగవ్వ గాని;
గవ్వ కా దది, నను వెండిమువ్వ గాని;
మువ్వ కా దది, తెలిమల్లెపువ్వు గాని;
పువ్వు కా దది, జిగివెన్నముద్దగాని.

పాలు గుడిపితి తెలతెల్లవాఱువేళ;
ఇంతలో నందు నిందును గంతు లిడఁగ
అకట ! ఆ పాలు పుడిసెడు నటిగిపోవ,
తూలుచున్నాఁడొ యాఁకట నోలి కొడుకు ?

వీఁకమై నేను తన మేను నాఁకుచుండ,
తోఁక పైకెత్తి, వీనుల దోరవైచి,
కన్ను లఱమోడ్చి సొక్కు నా చిన్నికూన
కెవరు దిక్కొకొ యక్కటా ! యింకమీఁద ?

చన్ను గానక నెమకి నా కన్నకొడుకు
దారి నే గొట్టుటా పైనఁ దారసిలిన,
పొదుఁగు తొడుకఁగ నయ్యది యుదరిపడుచు
కొమ్ముచేఁ గ్రుమ్మి చిమ్మునో కుదికిలఁబడ ?

కుక్షి నిండును గ్రుక్కెడు గుమ్మపాల
నాదు సుతునకు, నా మేనినంజు డెల్ల
తనివి దీఱఁగ నారగించినను గాని
ఊడుగ దించుకయేని నీ కడుపుచిచ్చు.

చిన్నిపాపకు మున్నుగా చన్ను గుడిపి,
అవల నీ యాఁకలిని దీర్తు వ్యాఘ్రరాజ !
ఇంతమాత్రము చనవు నా కియ్య వయ్య !
పుట్టకుండునె దయ నీకు పులివ యైన ?

పుడమి గోవులమై మేము పుట్టినపుడె
వ్యాఘ్రముల కామిషంబుగ నజుఁడు మమ్ము
చేసెఁ గావున, దీనికై చింత యేల ?
భోజ్యమను నేను, వ్యాఘ్రమా ! భోక్త వీవు.

అనుచు నీరీతి వచియించు నావుఁ జూచి,
వికటముగ నవ్వి ముప్పున్నె మెకము పలికె
'ఏటి కీ మాట లాడెద? విట్టి పలుకు
లెవ్వ రైనను విన్నచో నవ్వ రొకొ ?

ఒరులచేఁ జిక్కి మడియుంగ నున్నవేళ,
ఏ యుపాయంబు పన్నియో యెట్టు లైన
తనదు ప్రాణంబు గాపాడఁ దెసఁగుఁ గాని,
సమ్మతించునె చావ నే జంతు వేని ?

నోటఁ జిక్కిన మృగము నేనాఁట నైన
విడిచె పులి యంచు వింటివే వెట్టిగోవ ?
కోరి తనుదాన బెబ్బులినోరఁ గవియు
జంతు వెందైన నుండునే జగతియందు ?

విడిచినంతన 'బ్రతుకు జీవుఁడ' యటంచు
సరగ తనయునికడ కేగి చన్ను గుడిపి,
కాంక్ష మీఱఁగ నుందువు గాక, యకట!
తిరిగి వత్తువె యిచ్చటి కెటిఁగి యెఱిఁగి?

'బదికియుండిన శుభములు బడయువచ్చు,
తఱకలును చొప్ప చాలును, మఱచి యైన
తలపొలము వీడి యడు గైన దాఁట' నంచు
తలఁచెదవు కాని, నా మాట తలఁతు వొక్కొ?

మహిత విజ్ఞానయుతు లైన మనుజులందె
మాట తప్పంగ నేరని మానధనులు
కానరా రన్న, మాటికి గడ్డి కఱచు
పసరముల మాట వేఱ చెప్పంగ నేల?

ఆఁకటను ప్రేగు నకనకలాడుచుండె,
ఇట్టు న న్నింక నట్టాఁక వెట్టఁ దగునె?
తడవు సేయఁగ నేటికి? తనివి దీఱ
నంజుకొనియెద నీ మేనినంజు డెల్ల.

ఇట్టు లేమిటి కింకను నెట్టుకొనెదు?
నీదు కఱుదుల నా కుక్షి నిండుకొనునె?
బిడ్డపై జడ్డు విడలేక పెనఁగె దౌర?
ప్రిదులవచ్చునె నా ముందు వెఱ్ఱిగోవ?'

నావు డా మాట లాలించి యావు పలికె
అలుకమై తన్ను గద్దించు పులిని జూచి
పలుకుపలుకున కన్నీరు తొలకరింప,
పలుకుపలుకున దైన్యంబు గులకరింప.

'అగునె నీ విట్టు లాడంగ వ్యాఘ్రరాజ?
పశుగణంబులయందును, పక్షులందు
పలుకు తిరుగక చరియించువారు లేరె?
బోయ కీయదె తన మేను మును కపోతి?

అడి తిరిగిన చండాలుఁ డంద్రుడు గాని,
కులము చండాలుఁ డైనను కొఱఁత లేదు;
అడి తిరుగక యుండెనా, వాఁడె పుడమి
పూజ్యుఁ డను మాట వినలేదె పులులఱేఁడ!

కడుపుతీపుకొలందిని నుడివియుంటి,
నీ వెఱుంగని ధర్మంబు లెందుఁ గలవు?
పోయి రమ్మని యందువా—పోయి వత్తు,
అట్లు గాకున్న, నీ కొక్క యడ్డు గలదె?

అతిథి సత్కారమునకంటె నధికఫలము
కలుగ దంచు వచింతురు గాదె బుధులు?
కాన నీ కిదె నా మేను కాన్క యిత్తు,
కాంక్ష దీఱ భుజింపుము కడుపునిండ.'

కఱకుఱా లైన జాలిచే కఱఁగఁ జాలు
ఆవు పలికిన పలుకుల నాలకించి,
ఇట్లు వచియించె బెబ్బులి యెట్టకేని
హృదయమున ప్రేమలతికలు ఱేకులెత్త.

'ఏను నిను వీడ, చయ్యన నింటి కేగి
పుత్రమోహంబు కడుపార పొంగిపొరల
మగుడ వత్తువొ రావొ నమ్మంగఁ జాల,
శపథ మేమి యొనర్తువో చెపుము గోవ!'

అనుడు, మోమున దరహాస మంకురింప,
పులికి వందన మొనరించి పలికెనావు:
'బళిర! నీ మేలు మఱపంగఁ గలనె యెపుడు?
వినుము నే నిదె బాస గావించుచుంటి.

గోవులను వస్తువెట్టెడి కూళగతికి,
గొడ్ల ముకుత్రాళ్ళ బంధిచు కుజనుగతికి,
దూడ లేనావు పితికిన దుష్టగతికి,
పోవుదానను నే రాకపోతి నేని.

దేవదూషణ సేయు నాస్తికునిగతికి,
గురుల ధిక్కార మొనరించు కుమతిగతికి,
సాధువుల బాధపెట్టు నృశంసుగతికి,
పోవుదానను నే రాకపోతి నేని.

తల్లిదండ్రుల నిందించు ప్రల్లదుండు,
బంధువులఁ బ్రోవ నేరని బ్రహ్మబంధు,
వర్థిజనముల మనుపని వ్యర్థజీవి,
అల్పజంతువులకు హింస నల్పు ములుచ,

పరసతులఁ బట్ట నుంకించు పరమపాపి,
అన్యధనములు గాంక్షించునట్టి చెనఁటి,
తిన్నయింటికి వాసాల నెన్ను తులువ,
అప్పు లొనరించి యెగఁబెట్టు నాకతాయి,

కూటసాక్ష్యము లిచ్చెడు కుటిలబుద్ధి,
కొండియంబుల నాడెడు కుత్సితుండు,
అతిథు లింటికి నేతేర నన్న మిడక
కుక్షి నిండంగఁ గుడుచు కక్కుర్తికాఁడు,

తాను గుడువక, యొరులకు దాన మీక
పసిఁడి కుప్పలుగాఁ గూర్చు పిసినిగొట్టు,
అగ్నిసాక్షిగ పరిణయమాడినట్టి
కులసతిని వీడి పెరయాలిఁ గూడు కూళ,

కడుపుకూటికై కాటికి కాళ్ళుసాఁచు
ముదుసలికి కూఁతు తెగనమ్ము ముష్కరుండు
పోవువారల గతులకు పోవుదాన
నింటికడ కేగి మగుడ రా కుంటినేని.

సత్యదేవత యెదుట సాక్షాత్కరించె
ననఁగ, వెలుఁగొందుచున్న యయ్యావు జూచి,
అచ్చెరువు తిచ్చపాటును పిచ్చలింప
పలికె నీరీతి శార్దూలవల్లభుండు.

'చాలు చాలును గోవ! నీ సత్యనిష్ఠ
కిచ్చ మెచ్చితి; నీ యింటి కేగి, వేడ్క
కన్నబిడ్డకు కడుపార చన్నుగుడిపి,
తిరుగ రావమ్మ నా కోర్కె దీర్ప వేగ.

కడుపుతీపిని నీ విట్లు పడెడు బాధ
కడుపుమంటను నే నిప్డు పడెడు బాధ
కంటె నధికంబు కావున, నింటికడకు
పోయి రా వమ్మ వేగ నో పుణ్యరాల!

వనధి లో తెంతో యెన్నఁగవచ్చుఁ గాని,
తల్లి దయలోతు నెన్నంగఁ దరము కాదు;
మాతృప్రేమకు సాటి యి ధాత్రిఁ గలదె?
పోయి రావమ్మ వేగ నో పూజ్యరాల!'

అనుడు, పులికి ప్రదక్షిణ మాచరించి
కనుల నానందబాష్పముల్ క్రమ్ముకొనఁగ,
అరిగె పరుగున ధేను 'వంబా' యఁటంచు
పొదుఁగువ్రేఁగున తడఁబడ పదచయంబు.

ఆ సుధామధురధ్వని యాలకించి
వత్స 'మంబే' యటంచును పరుగువాఱి
మాతకడ కేగి పొదిక్రింద మూతి దూర్చి
గుప్పుగుప్పున దుగ్ధముల్ గుడిచికొనియె.

ముట్టెతోఁ గ్రుమ్మి పొదుఁగుపై పొడిచి పొడిచి
కొడుకు పాల్ ద్రావుచున్నంతతడవు, తల్లి
అట్టు నిట్టును మెదలక యట్టె నిలిచె,
తెల్లఱాతిని మలఁచిన ధేను వనఁగ.

అంత నా యింటియిల్లాలు చెంత కరిగి
బిందె చేకొని పొదిక్రిందఁ బెట్టి నిలువ,
ఊఱ్ఱుదాయియు లేకయె ముఱ్ఱుఁబాలు
కురిసె సంతతధారగా పొరలి పాఱ.

పొట్టపొంగున తన తల్లిపొదుఁగు వాసి
గురువువాఱుచు వత్సంబు పరువులెత్తు;
తల్లి యెలుగెత్తి పలుమాఱు నెమ్మి పిలువ,
నిలిచి తల యెత్తి చూచుచు పొలసియాడు.

సుడిసి యెవరైన తను బట్టఁ గడఁగిరేని,
వీఁక చేయీక కుప్పించి చౌకళించు;
బిడ్డ లెవరైన దారిలో నడ్డ మైన,
మిట్టిమీనయి జంకించి మింటి కెగయు.

పుడమిపై ముట్టె నానించి మూరుకొనుచు
చెండు మీటినగతి పైకి చెంగలించు,
గరికిపఱకల నెడనెడఁ గొఱుకఁ దివురు,
నేలఁ బొరలాడు, క్రిమ్మఱి నిలిచి పాఱు.

ఇట్లు శైశవక్రీడల నెసఁగుచున్న
పుత్రుఁ బొడఁగని కన్నీరు పొంగి పొరల,
'ఇట్టి నెత్తురుకందు నే నిచట డించి,
పోవలసెనె కటకటా! దైవగతికి?

ఈడుదూడలు తమ తల్లు లేగు దేర
ఎదురుగా నేగ, తానును ముదము మీఱ
నేగి, తన మాతృహీనత యెఱుకపడఁగ,
చిత్తమున నెంత కుందునో చిన్నికూన?

ఏను తను బాసిపోవుట యెఱుఁగ కకట!
ఆడుచున్నాఁడు బిడ్డడు వేడు కలర;
అచట బెబ్బులి యాఁకట కాఁగలేక
స్రుక్కి సోలుచు నను దూఱి సురిగె నేమొ?

గడియ యేనియు నే నీట తడయ నగునె?'
అనుచు ధేనువు తలపోసి, మనమునందు
నెట్టి కొనివచ్చు శోకంబుమట్టువఱచి
తనయునిం జేరి వానితో ననియె నిట్లు.

'అన్న! నవమాసములు మోసి నిన్ను గాంచి
చనవుమై పెంచుచుంటిని చన్ను గుడిపి,
నీవు జనియించి మూన్నాళ్ళు నిండ లేదు
నీకు నాకును చెల్లెనే నేడు ఋణము?

తండ్రి ! యింకమీఁద నా మాట తలఁపఁ బోకు,
మమ్ము మఱవుము, సత్య మేమఱకు మయ్య:
మనల నిన్నాళ్ళు ప్రేమతో మనిచినట్టి
విప్రునానకు మాఱు గావింపఁ బోకు.

ఒంటి నేగకు పొలముల. కింటికడకు
పొద్దు వాలకమున్నగాఁ బోవు మయ్య;
కరులు ఖరములు తురగముల్ తిరుగుచోట
దారి కడ్డంబుగా నిల్చి తారఁబోకు.

నూతిదరులందు. లోతైన గోతుల దరి
నెట్టి పచ్చిక మొలచిన మెట్టఁ జనకు,
గుమురుగా నున్న కసవుజొంపముల నేని
మూరుకొనకుండ నెన్నఁడు ముట్టఁ బోకు.

వేటువసరాల జోలికిఁ బోకు మెపుడు,
దుడుకుతొడుకుల పొదుఁగుల దూఁటఁ బోకు,
తెవులుగొంటులతోఁ గూడి తిరుగవలదు,
మొసలి మసలెడు మడువుల మూతి నిడకు.'

నిన్ను బాయక చెంత నే నున్నయపుడె
ఒద్దికను నిన్ను ముద్దు సేయుదురు కాని,
అక్కటా ! నేను నినుబాసి యరిగినంత
లెక్కగొందురె నిన్నొక్క వక్కకైన ?

తూఁడుకంటెను. పుష్పాదిధూళికంటె,
తృణకణముకంటె, పుల్లుఁగుల యీఁకకంటె,
బెండుకంటెను, మఱి దూదిపింజకంటె
చుల్క నగుఁ గాదె తలి లేని సుతుఁడు జగతి.

స్వామి యెపుడైన కినుకచే నేమి యన్న,
అల్కఁ జెందక, తలలోనినాల్క వగుచు
ఏను లేనట్టి కొదవ గాననీక మెలఁగి,
వెయ్యియేఁడులు వర్ధిల్లు మయ్య కొడుక !'

తల్లి యీరీతి బోధింప తల్లడిల్లి,
దూడ యిట్లనె, 'అమ్మ ! యి ట్లాడె దేమె ?
దాన మొసఁగెనొ, అమ్మెనొ తన తనూజ
కరణ మిచ్చెనొ, చెపుమ - భూసురుఁడు నిన్ను ?

ఎటకుఁ బోయెదు ? నీవెంట నేనువత్తు,
గోవుదూడల నెవ్వ సేయును సుమతి గలఁడె ?
నీవు లే కున్న నిమిషంబు నిలువఁ బాలః
తల్లితోడిద లోకంబు పిల్లలకును.

పెర్మి న న్నింక నెవ్వరు పెంచువారు ?
వీఁక న న్నింక నెవ్వరు నాకువారు ?
కూర్మి న న్నింక నెవరు చగ్గ[illegible]వువారు ?
ఎందు బోయెదు న న్నింటి నింట డించి ?'

కనుల జలజల బాష్పముల్ కాల్వ గట్ట
వత్స మీరీతి తనతోడఁ బలుకుచుండ,
జల్లుజల్లని హృదయంబు జలదరింప
సూనుఁ గౌఁగిట గదియించి, సురభి యనియె.

'జాలి నీ లీల వాపోవ నేల వత్స ?
పాయుఁ డెవరికి న న్నియుఁ బాలుపడఁడు,
విధినియోగంబుచే నేన వెడలుచుంటి'
అంచు జరగిన దెల్ల విన్పించె, నంత.

కొఱవిచేఁ గాల్చినట్టులు, సూఁదియ బెట్టి
వ్రచ్చినట్టులు, కొఱ్ఱున గ్రుచ్చినట్లు,
ములుకులను బోలు తన తల్లి పలుకులు విని
గుండె లవియంగ నేలపైఁ గూలె దూడ.

అంబ యను, నన్ను వీడ నాయంబ యనును,
వనట ముంచితె చెనఁటి దైవంబ ! యనును,
ధరణి నా జీవ మింక వ్యర్థంబ యనును,
అకట ! పులి యేల దాపురం బయ్యె ననును.

అనుచు పలవించు తనయుని కనియె గోవు;
'జీవియై పుట్టుపిమ్మట చావు నిజము,
ఊరక చచ్చుటకంటెను, పరులకొఱకు
మరణ మొందుట పరమధర్మంబు గాదె ?

అమలసత్యంబె యూఁతగా, వ్యాఘ్రవక్త్ర
గహ్వరం బది మోక్షమార్గంబు గాఁగ
స్వర్గసుఖముల చూఱాడఁ జనుచునుంటి;
అహహ ! యింతటికంటె భాగ్యంబు కలదె ?'

అనుచు నాత్మజశోకదావాగ్నికీల
లాత్మవచనాంబువృష్టిచే నాఱఁజేసి
సత్వరంబున పులి యున్న చక్కిఁ జేర
నరిగె గోరత్న, మంత నవ్వ్యాఘ్రి మచట.

'సాటి యున్నదె యెందైన వసరమునకు?
బేలనై దాని మాటల బేలువడితి,
కేలఁ జిక్కిన యావును గోలుపోతి;
అకట! నావంటి యంబేద యవనిఁ గలఁదె?

బళిర! తా నొక్క నిజమరిబలె నటించి,
పెక్కుబాసలు చేసి తప్పించుకొనియె;
అయినఁ గానిమ్ము - ఇంతలో నైన దేమి?
ఎదుడువడ కున్నె యిది యింత నెన్నఁడేని?

ఇంక నీసారి అయ్యది యెదురుపడిన,
ఒక్కపెట్టున దానిపై నుఱికి, మేను
వ చ్చివండట చేసి, యా వెచ్చ నెత్తుఱు
గ్రోలకుండిన నింక నే క్రోలుపులినె?'

అంచు పెటపెట పండ్లు దీటించుకొంచు
కడిఁదియాఁకట కటకటఁబడుచున్న
పులికుఱంగట నొయ్యన నిలిచె గోవు,
చుక్క తెగి రాలిపడినట్లు చక్కవచ్చి.

ఇట్లు లరుదెంచి, పులిచెంత నిట్టనిలిచి,
ధేను విట్లనె 'పులిఱేఁడ నేను వోయి
ఎంతొ తడవయ్యె, అక్కటా! యింతదాఁక
ఎట్టు లుంటివొ యాఁకట బిట్టు దూలి?

వ్యాఘ్రరాజమ! నీ చేసినట్టి మేలు
మఱవ శక్యమె యెన్నిజన్మముల కైన?
నీ దయారసకలనచేఁ గాదె యేను
బుజ్జగించితి సుతునకు బుద్ధి సెప్పి.

నాదు కోరిక దీఱెను, నీదు కోర్కి
యింక దీఱఁగ నా దేహ మిదిగొ నీకు
ధారవోయుచునుంటిని, తనివి దీఱ
నారగింపుము తడవు సేయంగ నేల?'

అనుచు నీరీతి తనతోడ నావు పలుక,
చిత్ర మది యేమొ — పులి యంత చేష్ట లుడిగి
తేఁకువను గోలుపోవు, విఠాకు జెందు,
కనుల నటె విచ్చి వెడవెడ గాంచు బయలు.

ఎదుట నిలిచిన యావుఁ గన్నెత్తి కనఁడు,
గడగడ వడంకు, బాష్పముల్ కనుల నించు,
గొణుఁగు దనలోన, వేదురు గొన్నభంగి
నుండు, తలయూచు, వెచ్చని యూర్పు పుచ్చు.

కరుణ యెట్టిదొ కలనైన నెఱుఁగనట్టి
వ్యాఘ్రి మీరీతి శౌర్యంబు పరిహరించి
దీనవృత్తిని వహియించి, మౌనముద్ర
నుంట గనుఁగొని యక్కజ మొందె యావు,

అఱ్ఱు పై కెత్తి గంగడోల్ బిఱ్ఱబిగియ
పుండరీకము నొంతకుఁ బోవ, వ్యాఘ్ర
ముస్సురసు రని వెచ్చనిట్టూర్పు పుచ్చి
మూర్మగము వెట్టి వెనుకకు మరలిపోవు.

అంత నీరీతి పులితోడ ననియె సురభి :
'కాదొ యాఁకలి ? నామీఁద కాంక్షలేదొ ?
నాదు మాంసము వాచవి గాదొ ? యిట్లు
దెసలు జూచెద వేటికి తెల్లబోయి ?

ఆఁకటను గ్రుక్కి వాడివత్తయ్యె నొడలు.
కడుపు వీఁపున నంటె నప్పడము వోలె;
జాల మేటికి ? నాదు మాంసమ్ము మెసవి,
పుణ్యలోకంబులకు నన్ను బుచ్చు వయ్య.

ఆవు గావించు తెగువకు నదరిపడుచు
ఎట్టకేలకు శార్దూల మిట్టు లనియె,
'పుడమిపై నేను పులి నయి పుట్టి పెరిగి
యిట్టి ధీరత గంటినే యెన్నఁడైన ?

అకట ! 'నీయట్టి మహితాత్ము లైనవారిఁ
బట్టి వధియించి దురితంబు గట్టికొనుట
కంటె, లొడితెడు పొట్టకై కాయ గసరు
మెసవి మునివృత్తి మసలుట మేలు కాదె ?

కన్నుగానక దూఱనై యిన్నినాళ్ళు
కూల్చితిని జీవరాసుల కోట్లకొలది,
కట్ట ! నిను గూడ నా పొట్టఁ బెట్టికొనుచు
ఘోరనరకానలంబునఁ గూలఁ జాల.

నీదు ధర్మమె నిను గాచె, నేను నిన్ను
గాచివుచ్చితి నను మాట కల్ల, నేను
నిన్ను గెలుచుట యటు లుండె, నీవె నన్ను
గెలిచికొంటివి సత్యవాగ్విభవకలన."

అనుడు, ధేనువు వచియించె 'వ్యాఘ్రరాజ !
ఏల యీరీతి వలికెద ? పేను మున్ను
ధారవోసితిఁ గాదె యీ తనువు నీకు ?
చింత యేమిటి కింక భక్షింపు మయ్య,

ఈవు నను గాచి విడువ. నే నింటి కేగఁ
గాంచి. 'ఈ యావు పులిఁ గికురించి వచ్చె.
మాయురే ! ఎంత మాయులమారి !' యంచు
సెల్లిదంబులు సేయరే యెల్లవారు ?

అకట ! పడికంటె చావు మే లగును గాన,
చారుతరలీల నీకు నాహార మగుచు
కాయ మర్పించుటో, అట్లు గాకయున్న
జీవముల బల్మిc దొరcగుటో చేయుదాన.'

అనుచు పులిc జేరి 'తిను' మంచు నావు పెనcగ,
నీకు మొక్కెద నా జోలి రాకు మమ్మ,
తినను తిన' నంచు బెబ్బులి పెనcగ, నిట్లు
జరగె వాదము వారికి చాలసేపు.

అంత ఖేచరు లద్భుత మంది, గోవు
సత్యవాక్శుద్ధి పులికృపాసక్తబుద్ధి
చాల మెచ్చుచు నంతరిక్షమునను౦డి
కుసుమవర్షంబు వారిపై కురిసి రాగిని.

మొలను పులితోలు పచ్చడంబును ధరించి,
వృషభరాజంబుపై నెక్కి. వేడు కలర
నంత నీశ్వరుc డచట ప్రత్యక్ష మయ్యె
వ్యాఘ్ర ధేనూత్తమంబుల వాద ముడుప.

ఇట్లు అవతరించిన యీశు నెదుటఁ గాంచి,
వ్యాఘ్రమును గోపు భక్తిసంభ్రమము లెసఁగ
స్తుతు లొనర్చిరి, దాని కీశుండు మెచ్చి
కరుణతో నిచ్చె వారికి వరమువదము.

బుద్ధి చాలని మూర్ఖుని పుడమియందు
పశు వటంచును పిలుతు, రా పశువ కాదె
నిత్యసత్యవ్రతంబును నిర్వహించి
ప్రవిమలానందపదవిని బడయఁ గలిగె.

---

# కేరళరాణి



చల్లఁ బగు నొక్క యామని పంజవేళ,
విరుల పొదరింట కమ్మ తెమ్మెరలు వీవ,
చలువరాతిన్నెపై నొక్క తలిరుఁబోఁడి
ఇంపు మీఱఁగ వీణ వాయించుచుండె.

'జయము జయము-కేరళరాణి! సరళరాణి!
ప్రేమమై నీదు ప్రియుఁడుఁ పంపించినట్టి
పెండ్లికానుక లివె-వీని స్వీకరింపు'
మనుచు నొక దూతి యందిచ్చి యవలఁ జనియె.

'నాదు రాజ్యము, పదవియు, నా ధనంబు,
నాదు వంశము నాసించి కాదు-నాదు
వరగుణంబుల మది మెచ్చి వలచె నతఁడు'
అనుచుఁదనలోనఁ దా ననుకొనియె రాణి.

అంతిపురినుండి యరుదెంచి యామెదాసి,
విలువ నగలును సన్నని వలిపములును
గాంచి 'ఈ కానుక లెవ్వ రంపించినారు?'
అనుడు, చిరునవ్వు నవ్వుచు ననియె రాణి:

'ఇంతమాత్రమె దాసిరో! ఎఱుఁగలేవె!
నాదు చిన్నారి పొన్నారి ననుపుకాఁడు,
అనుఁగు మేనత్తకొడుకు, సుధాకరుండు-
అతడుఁ తక్క మఱింకెవ్వ రంపువారు?'

హర్షమున పొంగి పొరలుచు ననియె దాసి:
"శీఘ్రమే మీకు కల్యాణసిద్ధి రస్తు!
ఈశ్వరుఁడు మీకు శుభముల నిచ్చుఁ గాక!
చల్లఁగా వేయియేండ్లు వర్ధిల్లుఁ డమ్మ!

చెలువు గలవాఁడు, చిఱునవ్వు గులుకువాఁడు
హొయలు గలవాఁడు, మవ్వంపు వయసుకాఁడు,
ఇవ్వి యన్నియు నటు లుండనిచ్చి-నీదు
చిఱుతపాయమునాఁటి నెచ్చెలిమికాఁడు.

అఖిల లక్షణ శుభ శోభనాంగి వీవు,
చారు సుకుమార సుందరాకారుఁ డతఁడు-
అన్ని విధముల ననురూపు లైన మీకు
సఖ్య మొనగూర్చి నలువ తా చతురుఁ డయ్యె.

ఇంతకాలమునుండి నా హృదయమందు
దాచియున్న రహస్యంబు తల్లి ! నీకుఁ
తెలుపవలసిన తరుణంబు కలిగె నేఁడు,
కాన తెలిపెద- 'రాణివి కావు నీవు!'

అనుడు వెడవెడ నవ్వుచు, ననియె సరళ :
'ఇట్టు లాడఁగ నీకు నో రెట్టు వచ్చె ?
నేను రాణిని గానంచు నీవు పలుక,
ఎవ్వరైనను విన్నచో నవ్వ రొక్కొ !'

"అట్టు లైన వచించెద, నమ్మ వినుము-
వృద్ధభూపతి యవసానవేళ, తనదు
అనుఁగు తనయను నాపాలి కప్పగించి,
ఇట్టు వచియించె కనికర ముట్టిపడఁగ.

'లేమరో! నాకు తనయులు లేరు గాన,
రాజ్ఞి యిద్దియె నాదు సర్వస్వమునకు;
దాని కీవయె తల్లివి తండ్రి వగుచు
ప్రీతిమై నాదు కుల ముద్ధరింపు మమ్మ!'

కన్నకూఁతురు వోలె, నా చన్ను గుడిపి
సాకితిని దాని, అది యొక్క సంజవేళ,
ప్రాణములు వాయ, దానికి బదులు నాదు
కన్న బిడ్డను నిలిపితి నిన్ను సరళ!"

అనుడు వెఱఁగంది, యీరీతి ననియె సరళ:
"జనని! ఎంత యకృత్యంబు సలిపి తమ్మ!
నృపతియల్లుని రాజ్యంబు నపహరించి,
కట్టితివి దాని నాకు నీ కన్నసుతకు.

'ఒరుల రాజ్య మపేక్షింప నొల్ల, నింక
నీవు చేసినయట్టి యా నేరమునకు
ప్రతికృతిగ వాని రాజ్యము వాని కొసఁగి,
కానలకు నేగి కడపెద దీనవృత్తి."

'సరళ ! వల దమ్మ యంతటి సాహసంబు,
ప్రేమతో నీవు వానిని పెండ్లియాడ,
వాని రాజ్యము వానిదే యౌను గాదె !
ఇట్టి తెగువకుఁ బూనంగ నేటి కమ్మ !'

జనని కంతట కడసారి ప్రణతు లొసఁగి,
ఒక్కటొకటిగ తొడవుల నూడఁబెఱికి,
నారచీరల ధరియించి, యూరు విడిచి,
విపినసీమల కరుగంగ వెడలె సరళ.

తేరిపై నెక్కి మెల్ల నా దారిఁ జనుచు,
తరుణి నల్లనఁ గాంచి సుధాకరుండు
వెఱఁగుపాటును నివ్వెర పెనగొనంగ,
దిగ్గు రని తేరిపైనుండి డిగ్గి' అనియె.

'బాల ! ఇది యేమి ! నిఱుపేదరాలి వోలె,
ఒంటిమై కాననంబుల వెంట రేయి
ఏల తిరిగెద వీలీల బేల వగుచు,
సరస మృదువాణి ! అలివేణి సరళరాణి !

అలరుదోటల విహరింప వలయు నీవు
ఘోరవనముల నేరీతి గ్రుమ్మరితెదు ?
కొదమచిలుకల వలుకుల బెదరు నీవు
పులుల బొబ్బల కేగతి నిలువఁ గలవు?

రమణిమిన్నరొ! నాదు ప్రాణములకన్న
నిన్ను మిన్నగఁ బ్రేమించుచున్న వాఁడ,
అట్టి నను వీడి నీ విప్పు దక్కటకట!
నట్టడవి కేగ నీ మన సెట్లు లొప్పె?'

హృదయమున నించు కేనియు బెదరు లేక,
తివిమై నిల్చి బదు లిడె పూవుఁబోడి!
'ధరణిపతివారసుడ వీవు, దాసి నేను—
ఎట్టు లొనగూడు ననురాగ మిట్టి మనకు?'

"ఎట్టెటూ! చిట్టిదాసిరొ! ఇట్టు రావె!
ఇన్ని వగ లెందు నేర్చితే వన్నెలాడి!
ఈవు దాసివ? అట్లగునేని, నేను
ముగుద దాసానుదాసుఁడ నగుదుఁ గాదె!

దాసివా నీవు ? కేరళదేశరాజ్య
రమ్య సామ్రాజ్య సౌభాగ్యరాశి వీవు;
విమల భాసుర కాంతిచే విశ్వ మెల్ల
భాసిలఁగఁ జేయు తేజోవికాసి వీవు.

చిఱుతప్రాయమునుండి కాంక్షించుచున్న
వాంఛ లీడేరు తరుణంబు వచ్చె నంచు
ఉల్లమున నెంతొ యువ్విళు లూరుచుండ.
అకట ! నీ విట్లు చేయంగ న్యాయ మగునె ?"

'తగునె నీ విట్లు లాడంగ ధరణివిభుడ !
రాణి నేఁ గాను, నిఱుపేదరాల సుమ్మి'
అనుచు నే నెంత చెప్పిన, విన వ దేమి ?'
అంచు జరగిన దెల్ల విన్పించె నంత.

'నీవు చెప్పిన మాటలే నిక్క మేని,
నేను రా జైన, రాణివి నీవు గాక,
ఏల యగుదువు పేదవు ? చాలు చాలు—
ఇట్టి మాటల నీ వింక కట్టిపెట్టు.

‘పేదరాలివో, దాసివో యౌదుగాక !
ఈవె కేరళరాణివి యింకమీద’
అనుచు నతఁ డామె బిగికౌఁగిటను గదించి,
మోవి మోవిని గీలించి ముద్దు గొనియె.

జరిగె వారికి మఱునాఁడె పరిణయంబు;
ఎవరి రాజ్యమొ నేఁటికి నెఱుఁగ రెవరు,
రాజ్ఞి ఆమెయె కేరళరాజ్యరమకు
అనుచు భావించుచుండిరి అఖిలజనులు,

——

ధాత్రి క్రోధన వత్సర చైత్ర శుద్ధ
చవితి శనివార ముదయంబు సంధ్యవేళ,
అనుంగుపుత్రుండు కామరాజాహ్వయుండు
కుతలమును బాసి స్వర్గంబు కొల్లగొనియె.

# మున్నుడి



కరుణారస పరిప్లావితహృదయమునుండియే యుత్తమ కవిత ఆవిర్భవించు ననుటకు 'ఆదికవి' వాల్మీకిరామాయణమే తార్కాణము. ఆలంకారికులు శృంగారము రసరాజమన్నను 'కరుణారసపోషణము' ఉదాత్తకవితాలక్షణముగాఁ జేర్కొనవలసియున్నది. 'భవభూతి, ఉత్తరరామాయణప్రాశస్త్యమున కిదియే కారణమని పండితుల అభిప్రాయము.

'సంస్కరణాభిలాషి'గా 'మధురకవి'గా శ్రీ నాళము కృష్ణారావుగారు తీఁదీయని పదములతో మనోహరభావనలతోఁ దేటగీతులలో నాటవెలఁదులలోఁ బెక్కు చిన్నారి మధురకృతులను రచించి యాంధ్రుల యాదరాభిమానములను జూఱగొన్నారు. వీరి కబ్బముల పేర్లెంత మృదుమధురములో, వీరి హృదయస్థితియు నట్టి దని చెప్పవచ్చును.

విషయము చిన్నదైనను దానిని భావించుటలోను కవితాబంధముగా మలచుటలోను కవి 'ఘనత' స్పష్టముగాఁ గానవచ్చుచుండును. తల్లిబిడ్డల, తండ్రికొడుకుల అనురాగాతిశయములు నిరుపమానములైనవి. 'అందాలరాశి' గుణవంతుఁడు నగు 'పాపాయి' అను కుమారుఁడు అయిదాఱేండ్లయినను నిండక మునుపే మరణించుటతో మనకవిగారు చాల పరితపించినారు. మంచి భావుకులు, కవులు నగుటచే వీ రంతకాల మతనితోఁ గడపిన సన్నివేశములను మధుర కవితాశక్తితోఁ గరుణారస

ములోఁ బ్రోదిచేసి 'పాపాయి' యను చిన్ని కావ్యరూపము నకుఁ దెచ్చినారు.

తన భావనలోఁ దాను కరగి యితరులను సైతము కరగు నట్లు చేయఁగల కొలఁదిమంది కవులలోఁ గృష్ణశాస్త్రిగా రొకరు. వీరి కవితలను జదువునపు డాంగ్లకవి 'వర్డ్స్వర్త్' జ్ఞప్తికి రాకమానఁడు. వియోగసంజనిత శోకమును కవి రసము చేయక తాన్యోక్తిలోఁ జెప్పఁగల్గును. ఇతరు లట్లు చెప్ప లేరు. ఇదియే కవిలోని ప్రత్యేకత!!

ఇంతవిమున్న యీ 'పాపాయి' కృతి యావదాంధ్రుల మెప్పొందినది. కవిగారి పుత్రీమణి 'విదుషీమణి' 'కళాప్రపూర్ణ' శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి కోర్కెపై నీ కావ్యమణిని మరల ముద్రింపించి సారస్వత లోకమునకు మహోపకారము గావించిన 'వదాన్యులు' 'కళాసాహిత్య ప్రియులు' 'శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారు (రాజమహేంద్రవరము) నిజముగా అభినందనీయులు.

'సువర్ణగండపెండేర విభూషిత'
'కవితావాచస్పతి' 'భాషాప్రవీణ'

చేబోలు చిన్నయబ్రహ్మకవి, ఎం. ఏ.

రాజమహేంద్రవరము, 22-3-82.

———•••———

# కాలగతి

ఎల్లజనములు కడువేడ్క నుల్లసిల్ల
చైత్ర మిదె వచ్చె, సంతతోత్సవము హెచ్చె;
మొగ్గ లన్నియు విచ్చె, నా మొగ్గ యకట!
మూడుప్రొద్దులలో నిట్టె మాడిపోయె.

చనియె దుష్ట సంవత్సర సప్తకంబు;
మంచి వత్సర మరుదెంచె నంచు నుండ;
పిట్టపిడుగున నక్కటా! యుట్టిపడుచు
క్రోధనా! వచ్చి నా కొంపఁ గూల్చినావె?

నీదు నామముచేతనె నీగుణంబు
బోధపడుచుండ, నీయందు సాధుగుణము
వెలయు ననుకొంట క్రోధనా! వెఱ్ఱి కాదె?
తులసి పుట్టునె గంజాయి తోటయందు?

క్రొత్త వత్సర మరుదేరఁ, గోర్కె దీఱ
బూరెముక్కలఁ గడుసార నారగించి,
వేడుకలరంగ నా బాలుఁ డాడుకొనుచు
పొంగుచుండఁగ, క్రోధనా! మ్రింగినావె ?

క్రోధనా! నీకు నామీఁద క్రోధ మేల ?
అడుగు పెట్టితివో లేదొ యంతలోన,
ముద్దుకొమరుని తొలి పెచ్చుముద్ద గాఁగ
గుటుకు మని మ్రింగి తెంతటి కుటిలమతివి?

పులుసు కారము వర్జించి, ఫలము పాలు
కుడిచి, మునివృత్తి నిష్ఠమై గడపుచున్న
కనులు తెఱువని పసిపాపఁ బెనఁగి చంప
చెనటికాలమ! నీ కెట్లు చేతులాడె ?

ఏను సౌఖ్యంబు నొందుట గాన లేక
నీకుఁ గనుగుట్టెఁ గాఁబోలు, గాక యున్న
మంటఁ గలుపుదువే పండువంటి సుతుని ?
చెనఁటికాలమ! నీ కేమి చేటు మూఁడె ?

ఎల్లవారికి నల్లారుబెల్ల మగుచు,
మురిపములు చూపి ముద్దులు మూటగట్టు
ముద్దుబుడుతఁడు నీకును ముద్దు గొలుప,
ముచ్చ టయ్యెనె మృత్యువా! ప్రముచ్చిలింప ?

ఆటలం దైన నన్నృతంబు లాడఁ బోఁడు,
చిన్ని చీమల నేని హింసింప లేఁడు,
అన్నమును పున్నె మెఱుఁగఁడు, అట్టివాని
చప్పరించితె మృత్యువా! చుప్పనాతి!

అకట! ముకుపచ్చలారని యట్టి నిసుఁగు
నంత మొందింప నీశక్య మయ్యెఁగాని,
అట్టి మంగళాకారుని, అమలగుణుని
మగుడఁ బుట్టింప నీశక్య మగునె మిత్తి!

సాధుజనముల కెగ్గులు సలిపినానొ?
తండ్రిబిడ్డల కెడబాటు తలఁచినానొ?
ఒరుల సంపదఁ దిలకించి యోర్వలేనొ?
కుటిలదైవమ! నన్నేల కుతిలపఱుప?

బాలపాపలపాలి యకాలమృత్యు
వగుచు, వారిని బలిమిమై నట్టె పట్టి
కుత్తుకలు నొక్కి త్రుటిలోనఁ గూల్తు వౌర!
పాపినివి కావె యో బాలపాపచిన్న!

వార! స్థిరవార మని నీకు పేరె కాని,
యింత యస్థిరవాసర మెందు లేదు;
మందుఁడై నట్టి శని నిన్ను పొందియుండ,
మందునకు నైన నీయందు మంచి యున్న?

కృత్తికా! నీవు కుత్తుకల్ కత్తిరింతు,
వగుటఁ జేసియె యానామ మమరె నీకు;
కాని-చో నుక్కుగుండును బోనివాని
తునుకలుగఁ ద్రుంతువే యొక్క త్రుటికలోన?

నాగుబాములు విఘ్నవినాయకుండు
నధిపతులు గాన సహజంబు లయ్యె నీకు
పరుల నొంచుట బన్నంబు పఱచుటయును;
తిథివె? మృత్యుదేవత కీ వతిథివి చవుతి!

# మరణము

కలల నైనను సత్యంబె పలుకువాఁడు,
పలుకు పలుకునఁ దేనియల్ చిలుకువాఁడు,
దైవసములుగఁ బితరులఁ దలఁచువాఁడు,
నన్ను దిగనాఁడి యక్కటా! నాక మేగె.

చెక్కుఁ గీటిన పాల్గాఱు చిఱుతవాఁడు,
పూఁపపాయంపు బుడుతఁడు, ముద్దులాడు,
నాదు చిన్నారి పొన్నారి నందనుండు
నన్ను శోకాబ్ధిఁ బడఁద్రోసి నాక మేఁగె.

శ్రుతుల సమ్మేళనము చేసి సొంపు మీఱ
రాగ మాలపింపగ, వీణ బ్రద్ద లయ్యె;
ముద్దు ముచ్చట మురిపంబు మురువు చూచి
మోదమునఁ దేలుచుండ, నాపుత్రుఁ డీల్గె.

శుక్తిపుటమునఁ బడనున్న సోనచినుకు
వాయువశమున గుల్లలోఁ బడినయట్లు,
ధన్యజన్మము నొందఁగఁ దగినవాఁడు
కాలగతిఁ బుట్టె నిర్భాగ్య కడుపునందు.

౫

నిండుచందమురుఁ బోలు నీ నెమ్మొగంబు
గాంచి చిరజీవి వగు దని యెంచియుంటి;
అకట! ఆఱేండ్ల చిన్నిప్రాయంబునాఁడె
నిండఁ జనె నీకు నూఱేండ్లు నిండువయసు?

ఇంట నొకసారి తళుకున మెఱపు మెఱసి
అంత త్రుటిలోన నె యదృశ్య మైనయట్లు
అల్ప కాలంబునసె లీల లన్ని చూపి
అప్పై తటుకున మటుమాయ మైతివయ్య.

'అరయ నాఱేండ్ల లేతప్రాయంబులోన
అఖిల సద్గుణగణముల నభ్యసింప
నగును ధారుణిఁ గల మానవాళి కెల్ల'
అనుచుఁ జాటింపఁగాఁ బుట్టి చనితె దివికి?

పూతచారిత్రుఁడైన నీతాతగారి
పూజ్య బగు నామమును నీవు పూనియుంట,
ఇల్లు నిలఁబెట్టి నాముప్పు వెళ్ళఁబుత్తు
వనుచుఁ దలఁచితి, నది యెల్ల వ్యర్థమయ్యె.

అక్షరాభ్యాస మొనరించినపుడు కవులు
నీవు చిరజీవి వగు దంచు దీవెనలను
బలికి, రవ్వియు నిన్నుఁ గాపాడఁ వయ్యె;
నాదు దౌర్భాగ్యఫల మది కాదె యకట!

ఎచట నేగుడి నే దేవుఁ డెదురుపడిన,
'ఆయి రాకుండ నను గావు మయ్య' యంచు
మ్రొక్కుచుందువు, వారిలో నొక్కఁడైన
అడ్డుపడి నిన్ను గాపాడఁ డయ్యె నయ్యొ!

ఏమ మును నీకు ప్రతిమ తీయించినపుడు,
చూపు మింటికి బఱపి కూర్చుండినావు;
మింటిచూపులె కాని, యీ మంటిచూపు
తిరము కా దని యీలీలఁ దెలిపినావ ?

మృత్యుసమయంబు దాపింప మేను మఱచి
'ఇంటి కేగుచునున్నాఁడ' నంటి వయ్య!
కలవరిం పని యప్పుడు తలఁచికొంటి
అకట! యిప్పుడు తెలియంగ నయ్యె నిజము.

పలకపై నేవో యక్షరంబులను గిలికి
'అయ్యో! నా వ్రాతయిదె పూర్తి యయ్యె'నంచు
పలికితివి రేపు రోగంబు వచ్చు ననఁగ;
అకట! ఆమాట సత్యంబ యగుచు; దాఁకె.

'పిలుప రెప్పుడు నోరార పేరు పెట్టి,
'పాప' యని పిల్తు రది యేమిపాప మొకో?
కాను పాపఁడ, పెద్దలఁ గలసినాఁడ'
అనుచుఁ బలికెద, వది నిజం బయ్యె నేఁడు.

వెనుక మనపెద్ద లందఱు వేఱుపడఁగ
కనఁగఁ జాలక నీ తాత చనియె దివికి;
నేఁడు నీ నాన్న, పెదనాన్న వీడిపోవ
కనులఁ గనఁజాల నని నీవు చనితె దివికి?

వచ్చు శ్రీరామనవమికి వైభవమున
బాలకృష్ణుని రథముపై లీల నునిచి
పండుగ నొనర్ప నుంటివి నిండువేడ్కఁ;
అకట! పండుగ దండుగ యయ్యె నొకో?

'రంగు తేరికి కొయ్యయేనుంగు కట్టి
ఆడుకొన నాకు వేడుక యయ్యె నయ్య!
గొలుసు కొను,' డని యంటివి; కొనెడిలోనె,
త్రెంచికొంటివి మనల బంధించు గొలుసు.

'ముద్దు' పేరిట పద్దియముల రచించి
ప్రేమమై నీకు కృతి సమర్పింప నెంచి
నీవు జీవించియుండంగ నేర నైతి;
అక్కటా! నేఁడు నా 'ముద్దు' ముక్క లయ్యె.

'మూఁడు చక్రాలబండిపై ముచ్చ టయ్యె.
కొనఁడు మామయ్య, నీవైన కొనఁగదయ్య!'
అనుచు పలుమారు వేఁడిన, అక్కటకట!
నీదు తుదిముద్దు చెల్లింప నేర నైతి.

నాకు కృష్ణున కీవు నందనుండ వగుట,
ప్రేమమై కాముఁ డను ముద్దు పేరు పెట్టి
యుంటి; నా కుమారుండ వై యుండ కకట!
నాకు మారుండ వై యుంట నీకు తగునె?

నేను నిలిపిన పుస్తక నిలయమందు
నీవు నా పేరు స్థిరముగ నిలిపెదవని
యెంచితిని గాని, నీ పేరె యేను నిలుప
వలసివచ్చు నటంచును దలంప నైతి.

ఎంత సుకృతాత్ము లగువారి కైనఁ గాని
ధర ననాయాస మరణంబు దొరకు టరిది;
ఎట్టి ధన్యుండవో నీవు, గిట్టు వేళ
ఉస్సు రనియైన నాయాస మొంద లేదు.

ప్రీతి లాలించి నినుఁ జేర బిలుచువార
చెంత కేనియుఁ జేరంగ సిగ్గువడుదు;
ఎపుడు ముక్కు మొగంబును నెఱు గనట్టి
వింతలోకము నెటు లొంటి వెళ్ళి తయ్య?

మర్త్యులకె కాదు, దేవతా మండలికిని
మండనాయమానంబుగ నుండువాఁడు
అరుగు చున్నాఁడు మీ చెంత కమరులార!
లెండు మీ పుణ్య మంతయు పండె నేఁడు

## వియోగము

ఈవు నవ్వీన నవ్వేదు, ఏడ్వ నేడ్తు,
ఆడ నాడుదు, పాడిన పాడు చుందు,
అకట! నీతోడిదే లోక మనుచు నుండి;
తోడికొన వేల నున్న నీతోడ నేడు?

కాంతు నవమాసములు మోసి కాంచి పెంచి
ఎవుడు నీ కేమి యాపద లెసఁగునో యని
కంట వత్తిడుకొని సదా కాచియుండు
అనుఁగుతల్లిని విడనాడ న్యాయ మగునె?

ఏను నమ్మయు నీపయి నెన్నఁడైన
కినుక వహియించి యుందుము; కనులుగప్పి
కొనుచు నెప్పుడు నిన్నెంతో కొండసేయు
నీదు అమ్మమ్మపైనైన నెనరు లేదె?

మించు వేడుకతో నొక్కకంచమందె
బువ్వ గుడుచుచు, నొక సెజ్జఁ బవ్వళించి,
కూడిమాడుచు నీతోడ నాడి పాడు
అన్న యక్కల నేనియు నరయ వలదె?

'నాదు గద్దియపై నెక్కి-నాండ వేర?'
అనుచు నీ తాత నిను మీలమూండ, నతని
వీపుపై దువాళించి నవ్వింతు వెలమి?
అట్టి తాతను వీడ నీ కెట్టు లొప్పె?

పుత్రమోహము కడుపార పొంగి పొరల
కొడుకు కుట్టిలు లే రను కొఱంత దీఱ,
నిన్ను లాలించి ముద్దాడుచున్న నీదు
పిన్న యమ్మమ్మపై నైన ప్రేమ లేద?

'అవని నాతండ్రి యాతండె యనతరించ,
వంశమున కెల్ల వన్నెయు వాసి తెచ్చు'
అనుచు నినుం జూచి మరియు చున్నట్టి నీదు
అయ్య విడనాడంగా నీకు న్యాయ మయ్య?

'నన్ను డబుల నడిగెదు, నాకు తండ్రి
నీవు కావున నీవె నా కీయవలయు'
అనుచు నిను లీలం బరిహాస మాడునట్టి
అయ్య విడనాడ నీ కెట్టు లయ్యె మనసు?

ఎపుడు నీమీఁద ప్రేమచే నింపు మీఱ
బుగ్గ నులుముచు, నీ చిన్ని బొజ్జ నిమిరి,
గిలిగిలింతలు వెట్టి నగింపఁ జేయు
మామపై నైన నీ కింత మమత లేదె ?

పట్టఁజాలని తమకంబు బాయ లేక,
లీల నిను పాను పెక్కించి మేల మొప్ప
నొవ్వ నేడ్పించి, తోతోన నవ్వఁ జేయు
మామ విడనాడ నీ కెట్లు మనసు గొలిపె ?

'కడుపు గలిగిన ఫలముగఁ గాంక్ష దీఱ
కన్న నిటువంటి కొడుకునె కాంచవలయు'
అనుచు నిన్నెత్తుకొని ముద్దు లాడునట్టి
చిట్టి యత్తను వీడ నీ కెట్టు లొప్పె?

నీవు మరణించినది యాది, నీదు తల్లి
నిదురయును కూడు నెఱుఁగక, నేలఁ బొరలి,
గొల్లుమని యేడ్చుచున్నది గుండె పగుల;
తల్లి నిటు లేడిపింపగఁ జెల్లు నయ్యొ?

# స్మరణము

కన్నె వెన్నెల లొలయించు చిన్నినవ్వు,
తేటతేనియ లొలికించు తీయపలుకు,
హాయిలు గులికించు నడకల యొప్పిదంబు
ఎట్లు మఱతును నను గన్న చిట్టితండ్రి?

ఒయ్యనొయ్యన నొయ్యార ముట్టిపడఁగ
హొయలుమై నీవు నడయాడుచుండఁ జూచి,
చిన్ని యేనుంగుగున్నను గన్నయట్లు,
చెంగలించుచు నామది నింగిముట్టు.

కనులు మూసిన, విచ్చిన, కలలు గన్న,
పను లొనర్చిన, తలఁచిన, పలుకుచున్న,
నిలిచియున్నను, మెలఁగిన నీదుమూర్తి
కనులఁ గట్టినయట్టులు కానవచ్చు.

సొగసు గుల్కెడు నీదు దుస్తులను జూచి,
ఎలమి నీ వాడుకొను వస్తువులను జూచి,
అకట! నీ యీడుజోడు బాలకులఁ జూచి,
గుండె చెఱువయి పోవుచు నుండెఁ గదర.

నేను నీవును జనుచుండ, నిన్ను ముందు
పలుకరింపక; నాతోడఁ బలుక రెపుడు
తోడినెచ్చెలు; 'లక్కటా! నేఁ డిదేమి
వెడలుచున్నారు నను జూచి వెల్లఁబోయి?

ఏడ కేగిన, నా తోడునీడ వగుచు
నాదు చూపుడు వ్రేలిని నాదుకొనుచు
నేగుచుందువు దవ్వెంతయేని గాని;
నేఁడు నావెంట రా వేమి నీవు తండ్రి?

ఎపుడు గ్రంథాలయంబున కేను జనిన,
తోడ వత్తువు గోవుతో దూడ వోలె;
నేఁడు పోవుచునుంటి; నాతోడఁ గలసి
ఈవు రా వేమి? పితృభక్తి యెందుఁబోయె?

ప్రతిదినంబును దిద్రపోవకయ ముందు,
'దండ మిదె నాన్న! అమ్మరో దండ మిదిగో!
దండ, మన్నయ్య! అక్కయ్యా దండ!' మనుచు
దండ గ్రుత్తువు, నేఁ డేది దండకంబు?

తొట్టెతానము చేయుచున్నట్టివేళ,
వచ్చియును రాని జిలిబిలి పలుకు లొలయ
ముద్దుకృష్ణుని పద్యముల్ ముద్దు గులుక
చదువుచుందువు; నే డట్లు సలుప వేమి?

వేడుకలు మీఱ నీవు నీ తోడివారిఁ
గూడి కిలకిలలాడుచు నాడి పాడు
చుండ, కలకలలాడుచు నుండు నిల్లు
అక్కటా! నేడు వెలవెలలాడుచుండె.

తోడిబాలురఁ గూడి నీ వాడుకొనుచు
బమ్మరిల్లుచు నుండ, నీ బొమ్మరిల్లు
కనులపండువు సేయుచుఁ గానవచ్చె;
కడుపు చుమ్మలుచుట్టెరా కాంచ నేడు.

తొట్టిలో నీవు కూర్చుండి తూఁగులాడు
చుండ, నుట్టిలో గుమ్మడిపండులీలఁ
గానవత్తువు కన్నులకఱవు దీఱ;
పొట్టుపొర లయ్యె నేడు నీ తొట్టి చూడ,

మరణవేళను కుత్తుక గుఱక పుట్ట,
చుఱుకు మని నీదు నుదుటను చుఱక వెట్టి;
రది తలంచిన నా గుండె లక్కటకట!
చుఱుకు మనుచుండె కొఱవితో! చూడినట్లు.

మఱపు దుఃఖంబునకు మంచిమం దటంచు
పెద్ద లందురు; కావున నెద్ది యైన
కార్య మొనరింతు నన్న, నా కార్య మెల్ల
మఱపునకు వచ్చు; నీ వెప్డు మఱపు రావు.

నాదు పొత్తునఁ గుడుతువు, నాదు సెజ్జఁ
బవ్వళింతువు, నాపజ్జఁ బాయకుందు,
వకట! తలలోని నాల్కవై యలరు నీవు
మఱపువత్తువె నే నెంత మఱతు నన్న?

మొలకనవ్వులు మొగమునఁ దొలకరింపఁ
మెడను కర్పూరహారంబు తడఁబడంగ,
చెంగుచెంగునఁ బరుగెత్తి చేరవచ్చు
నిన్నుఁ జూచితి కలలోన నేఁడు కుఱ్ఱ।

# గుణవర్ణనము

చిన్ని కృష్ణుని లీలల 'సినిమ' యందు
చూచి, కృష్ణుని పెనుబాము చుట్టి కలప,
గ్రుడ్ల నిండను కన్నీరు గ్రుక్కుకొనుచు
గోలు మని యేడ్చితివి; యెంత జాలి నీకు?

అమ్మ రామాయణము చెప్ప నాలకించి
సీతశోకము విన లేక చెవులుమూసి
కొంచు, 'అమ్మరో! ఇంక చాలించు మమ్మ!'
అంచుఁ బలికితి; వెంత దయార్ద్రమతివొ?

'ఎన్నఁడును మామ మనయింటి కేని రాఁడు,
మనల నేటికి వారింట మనకు తల్లి!'
అంచు మనయింటి కమ్మను గొంచు రావె?
ఎట్టి యభిమాన మమరెరా చిట్టినాఁడె?

నీదుబుద్ధియు వినయంబు నెనరు జూచి
ఏడ నావంటి ధన్యుండు లేఁ డటంచు
పొంగితిని; నేఁ డెచట! నన్నుఁ బోలినట్టి
మందభాగ్యుఁడు లేఁ డని కుందుచుంటి.

‘ఏచటి కేఁగిన ననుఁ జూచి యెల్లవారు
పిలిచి తద్దయు ప్రీతితోఁ బలుకరించి
ముద్దుగొనియెద రిది యేమి సోద్దె?, మనుచు
సుద్దులాడవె తల్లితో ముద్దుకుఱ్ఱ!

‘బట్ట కొలిచెద రమ్మని కుట్టువాఁడు
చేయివైచెను బుగ్గపై, చిత్ర మమ్మ!
కాలు సేతులు కొలుతురు కాని, బుగ్గ
కొలుతురే’ యని తల్లితోఁ బలుక లేదె?

‘‘అంగడికి నేగి లడ్డు కొనంగఁబోవ,
‘వద్దు నీ డబ్బు, నాకొక్క ముద్దు నిమ్ము,
లడ్డు ని’త్తనె, వాఁ డెంత దొడ్డవాఁడె ?
అయ్యొ! యిది యేటి విడ్డూర ?’’ మనుచు ననవె?

‘ఎవఁడవుర నీవు? నాయింటి కేల వచ్చి?’
తనుచు నీ తాత పలుక, ‘నీ మనుమఁడ సుమి !
అసలుకంటెను వడ్డియే సిస’ లటంచు
పలుకుదువు కాదె! ఎంత నేర్పరివి నీవు ?

'మామకను తాత కెన్నియో మంచి బండ్లు,
మంచి మోటారు లున్నవి, మనకు లేవు;
నాన్న! నే పెద్దవాఁడ నై యున్న యపుడు
ధనము గడియించి కొనవ' లం చనఁగ లేద?

'మూఁడునిలువులు కలిగిన మేడ తాత
కట్టె, నాలుగంతస్తులు గలుగు మేడ
కట్టె మామయ్య; నే నిదె కట్టువాఁడ
ఐదునిలువులు గల సొగసైన మేడ;

'అమ్మ కొక్కటి, నీ కొండు, అన్న కొకటి,
అక్క కొక మేడ యిత్తు, నే నెపుడు మీఁది
నుందు పై మేడపై నంచు' నందు; నకట!
మిద్దె లిన్నియు నింతలో మిథ్య లయెన?

మాకు మేడలు లేకున్న మానెఁ గాని,
కట్టుకొంటివి నీ కొక్క గట్టి మేడ,
అన్ని మేడలపై నున్న యట్టి మేడ,
స్వర్గసౌధంబు; అందైనఁ బడయు సుఖము.

## విలాపము

ఒక్కతరి కన్ను మూయుదు, నొక్కయెడను
కనుల నఱవిచ్చి వెడవెడఁ గాంతు బయలు;
ఒక్కవేళను తలయూఁతు, నొక్కసారి
ఉస్సురంచును వేఁడినిట్టూర్పు పుత్తు.

రాత్రి యరుదేర, నిద్దుర రాక వేఁగి
పగలె మే లని యెంతును, పగలు రాఁగ,
రేయి, మే లని యెంతు; నీరీతి గాఁగ
పగలు రేయియు నాపాలి పగలె యయ్యె.

ఒంటిపాటున దుఃఖంబు నోర్వలేక
పలువు రుండఁ దలంతును, పలువు రుండ
ఒంటిగా నుండఁ దలఁతు; నీయోజ నిట్లు
గడపుచుంటి దినంబు యుగంబురీతి.

వెల్లివిరియుచు తీరంబు పెల్లగించి
వఱ్ఱు లొడ్డుచు పాఱు ప్రవాహ మనఁగ,
నిండి నిబిడీకృతం బయి గుండెఁ జీల్చి
పొంగి పొరలెడి దుఃఖ మభంగురముగ.

కొఱవితోఁ గాల్చినట్టులు, సురియ నెట్టి
వ్రచ్చినట్టులు; కొఱ్ఱును గ్రుచ్చినట్లు.
కఱకుఱంపానఁ గోసినకరణి, నాదు
గుండియలు బగ్గుబగ్గున మండుచుండె.

తనయుఁ జేర్పట్టి పిలువంగఁ దగ వటంచు
నోరినిండఁగ నీ పేరు నుడువ నైతి;
అయయొ! యెలుఁగెత్తి 'కామరాజా' యటంచు
నుచ్చరించుచుఁ బలవించుచుంటి నేఁడు.

కన్నులారంగ ప్రతిమను గాంచి నైన
కొంతయేనియు సూఱట కాంతు నంచుఁ
నిడుపటమును నాచెంత నిలిపికొనఁగ,
ఊఱటకు మాఱు జనియించె నారటంబు.

# పుత్రుఁడు

కూడు సైచదు, కనులకు కూర్కు రాదు,
స్వాంతమున తేళ్ళు ప్రాఁకిన పగిదిఁ దోఁచుఁ
కనుల జలజల బాష్పముల్ కాల్వ గట్టు
ఆత్మజవియోగదుఃఖ మత్యంతభరము.

నడక తడఁబడు, మై గడగడ వడఁకు,
బెదరు గుండియ, మాట తబ్బిబ్బునొందు,
బెండువ తాల్మి, మది కలగుండు వడును;
పుత్రవిరహంబు వల దెట్టి శత్రువులకు.

జగతి యంతయు శూన్యంబ యగుచుఁ దోఁచు,
ఎల్ల సుఖములపైఁ గడు నేవ పుట్టు,
వ్యర్థ మేటికి జీవన మనుచుఁ దోఁచు;
దుర్భరము పుత్రనిర్యాణదుఃఖ మిలను.

మంచిగందము వెన్నెల మంచుకంటె
శీతలకరంబు నందనాశ్లేషసుఖము;
ఉడుకు నూనియ, కార్చిచ్చు,పిడుగుకంటె
ఉగ్రతాపంబు పుత్రవియోగభరము.

పుట్ట కున్నను తెస్సయొ, పుట్టి పెరిగి
తల్లిదండ్రుల యుల్లంబు లుల్లసిల్లఁ
జేయు నందనుఁ డెడఁ బాసి పోయె నేని,
అట్టి దుఃఖము వర్ణింప నలవి యగునె?

పుట్ట కుండిన దుఃఖంబు, పుట్టి పెరిఁగి
వ్యాధిగతుఁ డైన నెంతయు వ్యాకులంబు.
అవల మృతి నొంద దుస్సహం; మక్కటకట!
కష్టబహుళంబు పుత్రసంగతి తలంప.

తన్నుఁ గని పెంచి ముద్దాడు తల్లిఁ దండ్రిఁ,
బాళి లాలించు నెల్ల చుట్టాల విడిచి,
కూర్మిఁ దెగఁ గోసి నట్టేటఁ గూల్చు రకట!
శత్రువులు గాక మిత్రులే పుత్రు లరయ

## శనినింద

ఆదిదేవుని కడుపున నవతరించి
నరక సన్నిభుఁడైన యా నరకుభంగి,
భువనబాంధవు కడుపునఁ బుట్టియైన
నైచ్యమును మాన వీవు శనైశ్చరుండ!

చండమార్తాండు కూర్మిపుత్రుండ వగుట,
దండధరునకు ముద్దుతమ్ముండ వగుట,
కలుగునే నీకు నొక్కింత కనికరంబు?
మందుచిచ్చునఁ బుట్టునే మంచుముద్ద?

నీవు కడగంటఁ జూచిన నిఖిలజగము
ధ్వంసపారాయణంబును దగ్ధపటలి,
నీవు చేపట్టినది యెల్ల నిష్ఫలంబు;
ఇనుపగజ్జెల తండ్రి! శనీశ్వరుండ!

ఈవు కన్నెత్తి చూడవయేని, నరుఁడు
అఖిల సౌభాగ్యసంపద లనుభవించు;
ఈవు కన్నెత్తి చూచితివేని, నరుఁడు
బగ్గుమని మండి నిలువున బుగ్గి యగును.

నీ కటాక్షంబు లేననిపై నిగుడు, వాఁడు
పట్టినది యెల్ల నట్టి నిప్పచ్చరంబు,
కాంచినది యెల్ల నెపుడు బగ్గంపువాఁడు,
తలఁచినది యెల్ల సర్వామంగళము మాఁవ !

ఈవు జనులను నొక్కఁడ హితము గూర్ప
వంచు రదియు మఱింత యనర్థమునకె;
ఒయ్యనొయ్యన నెక్కించి, యొక్కఁ డెట్టి
కూలఁద్రోతువు వారిఁ బాతాళమునను.

గ్రహములం దెల్ల నతి నీచగ్రహము వీవు,
వాసరంబుల నధమంపు వాసరమవు;
నీకు మ్రొక్కెద నాజోలి రాక యుండ,
చెమురు కాళ్ళయ్య ! దౌర్భాగ్య చక్రవర్తి !

## వైరాగ్యము

తాను చావక మూనిశివానిభంగి
వగచు జీవుండు చచ్చినవానిఁ గూర్చి,
చావకయ యుండ దాఁకోనశక్య మగునె!
ఎచటఁ బుట్టెనో యచ్చటి కేగు నరుఁడు.

పుట్టినంతన మూరెడు పొంగనేల ?
త్రుంగినంతన బారెడు క్రుంగ నేల ?
పుట్టువాఁ డెన్నఁడేనియు గిట్టకుండ
ఉట్టికట్టుక యూఁగునే యుర్వియందు ?

'నిన్నఁ జూచితి, వాఁ డెంతో చెన్ను మీఱె,
నేఁడు తెగ వాఱె,' పనుచుఁ జింతించు నరుఁడు,
ఎల్లి తనచావువచ్చు నం చెఱుఁగ లేఁడు ;
అరయ క్రిందాకు మీఁదాకు వరుస కాదె!

ఘోర సంసారవారాశిఁ గోట్లకొలఁది
పుత్ర మిత్ర కళత్రముల్ బుడగలట్లు
పుట్టుచుందురు, పొరిపొరి గిట్టుచుందు?
రిట్టివారికి వగఁ జెంద నేల నరుఁడు ?

# సంసారము

తల్లి నా కిది యీతండు తండ్రి నాకు,
ఇదియ యిల్లాలు, నా కిది యిల్లు, నాదు
సుతులు వీరలు, వీరలు హితు లటంచు
జడుండు భ్రమ జెంది పుట్టుచుం జచ్చుచుండు.

చెలియె మృత్యువు? చుట్టమే తలంప యముండు?
శిలయె దేహంబు? గాథమే జీవ మెన్న?
మాయసంసార మిది కడు హేయ మంచు
తెలియ కజ్ఞుండు తలపోయు స్థిర మటంచు.

తన గృహంబున నభ్యాసమున మెలంగు
అంధుని విధంబు, సంసారమందుం దిరుగు
మూఢుం డెఱుంగునె నిక్కంపు ముక్తి తెరువు?
అరయ విజ్ఞానవిదుండు తా నెఱుంగుం గాక.

శిశువు, బాలుండు, తరుణుండు, ముసలి యనంగ,
వివిధ పాత్రంబుల ధరించి భువిని నరుండు
నటుని కైవడి సంసార నాటకంబు
నాడి, నరక మను తెరలోని కరుగు తుదిని.

## అస్థిరత

ఆయు వల్పంబు, భోగంబు లస్థిరములు,
పుత్ర మిత్ర కళత్రముల్ బుద్బుదములు,
సకల ధనధాన్య సంపదల్ చంచలములు,
అనుచుఁ దెలిసియు నరుఁడు మోహాబ్ధి మునుఁగు.

దేహ మెన్నఁగ గాలిలో దీపకళిక,
కలలలోపలి ముచ్చటల్ కల సుఖములు,
పుత్రసంగతి తెరలోని బొమ్మలాట;
హేయభాజన మక్కటా! యిహసుఖంబు.

శైశవం బెన్న నఖిలరోగాశయంబు,
యౌవనంబు సమస్తపాపాలయంబు,
వార్ధకం బది దుర్వ్యథావర్ధకంబు;
సౌఖ్య మొందుట యెన్నఁడో జనుఁడు భువిని.

కాలపరివర్తనమున దుఃఖంబు సుఖము
సకలజనులకు నెడ నెడ సంభవించు;
ఖేద మొదవిన క్రుంగుచు, మోద మొదవ
పొంగుచుండరు సతతంబు బుధులు మనెని.

తెలియఁ జాలక పక్షులు వలలఁ జిక్కు,
ఎఱుఁగ నేరక మిడుత తా నుఱుకుఁ జిచ్చు,
దురితభూయిష్ఠ మంచుఁ దా నెఱిఁగి యెఱిఁగి,
కూలు సంసారవార్ధిలోఁ గూళనరుఁడు.

అడరి ముదిమియు రోగంబు నతిశయింప
చీకి దేహంబు శిథిలంబు గాకమున్న
బుధుఁడు సాధింపఁగా దగు ముక్తిపథము?
ఇల్లు కాలంగ నుయి త్రవ్వఁ జెల్లు నొక్కొ?

అరయ దేహము రథ, మింద్రియములు హయులు,
ఆత్మ పేరిటి రథికుఁ డా యశ్వచయము
ధైర్య మనియెడు రజ్జులఁ దగఁ గుదించి,
వెరవుతోఁ బట్టి, మోక్షంబు తెరువుగాంచు.

హేయసంసారసుఖముపై నేవ పుట్ట,
విషయవాంఛల విడనాడి, విపినమందు
తపము సేయుచు నీశ్వర ధ్యానములను
పొద్దుపుచ్చెడివారెంత పుణ్యులౌరా!

## కర్మము

వాయువశమున నెగయుచు వారిదంబు
లాకటఁ గూడుచు వీడుచు నుండుపగిది,
కాలగతిఁ జేసి జీవు లొక్కటన కూడి
వీడుచుందురు కర్మంబు మూడినంత.

కర్మమున జీవి యుదయించు, కర్మవశత
వర్ధనము గాంచు, కర్మంబువలనఁ ద్రెళ్ళు;
కర్మమే కష్టసుఖముల కారణంబు,
కర్మమే దైవ మఖిలజగంబులందు.

కర్మమున మేలు కలుగును, కర్మముననె
కలుగు కీడును, సకలంబు కర్మవశమె;
బమ్మ యైనను కర్మంబు క్రమ్మఱింపఁ
జేయలేఁ డన్న, నితరులఁ జెప్ప నేల ?

తొంటి తన కర్మములు వెంటనంటి త్రిప్ప,
పుడమి నొక్కొక్క దేహంబుఁ బడసి పొడమి
ఒండుత్రోవను బోవుచు నుండు దేహి ?
చావు పుట్టువు సహజంబు జీవతతికి.

బలిపదము ద్రొట్టి, అల బ్రహ్మపదము దాక
సంక్రమింపఁగఁ జూచెదు చాపలమున;
లోన వెలిఁగెడి బ్రహ్మంబు లోఁ నెఱింగి
తలఁప వెన్నఁడు చిత్తమా! తప్పిదారి.

గండుపులివోలె వెఱపించుచుండె ముదిమి;
ఓటికుండను బోసిన నీటిఁ బోలె,
అంతరించుచు నున్నది ఆయు వకట!
వెడగుచిత్తము! యింకేల మిడిసిపాటు?

తన్ను పెనుబాము కబళించుచున్న తఱిని
ఈగలం బట్టి కప్ప తా వేగిరించు
భంగి, కాలభుజంగము మ్రింగ నున్న,
విషయవాంఛల వీడవు వెకలిమనస!

నీదు వాంఛలు నాసలు, నీదు కోర్కె-
లన్నియు కటా! పటాపంచ లయ్యెఁ గాని,
శిలను జేసిరొ? యినుమునఁ జేసిరో నిను?
నిలిచియుంటివి నిట్రాడువలెను మనస!

నీదు పూనిక లెల్లను నిష్ఫలములు,
నిన్న చూచినవారలు నేఁడు లేరు;
సుతు లటంచును సతి యంచు హితు లటంచు,
విఱ్ఱవీఁగెద వేటికే వెఱ్ఱిమనస !

ఏల తిరిఁగెదు చిత్తమా! బేల వగుచు
కాలు కాలిన పిల్లిని బోలె నీవు ?
వమ్ములై చెడె నీ ప్రయత్నమ్ము లెల్ల;
విసిగి వేసారితివి, యింక విశ్రమింపు.

# నిర్వేదము

విద్య నేరిచి ప్రఖ్యాతి వెలయ లేను.
ధనము గడియించి దీనులఁ దనుప లేను.
భోగములచేత సౌఖ్యంబుఁ బొంద లేను.
గడపి పుచ్చితి కాలంబు కాకివోలె.

వయసు ముదిరెను, సుఖముపై వాంఛ తొలఁగ,
ప్రాణసములైన మిత్రులు బాసి, రకట!
పండువంటి కుమారుఁడు పదటఁగలసె;
బ్రతికి యుంటిని జీవచ్ఛవంబ నగుచు.

బంధుగులకెల్ల గిట్టనివాఁడ నైతి,
మిత్రులెల్లరు నొకపెట్ట శత్రులైరి.
అనుఁగుపుత్త్రుఁడు గిరురించి చనియె దివికి;
ఎట్లు బ్రదుకుదు పుడమిపై నింకమీఁద ?

మున్ను నమ్మితి విగ్రహపూజనంబు,
అవల నమ్మితి మానసికార్చనంబు,
ఇదియు నదియును మదియందు కుదురవయ్యె;
రెంటికి చెడ్డ రేవనిరీతి నైతి.

## ఆత్మసమర్పణము

నిన్ను భక్తిని గొలువనో? నెమ్మనమును
నీవె దిక్కని నమ్మనో? నిన్ను విడిచి
పరుల సేవించినాఁడనో? పరమపురుష!
ఏల నన్నిట్టి కష్టంబు పాలు సేయ?

ఇలను జన్మించినది మొదలింతదనుక
గడపితిని ప్రొద్దు పరహితకార్యములకు,
సలిపితిని శక్తి కొలదిని సాధుసేవ;
ఏల నన్నిట్టి కష్టంబు పాలుసేయ?

ఆలు పేరిటి గుదికట్టు నఱుత వ్రేల్చి,
బిడ్డలనియెడి ముకుత్రాడు బిగియఁగూర్చి,
ఘోరసంసారమను పెద్దగుంజఁ జేర్చి
కట్టితివి నన్ను నట్టిట్టు కదలకుండ.

పుట్టి రేఁగురు—పుత్రికల్ పుత్రులందు
కట్ట! నలువుర నీపొట్టఁ బెట్టికొంటి;
వున్న ముగ్వురనైన నాకుండ నిచ్చి
ఆయురారోగ్యవంతులఁ జేయుమయ్య!

ఏఁగె నలువదిమూఁడేఁడు, లింతదనుక
కష్టమువలె కాని యొక్క సౌఖ్యం బెఱుంగ,
ఉన్నయాసయు నేఁటితో నూఁడె; నింక
చేర్చుకొన వయ్య నన్ను నీచెంత దేవ !

చిత్తమునయందె కోర్కులు జీర్ణమయ్యె,
జీవితం బన్న నెంతయు నేవ పుట్టె,
ఎల్లయాసలు కడ తేఱె; నింక నీదు
దివ్యపాదాబ్జయుగళియె దిక్కు నాకు.

హేయసంసారజలధిలో నీఁది యీఁది
మునిఁగి తబ్బిబ్బువడి తలమునక లైతి,
చాలు సుఖములు, విసిగి వేసరితి; నింక
నీదు పాదారవింద సన్నిధికిఁ గొనుము.

దురిత తాపత్రయాభీల దుర్నివార
ఘోరసంసారజలధిలోఁ గూలియుంటి,
కరుణ దరిఁజేర్చి నన్నొగి గావుమయ్య !
దిక్కు నీవని నమ్మితి దేవదేవ !

నిఖిలపాపంబులకు నెల్ల నిలయమైన
యిహసుఖంబుల నే నింక నిచ్చగింప;
పరమపదమైన నీ పాదపంకజంబు
చెంతఁ జేరిచి నన్ను రక్షింపు మీశ!

ఘోరసంసార సాగరోత్తారణంబు,
భక్తజన సంతతానంద భద్రకరము,
అవ్యయానంద మోక్షదాయకము నైన
నీ పదధ్యాన మాత్మలో నిలువ నీవె?

ఆత్మజవియోగ గాఢదుఃఖాగ్నిఁ గ్రాఁగి
స్వచ్ఛమైనట్టి మామక స్వాంత మిదిగో!
ధార గట్టెడి కన్నీట ధారవోసి
అర్పణ మొనర్తుఁ, గైకొనుమయ్య దేవ!

## ఆత్మశాంతి

వ్రాసితిని మొన్న ననుతాప పద్యములను,
ఇంక చేతడియారలే; దింతలోనె,
వ్రాయఁ జేసితె సంతాప పద్యములను
కూర్మిపుత్త్రుని మరణంబు గూర్చిఁ దేవ !

పట్టె యంచును మూన్నాళ్ళ పట్టపగలు
పొంగిపొరలుచు మురియుచు బోర్లపడితి;
ఇచ్చితివి వాని. క్రమ్మరఁ బుచ్చుకొంటి,
వాఁడు నీవాఁడు కాని నావాఁడు కాఁడు.

నేను నన్నె కాపాడుకో లేనివాఁడ,
వానిఁ గాపాడ నేర్తునె! కాన నీవె
చెంతఁ జేరిచి వాని రక్షింపవయ్య!
నీకుఁ గలిగిన బాధ్యత నాకుఁ గలదె?

అతఁడు నాచెంత దుఃఖంబు లనుభవించు
చుండుకంటెను, నీపాదయుగళిపొంత
నుంటయే శుభం బగు; 'ఇంటికంటె గుడియె
పదిల మగు' నంచు బుధులు చెప్పుదురు కాదె?

భంగురం బగు నిహలోక బంధ ముడిపి
నిత్యమైనట్టి నీదు సాన్నిధ్యమునకు
వానిఁ గొనియుంటి; వందుల కేను వగవ
వానితో నన్నుఁ గొనకుంట కేను వగతు.

వానిఁ గొన నీకు మన సయ్యెఁగానఁ గొంటి,
వందు కేమందు? నక్కటా! యతని విడిచి
యుండఁగా నోప, నను వానియందఁ జేర్పు,
తండ్రి బిడ్డల నెడ సేయు దగునె నీకు.

ఎప్పు డేరీతి నెవ్వారి కేది హితమొ,
అప్పుడారీతి వారల కది యొనర్తు;
వట్లు చేసితి, విటు సేయ వైతి వనుచు
నింద చేయుదు రజ్ఞులై నిన్ను నరులు.

దుఃఖమూలంబు, నత్యంత దుస్సహంబు,
దుర్వ్యథాభాజనంబును, దుర్భరంబు
నైన యైహిక బాధల మానఁ జేసి
పరమపద మిమ్ము నా కూర్మిపట్టి కీశ!

పతితపావన! నా కూర్మిసుతుని యాత్మ
కవ్యయానంద సౌఖ్యంబు, నమలమైన
శాంతి నొసఁగుచు, నెపుడు నీచెంతఁ జేర్చి,
మగుడ జన్మంబు లేకుండ మనుపు మయ్య!

## ప్ర ణ య ము

ఏమి మహిమంబు గలదో నీనామమందు ?
'పాప' యను పల్కు వీనులఁ బడినయంత
నిలువునను నాదు మే నెల్లఁ బులకరించు
జల్లు మని నాదుహృదయంబు జలదరించు.

ఓహో! నీనామ మెంత మనోహరంబొ
మించు వేడుకతో స్మరియించుకొలఁది
నిశ్చలం బగు భక్తి ధ్యానించుకొలఁది
కూర్చుచున్నది నానాఁట క్రొత్తరుచులు.

సర్వ సారస్వత ప్రపంచంబునందు
'పాప' యనియెడి యక్షర ద్వయముతోడ
సాటి వచ్చెడు కొండొక మాట గలదె
మార్దవంబున మధురిమ మంజులతను?

జల్లు మని నోట ముత్యాలు జాఱ, నీవు
పలుకు తొలిపల్కులే నాకు తొలి పలుకులు;
జిలుగుగా నీవు పలకపై గిలుకు మొదటి
యక్షరమె నాకు మొదలిటి యక్షరంబు.

నీదు నవ్వులు నిండువెన్నెలలు, నీదు
శీలసంపద భూషణశ్రేణి, నీదు
తళుకు నిద్దంపు సిగ్గుదొంతరలు తలఁప
పరమసౌభాగ్యశుభపరంపరలు నాకు.

ఈవు కలకల నవ్వితి వేని, నాకు
పండువెన్నెల జగమెల్ల నిండినట్లు;
ఈవు వలవల యేడ్చితి వేని, నాకు
చిమ్మచీఁకటి జగమెల్లఁ గ్రమ్మినట్లు.

విమల భవదీయ గుణవర్ణనములఁ గాని
చిత్త మరగదు తదితర చింతనముల;
రమ్య మగు నీదు వదనదర్శమునఁ గాని
దృష్టి నిగుడదు తదితరదృశ్యములకు.

ఎట్లు ముచ్చిలితివో నాదు హృదయ మీవు?
లేఁతనవ్వుల మొలకలచేతఁ గాదు,
చెలువు గులికెడు పలుకులచేతఁ గాదు,
సిరుల నీనెడు నునుసిగ్గుచేత నేమొ ?

నీదు నవ్వులు నిండువెన్నెలలు, నీదు
శీలసంపద భూషణశ్రేణి, నీదు
తళుకు నిద్దంపు సిగ్గుదొంతరలు తలఁప
పరమసౌభాగ్యశుభపరంపరలు నాకు.

ఈవు కలకల నవ్వితి వేని, నాకు
పండువెన్నెల జగమెల్ల నిండినట్లు;
ఈవు వలవల యేడ్చితి వేని, నాకు
చిమ్మచీఁకటి జగమెల్లఁ గ్రమ్మినట్లు.

విమల భవదీయ గుణవర్ణనములఁ గాని
చిత్త మరగదు తదితర చింతనములఁ;
రమ్య మగు నీదు వదనదర్శమునఁ గాని
దృష్టి నిగుడదు తదితరదృశ్యములకు.

ఎట్లు ముచ్చిలితివో నాదు హృదయ మీవు?
లేఁతనవ్వుల మొలకలచేతఁ గాదు,
చెలువు గులికెడు పలుకులుచేతఁ గాదు,
సిరుల నీనెడు నునుసిగ్గుచేత నేమొ?



నిండు బిగియారు కౌఁగిట నిన్నుఁ బొదివి
నీదు తనుధూళి తల మేనినిండ సోఁక
హాళి నిన్నెత్తికొని ముద్దులాడినట్టి
వానిజన్మంబు జన్మంబు వసుధమీఁద.

సిగ్గుదేఱెడి నీపాలబుగ్గలందు
గిలిగిలింతల గిలకొట్టి, తళుకునవ్వు
వెన్నముద్దలఁ జిలికించి యెన్నిసార్లు
జుర్రియుంటినో చుబ్బనచూఱగాఁగ?

సరస సంగీత సాహిత్యభరిత మగుచు
శ్రుతిహితం బగు త్యాగయ్యకృతిని బోలె,
చిన్నదయ్యును తావక జీవితంబు
రసికజనరంజకం బయి రమణఁగాంచె.

స్వచ్ఛతరమయి మాధురీ సహిత మగుచు
సురుచిరామోదజనకమై సుమము వోలె
చిన్నదయ్యును తావకజీవితంబె
బంధురానందకర మయి వన్నెకెక్కె.

## సోయగము

నిండుచంద్రుండు నీముఖమండలంబు,
కందు ముంగురు, లుదయరాగంబు మోవి,
అమలచంద్రిక మందహాసాంకురంబు;
అహాహా! నీ ముఖంబు సుధాకరాత్మకంబు.

వదనలావణ్య సరసిలోఁ గదలియాడు
వాలుమీనులో యన నొప్పు వాలుకనులు,
నురువులో యన నలరారుఁ జిలునగవులు
విమల శైవాలమో యన వెలయుఁ గురులు.

నిగనిగలు దేఱు నిద్దంపు నీలమణులు
నట్టనడుమను, కెంపులు తొట్టతుదను
చెక్కి తాపిన ముత్తెంపుఁజిప్ప లనఁగ
చెన్ను మీఱెడి నీ వాలుఁగన్నుదోయి.

కలువఱేకులు మెఱుఁగులు గండుమీలు
నీడు రామికి, కనులతో జోడు గూర్ప
తమ్మిపువ్వులఁ గల్పించెఁ దమ్మిచూలి;
పుట్టినిలు పెద్ద సేయరె యెట్టివారు ?

కన్నుఁగొలకులు రెండును గలియకుండ
నడుమ ముక్కను సేతువు నలువ కట్టి
పైకి పొరలకయుండ నేర్పఱచినట్టి
పోతగట్టులో యన కనుబొమ్మ లలరు.

రమ్యభవదీయ ముఖసభారంగమందు
కొలుపు దీరిచి మారుండు కూరుచుండి
డంబు మీఱిన సింహాసనం బనంగ
నీదు నాసిక విలసిల్లు నిండుజిగిని.

మంజులం బగు నీ కంఠపంజరమున
గోరువంకయొ చిలుకయొ కోకిలంబొ
కాపురము సేయుఁ గాఁబోలు, కాకయున్న
అలరునే యింత మధురిమ పలుకులందు?

మోవి పవడంబు, గోరులు ముత్తియములు,
కురులు నీలాలు, కెంపులు చరణయుగళి,
పల్లువరుసలు రవ్వలు; పద్మభవుఁడు
నిన్ను నిర్మించెఁ నిక్కంబు నిఖిలమణుల.

రచి

కౌమరుమోవిని సుధ గిలకొట్టవచ్చు
మొలకనవ్వుల వెన్నెలల్ చిలుకవచ్చు
చిన్నికురులందు చీకట్లఁ జిమ్మవచ్చు
తీయపలుకుల కలకండ తీయవచ్చు.

విమల మగు నీదు చిఱునవ్వు వేయి సేయు
లలిత మగు నీదు వాలుఁజూపు లక్ష సేయు
కులుకుటొయ్యారి నీ నడ కోటి సేయు
నిద్ద మగు నీదునునుసిగ్గు నిధులు సేయు.

చలువ నునుమంచుబిందుల జాలుకొలిపి
పండువెన్నెల పిండిని పదనుచేసి
మెఱుఁగులందలి తళుకుల మేళగించి
చేసెఁ గాఁబోలు నలువ నీ చెలువ మారం!

ఒప్పు లన్నిటి నొకచోట కుప్ప వోసి
అందముల నెల్ల నొక్కెడ పొందుపఱచి
గుణము లన్నియు నొకచక్కి గూర్చి పేర్చి
సలిపె విధి నీదు నెమ్మేని చక్కఁదనము.

గల్లుగల్లున చిఱుగజ్జె లల్లలాడ
చిట్టిచేతుల సారె క ట్టిట్లు త్రిప్పి
విద్దియమ్ములు సేయు నీ ముద్దువగలు
మఱవ శక్యమె యెన్ని జన్మముల కైన?

అల్లనల్లన మెల్లఁగ నడుగు లిడుచు
వెనుకపాటునఁ జేరి నాకనుల నట్టె
మూసి, 'ఎవ' రని యడుగు నీ ముగుదతనము
మఱవ శక్యమె యెన్ని జన్మముల కైన?

'వచ్చి రెవ్వరో నీతోడ ముచ్చటింప'
ననుచు వచియింప, నేఁ దటాలునను లేవఁ
జననిఁ జూపించి నవ్వు నీ జాణతనము
మఱవ శక్యమె యెన్ని జన్మముల కైన ?

'నీదు తలమీద నున్నది యేదొ' యనుచు
నడువ, తడఁబడి నేఁ దల తడని కొనఁగ,
'తడవె దెవ్వరి' ననెడు నీ గడుసుతనము
మఱవ శక్యమె యెన్ని జన్మముల కైన?

ఏచటనుండియో నే నింటి కేగు వేళ
తలుపుచాటున నల్లన దాగియుండి
కెరలి దోబూచులాడు టక్కరితనంబు
మఱవ శక్యమె యెన్నిజన్మములకైన ?

గాఢముగ నేను నిద్రింప, గడ్డమునను
నార నంటించి మెల్లన నన్ను లేపి
కులికి యద్దంబు జూపు నీకొంటెతనము
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన ?

పాన్పుపై నాదుచెంతను బవ్వళించి
బొట్టనవ్రేలిని నోటను బెట్టికొనుచు
ఆదమరచుచు నిదురించు నీదు మురుపు
మఱవ శక్యమె యెన్నిజన్మములకైన ?

తొట్టిలోపలఁ గూర్చుండఁబెట్టి నేను
హాళి 'నుయ్యాలొ జంపాలొ'యంచు నూప
మోదమున నోలలాడెడు నీదులీల
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన ?

నీరు నూనియు పిండియు వేఱు వేఱు
చిన్నగిన్నియలం దుంచి నన్నుఁ బ్రీతి
జలకమాడంగఁ జేయు నీ విలసనంబు
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన ?

'చిన్నిచిలుకను జూచితే నాన్న?' యనఁగ,
'ఏది యే' దని నే నన, 'ఇదిగో' యనుచు
తన్నుఁ జూపించి నవ్వు గద్దరితనంబు
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన.

'తండ్రి! చూపెద నీ కొక్క తాయ' మనుచుఁ
బలికి, నామీఁద రబ్బరుపాము విసిరి,
అట్టె చప్పట్లు గొట్టు నీయాగడంబు
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన?

'ఏడువకు మేడువకుము, నీ వేడ్చి తేని ?
కనుల జలజల నీలాలు గాఱు' ననుచు
చిట్టి తమ్ముని నీవు జోకొట్టు హొయలు
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన ?

'కొట్టులో నున్న కొన్నట్టి గుడ్డిపిల్లి
పట్టునే యెల్క..?' నన, నేను 'పట్టు' దనగ,
'గుడ్డియెలుకనొ?' యను నీదు గోలతనము
మఱవ శక్యమె యెన్ని జన్మములకైన ?

లీలలు, ౨

కమ్మనెయ్యియు బువ్వయు కందిపప్పు
కలిపి గుజ్జుగఁ గావించి కడుపునిండ
గోరుముద్దలఁ దినిపింప నారగించి
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక ?

'పండు లోయమ్మ గుమ్మడిపండు' లనుచు
నెత్తిపై నిన్ను నిడుకొని నేను కేక
నిడఁగ, 'వెల యంత' యని యమ్మ యడుగ, కేరి
నవ్వి న న్నలరించువా రెవ్వ రింక ?

నవ్వులాటలకు నినుఁ దల్లి నొవ్వనాడ,
'అమ్మ! నీ పని పట్టింతు' ననుచు నన్నుఁ
జేరి బుడిబుడి కన్నీరు చిందువాఁడ
నేడ్చి న న్నలరించువా రెవ్వ రింక ?

'ఎచటి కేగుచు నుంటివి, యేను వత్తు'
ననుచు పరుగున నా చెంత కరుగుదెంచి
చిట్టిచేతుల నా కాలు చుట్టి పెనఁచి
ఎలమిన న్నలరించువా రెవ్వ రింక ?

'వెండిగిన్నియ నుంచితి వెన్న బువ్వ'
పసిఁడిదొన్నియ ఁబోసితి పాలు పెరుగు,
'ఆరగింపర జాబిల్లి' యనుచు పాడి
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక ?

'ఔర ! అబ్బాయితలమీఁద గోరువంక'
చెప్పకుము చెప్పకుము నీవు చిట్టిపాప !
చెప్పితే నీదు కన్నులు చెడు' నటంచు
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక?

'నన్ను ముట్టకు నామాలనల్లకాకి!'
అంచు నటునిటు పరుగెత్తి మించువేడ్క-
తోడిబాలురతో నాటలాడికొనుచు
ఎలమి నన్నలరించువా రెవ్వ రింక ?

ఈవు నేలపై కాళ్లూని యేడ్చుచున్న;
'పప్పు తిన్నను పాటివో, ఉప్పు తిన్న
ఊరివో' యని నే నన, ఊఱడిల్లి
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక ?

'ఎవరు ముందుగ నా చెంత కేగుదెంచు,
వాఁడె నాపాలి బంగారు బాలపిచిక'
అనుచు నే నన, గ్రక్కున నరుగుదెంచి
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక ?

'నాదు నోటను బెట్టుము నీదు వ్రేలు'
నీదు కంటను బెట్టెద నాదు వ్రేలు'
అనుచు బాలురతోఁ బరిహాస మాడి
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక ?

ఒప్పు లొలుకఁగ 'ఒప్పులకుప్ప' లాడి
మోద మారఁగ 'దాగుడుమూఁత' లాడి
వేడుకలు మీఱ 'గుజ్జెనగూడు' లాడి
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక ?

వచ్చియును రాని జిలిబిలి పలుకుచేత
తెలిసి తెలియని చిటిపాటి తెలివిచేత
నేర్చి నేర్వని చిన్నారి నేర్పుచేత
ఎలమి న న్నలరించువా రెవ్వరింక ?

మొలకనగవులు మొగమున గులకరింప
తళుకుఁ దేనియ పలుకులఁ దొలకరింప
కలికిచూపులు వీనులఁ బలుకరింప
ఎలమి న న్నలరించువా రెవ్వ రింక?

# ముద్దు

పాలమున్నీటి తరఁగలఁ బవ్వళించు
చిన్ని వెన్నుఁడో యన వెల్ల సెజ్జమీఁద
చెన్ను మీఱఁగ నిదురించుచున్న నిన్ను
కంటి నొకరేయి కన్నులకఱవు దీఱ.

పండువెన్నెల నీవు పన్నుండి యుండ
తమ్మిపువ్వులఁ దోఁగాడు తుమ్మెదలన,
చల్లగాలికిఁ జెదరి నీపిల్లకురులు
మొగుడుకన్నులతోడ దోబూచు లాడ.

మంచుబిందుల తాఁకున సంచలించు
చివురు పెదవులమాటున సిరుల నీను
మల్లెమొగ్గలఁ బోలు నీ పల్లువరుస
చుక్కగుంపులతో నెక్కసక్కె మాడ.

చిఱుతచెమ్మట గ్రమ్ము నీచిన్ని మొగము
చలువమంచున విరిసిన కలువవోలె
చెలువు గులుకంగ, తమకంబు నిలుప లేక
ముద్దుపెట్టుకొనఁగ నాకు బుద్ధి పుట్టె.

లలిత మగు నీదు నెమ్మోనిలతికయందు
అలరుగుత్తులో యన నొప్పు సంగకములు
మోహకోత్సుక మానసమధుకరంబు
నొక్కసారిగ నువ్విళులూరఁ జేసె.

కన్నుదోయియొ, బుగ్గలో, చిన్నముక్కొ,
చివురుపెదవులో, గడ్డమొ, చిట్టిబొడ్డొ-
ఇందు దేనిని ముద్దిడుకొందు ననుచు
నిర్ణయింపఁగ లే కట్టె నిలిచియుంటి.

వదనలావణ్య వరసరోవరమునందు
తేలియాడెడు బేడిసమీ లనంగ
చెన్ను మీఱిన నీ వాలుఁగన్నుదోయి
నాదు మానససీమను నాట్యమాడె.

సహజ లావణ్య శృంగార చారుకళకు
అన్యవస్తుల ఛాయల ననుకరించు
అద్దముల బెళ్కు సాటియే యనుచు నవ్వ
తళుకు చెక్కులు నామదిఁ దాండవించె.

॥

మామక స్వాంత కేదారసీమయందు
రాగబీజంబులను నాటి సాగుసేయు
పూన్చు బంగరుహాల మనఁ బోలెఁ బ్రొ సూాలు
నీదు నాసిక లూటాడె నాదు మనము.

చుబుకసోపానపంక్తిచే సొంబగు మీఱి
చెక్కుటద్దపుఁ గాంతుల జెన్ను మిగిలి
ముద్దుదేవికి పవడంపు గద్దెయైన
చివురు కెమ్మోవి నా మదిఁ దవులు కొనియె.

ముద్దునెమ్మోము నిద్దంపుటద్దమునను
నమరు చక్కని షిడి యన నలరు నీదు
డంబు మీఱిన చిన్నిగడ్డంబు నాదు
నుల్ల మంతయు నుఱ్ఱూఁత లూఁగఁ జేసె.

కనులపై వ్రాలి, గండభాగములఁ గ్రాఁకి,
నాసతుద నెక్కి, పెదవుల నాట్యమాడి,
గడ్డమున నిల్చి, చెంగున గంతువైచె
నాదు మానసభృంగంబు నాభిపైకి.

గీ.

నీదు లావణ్యలతికకుఁ బ్రోదివెట్టి
నాలవాలము లీలఁ జెన్నారు చున్న
చిట్టిబొడ్డుకు పట్టంబు గట్ట నెంచి
పట్టఁజాలని తమి ముద్దు పెట్టుకొంటి.

నిదుర మబ్బున నట్టిట్టు కదలియాడి
మొలక లేనవ్వు మామీఁదఁ జిలికినావు;
నాదు ముద్దున కదియె సన్మాన మనుచు
ఓలలాడితి హర్ష కల్లోలమందు.

# సందేశము

మేల్మిబంగరురంగుల మిసిమి మించు
వెలుఁగు లీనుచు, నో చిన్ని వేగుఁజుక్క!
ఒంటిగా నేల తిరిగెదు మింటివీథిఁ?
నిలిచి నాతోడ నొకమాట పలుక వయ్య.

ఒక్కటొక్కటిగ నీతోడిచుక్క లెల్ల
నొసఁగిల్లెను, కొలికోడి కూసె, నదిగొ!
తూర్పుదిక్కుల సంజలు తొలకరించె;
ఏల తిరిగెద వీలీల బేలవోలె?

కలువచెలికాఁడు చని యొక్క గడియ యయ్యె
ఇనుఁడు చనుదెంచు క్షణములో; నింతలోన
ఏల నెంచితె యాకాశ మెల్ల నొకట?
నిలిచి నా మాటలను మాఱు పలుక వయ ?

నాదు ముద్దుల కొమరుండు నన్ను విడిచి
ఏడుమాసము లయ్యెఁ దా నెటకొ చనియె,
ఇంతకాలముదనుక నాచెంత రాఁడు;
అతని విడనాడి నే నింక బ్రతుకఁ గలనె?

గిరా

నిన్నుఁ బోలిన వన్నెలు చిన్నెలొలుకు
సోయగమువాఁడు, చక్కనిచుక్క యతఁడు;
చుక్కగమిలోనఁ దానొక్కచుక్క యగుచు
నున్నవాఁడెము చూడుమా యొక్కసారి.

ఉన్నచో వేగ నాతనియొద్దకీవు
చేరి మెల్లఁగ నడుగుమా చిన్నమాట-
ఇప్పుడైనను మఱి యింక నెప్పుడైన
నిచ్చటికి వాఁడు క్రమ్మఱ వచ్చునేమొ?

ఇటకు వచ్చుట కతని కనిష్టమైన
అటకు నన్నైన రప్పించుమంచు ననుము;
వాని కటు చేయ నలవి కాదేని, వాని
పొంత కీవైనఁ దోడ్కొనిపొమ్ము నన్ను.

ఇంక నొకమాట చెప్పెద, నెల్లి నీవు
విన్నవిధిని విహరించువేళ, వాని
వెంటఁ గొనిరమ్ము-వానికే విన్నవింతు;
సమ్ముఖమ్మున రాయబారమ్ము లేల ?

చిత్ర మది యేమియో కాని చెప్పఁజాల-
నిన్నుఁజూచినతోనె నాకన్నకొడుకుఁ
గాంచినటు లుండుఁ గాన, నాకర్తి యెల్లఁ
దెలిపికొంటిని-ఇంక పెక్కు పలుకు లేల?

కడుపుతీపుకొలందిని నుడివినాఁడ,
నీవెఱుఁగని ధర్మంబు లెందు నైనఁ
గలవె? నీటను ముంచెదో? కరుణ నన్ను
పాలముంచెదవో నీదె భారమయ్య!

తూర్పుదిక్కున నల్లదే తొంగిచూచు
చుండె భాస్కరుఁ, డింక నీవుంటివేని
కరఁగిపోఁగల వాతని కిరణములను
మూసలోఁబడ్డ బంగారుపూస భంగి.

## చిత్రపటము

కన్నులారఁగఁ బ్రతిమను గాంచి యైన
కొంతయేనియు నూరట గాంతు నంచు
నీదు పటమును నాచెంత నిలిపికొనఁగ
ఊఱటకు మాఱు జనియించె నాఁటంబు.

చీటిమాటికిఁ జేరి నీ చిత్రపటము
ముద్దుగొందును, కన్నుల కద్దికొందు;
అకట! ననుఁ బాసిపోయితే యనుచు జాలిఁ
బలుకరింతును; పలవింతు; బలవరింతు.

అట్టె కాంతును తెప్ప లల్లార్పకుండ
అనుదినంబును నీదు ఛాయాపటంబు
క్రమ్ముకొనుచున్న బాష్పముల్ కన్నుదోయి
నిండి చూపున కడ్డమై నిలుచుదాఁక.

చెంత నిడుకొని యెపుడు నీ చిత్రపటము
కనులు చిల్లులు వోవఁగఁ గాంచి కాంచి
అగ్గలం బగు కోర్కుల కగ్గ మగుచు
ఉలికిపడి కన్ను మూయుదు నుస్సు రంచు.

చెప్ప సిగ్గగు – నొకసారి చిత్రపటము
గాంచి సంభ్రమ మొంది నిక్కముగ నీవె
యనుచు నేమేమొ చేసితి! నకట! నాదు
చిత్తవిభ్రాంతి యే మని చెప్పవాఁడ?

బాళి నొకసారి నీ చిత్రపటముఁ గాంచి
ఔర! యిటువంటి మోహనాకారు నాఁడు
పట్టిగాఁ గొన్ననాఁ డైనఁ బడయు భాగ్య
మబ్బెఁ గా యని యానంద మనుభవింతు.

చిత్ర మది యేమొ కాని, నీ చిత్రపటము
నాస దీఱఁగఁ గాంచినయప్పు డెల్ల
పూజ్యభావంబు నామదిఁ బొంగిపొరల
వ్రాలి మొక్కింత వంచి నమస్కరింతు.

ప్రేక్షకచకోరముల కోర్కెఁ గ్రేళ్ళువాఱ
కన్నుదోన్నెల జిగినవ్వు వెన్నెలలను
కొసరి వడ్డించుగతి, నీదు కులుకుచూపు
డంబు మీఱెడు ఛాయాపటంబునందు.

వాలుఁగన్నులఁ గూరిమి జాలువాఱ
గొనబుమాటలఁ జూపఱఁ గుస్తరించి
పలుకరించెడిరీతి నీ కులుకుచూపు
డంబు మీఱెడు ఛాయాపటంబునందు.

ఇహసుఖంబులపైఁ గడు నేవ పుట్టి
మోక్ష మరించి తపమును బూని సేయ
యోగముద్రను గొనసున్న యోగిలీల
చిత్రపటమున నీ మూర్తి చెన్ను మీఱు.

ఎట్టయెదుటను శ్రీహరి నట్టె కాంచి
పరవశంబున సకలంబు మఱచియున్న
ధ్రువుఁడో ప్రహ్లాదుఁడో యని తోఁచులీల
చిత్రపటమున నీ మూర్తి చెన్ను మీఱు.

మానవాళికి దుర్లభమైన యట్టి
దెద్దియో వింపవస్తువు నెదుటఁ గాంచి
దానిఁ జేకొన తహతహ పూనినట్లు
చిత్రపటమున నీ మూర్తి చెన్ను మీఱు.

## కా ల యా ప న ము

ప్రొద్దుపుచ్చఁగ నొకసారి పూలతోఁట
కేఁగియుంటిని - అక్కటా! ఏమి చెప్పుదు?
బూచులో యనఁ గనుపట్టె పూలచెట్లు,
గాలి సోఁకినగతి చల్లగాలి సోఁకె.

ఊబుసుపోకకు వెడలితి నొక్కనాఁడు
నాదు మిత్రులతోఁ గూడి నావపైని,
పయిరగాలికి నల్లాడు పడవపోలె
ఉల్ల మెంతయుఁ జింతచే నూగులాడె.

ఎట్టులెట్టులో కాలంబు నెట్టివుచ్చ
అనుఁగుమిత్రునిఁ గూడి వయాళి వెడల,
అనునయింపఁగ నతఁడు మాటాడినట్టి
పలుకు లన్నియు నక్కటా! ములుకు లయ్యె.

నాటకముఁ జూడ నే నొక్క నాఁటిరాత్రి
అనుఁగు నెచ్చెలికానితో నరిగియుంటి,
ఏమి చెప్పుదు నాతోడ నీవు లేమి
నాటకం బెల్లఁ గనుపట్టె బూటకముగ.

అక్కటా! ఏమి చెప్పుదు—నొక్క రేయి
నీవు తలంపునం బొఱంగ నిదుర రాక
దిగ్గురని పాన్పుపై నుండి డిగ్గనుఱికి
క్రమ్మరిల్లితి కొఱవిదయ్యమ్ము రీతి.

నిన్నుఁ గన్నట్లు, ముద్దిడుకొన్నయట్లు,
కౌఁగలించిన యట్టులు కలలు గాంచి
ఉలికిపాటున లేచి నేనొక్క రేయి,
పడిన దురవస్థ యెల్ల దైవంబె యెఱుగు.

ఏను పురవీథిఁ జనుచుండ, హితుఁడొకండు
'కొడుకు లెందఱు నీ' కని యడిగె నన్నుఁ;
పిడుగుఁ బోలిన యామాట వినినయంత
చిత్తరువురీతి నిలిచితి చేష్ట లుడిగి.

నేఁడు నడువీథిఁ జనుచుండ నిన్నుఁ బోలు
బూరిబుగ్గల బుడుతండు తారసిల్ల,
కాంక్ష దీఱ నెగాదిగఁ గాంచుచుంటి
వ్రీడచే వాఁడు నెమ్మోముం ద్రిప్పుకొనియె.

బుడుతఁ డెవ్వఁడో చావ, నాపొంతఁ జనుచు
కంటఁ దడిపెట్టితిని నీవు జ్ఞప్తి రాఁగ,
చుట్ట మని యెంచి వారు నాచుట్టుఁ జేరి
గొల్లు మని యేడ్వ, సురిగితిఁ దెల్లవోయి.

చుట్టములు నన్నుఁ బిలువంగఁ జూడ నేగి
నేఁడు చూచితి నీ యీడుజోడువాని
పాప నొక్కని— ఏమి పాపంబొ కాని
గుండె జల్లన నేలపైఁ గూలినాఁడ.

అకట! నీతోన నాయాస లంతరించె,
వాంఛ లడుగంటె, తలపులు వ్యర్థ మయ్యె
చిత్త ముడివోయె, పొల్లయ్యె జీవితంబు
ఎట్లు గడుపుదు కాలంబు నింక మీఁద ?

కేలఁ జిక్కిన రత్నంబు గోలుపోయి
గాజుపూసను గని తృప్తిఁగాంచినట్లు,
విమలగుణనిధి వగు నిన్ను వీడనాడి
కడపుచుంటిని రిత్తసౌఖ్యములఁ దవిలి.

# బిడ్డఁడు

చిన్నబిడ్డల మృతి కింత చింత యేల ?
అంచు మిత్రులు నన్నూరడించుచుందు
రెన్నివిధముల వారించుకొన్నఁ గాని
అలవి గా దయ్యె నాదుఃఖ మపనయింప.

పెద్దవారలు మరణింప తద్దినములఁ
బెట్టుచుందురు శ్రద్ధతో, పిన్నవారి
మరణమును గూర్చి చేయరు స్మరణమేని
ఇట్టి భేదంబు గలుగుట కేమి కతమొ?

వయసునం దెన్నఁ దక్కువ యయిన నేమి ?
ముద్దుముచ్చటలందును మురిపమందు
అలఁతి యగు నొక్కొ ? అధికంబ యగును గాక
పెద్దవారలకంటెను పిన్న వాఁడు.

ప్రియము గూర్తురు కూర్ప రప్రియము నెపుడు
మోదమే కాని ఖేదంబుఁ బొరయనీరు;
పెద్దవారలకంటెను పిన్నవారె
కొల్లగొందురు పితరుల యుల్లములను.

తల్లిదండ్రులు కినుకచేఁ దన్నుఁ గొట్టఁ
దన శిరంబును వారి యక్కున గదించి
జాలి పుట్టంగ నేడుచు బాలుఁజూడ
ఉల్ల మెవ్వారి కైన రంజిల్ల కున్న?

ఇంతలో నవ్వు, నేడుచు నంతలోన,
ఇంతలో వేఁడు, బెదరించు నంతలోన,
ఇంతలో నల్గు, మనసిచ్చు నంతలోన;
చిత్రములు గావె పసిపాపచేష్ట లౌర.

వింతవస్తువో తాయమో చెంత నిడిన
యంత కనకాభిషేకంబు నందినట్లు
పొంగి గంతులు వైచుచు నింగి ముట్టు;
అల్పసంతోషి కాఁడటె యర్భకుండు!

పువ్వుఁదేనియ తావియుఁ బుప్పొడియును
చిందకున్నను జెడకున్నఁ జెదరకున్న
ముద్దుబిడ్డల నవ్వుతోఁ బోల్పవచ్చు
క్రొత్తగా విచ్చు పున్నాగ గుచ్ఛకంబు.

కన్నె వెన్నెలకన్నను, వెన్నకన్న,
మంచుబిందులకన్న, క్రొమ్మించుకన్న,
కుసుమ మకరందమునకన్న కోమలంబు
చిఱుతపాపల చిన్నారి చిన్నినగవు.

నల్లనివియెల్ల నీళ్ళను తెల్ల వెల్ల
పాలు నంచును సూటిగాఁ బలుకుచుండు,
కల్ల కపటంబు నెఱుఁగఁడు పిల్లవాఁడు ;
బిడ్డఁ డన దేవుఁ డన వేఱె భేద మున్నె ?

ఆడు, నేడుచు, పలవించు, పాడు, సోలు,
తేఱిపాఱఁగఁ దిలకించు, కేరి నవ్వు,
గొణుఁగుఁ దనలోన, వేదురు గొన్న భంగి
నుండు; పసిపాప కేవల యోగి కాఁడె?

రీవి బొటవ్రేలె పిల్లనగ్రోవి గాఁగ
మోవిఁ గీలించి యెల్లరు మోహజలధి
నోలలాడఁగ గానంబు నాలపించు
ముద్దుబిడ్డఁడు గోపాలమూర్తి కాఁడె ?

తనదు నవ్యక్త మధురగీతంబు లనుచు
కాలు సేతుల యల్లార్చు తాళములుగ
వెలికిల పరుండి క్రీడించు బిడ్డఁ డెన్న
లోకకల్యాణమునకు మారాకు గాఁడె ?

వెండిపళ్ళెరమందున వెలుఁగుచున్న
కప్పురపుదీపమో యన నొప్పు మీఱు,
జిలుఁగు వెల్లనిదుప్పటి సెజ్జమీఁద
తీవిఁ గూర్చుండి క్రీడించు డింభకుండు.

## పండుగలు

ఈవు నాచెంత నుంటివ యేని, నాకు
పండుగులమీఁద పండుగుల్ వచ్చినట్లు,
ఈవు నను బాసి పోయితివేని, నాకు
ప్రళయములమీఁదఁ బ్రళయంబు పడినయట్లు.

నిరుడు కృష్ణాష్టమికి నీవు నిండు వేడ్క-
నుట్టి కొట్టఁగ నెగురుచు నుర్విఁ బడితి;
వకట! యుట్టికె యెగుర లేనట్టివాఁడ
వెట్లు స్వర్గంబునకు నిప్పు డేగి తయ్య ?

అన్ని పండుగులను వినాయక చతుర్థి
మఱతు నన్నను నా కెప్డు మఱపు రాదు;
నాఁడు మాపాలిటి గణపతి నాఁగ నీవు
కావవత్తువు కన్నుల కఱవుదీఱ.

వేడుకలు మీఱ నిదె వచ్చె విజయదశమి;
చిన్ని గిలకలబద్దను చేతఁ బూని
'ఏమిరా కృష్ణ యాగడం బేల' యనుచు
పదము పాడుచు నాచెంత; గదియ వేమి ?

ప్రొద్దుసనె లేచి నేఁ డట్లతద్ది యనుచు
కోడిబాలురు వీథుల నాడుచుండ,
నిన్ను లేపఁ దటాలున నిదుర లేచి
దద్దఱిల్లితి నా ప్రమాదంబు నరసి.

వచ్చె దీపాల పండుగ వైభవమున
దీపకాంతులఁ బురమెల్లఁ దేజరిల్లె!
నేఁడు నాగృహదీపంబు నీవు లేమి
శూన్యమై తోఁచె నాయిల్లు శోభ దక్కి.

'పుట్టలోఁ బోయుదువ పాలు, పొట్టలోన?'
అనుచు నే నన, 'నీ పొట్టయందె' యంచు
పలికితివి కాదె నిరుడు నాగులచవితికి;
నేఁడు నా పొట్టఁ జిచ్చిడినాఁడ వేమి?

మొన్న ముక్కోటి శ్రీరంగమునకు నేగి
దాఁటినాఁడవు వైకుంఠద్వార మీవు;
ఇపుడు ముక్కోటి వచ్చెనో యింక లేదొ,
ప్రాఁతకాఁపైతి వైకుంఠపట్టణమున.

నిండు వేడుక సంక్రాంతిపండు గంచు
ఎల్లజనములు బంధుల యిండ్ల కేఁగి
హర్షవారాశిలో నోలలాడు చుండ,
అకట; పడియుంటి నింట దివాంధమట్లు.

ఉత్సవంబులలోన సంవత్సరాది
సకలజనులకు సంతోషజనక మయ్యు,
అధిక సంతాపకారణ మయ్యె నాకు
స్మృతికిఁ దెచ్చుటఁజేసి నీ మృతిని గూర్చి.

## విపర్యయము

సకలజనులును దమ దినచర్య లెల్ల
సరసి శోధించెదరు వత్సరాదినాఁడు,
నాదు దినచర్య పరిశోధనంబు సేయ
అన్నిపుటలను శోకంబె యాక్రమించె.

అకట! యెంతటి తారతమ్యంబు గలదొ
నాదు బ్రదుకున నొక్క యేఁడాదిలోన?
నాఁడు నావంటి ధన్యమానసుఁడు లేఁడు
నేఁడు నావంటి దీన-మానిసియె లేఁడు.

నిరుడు నా మానసంబున నిశ్చలతయు
నిర్విచారత నిశ్చింత నిండియుండ,
నేఁడు నిర్వేదము నిరాశ నిస్పృహతయు
రాజ్య మేలుచు నుండె నిరంకుశముగ.

తావకవియోగ శస్త్రఘాతంబుచేత
గంటువడియున్న నా గుండెగాయ మింక
కుదురువోవక లోలోన కుళ్ళి కుళ్ళి
అలముచున్నది నానాఁట సెలఁటు వాఁచి.

నీవు మరణించి పదిరెండునెలలు గడచె;
కాలము గతించుకొలంది శోకంబు గూడ
అంతకంతకు నగ్గల మయ్యెఁ గాని,
ఇంచుకంతయు శాంతి వహింప దయ్యె.

ఇంత కాలమునుండియు నీవు నాకు
నందనుండవయి కూర్చు నానందమునకు
పెక్కుమడుగుల నెక్కుడై పిక్కటిల్లె
నీదు మరణంబుచేఁ గల్గు ఖేదభరము.

శోకమా! నిన్ను నాకూర్మిసుతుఁడు చనుచు
దనకు మాఱుగఁ బెంచికొమ్మనుచు నాకు
అప్పగించెను గావున నందికొంటి
ప్రేమమీఱఁగ నినుఁ బెంచి పెద్ద సేయ.

'సుఖము లబ్బినయప్పుడు శోక మడఁగు'
నంచు నందురు; సౌఖ్యంబు లబ్బినపుడె
ఎక్కుడయ్యెను సంతాప, మీవు లేని
లోప మధికతరం బయి తోప నాకు.

గాఢ మగు నీదు ప్రేమశృంఖలముచేత
మున్ను లొంగని మదగజంబు నగు నన్ను
శిక్ష యొనరించి లొంగఁదీసితివి యిట్టి
చటుల తీవ్ర వియోగాంకుశమున నేఁడు.

నాదు సంసారవనమునఁ బ్రోది గాంచు
బాల సహకారవృక్షంబు నేలఁ గూలె;
విమల మగు నాదు మానసకమలమందు
నిచ్చఁ గ్రీడించు రాయంచ యెగిరిపోయె.

నా తలంపుల మొలక, నాచేతి చిలుక,
కొంగుబంగర, మఱచేతి బొంగరంబు,
దొడ్డిలోపలి వేలుపుగిడ్డి, నాదు
పున్నెములమూట అక్కటా! నన్ను వీడె.

ఎవఁడు నాసౌఖ్యముల కెల్ల నవధి యంచు
నమ్మియుంటినో యాతండు నన్ను వీడె;
ప్రణయమా! నీవు నన్నింకఁ బాసి పొమ్ము;
మరణమా! నీవె నాపాలి శరణ మగుము.

## కృతిప్రశంస

నీయెడల నాకుఁ గలిగిన నిండు ప్రేమ
వెల్లడింపఁగఁ బదములు వెలితివడును,
కుంటువడు ధార పద్యముల్ కూర్చు నెడల
ఎట్లు వర్ణింతునో నాకె యెఱుక లేదు.

గాఢ శోకానలంబునఁ గ్రాఁగి క్రాఁగి
హృదయ మను కుప్పెలోపల నివిరియున్న
భావరసమును గన్నీటఁ బదనుగొలిపి
వ్రాయుచుంటిని నీపేర పద్దియములు.

అక్కరము కొక్క కన్నీటిచుక్క గాఱ
వ్రాయుచుంటిని నీ పేర పద్దియములు;
ఎంత వ్రాసిన పద్దెంబు లంత మొంద,
విపురఁ బాఱదు కన్నీటియేటిజాలు.

నీ వియోగవ్యథాంబుధి నిస్తరింపఁ
కడఁగి, కబ్బంబు తెప్పగాఁ గైకొనంగ,
పైకి తేలించుటకు మాఱు లోని కీడ్చి
ముప్పతిప్పలఁ బెట్టి నన్ ముంచుచుండె.

హస్తమునఁ దాల్చి నీస్మృతిపుస్తకంబు
సారెసారెకు నాసక్తిఁ జదువుచుందు ;
ఎన్నిసారులు చదివినయేని గాని
మరల నొకసారి చదువంగ మనసు పుట్టు.

ఇలను బుట్టిన దాదిగా నింతదనుక
లేశ మేనియుఁ బ్రఖ్యాతి లేని నాకు
కలిగె 'పాపాయితండ్రి' యన్ గౌరవంబు
పద్దియంబులు నీ పేర వ్రాయుకతన.

ఎన్నఁడును నన్నుఁ గనివిని యెఱుఁగనట్టి
వారు సైతము జాబులు వ్రాసి రిట్లు
పుస్తకంబును నిన్నును బ్రస్తుతించి;
అహాహా! ఎంతటి ధన్యుండ వయ్య నీవు?

"సుతులు చావరె? వారల స్మృతుల పేర
కరుణరస ముట్టిపడునట్లు కావ్యములను
వ్రాయరే నేడు సత్కవుల్? వాని నెల్ల
నీదు కృతితోడ సరిపోల్ప రాదు కాక!"

"రాణ నొప్పారు నాంధ్రసారస్వతాబ్ధి
కావ్యమణు లెన్నియో నేటికాలమందు;
వాని నెల్లను సరిపోల్చవచ్చు నొక్క-
తావకానూన కావ్యరత్నంబు తోడ?"

మేలు మే లని 'శారద' చాల మెచ్చె
ఔర యని 'ఆంధ్రపత్రిక' యభినుతించె,
బళిబళీ యని 'భారతి' తలను దాల్చె;
అహాహా! ఎంతటి ధన్యుండ వయ్య నీవు?

మృతుని బ్రతికించు సతతంబుఁ గతి యటంచు
పలుకుదురు గాన నీ కృతి వ్రాసినాఁడ ;
ధరణి నీ కృతి వెలయునందాఁక నీవు
బ్రతికియున్నట్లె భావింతు భావమందు.

'తండ్రిబిడ్డల యనోన్య తత్పరత్వ
మవని నెందాఁక నుండునో' అంతదాఁక
వెలయుఁ గావుత 'పాపాయి' విమలకీర్తి
విబుధమానస రాజీవవీథులందు.

# గాంధీమహాత్ముని

## (దశావతారము)

# గాంధీ మహాత్ముని

## ద శా వ తా ర లీ ల లు

---

గ్రంథాలయ సూక్తులు




రచయిత : 'మధురకవి'

నాళము కృష్ణరావు





1948 సం.  రు. 4-0-0

గాంధీమహాత్ముని దశావతారలీలలు :
గ్రంథాలయ సూక్తులు

---

ద్వితీయ ముద్రణము



సంవత్సరము
1982

మూల్యము
రు. 4-00

ముద్రణ :
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమండ్రి-1

అంకితము :

మహాత్ముని అడుగుజాడల
శాంతి సమరమున ముక్తి
ఆత్మార్పణము గావించిన
సోదర సోదరీమణులకు

# మున్నుడి



ఈ గ్రంథమును నేను పెక్కు సంవత్సరముల క్రితము, (మహాత్ముఁడు ఎరవాడ జైలులో బంధింపఁబడిన యనంతరము) విరచించియుండియు, కారణాంతరములచే నింతదనుక ప్రచురింపఁ జాల నైతిని. దీనిని నేను రచించిన పిమ్మట నింతకాలము వరకు, మహాత్ముని జీవితమున జరిగిన అనేక సన్నివేశముల నిందు జేర్పవలసియుండియు, అట్లు చేయుటచే కొంత కాలహరణ మగు నను భీతిచేతను, ఈ విషాద సమయమున పాఠక లోకమునకీ గ్రంథము సత్వరమునఁ బ్రదర్శింప వలయు నన్న తహతహ చేతను, వాని నెల్ల విడువవలసినవాఁడ నైతిని. వాని నన్నిటిని ద్వితీయ ముద్రణమున జేర్చుటయె కాక, మహాత్ముని నిర్యాణ ఘట్టము గూడ సంతరింపఁగలవాఁడ నని విన్నవించు కొనుచు న్నాఁడ.

ఈ గ్రంథ విక్రయమున లభించు ధనమును మహాత్ముని గూర్చిన గ్రంథముద్రణ కార్యములకు వినియోగించి, నా జన్మ మును ధన్య మొనరింప సంకల్పించినాఁడను.

౨౩-౨-౧౯౪౮
రాజమందిరము

ఇట్లు విన్నవించు
కృతికర్త

# గాంధీమహాత్ముని

# దశావతారలీలలు

---

"ఇంతై, యింతకు నింతయై, మరియుఁ దా నింతై, నభోవీధిపై
నంతై, తోయదమండలాగ్రమున నల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై (గాంధిమహోద్యమం) బదరె బ్రహ్మాండాంతసంవర్ధియై"

సత్యాగ్రహోద్యమము మహావటవృక్షము వంటిది. ఈ వృక్షమునకు గాంధిమహాత్ముడు తూకటివేరు. ఈమహీరుహము వేళ్ళు రసాతలమునఁ బాదుకొని, దాని శాఖలు భూమండలమున దిశదిశల వ్యాపించి, ఆకాశపథము నధిగమించి, చంద్రబింబము నాక్రమించి, సూర్యమండలము నతిక్రమించి, ధ్రువలోకము నవఘళించి, బ్రహ్మాండభాండము నెల్ల నిండి నిబిడీకృతమై యున్నవి.

ఈ మహాభూరుహరాజమును సమూలముగఁ బెకలించుటకు బ్రిటీషు రాజనీతిజ్ఞులు తలపడిరి. తొలుత దీని కొమ్మలు రెమ్మలు దళములు ద్రుంచినచో, ఈ వృక్షరాజము నిలువున నీరసించి నశించు నని భ్రమపడిరి. అట్లు గావించినచో, నిది

నశించుటకు బదులు మరల మరల ననలు గొనలు సాగి రేకెత్తి శాఖోపశాఖలై విజృంభించునని కొందఱు భావించిరి. అట్లు గాదు, మూలమట్టముగా దీనిని పెల్లగించినచో, నొక్క సారిగ అంతరించు నని మఱికొంద రూహించిరి.

గాంధిమహాత్ముఁడు లోకోత్తరపురుషుఁ డనియు అవతార మూర్తి యనియు భారతీయులే గాక ఖండఖండాంతరులును సంభా వించుటచే నాతని బంధించినచోఁ బ్రపంచమందలి సమస్తజాతుల ఖండనలకుఁ బాల్పడుటయకాక మహోపద్రవము లుప్పతిల్లు ననియు, సత్త్యమూర్తియు శాంతిదూతయు నగు మహాత్ముని బంధించినచో, ప్రభుత్వదౌష్ట్యము దుస్సహ మగుటచే, మహాత్ముని తత్త్వ మెఱుంగని ప్రజాసామాన్యము దౌర్జన్యమునకుఁ జొచ్చు ననియు, అందువలన మహావిప్లవస్థితి యేర్పడి తమ ప్రభుత్వ మునకే భంగము గలుగు ననియు, అట్టియెడ నా మహోద్వేగము నంకెకుఁ దెచ్చుట దుస్తరమనియు, ఇట్లు తర్కవితర్కములలోఁ బడి వితాకు జెంది వారు కర్తవ్యముతోఁపక కొంతకాలము తటప టించిరి.

ఈ సందర్భమున, తొల్లి కంసుఁడు శ్రీకృష్ణుని సంహ రించుటకే మార్గమును దోఁపక తన మిత్రులతో నాలోచింపఁగా, వారు చెప్పిన ఈ క్రింది సమాధానము ప్రకృత విషయమున కను వర్తించుచున్నది.

"అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం; డా చక్రియే ధర్మమం
దమరున్; గోవులు, భూమిదేవులు, తితిక్షామ్నాయకారుణ్యస
త్యములున్, యాగతపోదమంబులును, శ్రద్ధాంశాంతులున్ విష్ణుదే
హము; లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్.

"చంపుదుమే నిలింపులను జంకెల బొంకెల ? తాపసావళిం
బంపుదుమే కృతాంతుని పాలికి ? శ్రేపులతోడ గోవులం
ద్రుంపుదుమే ? ధరామరులఁద్రోయుదుమే ? నిగమంబులన్ విదా
రింపుదుమే ? వసుంధర హరింపుదుమే ? జననాథ, చంపుమా"

[శ్రీకృష్ణుని సంహరింపవలయు ననిన, అతని యవయవములగు గోవులు విప్రులు వేదములు సత్యశాంత శమదమాది సర్వసద్గుణములను రూపుమాపినచో, అతఁడు తనంతట తానే యంతరించును - అని దీనిభావము]

అని వచించి కంసుని పంపున -

"వెదకి వెదకి దైత్యవీరులు సాధుల
నడఁప, వారిబలము లడఁగిపోయె;
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు
నార్యహింస సేయ నడఁగుఁగాదె !"

— భాగవతము

ఇట్లు ఆలోచించి, బ్రిటిషు రాజనీతిజ్ఞులు మహాత్ముని యనుచరులగు ప్రముఖులను శాంతిసైనికులను బట్టి బంధించినచో, అతఁడు నిస్సహాయుఁడై తన యుద్యమము నుజ్జగించునని నిశ్చయించిరి; ఉద్యమ మందలి నాయకుల బలువిధముల బాధించిరి;

వేధించిరి; ఒకరితరువాత నొకరిని బంధింపఁ బ్రారంభించిరి. కాని వారి యూహలకు భిన్నముగా జరిగినది. ఉద్యమ మడుగంటుటకు మాఱుగా, పరస్సహస్రశాఖములతో వికసించి వీరతాండవ మారంభించినది. ఒక్కొక్క యోధుని జెఱఁబెట్టినప్పుడెల్ల వాని స్థానమున వందలకొలఁది యోధులు నవనవోత్సాహముతో రణాంగణమున నుఱికిరి.

ఒక్కొక సైనికుని చెఱఁబెట్టినపుడెల్ల అతని స్థానమున వేలకొలఁది సైనికులు ఆవిర్భవించి గుండుదెబ్బలకు దమగుండెల నొడ్డి మాతృదేశమునకు ఆత్మార్పణము గావింపఁజొచ్చిరి.

ఎట్టకేలకు బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులు చేయునది లేక, ౪-౫-౧౯౩౦ తేదీని నడిరేయి గం॥ ౧౨-౪౫ నిమిషముల వేళ దొంగతనముగా ఆశ్రమమును ముట్టడించి గాఢనిద్రయందుండిన మహాత్ముని బంధీకృతుం గావించిరి.

## అవతారక్రమ రహస్యము

వేదా నుద్ధరతే, గిరిం నివహతే, భూభాగ ముద్బిభ్రతే,
దైత్యం దారయతే, బలిం ఛలయతే, క్షత్రక్షయం కుర్వతే,
వార్ధిం లఙ్ఘయతే, హలం కలయతే, వైరాగ్య మాతన్వతే,
మ్లేచ్ఛా నుచ్ఛలతే, ఋభాయతనుతే దేవాయ తుభ్యం నమః.

ప్రకృతిపరిణతిని దెలుపుటయే అవతారక్రమము యొక్క- నిరూపణోద్దేశము. స్థావరజంగమాది ప్రకృతియంతయు నీశ్వరమయ మని యుపదేశించుటయు తత్పరమప్రయోజనము. భూతకోటియొక్క- బాహ్యాభ్యంతర జీవనక్రమము సంగ్రహముగా పది ఘట్టములుగ విభజింపఁబడెను. ఆ ఘట్టములే అవతారములు.

ఆదిని శ్రీమహావిష్ణువు వటపత్రశాయి. పిదప మత్స్యాకృతితో ప్రారంభమై కల్కిమూర్తితో అవతారక్రమము సమాప్తమయ్యెను.

ఈ యవతారక్రమము మానవజీవనమున కెంత సన్నిహితమో యెఱుంగునది.

౧—దశ. తల్లిగర్భమున బిందుపతన మైనది మొదలొక నెల వటపత్రశయనము. నెల దాటినది మొదలు మత్స్యము- (తలయు కాలు సేతులు ఏర్పడవు) రెండవనెల పిదప కూర్మము- (అవయవముల మొలక లగపడును). మూఁడవనెలపిదప వరాహము- (కాలు సేతులు తల స్పష్టపడి మృగమువలె నుండును). నాలవనెలపిదప నారసింహము. (నరమృగాకృతి). ఐదవనెలపిదప వామనము- (మానవాకృతికి ఆదిమదశ). ఆఱవనెలపిదప పరశురామము- (శిశుసంచలనము). ఏటవనెలపిదప శ్రీరామము - (మానవత్వము సమగ్రమము). ఎనిమిదవనెలపిదప శ్రీకృష్ణము-

(స్థితప్రజ్ఞ). తొమ్మిదవనెలపిదప బౌద్ధము- (విజ్ఞానము). అంత ఆవిర్భావము.

౨వ దశ. ఆవిర్భవించిన పిమ్మట పుట్టుట వటపత్రశయనము. బోర్లపడుట మత్స్యము. ప్రాకుట కూర్మము. మోకాళ్ళ దోఁగుట వరాహము. నిలఁబడుట నారసింహము. హఠము పరశురామము, సంసారనిర్వహణము శ్రీరామము, ప్రపంచజ్ఞానము శ్రీకృష్ణము, వైరాగ్యము బౌద్ధము.

సృష్టిపరిణామము

మత్స్యము - ఆదిని సృష్టి జలమయము-జీవులు జలచరములు.

కూర్మము - కొంత భూభాగ మేర్పడినది - జీవులు జలము ననేగాక భూమిని గూడ జరించును.

వరాహము - మృగము - భూచర మయ్యు జలమునఁ గూడ బొరలాడును.

నారసింహము - నరమృగాకృతి.

వామనము - పరిణతిఁ జెందని మానవాకృతి.

పరశురామము - పెంకెపట్టుదల,

శ్రీరామము - పరిపూర్ణ మానవత్వము.

శ్రీకృష్ణము - విజ్ఞానము.

బొద్ధము -     వైరాగ్యము.

కల్కి -     ధర్మసంస్థాపనము.

"పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అను భగవద్గీతావచన ప్రకారము దుష్టులు చెలరేఁగి ధర్మ మడుగంటినప్పుడు, సాధువుల రక్షించుటకును ధర్మమును సంస్థాపించుటకును యుగయుగ మందును భగవంతుఁ డవతరించు చుండును.

ఆ ప్రకారము దుష్టశిక్షణము శిష్టరక్షణము గావించుటకు భగవంతుఁడు ఇంతదనుక తొమ్మిది యవతారముల నెత్తియున్న వాఁడు. ప్రకృతము ఈ కలియుగమున గాంధిరూపమున కల్కిమూర్తియై యుద్భవించె ననియు, ఈ యవతారమునఁ గడచిన యవతారలీల లన్నియు మూర్తీభవించిన వనియు, ఈ గ్రంథము సాంకల్యముగఁ జదివినఁ దెలియనగును.

గాంధి యవతార లీలలు

| | |
|---|---|
| జీర్ణమతోద్ధరణము- | మత్స్య |
| దీనసంరక్షణము- | కూర్మ |
| పతితలోక సముద్ధరణము- | వరాహ |
| అహంకార విధ్వంసనము- | నారసింహ |
| విశ్వవిక్రమణము- | వామన |

| | |
|---|---|
| నిరంకుశతా నిర్మూలనము- | పరశురామ |
| ధర్మరాజ్య ప్రతిష్ఠాపనము- | శ్రీరామ |
| కర్మయోగము- } | శ్రీకృష్ణ |
| స్వరాజ్య ప్రదానము- } | |
| జీవకారుణ్యము- | బౌద్ధ |
| సత్యయుగ సంస్థాపనము- | కల్కి |

౧ మత్స్యావతారము.

జీర్ణమతోద్ధరణము.

తొల్లి - సోమకుం డను దైత్యుఁడు వేదముల ప్రముచ్చిలించి సముద్రగర్భమున డాఁగియుండెను. విష్ణువు మత్స్యరూపమున నవతరించి వానిని సంహరించి వేదముల నుద్ధరించెను.

నేఁడు - భరతఖండము పరరాజ్యపాలనము వాతఁబడి వైదికధర్మములు వక్రమార్గములఁ బట్టెను; సమస్తవిద్యలు కళలు నమసెను; సదాచారములు సంకరము లయ్యెను; నాస్తికత విస్తరించెను; పరాధీనత ప్రబలెను. గాంధిదేవుఁ డవతరించి వైదిక ధర్మముల పునరుజ్జీవింపఁజేసి లోకమున శాంతి నెలకొలిపెను.

౨ కూర్మావతారము.

దీనసంరక్షణము.

తొల్లి - దేవతలు మందరనగ మను కవ్వమునకు వాసుకిని తఱిత్రాడుగఁ జేసి పాలకడలిని తఱువ, అందు అమృతము

థించెను. విష్ణువు కూర్మమై పర్వతమును ధరించి మోహనా
కృతితో ముప్పదిమూఁడుకోట్ల దేవతలం కా యమృతముం బంచి
శాశ్వతసౌఖ్యము ప్రసాదించెను.

నేఁడు - మోహనదాసు (గాంధి) సత్యాగ్రహ మను శైల
మునకు అహింస యను కటిఁదాటిని జుట్టి సముద్రము మధించి
లవణ మను అమృతము సాధించెను; ముప్పదిమూఁడు కోట్ల
భారతీయులకు దానిం బంచి, వారి దారిద్ర్యముం బాఁదోలి నిత్య
సంపద ఘటించెను.

(ఉప్పును అమృతముతోఁ బోల్చుట చాలమందికి వింతగఁ దోచవచ్చును.
దాని ప్రాశస్త్యమును ప్రాముఖ్యమును స్థలాంతరమున అనుబంధము నందలి యంశ
ములు పరికించినయెడఁ దెలియఁగలవు.)

౩ వరాహావతారము.

పతితలోక సముద్ధరణము.

తొల్లి - హిరణ్యాక్షుఁడు భూమిని చాపచుట్టగఁ జుట్టి చంక
నిడుకొని పాతాళమున దాగియుండెను. శ్రీహరి వరాహరూపమున
నవతరించి ఆ దానవుని సంహరించి క్రుంగిన భూమిని తనకొమ్మున
నుద్ధరించెను.

నేఁడు - బ్రిటిషుప్రభుత్వము భారతభూమిని సర్వము నప
హరించి యధోగతి పాలొనర్చెను. గాంధిమహాత్ముఁడు అసహాయ
యోగ మను కొమ్మున భూమిని లేవనెత్తి రక్షింప సమకట్టెను.

## ४ నారసింహావతారము.

### అహంకార విధ్వంసనము.

తొల్లి - హిరణ్యకశిపుడు అను దానవరాజు అహంకారాతిశయము పెంపున లోకముల నెల్ల నిర్జించెను. సాధుజనుల బాధించెను. సమస్తజగత్తులందనకంటె బలాధికుఁడు లేఁడని సర్వ లోకములు తన్నే నియంతగాఁ గొలుచుచుండవలయునని శాసించి చెలరేఁగుచుండెను. అతనికొడుకు సకల కల్యాణగుణసంపన్నుడు, సాధుశీలుఁడునై శ్రీహరి నారాధించుచుండెను. హిరణ్యకశిపుఁడది సహింపక తనశాసనము నుల్లంఘించెనని కోపోద్దీపితుఁడై భటులచే ప్రహ్లాదకుమారుని నానాహింసలఁబెట్టించెను.

> "తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటిమాటి కో
> పన్నగశాయి. యో దనుజభంజన. యో జగదీశ, యో మహా
> పన్నశరణ్య, యో నిఖిలపావన, అంచు నుతించుఁగాని, తాఁ
> గన్నుల నీరు దేఁడు, భయకంపసమేతుఁడు గాఁడు భూవరా.
> "పాఱఁడు లేచి దిక్కులకు; బాహువు లొడ్డఁడు; బంధురాళిలో
> దూఱఁడు; ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని; మిత్త్రివర్గముం
> జీరఁడు ; మాతృసంఘమువసించు నువర్ణగృహంబులోనికిం
> దాఱఁడు; కావరే యనడు; తాపము నొందఁడు; కింటగింపఁడున్."
>
> — భాగవతము

ఇట్లు సాత్త్వికవృత్తితోఁబరమశాంతుఁడై యున్న ప్రహ్లాదుని ఆత్మనిగ్రహమునకు నిశ్చలభక్తినిష్ఠకు మెచ్చి, శ్రీహరి నారసింహాకృతి నావిర్భవించి, నిజనిశాతనఖముఖముల హిరణ్య

కశిపునిఁ ఖండించి చెండాడెను; ఏకభక్తపరతంత్రునిఁ ప్రహ్లాదునిఁ గాచి లోకములకు శాంతిఁ జేకూర్చెను.

నేఁడు - బ్రిటిషుప్రభుత్వమువారు పశుబలముచేఁ బ్రపంచము నెల్ల నాక్రమించుకొని, జగమునఁ దమ కెవ్వరు నెదురు లేరని, రవి యస్తమింపని విశాలరాజ్యము తమ యధీనమున నున్నదని మురిసి దురహంకారాతిరేకమున మదోన్మత్తులై ఎల్లజాతులను హింసించుచు బ్రతుకుపడుచుండిరి. తొలుత గాంధిమహాత్ముఁడా ప్రభుత్వమున శాన్తుఁడై సాంత్వనవచనముల బుజ్జగించియు మందలించియు హితవులు గఱపెను. అతని యుపదేశములు నరకుగొనక ఆ ప్రభుత్వమువారు వానిఁ బలువిధముల గాసి పఱిచి ఎప్పటియట్ల ప్రజాపీడనము గావించుచుండిరి. అందులకు గాంధిమహాత్ముఁడణుమాత్రము చలింపక సహజసాత్త్వికవృత్తితో హింసల కన్నిఁటికి సహించెను; వారు తమ కుటిలమార్గము విడనాడకుండుటచే, నాతఁడు తుదకు నరసింహుఁడై శాంతిరణరంగమున నుఱికి, సత్యాగ్రహాస్త్ర ప్ర యో గ ము న ప్రత్యర్థిలోకమును విభ్రాంతము గావించి తద్దహంకారమును లోనడఁచి, సకల లోకములందు పురుష సింహుఁడని ఖ్యాతిఁగాంచెను.

[ఇందు గాంధిమహాత్ముఁడు ప్రహ్లాదుఁడును నరసింహుఁడు నని యెఱుఁగునది]

### ౫ వామనావతారము.

#### విశ్వవిక్రమణము.

తొల్లి - బలిచక్రవర్తి బాహుబలమున లోకముల నెల్ల జయించి యేలుచుండెను. శ్రీహరి వామనుఁడై యవతరించి,

పదత్రయముచే సమస్తజగముల నాక్రమించి ఆతని రసాతలమున కడఁగఁద్రొక్కెను.

నేఁడు బ్రిటిషుప్రభుత్వము మాయాబలముచే ధరామండలము నెల్ల నాక్రమించెను. గాంధిదేవుఁడు వామనుఁడై - లవణశాసననిర్మూలనము మద్యపాననిషేధము, విదేశవస్త్ర బహిష్కారణము అను పదత్రయమున విక్రమించి, బ్రిటిషుబలము నధోగతిపాలుచేసి, దేశసౌభాగ్యము గూర్ప నుద్యమించెను.

### ౬ పరశురామావతారము.

#### నిరంకుశతా నిర్మూలనము.

తొల్లి- కార్తవీర్యాది క్షత్రియవీరులు నిరంకుశులై లోకకంటకముగ ధరాతలమును బాలించుచుండిరి. శ్రీహరి పరశురాముఁడై యవతరించి వారి నెల్లఁ బరిమార్చి, భూమండలము నంతను కశ్యపాది మహర్షులకు దానమిచ్చి తాను తపోవనమున కరిగెను.

నేఁడు- బ్రిటిషువారు విశృంఖలులై నిరంకుశవిధానముచే అన్యదేశముల నాక్రమించి ప్రజాసంక్షోభ మొనర్చుచుండిరి. గాంధిదేవుఁడు సత్యాగ్రహ మను పరశువు ధరించి, వైరివీరుల నిరంకుశతను నిర్మూలనము జేసి, దేశమును ప్రజాయత్తప్రభుత్వమున కర్పించి, జీవితశేషమును నిర్వికల్పసమాధి యందుఁ గడపసంకల్పించెను.

# ౭ శ్రీరామావతారము.

## ధర్మరాజ్య ప్రతిష్ఠాపనము.

తొల్లి - రావణుఁడను రాక్షసరాజు మాయచే సీత (భూమిజ) నపహరించి సింగలదేశమున (లంకలో) బంధించెను. శ్రీరాముఁడు వానరసమేతుఁడై వెడలి రావణ మేఘనాథాది నిశాచరులఁ బొరింగొని, భూమిజను చెరనుండి విడిపించి, ధర్మరాజ్యమును సంస్థాపించెను.

నేఁడు - * ఇరావణుఁడు (ఇర్విను) భారతరాజ్యలక్ష్మిని కొల్లఁగొని ఇంగలదేశమున బంధించెను. గాంధిమహాత్ముఁడు శాంతిసైన్యమును వెంటఁగొని ఇరావణ మేగ్డనాల్డాది మ్లేచ్ఛ ప్రభువుల గర్వభంగము గావించి, భారతభూమిని నిర్బంధము నుండి విడిపించి, ధర్మరాజ్య ప్రతిష్ఠాపనము గావింపఁబ్రతిన వట్టెను.

---

* తమిళమున రామ రావణాది పదములకు ముందు 'ఇ' ప్రత్యయము వచ్చును. ఇరామన్ ఇరావన్, ఇత్యాదులు ఉదాహరణములు.

| | |
|---|---|
| ఇరావణుఁడు [ఇరివిన్] బ్రిటిషు రాజప్రతినిధి | రావణుఁడు (దానవరాజు) |
| మేగ్డనాల్డు [బ్రిటిషు ప్రధానమంత్రి] | మేఘనాథుఁడు (రావణుని యాత్మజుఁడు) |
| గాంధిమహాత్ముఁడు | శ్రీరాముడు |
| భారతరాజ్యలక్ష్మి | సీత (భూమిజ) |
| ఇంగలదేశము [భారత లక్ష్మిని కొల్లగొనుచున్న లంకాషైర్ గల దేశము] | సింగలదేశము (లేక) లంక. |
| శాంతిసైన్యము | వానరసైన్యము |

## ౮. శ్రీకృష్ణావతారము.

### కర్మయోగము.

తొల్లి - యాదవులు ఇంద్రుని యనుగ్రహము గోరి ఇంద్ర యాగము సేయ సమకట్టిరి. అంత * శ్రీకృష్ణుడు ♦ సంకర్షణునిం గూడి వారికిట్లనియె :

"ఇంద్రుఁడు నాకలోకాధిపతి. భూలోకవాసుల మగు మనకు అతనితో నే ప్రయోజనమును లేదు. పశుపాలనా కృషి వాణి జ్యాదుల జీవించు మనము గోవులను గిరులను తరుసస్యములను పూజింపనగుఁగాని, ఇంద్రుని సంభావింపఁదగదు -

అపకారంబులు సేయ వెవ్వరికి, నేకాంతంబులందుండు, నా
తప శీతానిల వర్షవారణములై త్వగ్గంధ నిర్యాస భ
స్మ పలాశాగ్ర మరంద మూల కుసుమ చ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు వృక్షులకు, నీ యుర్వీజముల్ గంటిరే.

— భాగవతము

"కేవలము పర్వతములకు
గోవులకు బ్రియంబు గాఁగ గోరి మఖంబుల్
గావింత, మెన్నివిధముల
భావించిన నింద్రుతోడి పని మన కేలా ?

---

* కృష్ణ, సంకర్షణ, పదములు కృషి కర్షణ శబ్దముల నుత్పన్నములు. కృషి కధిష్ఠానదేవతయగుటచే కృష్ణుఁడు కర్మయోగి.

♦ సంకర్షణుఁడు అనఁగా బలరాముఁడు. ఈతని హలధరుఁడనియు నందురు. హల మనఁగా నాగలి కావున ఈతఁడు వ్యవసాయమున కధిష్ఠానదేవత.

"కర్మమునఁ బుట్టు జంతువు,
కర్మమున సమృద్ధిఁ బొందు, కర్మమునఁ జెడున్;
కర్మమె నరులకు దేవత,
కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!

- విష్ణుపురాణము

అట్లగుటం జేసి, కర్మపరుల మగు మనకు కర్మ యోగమే రమధర్మము. కాన ప్రకృతిప్రీత్యర్థము గోగిరుల నుపాసింతము.

ఇట్లు వచించి, యాదవులచే ఇంద్రోత్సవము మాన్పించి గోవర్ధనోత్సవమునకు వారిం బ్రోత్సహించెను. ఇందున కింద్రుండు కినిసి గోవులమీఁదను గోపాలురమీఁదను రాళ్ళ వాన గురిపించెను. ఆ బెట్టిదపు తుపాను తాకుడునకు గోగణం బులును గోపాలజనంబులును నొచ్చి ఆర్తనాదములు గావిం చుచు వచ్చి పడవఁ జొచ్చెను. అట్టియెడ, పరమదయాళు డగు గోపాలుఁడు గోవర్ధనగిరినెత్తి ఇంద్రుని పరాభూతునిం గావించి గోబృందమును గోపాలవర్గమును రక్షించి, గోవిందు డని ఖ్యాతి నందెను.

నేడు - భారతీయులు పరతంత్రులై బ్రిటిషువారి పాలన మునకు లోఁబడి, తద్వ్యామోహవాగురులం జిక్కి, వారియేలు బడియె తమకు ఏకుగడ యనియు, భుక్తి ముక్తిదాయక మనియు నమ్మి, వారికి దోసిలొగ్గి దాసోహ మ్మని కప్పములు కానుకలు చెల్లించుచుండిరి. అట్టియెడ కర్మచంద్రుఁడు

(కరమ్‌చంద్ గాంధి) వారి అవివేకమునకు పరాధీనజీవనమునకు వగచి వారి నిట్లు ప్రబోధించెను.

"పెక్కువేలమైళ్ళ దూరమున నున్న బ్రిటిషువారికిని మనకును సంబంధమేమి? వారు భేదోపాయమున మనల వంచించి మనదేశము నాక్రమించి మనసంపదల నెల్ల హరించు చున్నారు. క్షీణించిన మన కృషి వాణిజ్య పశుపాలనాది వృత్తుల పెంపు గావించుకొనినచో. వారితో నెట్టి సంపర్కము లేక మనయంతట మనమే యధేష్టముగ స్వతంత్రపాలనమును ప్రతిష్ఠించికొని సంతతసౌఖ్యానందముల నోలలాడఁ గలము. మహోన్నత మహీధరము లిందుగలవు; పావనవాహిను లిందుఁ గలవు; మనోహర పుష్పఫలభరిత భూజరాజము లిందుఁ గలవు. నిరుపమసౌభాగ్యనిలయమై నిత్యశోభనమై విరాజిల్లు నీ రత్నగర్భను ఈ సస్యశ్యామలను, ఈ కర్మక్షేత్రమును, ఈ వీరభూమిని, ఈ భారతమాత నారాధింపుఁడు."

ఇట్లు హెచ్చరించి భారతీయుల మేల్కొల్పి, వారిని విదేశ ప్రభుత్వ దాస్యశృంఖలములనుండి విడిపించి, మాతృదేశ సమారాధ నమునకుఁ బురిగొల్పెను. ఇందునకు, బ్రిటిషుప్రభుత్వమువారు దురాగ్రహావేశజ్వాలతో మండిపడి, భారతీయుల నిర్బంధశాసన పరంపరల గుప్పించి ముప్పు తిప్పల ముంచి వేధించిరి. ఈ దుస్సహ దుష్ప్రయోగములకు భారతీయు లెల్లరు దురపిల్లి తల్లడిల్లి హాహాకారములు గావించిరి. ఆ విపత్సమయమున

గాంధిమహాత్ముఁడు సత్యాగ్రహ ఘూధరమును ధరించి. పగతుర పీచ మడంచి, భారతలోకముయొక్క మాన ప్రాణధనములం గాపాడఁ గంకణము గట్టెను.

## స్వరాజ్యప్రదానము

తొల్లి - కౌరవులు పాండవుల పైతృకరాజ్యమును కపట వృత్తిచే నపహరించి. వారిని పాంచాలీపరాభవము మున్నుగాఁ బెక్కు లిక్కట్టులఁ బెట్టి ప్రవాసముల పాలొనర్చిరి. శ్రీకృష్ణుఁడు పాండవుల దుస్థితికి విషాదమొంది, ధర్మజాదుల పక్షమున కౌర వుల కడకు వెడలి, పాండవులకు రాజ్యమునఁగొంతయైనఁ బాలీయ మని సామవాక్యముల నంధి నడపెను. కౌరవులందుల కొడం బడక, మీఁదుమిక్కిలి శ్రీకృష్ణుని బంధింప సాహసించిరి. అంత పాండవులు శ్రీకృష్ణసహాయులై ధర్మయుద్ధమునకు దలపడిరి. శ్రీకృష్ణుఁడు పాంచజన్యముంబూరించి కౌరవబలము నొంచి ధర్మ రాజాదులకు సంపూర్ణ స్వరాజ్యము స్వాధీన మొనర్చి దిగంత విశ్రాంతయశోవంతుఁడయ్యెను.

నేడు - బ్రిటిషువారు భారతీయుల పరంపరాగత మగు భరతఖండమును కుతంత్రములచే నాక్రమించి. వారిని పాంచాల పరభవాది దుర్భరసంఘట్టనలఁ జీకాకుపరచి కఠినదండనలకు గురి చేసిరి. గాంధిమహాత్ముఁడు భారతీయుల పరాధీనజీవనమునకును దురవస్థలకును దురపిల్లి, వారికి సంపూర్ణస్వరాజ్యము కాకున్నను,

అధినివేశనప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్) యైన నిమ్మని రాయ బారము నెఱపెను. బ్రిటిషువారు అతనిమడుల పెడచెవిని బెట్టి, భారతీయుల నిడుమలఁ గుడుపుటయ కాక, ధర్మమూర్తి యగు మహాత్మునే బంధించిరి. ఇకఁజేయునది లేక, మహాత్ముఁడు భార తీయుల గూడి శాంతిసమరమున కురవడించి తరుణభారత (యంగిండియా) మను శంఖమును బూరించి, రాట్నము అను చక్రమును, అహింస యను గదను చేతఁదాల్చి పరరాజుల గుండి యలు కలగుండు పఱచి భారతీయులకు స్వారాజ్యముం గూర్ప దీక్ష బూనెను.

## బుద్ధావతారము

### జీవకారుణ్యము

ఐహికము రోసి, లోకహితైకదీక్ష
బ్రహ్మచర్యంబు నాత్మనిగ్రహ, మహింస
భూతదయయు ప్రజాళికి బోధ సేయ
నవతరిల్లిన బుద్ధమహాత్ము నెంతు.

తొల్లి - గౌతమబుద్ధుఁడు రాజ్యభోగముల నెల్ల విడనాడి విరాగియై తపోవనమున కేగి, భూతదయ, అహింస, ఇంద్రియ నిగ్రహము మున్నగు ధర్మములను అఖిలమానవ ప్రపంచమునకు బోధించి నిర్వాణపథము ప్రదర్శించెను.

నేఁడు - గాంధిమహాత్ముఁడు ఐహికభోగముల నన్నిటినిఁ ద్యజించి, దరిద్రనారాయణపద మాశ్రయించి, జగదుద్ధరణ పరా

యుఁడై బ్రహ్మచర్యము, పతితజనోద్ధరణము, విశ్వసౌభ్రాతృత్వము, స్వార్థత్యాగము, అహింస మున్నగు ధర్మములను మర్త్యకోటి కుపదేశించి, స్థిరమగు సంపూర్ణస్వరాజ్యపద్ధతికి మార్గము నిర్ధారణ మొనర్చి, తత్సంకల్పసిద్ధికి సత్యాగ్రహ యోగముద్ర నవలంబించెను.

## ౧౦ కల్క్యవతారము.

### సత్యయుగ సంస్థాపనము.

"ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం జిక్కతో
హరులై సాధుల డోఁచి చేకుడు తదీయ స్త్రీ ధన క్షేత్రముల్
హరియింపం గలవారు, దారుణతరం బై పెల్లు రెల్లుం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణినాశంబుగన్.

......... "మే ధా హీ ను లై మ్లేచ్ఛాకారులగు రాజులు భూభాగం బేలుచు ధర్మసత్యదయాహీనులై క్రోధ మాత్సర్యంబుల స్త్రీ బాలగోద్విజాతుల వధియింపన్ రోయక పరధన పరస్త్రీపరులై రజ స్తమోగుణరతులై, అల్పజీవులై, అల్పబలులై తమలో నన్యోన్యవైరానుబద్ధులై సంగ్రామరంగంబుల నిహతులయ్యెదరు. ఆ సమయంబున ప్రజలు తచ్ఛీల వేష భాషాదుల ననుసరించి యుండెదరు.

— భాగవతము

"బలిమి గలవాఁడె రాజు; సంపదలు గలుగు
నతఁడె మాన్యుఁడు; సరల మాట్లాడ నేర్పు
నతఁడె పూజ్యుడు; కొల్చినయతఁడె హితుఁడు
జనుల కెల్లను - కలియుగ సమయమందు.

"మఱియు ధనంబ కులాభిజాత్యహేతువు; బలంబ ధర్మ హేతువు; మనోహరంబ దాంపత్యహేతువు; స్త్రీత్వంబ ఉపభోగ హేతువు; అన్యాయంబ వృత్తిహేతువు; దౌర్బల్యంబ అధమ హేతువు; సద్వేషధారణంబ పాత్రహేతువునై, యనేక భీషణ దోషవిశేషంబులు సమస్త వర్ణంబులయందును గలిగియుండు."

"అర్థ మిచ్చె నేని యధమాధముని నైన
ఆశ్రయింప జూతు రఖిలజనులు;
సూనృతంబు బలము శూరత్వమును లేదు,
కల్లతనమె గలదు కలియుగమున.

[ఇట్టి యధర్మవర్తనంబులు గల కలికాలంబున]

భూమి నధర్మముల్ దులుపఁ బూని ముకుందుడు సర్వలోకర
క్షామణి భక్తవత్సలుఁడు సాత్త్వికబుద్ధి యెలర్ప శంబర
గ్రామమునం బ్రధానుడగు బ్రాహ్మణునింట జనించు గల్కియై
ఆ మహనీయ మూర్తి తెగటార్చుటను మ్లేచ్ఛకిరాత జాతులన్.

"నిజధర్మంబున వేదముల్ ధరణిపై నిండం బ్రతిష్ఠించి సా
ధుజనవ్రాతము నాచరించి, యొకచో దోషంబు లేకుండఁ జే
సి, తనంబుల్ వరమానురాగమునఁ దాఁ జెందించువాడై యధో
క్షజు డుండున్ ఇటు సాత్త్వికస్ఫురణతో కల్కిస్వరూపంబునన్."

...... విష్ణుపురాణము

ఇఁకఁ బ్రకృత మనుసరింతము –

పై వివరింపఁబడిన కలియుగలక్షణము లన్నియు తూచా తప్పక ప్రకృతమునఁ బ్రత్యక్షమై సాగుచున్నవి. ఇట్టి మహో త్పాతసమయమున శ్రీమహావిష్ణువు కల్కి మూర్తియై యవ

తరించి ధర్మసముద్ధరణముఁ గావించు నని మన పురాణములు ఏకకంఠ్యముగ నుద్ఘోషించుచున్నవి. గాంధిమహాత్ముడే ఆ కల్కిమూర్తి యని ఈ క్రింది నిదర్శనములు నిరూపింపఁ గలవు.

పై పద్యములలో "భూమి నధర్మముల్ దులుప" అను పద్యమునందు "శంబరగ్రామమునన్ ప్రధానుఁడగు బ్రాహ్మణు వింట జనించుఁ గల్కియై" అని యున్నది. ఈ "శంబర" గ్రామము "శబరమతి" కి అన్వయించును. ఇఁక "ప్రధానుడగు బ్రాహ్మణువింట" అను వాక్యముఁ గూర్చి విచారింతము- మహాత్ముని తండ్రితాతలు రాజులకడ ప్రధానులు (మంత్రులు) గా నుండి రని మహాత్ముని 'ఆత్మకథ' తెలుపుచున్నది. మహాత్ముడును ఆతని జనకుఁడును జన్మమున వైశ్యులైనను, గుణకర్మములందు బ్రాహ్మణులే యగుదురు. మఱియు పై పద్యములలోఁ గడపటి రెంటియందును "సాత్త్వికబుద్ధి" "సాత్త్వికస్ఫురణ" అని కల్కిమూర్తికి విశేషణములు ప్రయోగింపఁబడినవి. సాత్త్వికనిరోధమే (passive resistance) ప్రధాన సాధనముగాఁ గల మహాత్ముని కెట్లావిశేషములు వర్తించునో. ఆతనిచరిత్ర ఎఱిగినవారికిఁ గరతలామలకము.

......................................నవగ్రహంబులున్
శివ! శుభంబులైన తమ చెంతల నుండఁగ ద్వాదశీతిథిన్
దేవవిభుండు..........ముద్భవ మందె, దేవతల్
గానపరులందు లోకములఁ గల్కి యటంచును సంస్తుతింపఁగన్.

—కల్కి పురాణము, అ 1, 189.

మహాత్ముని యవతారము గూడ ద్వాదశీతిథి యందేయని "ఆత్మకథ" వక్కాణించినది. కల్కిమూర్తి చైత్రయాత్ర వెడలి నపుడు, అశ్వారూఢుఁడై తరలెనని పురాణప్రసిద్ధము. మహాత్ము డును మొన్న లవణ సత్యాగ్రహమునకై దండుతో దండికి మహా ప్రస్థానము గావించినపుడు, అశ్వసమేతుడై వెడలెనని మన మెల్లర మెఱిఁగిన విషయమె.

పై దృష్టాంతములవలన, గాంధిమహాత్ముఁడు కల్కిమూర్తి యనియు, ప్రకృతము దేశమునందలి దుర్దశల నెల్లఁదొలఁగించి, విశ్వమునందెల్ల ధర్మరాజ్యమును సంస్థాపింప నవతరించె ననియు సిద్ధాంత మగుచున్నది.

---

### ఫలశ్రుతి

ఇంతదనుక గాంధిమహాత్ముని లీలలు విష్ణుని దశావతార లీలలతో సమన్వయించి సాదృశ్యములం బ్రదర్శించితిమి. ప్రాయ దగు నంశములు పెక్కులుండియు గ్రంథవిస్తర భీతిచే గొన్నిటివి. మాయల్పబుద్ధికి స్ఫురింపక కొన్నిఁటిని విడువవలసినవార మైతిమి. మఱియు జీసను, మహమ్మదు మున్నగు మహాప్రవక్తల చరిత్రములతోడను ఉపదేశములతోడను సరిపోల్చి చూపదగిన విషయము లనేకములు మహాత్ముని లీలలఁలో గల వని యెఱింగియు, ప్రకారాంతర మగుటచే వదలితిమి. మా వ్రాసి నంతనట్లు మహాత్ము డొక యవతారమూర్తి యనియు, అతని

లీలలు అలోకసామాన్యము లనియు, జనులు గుర్తెఱుగుటకుఁ జాలినంత ఋజువు చేయగల వనియె మా నమ్మకము.

కొందరు "మహాత్ముఁడు లోకోత్తరపురుషుఁ డైనఁ గావచ్చును గాని, అవతారమూర్తి కాఁడు; అవతారపురుషుల కుండఁ దగిన యద్భుతమహిమ లాతనియం దొక్కటియు గాన్పించి యుండ లేదు; తన్ను బంధించినపు డైనను, శ్రీకృష్ణునివలె విశ్వరూప మేదేనిఁ జూపఁ గలిగెనా?" అని తర్కవితర్కములఁ జేయువారు గల రని మే మెఱుఁగక పోలేదు.

అట్టివారికి మా సమాధాన మిది :- శ్రీరాముఁడు విష్ణ్వంశ సంభూతుఁడుగఁ బరిగణింపఁబడుచుండియు, స్వస్వరూప జ్ఞానము లేని ప్రాకృతునివలె సీతాపహరణ సమయమునను, లక్ష్మణ మూర్ఛాఘట్టమునను విలపింపలేదా? శ్రీకృష్ణుఁడు లీలా మానుష విగ్రహుఁడై స్థితప్రజ్ఞుఁ డయ్యు శిశుపాలాదు నాతని మహిమ గుర్తెఱుఁగక తూలనాడ లేదా? జరాసంధప్రభృతులు తఱిమినపుడు సామాన్యునట్లాతఁడు పరువిడలేదా? ఇంతమాత్రమున వారి భగవదంశసంభూతికి గొఱఁత గలిగిన దనఁ జెల్లునా? దివ్య విషయములం గూర్చి సంశయించుట ఆత్మవినాశ హేతుకము గాదా?

"సురల జన్మంబులు, శూరుల జన్మంబు, లేఱుల జన్మంబు లెఱుకపడవు" అను భారతవచన ప్రకారము, లోకసంగ్రహార్థ

మవతరించిన మహాత్ముల లీలలు మానవ సామాన్యమునకు దుర్జ్ఞే
యములు. కావున గాంధిమహాత్ముని మహిమ సమ్యగ్దృష్టి నవలో
కించువారికిఁగాని గోచరింపదు.

ఇంతదనుక రామకృష్ణాద్యవతారములతో బాటు మహాత్ము
నకు సమానప్రతిపత్తి నొసగితిమి. దీనితో మాకుఁదృప్తి గలుగుట
లేదు: వారికన్న నున్నతపదవి నధిష్ఠింపఁజేయుటకు మేముపక్ర
మింతుము.

ధర్మసంరక్షణార్థము రామకృష్ణాదులు దుష్టులను సంహ
రించిరి; లోకమును సముద్ధరించిరి. కాని వారిని సంస్కరించి
పశ్చాత్తప్తులఁగావించి సన్మార్గమునఁ ద్రిప్పజాలరైరి. మహా
త్ముఁడు అట్లుగాడు. అద్వితీయమగు తన * వైముఖ్యయోగము
(నాన్‌కోఆపరేషన్) ననుసంధించి విమతుల నెల్ల పశ్చాత్తప్తుల
గావించి స్వమతమున కాకర్షించి సాధువులనుగఁ బరివర్తనము
జేసి సంకల్పసిద్ధుఁడు గాగల్గినాడు. సటావిక్షేపణ మొనర్చు సింహ
యూధమును జింకపదుపుగ మార్చివేయుటయే అతని యవతారము
నకు పరమోద్దేశము; అదియే పరాకాష్ఠ. ఈ వైముఖ్యయోగ
ప్రయోగముననే అతఁడు దక్షిణాఫ్రికాలో విజయదుందుభిని
మ్రోగించినాడు; చాంపరాన్‌లో విజయ ధ్వజారోహణ మొనర్చి

* ఇది యోగములలో నొకటి.

నాఁడు; ఎరదోలి ప్రవముఖ పుణ్యక్షేత్రములలో విజయోత్సవములు నడపినాఁడు. నేఁడు గూడ ఈ దివ్య యోగప్రభావమునవే భూమండలమునం దెల్ల మహోద్దండ బలప్రచండు లని పేరు మోసిన బ్రిటీషుమండలాధీశ్వరులం డీ కొని గజిబిజి గావించి యున్నాఁడు.

అహింసాత్మక మైన ఈ మహాయోగ ప్రభావము అపూర్వము - అద్భుతము - అద్వితీయము - అనూనము - అనుపమేయము - అమోఘము. ప్రపంచమున దీని నెవ్వరు నింతదనుక నవలంబింపలేదు. యుగాంతరములనాటి ఈ మహాయోగమున కీ యుగమున మహాత్ముఁడే ప్రాణప్రతిష్ఠ గావించినాఁడు; ఇది భారతఖండమునకే గాదు - సమస్తఖండములకును అఖండశాంతిని బ్రసాదించుట నిశ్చయము; ఇది పాశ్చాత్యులు గూడ ఇప్పుడు గ్రహించుచున్నారు.

ఈ వైముఖ్యయోగమహిమం దెలుపుటకు ఉత్తర రామాయణమునందలి యొక యుపాఖ్యానము నిట నుదహరింతము.

తొల్లి హనుమంతుఁడు బాల్యచాపల్యమున తరుణార్కబింబమును పక్వఫలముగ భ్రమించి మ్రింగబోయెను. ఇంద్రుడు తన వజ్రాయుధమున నాతనిమూతిపై మోదెను. ఆ తాకుడు నకు అతఁడు నేలఁగూలి మూర్ఛాక్రాంతుఁడయ్యెను. అంత

ఆతనితండ్రి వాయుదేవుఁడు ఇంద్రునిపై నలిగి తనమూర్తి నుపసంహరించుకొనెను. అట్టియెడ -

యాజకుల్ వహ్ని హవ్యములు వేల్వఁగఁ జూచు
హస్తముల్ సాచినయట్టు లుండె;
దివిజులు ప్రేరేఁప దివి కెగిరిన దేవ
యానంబు లెగిరిన యట్టులుండె;
మునులు నదీతోయములఁ దోఁగ ముంచిన
యంగముల్ ముంచిన యట్టులుండె;
పశు మృగ నరముఖ ప్రాణు లుర్వినిఁ బెట్టు
నడుగులు వెట్టినయట్టులుండె;

భానుమండల మొక్కచోఁ బాదుకొనియె;
కాలగతి తప్పె; సత్క్రియల్ గడచె; వేద
పాఠ ముడివోయె; బాహ్య మభ్యంతరంబు
గాడ్పు బంధించి చనిన యక్కాలమందు.

— ఉత్తరరామాయణము ఆ ౫. ప. ౧౧౧.

ఈ యహింసాతత్త్వమును ఈ యుగమున బోధించిన మహనీయులు మా యెఱింగినంతవఱకు బుద్ధుడును జీససును పేర్కొనఁదగి యున్నారు. ఈ తత్త్వమును బుద్ధుఁడు కేవలము సాంఘికముగ వినియోగించినాఁడు; జీసను ధార్మికముగఁ బ్రయోగించినాఁడు. గాంధిమహాత్ముఁడు దీనిని భౌతికాధ్యాత్మికాది సమస్త వ్యవస్థలయందును సర్వతోముఖముగ నావేశింపఁజేసి విశ్వజనీన మొనర్చినాఁడు.

ఈ విషయము గూర్చి మా సొంతనుదులతో దెలుపుట కన్న, అమెరికాదేశీయుఁడు రిచార్డ్ గ్రెగ్ అను సాధుశీలుఁడు ఈ నడుమ వ్రాసిన వ్యాసమునందలి భావములను గొన్నిఁటి విందను వదించితిమి.

సత్యాగ్రహ ప్రభావము

"ప్రకృతము భరతఖండమున జరుగుచున్న సంఘర్షణము ప్రపంచేతిహాసమునందు ఇదివఱ కెన్నఁడు కని విని యెఱుఁగని యపూర్వనమన్యమై యున్నది. బుద్ధుఁడు అహింసాసిద్ధాంతము నుపదేశించెను; అనుష్ఠించెను; కాని అగదాల్లపాలు గాలేదు. జీసను దాని నుపదేశించెను; అనుష్ఠించెను; అగదాల్లం బడెను; కాని దాని యర్థము సువ్యక్తము గావింపలేదు. మహాత్ముఁడు ఉపదేశించెను; అనుష్ఠించెను: అగదాల్లం బడెను; తత్పరమార్థమును ప్రపంచ మందలి ఆబాలగోపాలమునకుఁ గరతలామలకము గావించుటయే కాక, వారు దాని నవగతము జేసికొని సుశిక్షితులై సంఘీభావమున ధారాళముగ సాధించునట్లు వారిని పరిపాకమునకుం దెచ్చినాడు. ఈ విధానము భరతఖండమునకే గాక, సమస్తప్రపంచమునకు నిట్టి ప్రయోజనముల నొడగూర్చు నని ఎవ్వరును ఎన్నఁడును కలనైనఁ దలంపలేదు.

పాశ్చాత్య రాజకీయతంత్రములను సూక్ష్మదృష్టితోఁ బరిశీలింపుడు. అవి యన్నియు కేవలము మోసము కుటిలత వంచనము కపటము లోనగు మాయోపాయములపై నాధారపడియున్నవి.

అల్పసంఖ్యాకులు తమ కుక్షింభరత్వమునకై నిర్నిమిత్తముగ నిర్దాక్షిణ్యముగ ప్రజల హృదయములను క్షోభపెట్టి స్వార్థపరాయణులై విశృంఖలముగఁ జెలరేగుచున్నారు. ఈ కారణముననే ప్రకృతసంఘర్షణ మావహించినది; దీనివిజయము ఈ వర్తమానమందలి ప్రతిప్రభుత్వము యొక్క బలమును నిస్సార మొనర్చి దానిపద్ధతిని పూర్తిగ సంస్కరింపగలదు. ఇది ముమ్మాటికి నిశ్చయము. ప్రపంచమందలి ప్రభుత్వములలో నెల్ల బలవత్తమమైన ప్రభుత్వమును ప్రతిఘటించిన ఈ సత్యాగ్రహము యొక్క విజయము తక్కిన అన్నిప్రభుత్వముల కుళ్ళును బయటవేయగలదు. నేటి ప్రభుత్వ విధానములయందలి పరువుప్రతిష్ఠలను కూడ నీ సత్యాగ్రహము క్రుంగదీయగలదు. ప్రపంచమునం దెల్లెడల స్వాతంత్ర్యశక్తుల నొక్కుమ్మడి పరివ్యాప్తము జేసి ప్రజ్వలింపఁ జేయగలదు. పరిపాలనమున కగ్గమై క్రుంగుచున్న వారెల్లరును నల్లవారైన నేమి, పాటకపుజనులైన నేమి, పాలకులతో సమాన స్వాతంత్ర్య మనుభవించుచు స్వేచ్ఛాడోలికల నోలలాడఁగలరు. రష్యా విప్లవము దేశదేశముల నావరించి ప్రజాసామాన్యమునందు గొప్ప సంచలనము రేపినది. అప్పుడు వణిక్ప్రభువులును సంస్థానాధిపతులును భీతిచేఁదల్లడిల్లిరి. ప్రాపంచిక చరిత్రయందింతదనుక బయల్వెడలిన ఏ విప్లవములు ఒనగూర్పఁజాలని ప్రజాస్వాతంత్ర్యమును నేఁడు భరతఖండమున విజృంభించిన ఈ సత్యాగ్రహము తప్పక సమకూర్పగలదని నానమ్మకము.

ప్రపంచసంగ్రామము యూరపునందలి యంతర్భేదముల నొక్కపెట్టునఁ దుత్తునియలు గావించినది. కాని బ్రిటనునందలి శాఖాభేదములు నేటికిని చెక్కుచెదరక పరిరక్షించియున్నవి. అచ్చట సాంఘిక రాజకీయ వ్యవస్థలు కేవలము కృత్రిమ కల్పితములు; అవి తర తమ పదవుల విభాగమునం బరఁగొని యున్నవి. బిరుదములం బంపాదించి బిరాబిరుల నందుటయే అచటి హేమాహేమీల ముఖ్యలక్షణము. శాఖాభేదములే అచటి సాంఘిక పారిశ్రామిక వృత్తంమీఁద నధికారము చెలాయించుచున్నవి. ఇవి యన్నిటిని రాజ్యాంగయంత్రము త్రిప్పుచుండును. భారతసామ్రాజ్య స్వాతంత్ర్య యుద్ధమారుతము ప్రచండతరముగ వీచె. ఆ మహాయంత్రమును ఒక్కపెట్టున మాటాడించి పటాపంచలు సేయఁగలదు; అంతట దానిచే నడపఁబడుచున్న కుతంత్రిక పరికరము లన్నియు మటుమాయము అగును. ఇట్లు సహస్రాబ్దములనుండి యూరపు జీవితము నెల్ల కలుషిత మొనర్చుచున్న దుష్కృతరాశిని ఒక్క త్రుటిలో నీ సత్యాగ్రహాస్త్రము భస్మీపటలము గావింపగలదు.

ఆర్థికముగఁ గూడ దీనిఫలితము లగణ్యములు. ధనస్వామ్యధరను సాంగ్రామిక విధానమును నిర్మూలించుటకు సత్యాగ్రహము దివ్యౌషధము. ధనస్వామ్యత్తను అణచుటకు ఏ సాంఘిక విప్లవమునకును సాధ్యము కాని మహాశక్తిని సాధించి ప్రసాదింపగలదు. ఇది పత్త్రికసరళిని ఒక్కపెట్టఁగలదు. పారిశ్రామిక వృత్తంమీఁద

నున్న ఒత్తిడులను ఒత్తిగింపఁగలదు. వ్యవసాయమును పెంపొం దించి ఫలవంతముగఁ జేయఁగలదు.

తలఁవనితలంపుగ ఇయ్యది భారతజాతిని భారత విజ్ఞాన మును నానాముఖముల వికసింపఁ జేయుటయకాక, భారత దేశీయ నిజప్రభావమును పాశ్చాత్యదేశము సంభావించుట కనువగు రాజ మార్గము నేర్పఱచి ప్రాచ్య పాశ్చాత్యఖండములకు సుహృద్భా వము గూర్పగలదు."

♦ సత్యాగ్రహోద్యమ తత్వము

"ద్వేషమును ప్రేమముననను, దౌర్జన్యమును, సౌజన్య మునను, అసత్యమును సత్యముననను మార్కొని సాధించుకొఱకు పూర్వము సమస్తమతములచేఁ ప్రసాదితమైన దివ్యసత్యమును విశ్వమునందంతట వ్యాపింపజేసి అనుష్ఠింపఁ జేయుటయే నేఁటి సత్యాగ్రహోద్యమము యొక్క పరమోద్దేశము.

తొల్లి లోకసంగ్రహార్థము మహర్షులు తమయుపదేశ ముఖమున దివ్యసందేశములం దెలిపిరి. జీససు బోధించిన సిద్ధాం తములు సరాసరిగ గాంధిమహాత్ముని తత్త్వోపదేశములయందు

---

♦ ఈవ్యాసము మీరాబాయి (స్లేడ్ శవ్య) అను పాశ్చాత్య విదుషి రచించినది. ఈమె మహాత్ముని శిష్యురాలై అతనికి శుశ్రూష చేయుచు సబర్మతి యాశ్రమమునఁ గడపుచున్నది.

విద్యోతమానము అగుచున్నవి. జీసను సిద్ధాంతముల సారూఢి వఱచుటకే నేఁడి సత్యాగ్రహ మను మహాప్రయోగము సాగుచున్నది.

జీసను ప్రబోధించిన పరమార్థముల నిరూపించుట కుద యించిన ఈ యమోఘసాధనమును క్రైస్తవప్రపంచమున నెల్ల బలవత్తమ మైన సామ్రాజ్యము తన సర్వశక్తులతో ప్రతిఘటించుచు తన్ను తానే ఖండించుకొనుచున్నది.

ఈ 'క్రైస్తవ' సామ్రాజ్యము భారతదేశసంపదను కబళించి మదించియున్నది. భారతీయులు నేఁడు అన్నములు వస్త్రములు లేయుచు అస్థిగతపంజరములై 'అన్నమో రామచంద్రా' యని యల్లాడుచు పిడికెడు మెతుకులకై క్రైస్తవుల యాచించి అంగ లార్చిరి. కాని కబళమునకు బదులు కాలుతాపు బడసిరి. అంతియ కాదు - చెంపపై లెంపకాయలు గూడ దినిరి. భార తీయులు మహాత్ముని యుపదేశములకు బద్ధులై క్రైస్తవులకు రెండవచెంప జూపిరి. వారు ఆ చెంపపైఁ గూడ గపేటములు చఱచిరి. కాని భారతీయులు శాంతమును గోల్పడలేదు. ఈ శాంతిమార్గముననే దౌష్ట్యము నడఁగఁద్రొక్కఁ గల మని గాంధిమహాత్ముఁ డొసఁగిన యుపదేశము వారి రక్తనాళము లలో ప్రత్యణువునను ప్రవహించుచున్నది.

తరతరములనుండి దౌర్భాగ్యదశకు దాసులై భారతీయులు అంధకారబంధుర మగు నావరణమున జిక్కి వివశులై విలవిల తన్నుకొనుచున్నారు. సాధుత్వమున శఠత్వమును, సౌజన్యమున దౌర్జన్యమును పరాస్తము జేయుదుమేని, ఆ యంధకారావరణము భగ్నమై మానవలోక మంతయు నవ్యజీవన జ్యోతి నాశ్రయింపగలదు.

ఆర్తలోకసంరక్షణమునకై సత్యాగ్రహము ననుసంధించిన గాంధిమహాత్ముని, క్రైస్తవులు పెక్కుసారులు బంధించి తమ పితికితనమును వెల్లడించుకొనిరి.

దేనికొఱకు మహాత్ముఁడు దురంతకష్టములకులోనైనాఁడో, దేనిని సిద్ధింపఁజేయుట కాతఁడు తనజీవితమును మహాయజ్ఞముగఁ గావించియున్నాఁడో, ఆ పవిత్రాదర్శమును మనము దృఢదీక్షతో సాధించి, లోకకళ్యాణము నొనగూర్చుటకై మన ప్రాణ మాన ధనముల నర్పింతము గాక!

---

స్వస్తివాచకము

సనాతన హిందూమతాచారపరులు కల్కిమూర్తి యావిర్భావమునకై కుతూహలితులై యున్నారు. క్రైస్తవులు జీసను పునరవతారమునకై విశ్వాసమున ప్రతీక్షించుచున్నారు. దివ్యజ్ఞాన సామాజికులు మైత్రేయాగమనము నాసించి నిరీక్షించుచున్నారు

వీరబ్రహ్మముగారి శిష్యులు వీరభోగవసంతరాయని యావిర్భావము నెదురు జూచుచున్నారు. తారకసంఘము (Star society) వారు తారకోదయమునకై ప్రాగ్దిశకుఁ దమ యాలోకనములఁ బర్వించుచున్నారు. క్రుత్రరహితతారకరాజ యోగులు విరాట్పురుషుని సందర్శనార్థము తహతహలాడుచున్నారు.

పై మతములవారెల్లరు తమతమ యవతారమూర్తి గాంధి మహాత్ముఁడే యని నమ్మి తదాదేశములను శిరసా వహించుచున్నారు.

పురాకృత పుణ్యపరిపాకవశమున గాంధిమహాత్ముని సమకాలికులమై జీవించు భాగ్యము మన కబ్బినది. ఇట్టి సదవకాశము మనకు మరల యెన్ని జన్మములకో కాని లభింపదు. తొల్లి రామదాసు శ్రీరాముని కాలమున బుట్టనైతిని గదా యని ఈ తీరునఁ బలవించినాఁడు :-

### కీర్తన

ఏమి నాపాపము ! అయ్యో ! ఏమి నాపాపము-
భూమిలోన శ్రీరాముని తోడను
బుట్టి పాదములఁ బట్టనైతిఁ గద ! ...ఏమి
వనజనాభునకు దాసుఁడ నైతే
వనముల వెంటను జనుదుగదా !
కనకకురంగము జనకతనూజకు
నిచ్చిన రాముఁడు మెచ్చుగదా ! ...ఏమి

అంగజాది వానరులఁ గూడుకొని
పొంగుచు లంకకుఁ బోదు గదా ।
సంగరంబున రావణుఁ బోరిగొని
రంగుగ జానకిఁ దెత్తుఁ గదా । -ఏమి

ఇప్పట్టున మనము మహాత్ముని బోధనల విడనాడి యుపేక్షింతుమేని, అనంతరము పశ్చాత్తప్తులమై 'మహాత్ముని సహజన్ముల మయ్యు, ఆతని సేవించి తరింపమైతిమి గదా !' యని పరిపరివిధములఁ బరితపింతుము. కావున మనమీ యమూల్యావకాశమును బోనాడుకొనక, మహాత్ముని దివ్యసందేశముల ననుసరించి శాంతిసమరమున నుఱికి-

''హతోవా ప్రాప్స్యసే స్వర్గమ్ జిత్వావా భోక్ష్యసే మహీం''

అను గీతావాక్యానుసారము - చచ్చిన స్వారాజ్యము బ్రతికిన సంపూర్ణస్వరాజ్యము సాధించి, భరతవర్షమును దాస్యము నుండి విడిపించి మనుగడల ధన్యమొనర్చుకొందాము గాక !

---

# ఉప్పు

ఉప్పు ఉత్పత్తియగు దేశములు —

ఉత్తర దక్షిణ అమెరికాలు, సైబీరియా, చీనా, పరిషియా, ఐరోపా, హిందూదేశములయందు ఉప్పు విశేషముగ నుత్పత్తియగును. కేటలోనియా దేశమునందు 400 అడుగుల యెత్తును 3 మైళ్ళ పరిధియు గల గొప్ప ఉప్పుకొండ గలదు. ఆఫ్రికాయందలి సహరా ఎడారిలోను అబిసీనియా

లోను పెద్ద ఉప్పుపళ్లలు గలవు. పోలండునందలి ఉప్పుగనులు ప్రపంచమునం దెల్ల ప్రఖ్యాత మైనవి. అఫ్ఘనిస్థానమునుండి పంజాబ్ వఱకు ఉప్పుకొండల వరుసలు వ్యాపించి యున్నవి.

హిందూదేశమునందు పంజాబు రాష్ట్రములోను, రాజపుటానాలోని శంబరసరోవరమున, సింధు గుజరాతుదేశములందును ఉప్పు పుష్కలముగ లభించును. అంతియ కాదు, భారతదేశము నావరించియున్న సుమారు 5,000 మైళ్ళు పొడవు గల సముద్రతీరమున నెల్ల ఉప్పు పండును. మఱియు అలెగ్జాండరు హిందూదేశమునకు రాకపూర్వమే, ఉత్తరహిందూ స్థానమందలి విశాలమయిన గనులనుండి ఉప్పు తీయుచున్నట్లు చరిత్ర తెలుపుచున్నది.

పవిత్రత

ప్రపంచమునందలి సమస్తజాతులవారును, ఎల్లమతముల వారును ఉప్పును పవిత్రముగ భావింతురు. భారతీయులు హవ్యకవ్యములయందు లవణమునకు ప్రాధాన్యమిత్తురు. ప్రతిదినము వారు భుజించునపుడు, విస్తరిలో తొలుత ఉప్పును వడ్డింతురు; పితృకార్యములందు భోక్తలకు దధిమిశ్రిత లవణము వడ్డింతురు. మఱియు దృష్టిదోషములచే గలుగు కీడుల దొలగించుటకు దృష్టి తీయుటకు, అన్నద్వేషము కలిగినపుడు మంత్రించి లోనికిచ్చుటకును ఉప్పు నుపయోగింతురు.

పాశ్చాత్యులు గూడ ఉప్పుయొక్క ఉత్కృష్టత గుర్తెఱింగి దాని నత్యంతపవిత్రవంతముగ భావించియుండిరి. వారు ఉప్పుఊట భగవద్దత్తమని తలంచుచుండిరి. జర్మనులు ఉప్పుచేలలకై యుద్ధములొనర్చిరి. ఉప్పుగల ప్రదేశములు పవిత్రవంతము లనియు, అచట జేయు ప్రార్ధనలు ఈశ్వరప్రీతికరములనియు వారు నమ్ముచుండిరి. మఱియు గ్రీకులు రోమనులు ఉప్పును దేవతలకు నైవేద్యములు బెట్టుచుండిరి. వారు ఉప్పును రొట్టెయు భోజనమునకు పారిభాషికముగ వ్యవహరించిరి. హోమరు ఉప్పును దివ్యము (Divine) గ భావించెను. ప్లేటో ఉప్పు భగవత్ప్రీతికర మని విశ్వసించెను. అరబ్బులు లవణసమ్మిశ్రితమైన భోజనము మంగళప్రద మనియు, అది బాంధవ్యమునకును మైత్త్రికిని ప్రేమ సూత్ర మనియు నమ్మి, 'ఉప్పు మనల పరస్పర ప్రేమానుబద్ధుల జేయును' అని అర్థమిచ్చు (There is salt between us) అను నానుడిని వాడుచుండిరి. పారశీకులలో ద్రోహము చేయుట గూర్చి తెలుపునపుడు, 'నమక్ హరామ్' అను సామెతను వాడు చుందురు. (నమక్ - ఉప్పు, హరామ్ - ద్రోహము.)

రోమనులు నౌకర్లకును సైనికులకును పూర్వము ఉప్పు రూపమున జీతములిచ్చుచుండిరి. కావున ఆ జీతమునకు వారి భాషలో 'సాలరీ' (Salary) అని పేరు. 'సాలరీ' సాల్ (Sal) అను లాటిన్ (Eng : Salt) పదమునుండి ఉత్పన్నమైనది. పూర్వకాలముల ఉప్పు ఆర్థికముగను పారమార్థికముగను ఆవశ్యక

మగు పదార్థముగ భావింపబడెను. కాన దాని వ్యాపారము నిమి త్తము ప్రత్యేకముగ బాటలు వేయబడు చుండెడివి. అట్టివానిలో నొకటి యగు సాలేరియ (Salaria) అను బాట ఇప్పటికిని ఇటలీ దేశమున గాననగును. పూర్వము అబిస్సినియా ఆఫ్రికా టిబెటు మున్నగుదేశములందు నాణెములకు బదులుగా ఉప్పుతో చేయం బడిన బిళ్లలు చెలామణి యగుచుండెడివట.

ఉపయోగములు :

మట్టిపాత్రలకు మెఱుంగుపెట్టుటకును, గాజు సామాను లకు ధావళ్యము స్వచ్ఛత నిచ్చుటకును, సబ్బు బిళ్లలను గట్టిపరచుటకును, రంగుల ధాతువులను పెంపొందించుటకును, మాంసాదులను చెడకుండ భద్రపఱుచుటకును, పళువుల గుగ్గిళ్లకును, సస్యములకు పురుగుపట్టకుండ ఎరువులో గలిపి పొలములకు వేయుటకును, తోళ్ళు పదును చేయుటకును, ఓడలు నావలు మున్నగువాని బల్లలు చెడిపోకుండ వాని సందులలో కూరుటకును ఉప్పు నుపయోగింతురు.

దీని యుపయోగము వైద్యశాస్త్రము జూచినం దెలియం గలదు. సమస్త రోగములకు ఉప్పే పరమౌషధ మని ఈనడుమ లవణానందస్వామి ఉప్పుతో చికిత్సలు చేసి రోగము గుదుర్చుట పత్రికలలో జదివితిమి. ప్రాణావసాన సమయమున వైద్యుఁడు రోగికి సెలైన్ ఇంజెక్షన్ అనుపేర ఉప్పు గలిపిన నీటిని

దేహమునందు పిచికారీతో నెక్కించుట మన మెఱుగుదుము. ప్రకృతి శాస్త్రజ్ఞులు పదార్థములను కళేబరములను చెడకుండ గాపాడుటకు లవణము నుపయోగించుట ప్రసిద్ధము. సృష్టిలోని సమస్త వస్తుజాలమును, ప్రాణికోటియు ఉప్పు లేక జీవించుట అసంభవమని ప్రకృతిశాస్త్రప్రవీణులు పరిశోధించి నిర్ణయించిరి.

ఉప్పు శరీరమందలి క్రిములను నాశనము చేసి రక్తము శుద్ధిపఱచును. ఈ సంగతి గుర్తెఱిఁగి దచ్చివారు తమ ఖైదీలను హింసించుటకై ఉప్పులేని యాహార మొసగుటకు శాసించిరట !

లవణము సాంద్రముగ నున్న జలమున నౌకలు అధిక భారము మోయగల వని శాస్త్రజ్ఞులు కనుగొనిరి. మధ్యధరా సముద్రమున నడచు ఓడలు నల్లసముద్రము (Black sea) నందలి యోడలకంటె ఎక్కుడు బరువుల మోయఁగలవు. ఏల యన, మధ్యధరాసముద్రమున నల్లసముద్రమునకంటె లవణము ౧౬ రెట్లు అధికముగనున్నది.

ఈ సందర్భమున ఉప్పుయొక్క ఘనత దెల్పుటకు హరివంశమందలి ఈ క్రిందికథ నుదాహరింతుము.

తొల్లి బ్రహ్మదత్తుఁ డను మహీపాలుఁడు సాళ్వదేశమును బాలించుచుండెను. వానికి హరుని వరమున హంసుఁడు డిచికుఁడు అను నిరువురు కొడుకులు జనించిరి. వారు తమజనకునిచే రాజసూయ యాగమును చేయింపఁ బూని, తమ మంత్రులలో నొకని శ్రీ కృష్ణు నాహ్వానింపఁ బంపుచు , అతనికిట్లు వచించిరి :

"ఏని యీ జనార్దనునిచే
ఘనమగు లవణంబు మనకుఁ గప్పముమగు; మే
ళనములను సరకు గా, విట
దనుచె మ్మనుమరని యుజ్జనమయుమ్మనటున్."

రాజసూయయాగము జరుగు సమయమున, పరరాజన్యులచే 'మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపదలు' కప్పములుగా నడుగుట రాజోచితమై యుండ, శ్రీకృష్ణునంతటివానిని హంసడిభికులు ఈపాటి యల్పమగు లవణమును గోరుటేల? మరియు పైపద్యమున లవణము ఘనమైనదనియు, దానితో ఏ ధనములును సాటిరా వనియు వ్రాయఁబడినది. దీనివలన లవణ * మెంతటి లావణ్యవంతమైనదో చదువరులు గ్రహింతురు గాక.

శ్రీకృష్ణుఁడు ద్వారకావాసి. ద్వారక - సముద్ర పరివృతమైనది. సాళ్వదేశము మధ్యరాష్ట్రములోనిదగుటచే, సముద్రమునకు చాలదవ్వు. తక్కిన పదార్థముల కంటె అక్కడ ఉప్పు అపురూపము ప్రియమునైనదిగా నుండును. కావుననే హంసడిభికులు కృష్ణుని నుండి ఉప్పు కప్పమును గోరియుందురు. ద్వారక గుజరాతు దేశములోనున్నది. ఉప్పుపంటలో ఆ ప్రాంత మగ్రగణ్యము. అచటి యుప్పు పెక్కుసంవత్సరముల వఱకుఁ బ్రపంచమున కంతకు వినియోగింప జాలియుండును.

ఉప్పు ఉత్కృష్టతను తెలుపు సామెతలు :

౧. ఉప్పు పెట్టినవారిని ముప్పువఱకు మఱువరాదు.

౨. అఱచేతిలో ఉప్పుపెట్టితే, ఆఱునెలలవఱకు తలచుకోవలెను.

---

* 'లావణ్య' పదము 'లవణము' నుండి ఉత్పన్నమైనది.

౩. ఉప్పుదొరకనియూరు, ఉపాయములేని మనిషి యుండరాదు.

౪. అప్పులేని ఉప్పుగంజి మేలు.

౫. ఊపిరి యుంటే, ఉప్పు అమ్ముకొని బ్రతుకవచ్చును.

౬. ఉప్పులేని కూర, పప్పులేని పెండ్లి.

౭. ఉప్పుతో తొమ్మిది (రసములు) ఉండనిచ్చును.

౮. ఉప్పుతో తొమ్మిది, పప్పుతో పది ఉంటే, అందరూ వంటలక్కలే.

౯. ఉప్పుతో ముప్పయారు ఉంటే, ఉత్తముండ ఐనా వండుతుంది.

౧౦. ఉప్పులేక ముప్పందుము తింటానంటాడు.

౧౧. ఉప్పుకు ఉపకారము లేదు.

౧౨. వానియుప్పు దిని వానిమీఁదనే చేఁదుకాయలు కోసినాడు.

౧౩. ఉప్పు, పత్తిరి లేనివాఁడు.

౧౪. ఉప్పులేని ఊరగాయ యుండునా ?

౧౫. వానికి ఎక్కడా ఉప్పు పుట్టదు.

౧౬. పుట్టెడుప్పు ధారపోసినా, వానిముఖము చూడఁగూడదు.

౧౭. ఉప్పుగల్లు వోలె నున్నవాఁడు.

౧౮. పప్పే వస ఖాపలకును.

ఉప్పే వస రుచుల కెల్ల, ఉవిదల కెల్లన్

కొప్పే వస, దంతములకు

కప్పే వస, కుందరపు కవిచౌడప్పా.

౧౯. షణ్ణాం రసానాం లవణం ప్రధానమ్.

1. Ye are the salt of the earth. (Bible)
2. We have salt of our youth in us. (Shakespeare)
3. He was worth his salt. (Dickens)
4. He never drinks below the salt.
5. He paid a salt price for it.
6. He is true to his salt.
7. To salt an invoice or an account.
8. The spice and salt that seasons a man.
9. To eat the salt of the palace.
10. There is salt between us.
11. Hot as monkeys, salt as wolves in pride.
12. He wont earn his salt for his porridge.

ఉప్పునకు సంబంధించిన మాటలు :—

౧. ఉప్పటి - (ఉప్పునట్టె)
"ఉప్పునట్టె లాడునెడ నుప్పును దెత్తురు గాక యాదవుల్"

౨. స్తంభాలాట - ఈ యాటలో 'ఉప్పేయమ్మ ఉప్పో' యని అమ్ముట అలిన యుంటురు.

లవణ భేదములు :

అక్షీబము, వసిరము, కటకము - సముద్రపు ఉప్పు (Sea salt)

సైంధవము, శీతశివము, మాణిబంధము, - ఇందుప్పు (Rock salt)

పాక్యము, బిడియము, క్షారము - అంటుప్పు - (Black salt)

రౌమకము, బస్తకము, వసుకము - చౌటుప్పు - (Sambhar salt)

సౌవర్చలము, రుచకము, అక్షము, తిలకము - (Sochal salt)

యవణము, యవక్షారము, సూరేకారము - (Salt petre)

# గాంధి నామ స్మరణము

ఏమి మహిమంబు గలదో నీ నామమందు !
'బాపు' అను పేరు వీనులఁబడినయంత,
నిలువునను నాదు మే నెల్ల పులకరించు;
జల్లుమని నాదు హృదయంబు జలదరించు.

సర్వసారస్వత ప్రపంచంబునందు
'గాంధి' యనియెడు వర్ణయుగంబుతోడ
సాటివచ్చెడు వేఱొక మాట గలదె
మార్దవంబున, మధురిమ, మంజులతను ?

భువన 'మోహన' మైన నీ ముద్దుపేరు
రామనామము కంటెను రమ్యమగుచు,
భక్తిముక్తి ప్రదం బయి ధన్యమైన
అవ్యయానంద సౌఖ్యంబు లందఁజేయు.

కర్మయోగివి యై నీవు గ్రాలుకతన,
'కర్మచంద్రుఁడు' అను పేరు కలిగెనీకు;
దివ్యమహిమంబుతో నీవు తేజరిలుట,
తనరె నీకు 'మహాత్ముఁడు' అనెడు బిరుదు.

---

# విద్య

విద్య ధన మిచ్చు, సత్కీర్తి వెలయఁజేయు,
బంధు మిత్రుల సమకూర్చు, పదవు లొసఁగు,
ఐహికాముష్మిక సుఖంబు లందఁజేయు;
తివిరి మనుజుఁడు విద్య సాధింపవలయు.

చదువుచే ప్రజ్ఞ, దానిచే వరసతయును,
దానిచే కార్యసఫలత, దాన ధనము,
దాన త్యాగము, భోగము, దాన యశము,
దాన సిద్ధించు వాంఛితార్థంబు లెల్ల.

ఆర్జనంబున దక్షత, వ్యయమునందు
మితము, సంభాషణంబున చతురతయును,
కార్యములయందు నిపుణత కలుగఁజేయు;
రమ్య మగు విద్య సమకూర్పరానిదేది ?

నీటఁ జివుకదు, కాలదు నిప్పునెగడ,
దొరల పాల్గాదు, దొంగలు దోచుకొనరు,
అన్నదమ్ముల పాళ్ళకు నలవి కాదు,
మేటి విద్యాధనమునకు చేటు లేదు.

ఒరుల కిచ్చిన తఱుఁగక పెఱుఁగునంత,
ఉద్ది వచ్చునె దీపిక విద్దెతోడ?
ఓరుగాలికి దీపిక యారిపోవు?
విద్దె యను దివ్వె యారక వెలుఁగు జువ్వె.

యౌవనంబును సౌందర్య మలరఁ గాక,
ధనము నున్నతవంశంబు తనరఁ గాక,
లేశ మేనియు సద్విద్య లేనివాఁడు
శోభ గాంచఁడు నిర్గంధసుమము వోలె.

## గ్రంథములు

కలఁత లడఁగించు, కష్టముల్ తొలఁగఁద్రోయు,
పాపములఁబాపు, బన్నముల్ పాఱఁద్రోలు,
మాంద్యమును మాన్పు, దుఃఖముల్ నుఱవఁజేయు,
కావ్యములు మానవుల పాలి కల్పలతలు.

పుస్తకములన్న కేవల పుస్తకములు
కావు. ప్రస్తుత ప్రాచీన భావికాల
మానవుల జీవితంబుల, మానసముల,
భావముల, ధర్మముల నవి వ్యక్తపఱచు.

తరములను బట్టి విబుధులు దాఁచియున్న
జ్ఞానభండారములు గ్రంథసంపుటములు,
ధరణి వెలసినయందాక తఱుఁగఁబోని
వారసత్వపు హక్కులై వఱలు మనకు.

సృష్టి మొదలుగ మనుజు లార్జించినట్టి
విస్తృతం బగు మాన్యముల్ పుస్తకములు;
సతము సద్గ్రంథ పఠనంబు కతనఁగాదె,
పృథివి నాగరకత జెంది వృద్ధి నొందు.

అమిత ధన ధాన్య భాగ్య భోగములకన్న,
అమల వాఙ్మయ రామణీయకము ఘనము;
శేముషీవంతుల పవిత్ర జీవిత ప్ర
శస్త రత్నపుంజంబులు పుస్తకములు.

పుస్తకంబులు గలిగిన పూరిగుడిసె
యందు నిలుపేద కాపునై యుందుఁగాని,
పుస్తకంబులు లేనట్టి భూరి సౌధ
మందు చక్రవర్తిగా నుండ నభిలషింప.

నిలువుటద్దాలు, సోఫాలు, చలువరాతి
రెండుమేజాలు, కుర్చీలు నుండుఁగాక,
మంచి గ్రంథముల్ లేని యా మందిరంబు
మందిరం బది గా, దొక్క బంది గాని.

గ్రంథములు పెక్కు తనచెంతఁ గలిగియుండి,
అనయమును వాని చదువనియట్టివాఁడు
దివ్వెకరమున ధరియించి తిరుగు గ్రుడ్డి
వాని విధమున పరిహాసపాత్రుఁ డగును.

మంచిగ్రంథము చదువఁ గాంక్షించువాఁడు
కోరఁడాప్తుల, సచివుల ధార్మికసఖుల;
దినదినంబును హితము బోధించుచుండు
పుస్తకములె తన యనుంగు నేస్తగాండ్రు

పరిజనంబులు, మిత్రులు, బాంధవులును
మనల విడుతురు లేమి పైకొనినవేళ;
అంతఁ బాయక యెప్పుడు వెన్నంటి తిరుగు
పొచ్చెములు లేని నేస్తముల్ పుస్తకములు.

మేటికావ్యము జనులకు మేలు గూర్చు,
అధమకావ్యము తద్దయు హాని వేయు;
ఏది మంచిదో, చెడ్డది యేదో, యరసి
పుస్తకంబులు చదువంగఁ బూనవలయు.

---

## గ్రంథాలయము

శ్రీకరంబును, విబుధవశీకరంబు,
పూజితంబును, సత్కారాజితంబు,
భాసితంబును, విజ్ఞానవాసితంబు,
శారదాదేవి పీఠంబు సంస్తుతింతు.

అది సమస్త జనాదరణైక సంస్థ -
యున్నతంబు, నుదారంబు, నుజ్వలంబు,
యుత్తమోత్తమ, ముత్కృష్ట ముచిత పఠన
మందిరం బెన్న సర్వాంగసుందరంబు.

గ్రంథనిలయంబు జాతివజ్రంబు వోలె,
స్వప్రకాశము, సహజంబు, స్వచ్ఛతరము;
ప్రబల గాఢాంధకారంబు పాఱఁద్రోలి
దివ్యకాంతుల వెదచల్లి తేజరిల్లు.

పుస్తకాలయ మా విరాట్పురుషు లీల
నప్రమేయ మనంతంబు, నచ్యుతంబు;
అది స్వయంభువు - తనుదానె ఉదయ మంది
విశ్వరూపము ధరియించి వెలయుచుండు.

దాత వోలెను, గ్రంథనికేతనంబు
అర్థిజనముల కెల్ల లే దనక యిచ్చు:
అది విశిష్టము, స్వచ్ఛంద, మవ్యయంబు,
మధుర మంజుల భావ సమన్వితంబు,

మాత వోలెను, పుస్తకమందిరంబు
తాఁ దను జేర వచ్చినవారి నెల్ల
భేద మెంచక సమముగ సాదరించి,
జాతి మత సంఘ సామరస్యంబు నెఱపు.

ఆలయంబులఁ బోలె, గ్రంథాలయముల
విమలభక్తిని జనులు సేవింపవలయు:
ఎందు వెదకిన నందని యీశ్వరుండు
కాపురము సేయు నిరతంబు కావ్యవాటి.

మానితం బైన పుస్తకమందిరంబు
సుందరంబు, సకల జనానందకరము;
సహజ మగు దాని లావణ్యమహిమ గాంచి
భ్రాంతుఁ డగును తదీయ నిర్మాణకర్త.

తీర్చి శారద కై సేసి దిద్దుకొనఁగ
మణుల మంజూష పుస్తకమందిరంబు,
తళుకు గులికెడు వివిధరత్నముల నందు
కోరికలు దీర జను లేరికొనఁగవచ్చు.

తనువు రక్తంబు జీవంబు ధారవోసి,
ఋషివతంసులు పెక్కువేలేండ్లు తపము
సలిపి యార్జించినట్టి విజ్ఞానధనము
దాఁచియుంచిన పేటి గ్రంథాలయంబు.

కవులు, వక్తలు, రసికులు, గాయకులును,
చిత్రకారులు, నటులు, చారిత్రవిదులు,
ప్రకృతివేత్తలు, జోస్యులు- వారి కెల్ల
గ్రంథనిలయంబు సర్వదా కాపురంబు.

గాలి నీరును లేకున్న గడపవచ్చు.
గ్రాసమును లేక యెట్లైటో గడపవచ్చు:
గడపవచ్చునె మన యొక్క గడియయైన
గ్రంథభాండారములు లేని గ్రామమందు ?

గ్రంథనిలయంబు గల నరకంబునందు
నైన నివసింపఁ గాంక్షింతుఁ గాని, నేను
గ్రంథనిలయంబు లేని స్వర్గంబునందు
నిముస మేనియు నివసింప నిచ్చగింప.

దేవళంబులు, వస్త్రముల్, పావడులును,
చెఱువులును వీట లేకున్న కొఱత లేదు;
దివ్యమగు నొక్క గ్రంథమందిరము లేని
వీడు వీడు గా దది, పాడు బీడు గాని.

గ్రంథనిలయంబునందలి గ్రంథములకు
గుణమె కాని ప్రధానము, గణము కాదు;
ఎన్నియో చెత్తపొత్తము లున్నకన్న,
ఉత్తమ గ్రంథములు కొన్ని యున్న చాలు.

ఏను గ్రంథాలయంబున కేగునపుడు,
గ్రంథములు నాకు కన్పట్టు కనులయెదుట;
ఉర్విజనులకు బోధించి యుద్ధరింప
వేడ్క దివినుండి వచ్చిన విబుధు లనఁగ.

పన్నులడుగదు, తను జేర వచ్చువారి
నన్నివేళల ప్రీతితో నాదరించు,
ఎవ్వరడిగిన నే పొత్త మేని నొసఁగు;
అఖిలజనముల హక్కు గ్రంథాలయంబు.

భాగ్యవంతుఁడు నిరుపేదవాఁడటంచు,
అగ్రకులజుఁడు, కడజాతియతఁడటంచు
ఉచ్చనీచ విభేదంబు లుజ్జగించు;
అఖిలజనముల హక్కు గ్రంథాలయంబు.

అఖిల జాతీయతాభావ మలవరింప,
అమల విజ్ఞానసంపద నమరఁజేయ,
సాంఘికాచార ధర్మముల్ సంస్కరింప,
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

విమల దేశాభిమానంబు వెలయఁజేయ,
నిఖిల సౌభ్రాత్రి భావంబు నెఱయఁజేయ,
సకల లోకకళ్యాణంబు సాఁగఁజేయఁ
సదమల గ్రంథసదనంబు సాధనంబు

పనులయందు ప్రవీణత, పలుకులందు
సరసతయు, ధనార్జమున చతురతయును,
జీవనంబున సౌఖ్యంబు చెందఁజేయ
సదమల గ్రంథసదనంబు సాధనంబు.

నదుల వెత దీర్చి, పాపముల్ మఱవఁజేసి,
భగ్న మగు వారి హృదయముల్ పదిలపఱచి
జీవితంబుల సరియైన త్రోవ నడప
నదమల గ్రంధసదనంబు సాధనంబు.

సభ్యతకు తావు, కళలకు జన్మభూమి,
భోగ భాగ్యముల కిరవు, నాగరికత
కాలవాలము, సంస్కృతి కాటపట్టు;
అఖిల కళ్యాణకరము గ్రంథాలయంబు.

పుణ్యముల సీమ, గుణముల పుట్టినిల్లు,
ధర్మముల కాకరంబు, సద్గతికి నెలవు,
త్యాగముల తావు, నీతికి తావలంబు:
గ్రంథనిలయంబు సకల మంగళకరంబు.

తల్లివలె సాకు, బోధించు తండ్రికరణి,
వంత లడఁగించి రంజించు పత్నివోలె,
కాంత లోనగూర్చు నెచ్చెలికాని లీల,
గ్రంధనిలయంబు సాధింపరానిదేది ?

గ్రింథనిలయంబు నీ కూర్మి బంధువుండు.
నీదు తల్లియు, తండ్రియు, సోదరుండు,
నీకు మనసిచ్చి వర్తించు నేస్తకాఁడు,
జీత మత్తెంబు లడుగని సేవకుండు,

విశ్వవిద్యాలయంబులు, పీఠములును,
గురుకులంబులు, పండితపరిషదాది
సంస్థ లొనరింపఁ జాలని సత్క్రియలను
లీలమై నెఱవేర్చు గ్రంథాలయంబు.

వ్యాసములు, పత్రికలు, నుపన్యాసములును,
సభలు, సమితులు, సంస్థలు, సంఘములును,
కడఁగి సాధింప నేరని కార్యములను
నేర్పుమై గ్రంథనిలయంబు నిర్వహించు.

ఐకమత్యము నెలకొల్పునట్టి దేది ?
కులవిభేదన నిగళంబు దులుచు నేది ?
నిఖిల మత సామరస్యంబు నెఱపు నేది ?
సర్వజన పుస్తకాలయ సంస్థ కాదె ?

ఆత్మగౌరవ మొనగూర్చునట్టి దేది ?
ఆత్మవిశ్వాస మొనరించునట్టి దేది ?
ఆత్మసన్యాస మలరించునట్టి దేది ?
సర్వజన పుస్తకాలయ సంస్థ గాదె ?

అడుగు మేదేని - తోనె లే దనక యిచ్చు.
కోరు మేదేని - గొబ్బున కోర్కె లొసంగు.
వేఁడు మేదేని - వేగ నీ వేడ్క దీర్చు.
గ్రంథనిలయంబు కల్పవృక్షంబు గాదె ?

గ్రంథనిలయంబు శారద కనకపీఠి,
గ్రంథనిలయంబు కవుల శృంగారవాటి,
గ్రంథనిలయంబు విబుధ విజ్ఞానపేటి,
గ్రంథనిలయంబు మోక్షసద్గతికి చీటి.

గ్రంథనిలయంబు నా యేదుగడయు, గతియు,
నాదు ప్రాణంబు, మానంబు, నా ధనంబు,
నాదు శక్తియు, భక్తియు, నాదు ముక్తి,
రక్తి - వేయేల - నాదు సర్వస్వమదియె.

